"ఈ రోజు సింహాసనం అధిష్టించిన నిజాం సాహెబానా ఇవి నా కిమ్మని చెప్పింది?"

"అవును, వారే స్వయంగా ఏరి యిచ్చారు" ఆసూఫీయోగి ఒక్క క్షణం కళ్లు చిట్లించాడు- "ఆహా! ఏమి ఉదార స్వభావం! ఎంత ధర్మ చింతన! కట్టెలవలె ఎండిపోయిన రొట్టెలు దానం చేశాడే? ఎన్ని? ఒకటి, రెండు మూడు... ఏడు. ఏడే ఎండిన రొట్టెలు. భగవాన్! వీడి వంశం కూడా ఏడో తరంతో ఎండిపోదా?"

**–18వ శతాబ్దపు ఒక దక్కన్ కథ.**

అంతరభారతీయ పుస్తకమాల

# జంట నగరాలు

అశోక మిత్రన్

అనువాదం

జి. సి. జీవి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-0739-8

ప్రథమ ముద్రణ 1994 (శక 1915)



*Original Title in Tamil :*

Padunettuvadu Lakshatagalu by Ashoka Mitran

*Telugu Translation :* Janta Nagaraalu

రూ. 34.00

డైరెక్టర్ నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా ఎ-5, గ్రీన్‌పార్క్
న్యూఢిల్లీ - 110 016 ద్వారా ప్రచురించబడినది.

# తమిళ నవల – ఆధునిక ధోరణులు

నలభై యేళ్ళ క్రితం శంకరరాం, షణ్ముగసుందరం, క.న.సుబ్రహ్మణ్యం, కు.ప. రాజగోపాలన్ - ఈ నలుగురూ సాహితీ స్ఫూర్తితో తమిళంలో నవలా రచన ప్రారంభించారు. ఈ నాలుగు దశాబ్దాల కాలంలో తమిళ నవల వివిధ రీతులలో పరిణతి చెంది, ఈనాడు, ఇతర భాషల్లో ప్రత్యేకించి పాశ్చాత్య భాషలైన ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్ భాషల్లో - వెలువడుతూన్న నవలలతో పోల్చదగిన స్థాయిని చేరుకోగలిగింది. తమిళ నవలకి ఆద్యులన దగినవారు గతశతాబ్దపు, చివరి దశలో తరిగిపోతూన్న సాంప్రదాయపు విలువలని గురించి చేసిన రచనలు గాని, ఆ తరువాత ఈ శతాబ్దపు మొదటి నలభై సంవత్సరాలలో, పాతవారినే అనుసరిస్తూ రచించిన నవలల్లో కనిపించే సామాజిక విమర్శగాని పరిశీలించి నట్లయితే ఈ రచయితలంతా శైలీ, శిల్పం కంటే విషయానికే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చినట్లు స్పష్టమవుతుంది. అయితే ఆ రోజుల్లోనే వీరిలో కొందరు తమ రచనా విధానంలో శైలి, కథనం వంటి విషయాల్లో ఎంతో కొంత నూతనత్వం సాధించడానికి ప్రయత్నాలు చేసినా పూర్తిగా ఆధునిక పోకడలతో నవలా రచన చేయాలనే ప్రయోగం గత పాతికేళ్ళ నుంచి మాత్రమే జరుగుతోంది. ఈనాటి నవలా రచనల్లో విషయం కన్న శైలి, శిల్పం-వీటికిస్తున్న ప్రాధాన్యతే ఎక్కువగా కనిపిస్తున్నది.

వ్యక్తి, సమాజం, చదువుకున్న యువతరంలో 'ప్రేమ'కు సంబంధించిన సంఘర్షణ, సామాజిక పరిణామం కోసం జరిగే సంభవాలు, క్షీణించిపోతున్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థ, ప్రాంతీయ, వర్గ సమస్యలు, మనిషి జీవితంలో సులభంగా అవగాహన చేసు కోవడానికి వీలుపడని అంశాలు - ఈనాటి యువరచయితల నవలల్లో ఎక్కువగా ప్రతిబింబిస్తున్నాయి. కథా వస్తువులోని నూతనత్వంతో బాటు కథ చెప్పే తీరులోనూ కొత్త ప్రయోగాలు చేస్తూ సాహితీపరంగా పాఠకుల రసాస్వాదనని పెంపొందించే విధంగా వుండడం కూడా ఒక విశేషం ఈ నవలా రచనల్లో.

ఇటీవలి కాలంలో ఈ కొత్త పోకడలు స్పష్టతని, విపులతనీ సంతరించుకుని తమిళ నవలకి కొత్త రూపురేఖల్ని ప్రసాదించాయి. తమిళ సంప్రదాయంలోని విశేషాంశాలైన కర్నాటక సంగీతం, ఉమ్మడి కుటుంబ విధానం, సమాజంలో స్త్రీ వహించే పాత్ర మొదలైన అంశాలని 'మోహముల్లు', 'చంబరుత్తి' (ఎర్రమందారం),'ఉయిర్ తేన్'(జీవిత మధువు) అనే నవలల్లో కథావస్తువులుగా స్వీకరించాడు తి. జానకిరామన్ ప్రేమానురాగాలకి, చివరికి శారీరకమైన కోరికలకి సైతం దూరమైన ఒక స్త్రీ తెగించి, ధైర్యంగా తనకు తానై తీసుకున్న నిర్ణయాలు, ఫలితంగా ఆమె ప్రవర్తనా ధోరణి, మానసిక సంఘర్షణ - వీటిని 'అమ్మావందాళ్' (అమ్మొచ్చింది), 'కురపుసు'(కొయ్యగోవు) అనే నవలల్లో ఎంతో లోతుకు వెళ్ళి విశ్లేషించి చూపుతాడు ఈ రచయిత. ఇలువంటి స్త్రీలు తమ జీవితానికి పరిపూర్ణతని వెతుక్కునే ప్రయత్నంలో కుటుంబంనించి, సమాజాన్నించి ఎదుర్కోవలసిన 'వెలి'ని తట్టుకోలేక చివరికి సంప్రదాయపు కట్టుబాట్లకి తలవంచాల్సి రావటాన్ని కూడా ఈ నవలల్లో చిత్రిస్తాడు రచయిత. కొత్త రకమైన కథా వస్తువుని ఎంచుకోవటమేగాక, సహజమైన ప్రాంతీయ వాతావరణాన్ని పొందు పరచటం చేత జానకిరామన్ నవలలకి ఓ ప్రత్యేకత సిద్ధించింది. ఇతని రచనల్లో సున్నితమైన హాస్య వ్యంగ్య ధోరణులు మిళితమై వుండటం చేత ఈతని రచనల్లోని పాత్రలు వాస్తవికతకి చాలా సన్నిహితంగా వుంటాయి. విడుదల కోరి స్త్రీ పడే ఆరాటం, స్త్రీ స్వాతంత్ర్యం, స్వేచ్ఛలాంటి అంశాలని కేవలం ప్రచారణ ధోరణిలో గాక స్త్రీని వ్యక్తి ప్రాధాన్యంగా చిత్రించి రాబోయే మార్పులకి ఆమెని ప్రతినిధిగా సూచిస్తాడు జానకిరామన్. మార్పుని కోరే మనిషి చూరెక్కి గొంతు చించుకుని అరవాల్సిన పనిలేదనీ, సామాజిక నియమాలకి అతీతంగా ప్రవర్తించడంలో తప్పులేదని సూచించే వ్యక్తి వాద ధోరణి ఈతని రచనల్లో కనిపిస్తుంది. శిల్పం, మానసిక విశ్లేషణ లాంటి ధోరణులు ఎక్కువగా కనిపించకపోయినా, పాత్రల బహిర్ ప్రవర్తన ద్వారా ఆయాపాత్రల స్వరూప స్వభావాలని చిత్రించడానికి తనకంటూ ఒక ప్రత్యేక శైలిని బాగా వుపయోగించుకున్నాడు జానకిరామన్.

సమాజంలో అట్టడుగు వర్గ ప్రజల జీవితాలని యథార్థంగా చిత్రించడంలో బాగా కృతకృత్యుడైన రచయిత జయకాంతన్ అలాగే బుద్ధి జీవులని పాత్రలుగా ఎంచుకుని వాళ్ళ సంభాషణల ద్వారా వారి స్వభావాలని చిత్రించడంలోనూ సిద్ధహస్తుడనిపించుకో గలిగేడు జయకాంతన్. పేదరికంలో మగ్గిపోయే ప్రజల జీవితాలని ఎంతో సానుభూతితో చిత్రించినా ఎక్కడా ప్రచారధోరణి తొంగి చూడకుండా జాగ్రత్తపడడం ఈతని రచనల్లో కనిపిస్తుంది. పేదల దుర్భర పరిస్థితిని స్పష్టంగా ఎత్తి చూపాలంటే, సామాజిక స్పృహలేని సంపన్నుల జీవితాలతో పేదల జీవితాలని పోల్చి చూపుతూ రచనలు చేయ్యాలనే 'అభ్యుదయ'వాదుల వాదనతో నిమిత్తం లేకుండానే జీవితంలోని చీకటి కోణాలని పాఠకుల ముందు అత్యంత సహజంగా నిలిపి చూపగల నేర్పు జయకాంతన్ లోని ప్రత్యేకత.

జయకాంతన్ తన ప్రారంభదశలో రచించిన నవలల్లో చెప్పుకో దగ్గ రచన'ఉన్నైప్పోల్ ఒరువన్'(నీలాంటి ఒకడు). తన కొడుక్కి తండ్రి ఎవరో కూడా చెప్పలేని, సమాజపు అట్టడుగు వర్గానికి చెందిన ఒక స్త్రీని ప్రధానపాత్రగా ఎంచుకుని చేసిన రచన ఇది. తనకో మగతోడు వెతుక్కున్న ఈ స్త్రీ అతనిమీది మమకారానికీ, కొడుకు మీది ప్రేమకి మధ్య నలిగిపోవడాన్ని ఎంతో సానుభూతితో చిత్రిస్తాడు జయకాంతన్ ఈ నవల్లో. తల్లి జీవితంలోకి అర్థాంతరంగా ప్రవేశించిన ఆ కొత్త మనిషిని భరించలేక ఇల్లు వదిలి వెళ్ళిపోతాడు కొడుకు. దీని కంతటికీ కారణం తనే కదా అని మథన పడిన ఆ మనిషి కూడా ఆమెకి దూరమవుతాడు. ఒక ఆడపిల్లని ప్రసవించి మరణిస్తుంది ఆమె. ఇంటికి తిరిగి వచ్చిన కొడుకు నిండా పదేళ్లు దాటని పసివాడు ఆ పాపని పెంచే బాధ్యతని స్వీకరించడాన్ని ఎంతో సహజంగా చిత్రిస్తాడు రచయిత. నిరుపేదల జీవితాల్లోని ఆత్మీయతల్ని, అనుబంధాలని, వాటి ఫలితంగా తప్పించుకోలేని బాధ్యతల్ని చిత్రించే నవల 'ఉన్నైప్పోల్ ఒరువన్.'

ఈ నవలలో మురికి వాడల్లో ముఖ్యంగా మద్రాసు నగరంలో నివసించే

ప్రజల జీవితం, ఆ వాతావరణం, వాళ్ళు మాట్లాడుకునే భాషలోనే అత్యంత సహజంగా చిత్రించడం ద్వారా, జయకాంతన్ తమిళ నవలా రచనలో వాస్తవిక ధోరణులకి పునాదులు వేశాడని చెప్పవచ్చు. ఇతనిదే 'సిలనేరంగళిల్ సిలమనిదర్‌గళ్'(కొన్ని సమయాలలో కొందరు మనుషులు) అనే నవల బుద్ధి జీవుల జీవిత సమస్యలకి సంబంధించినది. అనుకోకుండా జరిగిన ఒక ఘటన ఫలితంగా తన జీవితానికి గట్టి ఎదురు దెబ్బ తగిలినప్పుడు క్రుంగిపోయి లొంగి పోకుండా ఆత్మస్థయిరంతో నిలబడి పరిస్థితులల కనుగుణంగా జీవితాన్ని తీర్చి దిద్దుకున్న గంగ అనే ఒక విద్యాధికురాలైన స్త్రీ చుట్టూ అల్లబడిన కథ ఈ నవల. ఇందులో ఆమె మానసిక సంఘర్షణని, ఆమె ఆలోచనల్లో, ఆమె మాటల్లోనే వ్యక్తీకరిస్తూ రచన చేయడం ఒక విశేషం. తన జీవితం మైలపడినప్పుడు ఆ జీవితాన్ని సరిదిద్దుకోవడానికి గంగ తేసుకున్న స్వయం నిర్ణయాలు, స్త్రీలకి మాత్రమే విధించబడిన శీలం సంకెళ్లు, ఆ సంకెళ్ళని తెంచుకోవాలనే ప్రయత్నంలో నలిగిపోయిన కొందరి స్త్రీల జీవితాలు - ఈ విషయాలని సమర్థించడంగాని, బందించడంగాని నవలలో ఎక్కడా చేయ్యడు జయకాంతన్. దీనికంతటికీ కారణం ఈ సమాజం అంటూ సమాజాన్ని దుమ్మెత్తి పొయ్యటం కూడా ఎక్కడా కనిపించదు మనకు. స్త్రీల అంతర్ పోరాటన్ని, ఆలోచనలని చక్కని శైలిలో వాళ్ల మాటల్లోనే వ్యక్తీకరించటం ద్వారా ఆ పాత్రలకి పాఠకుల సానుభూతి లభించేలా చేయగలగటం జయకాంతన్ ప్రత్యేకత.

పాత్రల మనసులోతుల్లోతాకి చూసి వాళ్ళ ప్రవర్తనకి, చేష్టలకి కారణాలని వ్యక్తీకరిస్తూ రచనలు చేసే పద్ధతిని అవలంబించిన రచయిత క్రిత్తిక. ఢిల్లీ వంటి మహానగరాల్లో వున్నత పదవులు నిర్వహించే వ్యక్తుల స్వభావాలని, సమస్యల్ని చిత్రిస్తూ రచనలు చేసిన ఇతను, ఒక చిన్న గ్రామంలోని ప్రజల్లో అణగారిన కోరికల్ని, ఆశల్ని, ఆశయాల్ని చిత్రిస్తూ 'వాసవేశ్వరం' అనే చక్కని నవలను రచించాడు. దేశంలో ఈ నాటి పరిస్థితులు, రాబోయే మార్పులు వీటిని ప్రధానాంశాలుగా తీసుకుని రచనలు చేసినా, తమిళ సంస్కృతి, పురాణాలు, ఇతిహాసాలు మొదలైన వాటినుంచి కొన్ని సంఘటనల్ని ఉదాహరణలుగా పేర్కొని ఈనాటి పరిస్థితులతో పోల్చి

పీఠికలు రచించడం ఈ రచయిత ప్రత్యేకత. ఈనాటి రాజకీయ, ఆర్థిక పరిస్థితులు, భవిష్యత్తు మీద చేసే వ్యాఖ్యానాలు ఈతని నవలల్లో వాస్తవికతకి సన్నిహితంగా వున్నట్లనిపిస్తాయి.

ప్రపంచ రాజకీయాల్లో మనదేశం వహించే పాత్ర, తత్ఫలితాలని చిత్రించే నవలలు, తమిళంలో మృగ్యమనే చెప్పాలి. రెండో ప్రంచ సంగ్రామం మొదలైనప్పుడు స్థావరం కోల్పోయి బ్రతుకు తెరువు వెదుక్కుంటూ దేశాంతరాలు వెడలిన - ఆగ్నేయాసియాలో నివసించిన - దక్షిణాది ప్రజల సమస్యల్ని, వారనుభవించిన కష్టాలని, చారిత్ర్యక అవగాహనతో, సరైన ఆధారాలతో, సూక్ష్మ పరిశీలనతో రచించిన ఒకే నవల 'పుయలిలో ఒరుతోణి' (తుఫానులో ఒక నావ). దీని రచయిత ప. సింగారం తన స్వీయ అనుభవాల వర్ణన నవలలో పొందుపరచి, కొత్త పంథాలో నవలా రచన చేసిన బహు కొద్దిమందిలో ఒకరు.

విభిన్నమైన కథావస్తువుల్ని స్వీకరించి నవలా రచన గావించే రచయితల్లో ప్రధానంగా పేర్కొనదగినవాడు డేవిడ్ సిద్దయ్యా. తీవ్రవాద రాజకీయుల ఫలితంగా ఖైదుకెళ్ళిన యువకుల-ముఖ్యంగా స్త్రీ ఖైదీల దుర్భర జీవితాలని ఎంతో సానుభూతితో, దయనీయత వుట్టిపడేలా ఇతడు రచించిన నవల 'చిరైచ్చాలై ఎన్న సెయ్యుం?' (చెరసాల ఏం చేస్తుంది?). ఈ దోరణిలో మరో ప్రయోగంగా రాజంకృష్ణన్ నవల 'ముళ్ళుం మలంర్‌దదు'(ముల్ళు వికసించాయి) ని పేర్కొనవచ్చు. చంబల్ లోయలో నివసించే బందిపోటు ముఠాల్లోని మనుషుల సంప్రదాయాలు, వాళ్ళు తమకు తామై ఏర్పరచుకున్న నియమ నిబంధనలు, చివరకు ఈ బందిపోట్లు వినోబా, జయప్రకాశ్ నారాయణ్‌ల ప్రభావంతో బందిపోటు జీవితాన్ని విసర్జించి సన్మార్గులు కావడానికి సిద్ధపడడం - ఈ రచయిత్రి ఈ నవలలో చిత్రించిన విషయం.

సినిమా పరిశ్రమలో కళాత్మక విలువల కోసం ప్రయత్నించిన ఒక వుత్తమాభిరుచులు గల దర్శకునికి ఏర్పడిన చేదు అనుభవాల చిత్రీకరణే ప. పార్థసారథి రచించిన 'నీలనయనంగళ్'(నీల నయనాలు) అనే నవల.

వ్యాపారం కోసం మన దేశం వచ్చిన ఆంగ్లేయులు క్రమంగా కొన్ని ప్రాంతాలని ఆక్రమించుకుని, పరిపాలనా భాధ్యతని ఈస్టిండియా కంపెనీ బ్రిటిష్ ప్రభుత్వానికి అప్పగించిన సందర్భంలో తెలుగు ప్రాంతాలనించి దక్షిణ దేశపు కొసకి వలస వెళ్ళిన జనం అక్కడే స్థిరనివాస మేర్పరచుకుని బ్రతుకు సాగించటం - ఈ విషయాలని ఆధారంగా తీసుకున్న నవల కి. రాజనారాయణన్ రచించిన 'గోపల్లె గ్రామం'. ఇందులో రచయిత యొక్క చారిత్రక రాజకీయ అవగాహన తొంగి చూస్తూ వుంటుంది. కథని వృద్ధ పాత్రల జ్ఞాపకాల ద్వారా నడిపించడంతో బాటు రచయిత కథని చెప్పడమనే పద్ధతి కూడా కనిపిస్తుంది.

ఆర్థికాభివృధి కోసం దేశం తలపెట్టిన ప్రణాళికలు, వాటి ఫలితంగా ప్రజా జీవితంలో కలిగే మార్పులు, అభివృద్ధి చెందుతోన్న పట్టణాల ప్రభావం గ్రామీణుల జీవితాల్లో ప్రసరించడం వల్ల పుట్టు కొచ్చే వైరుధ్యాలు మొదలైన సమకాలీన సమస్యల్ని ప్రధానాంశాలుగా తీసుకుని చేసిన రచనల్లో ప్రథమంగా పేర్కొన దగినవి రాజంకృష్ణన్ 'అముదమాగి వరుగ'(సుధ యైరా); ఉమాచంద్రన్ 'ముల్లుం మలరుం'(ముల్లు పువ్వు) మొదలైనవి. ఈ వరవడిలో వచ్చిన నవలల్లో ముఖ్యంగా పెర్కొనదగిన మరో నవల క. సుబ్రహ్మణ్యన్ రాసిన 'వేరుం విశుదుం'(వేరు-ఊడ).

సేలం నగర సమీపాన బాక్సైట్ ఖనిజం కనుగొన బడటం, దాని ఫలితంగా గ్రామీణ ప్రాంతాల్లో చేతి వృత్తులు, కుటీర పరిశ్రమలు దెబ్బ తినడం ప్రజల దైనందిన జీవితాలలోను, సంబంధాలలోనూ కలిగిన మార్పులును చిత్రిస్తూ చేసిన రచన విఠల్‌రావు నవల 'పోక్కిడం'(గమ్యం). ఒకే మనిషి తన స్వయంకృషితో చెట్లనీ, పుట్టల్ని నరికి అరణ్యప్రాంతాన్ని సాగుబడి నేలగా మార్చుకోగలిగిన కార్యదీక్షతని న.కందసామి తన 'సాయవనం'(ఛాయవనం) నవలకి కథావస్తువగా తీసుకున్నాడు. సామాజిక వ్యవస్థ మారడం కోసం పేద ప్రజానీకం పోరాటంలో దిగి తీరాల్సిన ఆవశ్యకతని చిత్రిస్తూ రచనలు చేయ్యటమే 'అభ్యుదయ సాహిత్యం' అనే ధోరణిలో ఈనాడు చాలా నవలలు పుట్టుకొస్తున్నాయి. చేనేత కార్మికుల దుర్భర జీవితాలని ఆధారంగా చేసుకుని చిదంబర రఘునాధన్ రచించిన

'వుంజాం - పసియుం'(ప్రత్తి-ఆకలి) ఇతని అడుగుజాడల్లో కొత్త రచయితలు, నడకలు నేర్వడానికి కొన్ని సంవత్సరాలు పట్టింది. తమకంటూ ఎకరం నేల లేకపోయినా కర్షక వృత్తినే నమ్ముకున్న కష్టజీవులు, హరిజన వ్యసాయకూలీలు, ప్రభుత్వం తలపెట్టిన అభివృద్ధి కార్యక్రమాల ఫలితంగా ఈ ప్రజల జీవితాల్లో, దృక్పథంలో ఏర్పడుతోన్న మార్పులు, వైరుధ్యాలు మొదలైన వాటిని చిత్రించిన నవల టి. సెల్వరాజ్ రచించిన 'మలరుం సరగుం' (పూలు, ఎండుటాకులు). వర్గదృక్పథంతో దోపిడీ విధానానికి వ్యతిరేకంగా పోరాటం సలపడానికి శ్రామిక జనం ఆయత్తమవుతున్నారనే విషయాన్ని కథావస్తువుగా ఎంచుకుని కొందరు నవలలు రాయడం ఈ మధ్యనే ప్రారంభమైందని చెప్పవచ్చు. వర్గ పోరాటానికి జాతిభేదాలు అడ్డుగోడలుగా వుంటున్నాయన్న సత్యాన్ని 'కురుదిపునల్'(రక్తపుటేరు) అన్న నవలలో వ్యక్తం చేస్తాడు రచయిత ఇందిరా పార్థసారథి. కు.చిన్నప్ప భారతి రాసిన 'దాహం' అనే నవలలో భూస్వాముల దౌర్జన్యాలు, వాళ్ల దగ్గర వెట్టి చాకిరీ చేస్తూ బానిసలుగా బ్రతికే వ్యసాయ కూలీల దయనీయమైన, జీవితం చిత్రించబడినాయి. కమ్యూనిస్టు సిద్ధాంతం మానవతా వాదంలోంచి జనించిందేనని అంచేత ఈ సిద్ధాంత ప్రాతిపదిక మీద జరిగే పోరాటాన్ని ఏస్తుక్రీస్తు ప్రవచనాలతో, సమర్థించే ప్రయత్నాన్ని చేసి చూపుతాడు 'కీరల్‌గళ్'(పగుళ్ళు) అనే నవలలో రచయిత పొన్నీలన్ అరుమైరాజన్. కర్షకులంతా ఏకమై తమ హక్కుల కోసం పోరాటం సాగించాలనుకున్నప్పుడు భూస్వామ్య వర్గం నుండి ఏర్పడే విఘాతాలని, హింసల్ని చిత్రించే నవల పొన్నీలన్ రాసిన 'కరిపల్'(నలుపు). అయితే ఈ కథలన్నీ శ్రామిక జనమంతా ఏకమై పోరాటానికి సన్నద్ధమయ్యే ఘట్టంతో ముగిసి పోవడం ఈ నవలల్లో గమనించదగ్గ విషయం. శ్రామిక వర్గం తన పోరాటంలో విజయం సాధించినట్లు చిత్రిస్తే అంతటితో ధనికస్వామ్యం దౌర్జన్యాలు అంతరించి పోతాయనే తప్పుడు అభిప్రాయానికి పాఠకులు రాకూడదనే వుద్దేశంతోనే ఈ రచయితలు తమ కథల్ని ఈ విధంగా ముగిస్తున్నారనికూడ అనిపిస్తుంది మనకి.

షుమారు ఒక శతాబ్దంగా విదేశీ సాహితీ పోకడల్లో 'మాడర్నిజం' పేరిట వ్యక్తివాదం, మనిషి ఆత్మపరిశీలన చేసుకుంటూ సమాజంలో తన వునికిని స్థిరపర్చుకోవటానికి చేసే ప్రయత్నంలో అతని మానసిక విశ్లేషణ లాంటి ధోరణి బాగా ప్రచారంలో వుంది. రచయితలు ఈ అంశాలని తమ రచనల్లో పొందు పరిచే ప్రయత్నంలో వాటికో కొత్త శైలీ, శిల్పం ఏర్పడటం జరుగుతున్నది. దీని ఫలితంగా ఏర్పడినవే ప్రతీకవాదం (symbolism), అస్తిత్వవాదం(Existentialism) చైతన్య స్రవంతి(Stream consciousness) అనే సాహితీప్రక్రియలు. ప్రతీకవాద ధోరణిలో పదాల అంతరార్థాన్ని వివరించడానికి మాటల్ని, వాక్యాల్ని మంత్రోచ్చాటనలా ప్రయోగిస్తూ ధ్వనింపజేస్తూ మనసులోతుల్ని తాకేలా రచించడంలో సిద్ధహస్తుడు లా.స. రామామృతం. 'పుత్ర', 'అభిదా' అనే ఇతని రెండు నవలలూ ఇందుకు చక్కని నిదర్శనాలు. మనుషులు బాహ్య ప్రవర్తనకి వారి జీవితాల్లో సంభవించిన కొన్ని అసాధారణ సంఘటనలు, వారి అంతరాంతరాలలో ఆ సంఘటనల ప్రభావం-ఇవే కారణాలు అని సూచిస్తూ పాత్రలని సృష్టిస్తాడు ఈ రచయిత. గత స్మృతులని జరుగుతున్న కాలంతో పోలుస్తూ పాత్రల మనోభావాలని వ్యక్తీకరించడంలో 'చైతన్య స్రవంతి' పద్ధతి ఎంతగానో వుపకరిస్తుంది ఈ రచయితకి. చైతన్యస్రవంతి ప్రక్రియ ననుసరిస్తూ శైలిలో ఎక్కడా భావావేశానికి తావివ్వకుండా తేలిక పదాలతో పాత్రల మనోభావాలని చిత్రిస్తూ రచించడం నీలపద్మనాభన్ నవలల్లో కనిపిస్తోంది. 'తలైమురైగళ్'(తరాలు), 'పళ్ళికొండాపురం', 'ఉరవుగళ్'(సంబంధాలు) ఇతని రచనల్లో పేర్కొనదగినవి.

కథనంలో కొత్త పద్ధతులని అనుసరిస్తూ రచన చేస్తున్నప్పుడు అది రచయిత సొంతగొడవగా ధ్వనించడం చాలా సందర్భాలలో కనిపిస్తూ వుంటుంది ఈ విధమైన రచనల్లో. ఇలా ఆత్మపరిశీలన, ఆత్మ విశ్లేషణ చేసుకుంటూ రచించే రచయితల్లో నకులన్‌ని ప్రథమంగా పేర్కొన వచ్చును. రచన అనేది రచయిత యొక్క స్వీయ అనుభవాల వ్యక్తీకరణమే అనే ఇతని సిద్ధాంతం గమనించ దగ్గది 'నినైవుప్పాదై' (స్మృతులబాట), 'నాంగ్‌గళ్'(కుక్కలు) అనే ఇతని నవలల్లో ఈ ధోరణి స్పష్టంగా కనిపిస్తుంది.

కథని చెప్పే విధానంలో ప్రత్యేకించి కొన్ని ప్రక్రియలని అనుసరించాలని ప్రయత్నించే రచయితలకి చైతన్యస్రవంతి, ప్రతీకవాదం, పలుకోణాల్లోంచి పాత్రలే తమ కథల్ని చెప్పుకోవడం లాంటి ప్రక్రియ లెంతగానో సహకరించడమేగాక నవలా స్వరూపాన్ని నిర్ణయించడం కూడా గమనించదగ్గ అంశమే. ఈ ధోరణిలో వచ్చిన నవలల్లో మరికొన్ని కొత్త ప్రయోగాలతో రచించిన నవల 'కాగిదమలర్ గళ్'(కాగితంపూలు). దీని రచయిత ఆదవన్. సినిమా ప్రక్రియ, దాని ప్రభావం సాహిత్యం మీద కూడా ప్రసరిస్తుంది అని చెప్పడానికి ఈ నవల ఒక చక్కని వుదాహరణ.

తమిళ నవల పుట్టి వంద సంవత్సరాలైంది. సాహితీ ధోరణులు ప్రారంభమై గడచిన ఒక తరంలో కొత్త ధోరణులతో రచనలు చేసిన వారు చాలామంది వున్నా కథా వస్తువు, శైలి, శిల్పం మొదలైన వాటిలో నూతన ప్రయోగాలు చేసి కొంత విజయం సాగించిన కొందరిని మాత్రమే పైన పేర్కొనడం జరిగింది. ఈనాటి నవలా పోకడల్లో, తనకంటూ ఒక ప్రత్యేక శైలిని, శిల్పాన్ని ఎంచుకుని విభిన్న ధోరణిలో రచన సాగించే వారిలో ఆశోక మిత్రన్‌ని ముఖ్యంగా పేర్కొనవలసి వుంది.

ఎటువంటి ఆడంబరాలు, అలంకారాలు లేని స్వచ్ఛమైన శైలి ఇతనిది. తన కథానికల్లోను, చిన్న నవలల్లోను సంఘటనలని యథాతథంగా చిత్రించడం ఇతని ప్రత్యేకత. అక్కడక్కడా 'సింబాలిజం'ని ప్రయోగించినా కథనానికి ఏ విధమైన భంగమూ కలగకుండా రచించగలడు ఇతను. పాత్రల చిత్రీకరణలో ఆయా పాత్రల మనోభావ వ్యక్తీకరణకు ప్రాధాన్యత నివ్వడం కనిపిస్తుంది. కేవలం సంఘటనలని ఆధారం చేసుకుని రచన సాగించడం ఇతనికి గిట్టదు. సంప్రదాయరీతిలో కథని నడిపించడానికి బదులుగా కొత్త రీతులకి ప్రాధాన్యత నివ్వడం ఇతని రచనలోని విశేషాంశం. అలా అని ఇతను సంప్రదాయానికి, వ్యతిరేకి అని చెప్పడం న్యాయం కాదు. సమకాలీన విలువల్ని కొత్త కోణంలోంచి పరిశీలించే పద్ధతి ఇతనిది. పైకి అనవసరమైన గొడవగా అనిపించే విషయాలు సైతం ఇతని రాతల్లో అర్థ గాంభీర్యాన్ని సంతరించు కుంటాయి. వాస్తవిక జీవితానికి విరుద్ధమైన సినీమాయా

ప్రపంచంలో పేరుకున్న మురికి, అవినీతి-కనీసం తాగడానికూడా నీళ్ళు దొరకని నగరవాసుల అగచాట్లు-రాజకీయ పరిణామాల సంధియుగంలో చిక్కుకున్న యువకుని మనోభావాలు-సమాజం నుంచి తనని వేరు చేసుకున్న వ్యక్తి సంఘర్షణ లాంటి విషయాలు అశోకమిత్రన్ నవలల్లో జీవిత వాస్తవాలుగా రూపొందడం కనిపిస్తుంది.

నవలా రచనలో తన మొదటి ప్రయోగంగా సినిమా పరిశ్రమని కథావస్తువుగా ఎంచుకున్నాడు అశోకమిత్రన్. ఈ అనుభవం తరువాతి రచనల్లో పాత్రల చిత్రీకరణకు, అంతరంగిక వ్యాఖ్యానాలకి చాలా సహకరించింది రచయితకు. మానవజీవితంలోని నీతి నియమాలని ఖాతరుచేయ్యని సినిమా ప్రపంచపు పోకడల్ని 'కరైంద నియళ్‌గళ్'(కరిగిన నీడలు) అనే నవలలో చిత్రించడానికి ఇతడు ఎన్నుకున్న కథనా పద్ధతి కొంత గందరగోళంగా అని పిస్తుంది. అయితే ఇది ఎన్నుకున్న కథావస్తువు(సినిమాయా ప్రపంచం)కు సరిపోయేదిగా వుండటం గమనించ గలం. వాస్తవ జీవితాన్నించి మనిషి కాసేపు పారిపోడానికి పనికొచ్చే వెండి తెరమీద వెలుగు నీడలు విరజిమ్మి కరిగిపోయే-ఈ సినిమా ప్రక్రియ వెనక పరిశ్రమించే దౌర్భాగ్య జీవితాలని ఏ రకమైన వెలుగు జిలుగులు లేకుండా సరళమైన శైలిలో సూటిగా చిత్రించే ప్రయత్నం ఈ 'కరైంద నియల్‌గల్' నవల. ఈ ప్రయోగంతో లభించిన ఆదరణతో మరింత ముందుకు పోయి చేసిన రచన 'తన్నీర్' (నీళ్ళు) నవల. పారిశ్రామికంగా ఎంతో పురోగమించిన మద్రాను నగరంలో మంచినీళ్ళకి మొఖం వాచిపోయిన ప్రజల ఇక్కట్లని చిత్రించడం ఈ నవలలో ప్రధానాంశం. కడివెడు మంచినీళ్ళ కోసం కుళాయిల దగ్గర ఖాళీ కుండలతో, బిందెలతో ఆడవాళ్ళు పడిగాపులు పడివుండాల్సిన దుర్భర పరిస్థితిలో ఒక స్త్రీ జీవితం ఎన్ని ఇబ్బందులకి గురైంది అన్నది ఈ నవలలోని కథా వస్తువు. సమస్యలకి పరిష్కారం లభించకపోయినా, దానికోసం పోరాడి తీరాల్సిన అవసరాన్ని గుర్తించినప్పుడు ఆ మనిషి మనోభావాలు, అతని ప్రవర్తన ఇత్యాదుల్ని అతి వాస్తవికంగా చిత్రిస్తాడు ఈ నవలలో అశోకమిత్రన్. సమస్యకి పరిష్కారమో, బాధలనించి విముక్తో లేదని గ్రహించిన పరిస్థితిలో

కథలోని పాత్రలు చేష్టలుడిగి, 'ఇదియింతే' అన్నట్లుగా సహించి వుండిపోయినట్లుగా చిత్రించడం ఈ రచయిత యొక్క సహజ ధోరణి ఫలితమే. ఇటువంటి పరిస్థితుల్లో పాత్రలు ఏ విధంగా పోరాడి తీరాలో 'ఇజా'ల రీత్యా ఈ రచయిత చెప్పే ప్రయత్నం చెయ్యడు.

మనదేశంలో జరిగిన స్వాతంత్ర్య పోరాటం గురించి, సాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రజలు, ప్రజానాయకులు ప్రవర్తించిన తీరుగురించి చాలా రచనలు వచ్చినాయి. స్వాతంత్ర్య పోరాట కాలంలో దేశవ్యాప్తంగా ప్రజలు ఎన్ని ఇక్కట్లకి గురైనారో చిత్రించే నవల కల్కి రచన 'అలైయాసై'(అలలహోరు). 1942 లో జరిగిన పోరటం దాని ప్రభావం వీటిని ఆధారంగా చేసుకుని తన స్వీయానుభవాలని జోడించి కు.రాజవేలు రాసిన నవల '1942'. స్వాతంత్రానంతరం దేశం స్వార్థపరులైన రాజకీయ నాయకుల చేతుల్లో చిక్కి నిజమైన దేశభక్తులు కన్న కలలు కల్లలు కావడం, ముఖ్యంగా గాంధీగారి సిద్ధాంతలు ఆచరణలో వమ్ము కావడం, తరిగి పోతున్న విలువల్ని పునరుద్ధరించాలంటే, జాతిపిత బాపూజీ కన్నకలలు ఫలించాలంటే, గాంధీ మార్గంలో పోరాడి విజయం సాధించడం ఒక్కటే దారి అన్న విషయాన్ని వక్కాణిస్తూ అఖిలన్ రాసిన బృహన్నవల 'ఎంగేపోగిరోం'(ఎక్కడికి పోతున్నాం). దేశంలో ఒక ప్రాంతంగా వుంటూ కూడా విదేశీపాలన క్రింద అవస్థలు పడే గోవా ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని 'వళైక్కరం' (చేతిగాజులు) నవలలో చిత్రిస్తుంది రాజంకృష్ణన్. స్వాతంత్రం వచ్చిం తరువాత కూడా భారతదేశంలో చేరకుండా విడిగా వుండిపోయిన హైదరాబాదు సంస్థానంలో నిజాంపాలన కింద ప్రజలనుభవించిన కష్టాలు, హైదరాబాదు సంస్థానం భారతదేశంలో విలీనం కావడానికి నిరాకరించనిప్పుడు సైనిక చర్యల మూలంగా భారత ప్రభుత్వం హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో కలిపేసుకోవడం-ఈ రాజకీయ పరిణామాలు ఒక విద్యార్థి జీవితాన్ని ఏ విధంగా బాధించిందీ అనే విషయాలని పరిశీలిస్తూ చేసిన రచనే అశోకమిత్రన్ నవల 'పదినెట్టావదు అచ్చుక్కోడు'(పద్దెనిమిదవ అక్షాంశ రేఖ).

భూమధ్య రేఖకి వుత్తరంగా 'పద్దెనిమిదవ అక్షాంశ రేఖ' దగ్గర వుంది హైదరాబాదు నగరం. తమిళనాడు నుంచి వుద్యోగరీత్యా అక్కడికి వెళ్ళి స్థిరపడిన కుటుంబంలోని అబ్బాయి చంద్రశేఖరం. మనోఫలకం మీద అనుభవాల గుర్తులు పడే ప్రాయంలో హైదరాబాదు నగరంలో చదువుతున్నాడు. అతని సహాధ్యాయులైన ముస్లిం విద్యార్థులు సంపన్నుల వర్గానికి చెందినవారు. తోటి తమిళ విద్యార్థులతో కంటె ముస్లిం, క్రిష్టియన్ విద్యార్థులతోనే చంద్రశేఖరానికి చనువు ఎక్కువ. స్కూలు విద్యార్థి దశని దాటి కాలేజీ ప్రవేశించినప్పుడు కూడా అతనికి వూళ్ళో జరిగే రాజకీయ పరిణామాలని అర్థం చేసుకునే అవగాహన రాలేదనే చెప్పాలి. అయినా కూడా హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో చేరాలి అనే రాజకీయ వుద్యమంలో పాల్గొనే పరిస్థితిలో చిక్కుకుంటాడు చంద్రశేఖరన్ తనని ప్రేరేపించి, వుద్యమంలో చేర్పించిన మిత్రుడే ధైర్యం కోల్పోయి పరారి అవుతాడు. ఈ రోజుల్లోనే చంద్రశేఖరానికి మనసులో యవ్వనపు తొలి భావాలు మెదిలి అయోమయానికి గురౌతాడు. మహాత్మాగాంధీ కాల్చి చంపబడి నప్పుడుతనకి కలిగిన ఆవేదన, దుఃఖము ఇతర మతస్తుల్లో కనిపించక పోవడం గమనించి నివ్వెరపోతాడు. ముస్లింల, ఆధిక్యంలో వున్న హైదరాబాదు నగరంలో తను ఒంటరివాడనీ, పరాయివాడనీ తెలుసుకుంటాడు. సైనిక చర్య ద్వారా హైదరాబాదు సమస్యని పరిష్కరించ పూనుకుంటుంది భారత ప్రభుత్వం. అప్పుడు చెలరేగిన కల్లోలంలో మత విద్వేషం పడగెత్తి బుసకొడుతుంది. అంతవరకు తనకి చాలా సన్నిహితుడనుకున్న ముస్లిం మిత్రుడు తన పట్ల విరోధ భావాన్ని ప్రదర్శించడం, మరో ముస్లిం తమిళ దేశానికి చెందినవాడు-పరిస్థితులను వివరించి తన పట్ల సానుభూతి కురిపించడం, దేశకాల పరిస్థితులు మారినప్పుడు జీవిత సత్యాలు ఇలాగే వుంటాయని చంద్రశేఖరం గ్రహించడం జరుగుతుంది. నగరంలో జరిగిన ఒక అల్లరిలో ఇరుక్కున్న సందర్భంలో కలలోకూడా వూహించని ఒక చేదు అనుభవం ఎదురౌతుంది చంద్రశేఖరానికి. అంతవరకూ ఎంతో వున్నతంగా, చిత్రంగా అనిపించిన స్త్రీత్వం ఒక్కసారిగా అతని ముందు నగ్నంగా, వికారంగా నిలబడి అతడ్ని

అమితంగా కలచి వేయడం జరుగుతుంది. బాహ్యప్రపంచాన్ని సొంతం అర్థం చేసుకోవాలని మిడిమిడి జ్ఞానంలో వున్న చంద్రశేఖరం అనుభవాల ద్వారా, అతని దృష్టి కోణంలోంచి ఆ సంధికాలపు హైదరాబాదు జీవితాన్ని చిత్రించడానికి సంక్లిష్టమైన సాహితీ ప్రక్రియల జోలికి పోకుండా తన సహజమైన కథనంలో సులభ శైలిలో నవలా రచన చేయ గలిగేడు అశోకమిత్రన్. చంద్రశేఖరన్ అనుభవాల ద్వారా వివరించలేని కథాభాగాలని రచయిత చెప్పినట్టుగా రాయడం కూడా ఈ నవలలోని ప్రత్యేకతగా పేర్కొనవచ్చు. నవలా రచయితగా అశోకమిత్రన్ జీవితంలో 'ఈ పద్దెనిమిదవ అక్షాంశ రేఖ' ఒక మైలురాయి.

ఈ విషయం ఇటీవలే ఇతను రచించిన 'ఆగాయతామరై' (ఆకాశతామర) అనే నవలని పరిశీలిస్తే వెల్లడౌతుంది. సమాజంనించి వేరుపడినట్లుగా భావించుకునే ఒక యువకుడి జీవిత చిత్రణ ఇందులోని కథాంశం. పైకి నిరర్థకంగా కనిపించే జీవితంలో కూడా కొన్ని నిర్దిష్టమైన విలువలు దాగి వుంటాయనే నిజాన్ని చెపుతాడు అశోకమిత్రన్ ఈ నవల ద్వారా. తండ్రి మరణానంతరం తల్లికి సన్నిహిత మిత్రుడైన ఒక వ్యక్తి ఈ కథలోని యువకుణ్ని తన చెప్పుచేతుల్లో వుంచుకునే ప్రయత్నం చేస్తాడు. విరక్తి చెందిన యువకుడు ఇల్లు వదిలి పారిపోతాడు. విచిత్ర మనస్తత్వమూ, విశాలహృదయమూగల ఒక సంపన్నుడైన పారిశ్రామికవేత్త ఆదరణ అనుకోకుండా లభిస్తుంది ఈ యువకునికి. ఈ ధనవంతుని ప్రవర్తనలో జీవితం మరింత అయోమయంగా కనిపిస్తుంది మన కథానాయకుడికి. జీవితమే అయోమయమైనప్పుడు ఆ జీవితంలో ఏర్పడే సంఘటనలకి కారణాలు వెదకడం నిష్ప్రయోజనం అనే నిర్ణయానికి ఈ యువకుడు రావడంతో కథని ముగిస్తాడు అశోక మిత్రన్. ఆధునిక జీవితంలో 'పోటీ' మనస్తత్వం మూలాన మనుషుల మధ్య విచ్ఛిన్నమైపోయే మానవత్వపు విలువలని గురించి రచయిత ఈ నవల ద్వారా చెప్పాలనుకోవడం కనిపిస్తుంది. ఇతరులకి అర్థంకాని సంపన్నుడైన పారిశ్రామికవేత్త చిత్రమైన ప్రవర్తన యువకుడ్ని కలచివేసిన తీరుని రచయిత ఈ నవలలో చిత్రించిన తీరు గొప్పగా వుంది.

విదేశీ సాహిత్య రీతులని సైతం బాగా ఆకళింపు చేసుకున్న రచయిత అశోకమిత్రన్ అమెరికా వారి ఆహ్వానంపై రెండేళ్ళపాటు అయోవా విశ్వవిద్యాలయంలో సాహితీ అతిథిగా వుండి వచ్చాడు. ఆంగ్ల, అమెరికన్ సాహిత్య ఆధునిక రీతులతో ప్రత్యక్షానుభవం గడించే అవకాశం కలిగింది. ఆ అనుభవాలని పత్రికల్లో వ్యాసరచన ద్వారా పాఠకులతో పంచుకున్నాడు.

ఈనాటి యువ రచయితల్లోని ఆవేశం, హృదయస్పందన ఇతని రచనల్లో చూడ గలుగుతాము. దీనితోబాటు అనుభవంతో గడించిన క్రమశిక్షణ కూడా ఇతనిలో గమనించగలం. ఈ ధోరణితో పరిశీలించి నప్పుడు అశోకమిత్రన్ నవల 'పద్దెనిమిదో అక్షాంశరేఖ' నేటి తమిళ నవలా పురోగతికి చిహ్నంగా భాసిస్తున్నది.

మద్రాసు
1.4.81

-పె.కో. సుందర్‌రాజన్(చిట్టి)

# రచయిత మాట...

ఈ నవల పాతికేళ్ల కిందటే రాయవలసింది. కాని ఇప్పుడాలోచిస్తుంటే అలా చేయకపోవటమే మంచిదైనదని తోస్తున్నది. సుమారు ముప్పైయేళ్లు నివసించి వచ్చేసిన అదే ప్రాంతానికి తిరిగి వెళ్లి కొంతకాలం అక్కడే మకాం వేసి ఈ నవల పూర్తి చెయ్యాలని కూడా అనిపించింది. అయితే అలా చెయ్యకపోవడం కూడా ఒక విధంగా మంచిదే అయిందని అనిపిస్తోంది. ఇప్పుడు ముప్పై సంవత్సరాల పాత బడిన సంఘటనలకి, జ్ఞాపకాలకి అక్షర రూపం కల్పించడానికి ఇప్పుడు అక్కడి పరిస్థితులు, వాతావరణం ఎంతవరకు అనుకూలిస్తాయో చెప్పటం కష్టం. ఒక వేళ అసలు ఈ నవలా రచనే సాధ్యమై వుండేదికాదేమో అక్కడ.

ఈ నవలా కాలం పందొమ్మిది వందల ముప్పై-నలభై కి మధ్య. నా ప్రారంభ దశలోని కొన్ని సంవత్సరాలు ఈ కథా స్థలంలో గడిపినంత మాత్రాన ఈ కథ నా స్వీయ చరిత్రకాబోదు. స్వీయ చరిత్రలు ఎంతమేరకు నవలలనిపించుకోగలవనే విషయంలో నాకు సందేహం లేకపోలేదు. అయితే నవలన్నీ ఒక రకంగా స్వీయ చరిత్రలేనంటాను.

దుఃఖానికి చెప్పే అనేక కారణాలలో కొన్ని కార్యాలని మనం వాయిదా వెయ్యటం కూడా ఒకటిగా పేర్కొంటారు. ఈ నవలని నేనింతకాలం జాప్యం చెయ్యం న్యాయంగానే అనిపిస్తున్నది నాకిప్పుడు. గడచిన దినాల జ్ఞాపకాలని తీరిగ్గా కూర్చుని నెమరువేసుకునే అవకాశం కోసరం నిరీక్షించడంలో తప్పులేదు కదా?

ఏడు నెలలపాటు ఒక విదేశం, విదేశీ భాష, ఆ సంస్కృతి వీటి మధ్య నివసించే అవకాశం, దానితోపాటు నాకు దొరికిన ఏకాంతం, తీరిక, ఈ నవలని మలచడానికి ఎంతగానో ఉపకరించాయి. ఇందుకు 'అయోవా' యూనివర్శిటీ వారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

తమిళ సాహిత్యపు భవిష్యత్తుపట్ల అపారమైన నమ్మకంతోవున్న మిత్రులు తి.క.సి.గారికి సైతం నేను ఋణపడి వున్నాను. వారితో జరిపిన వాదనలు, సంప్రదింపుల మూలంగా ఈ నవలలోని చాలా సన్నివేశాలని మరింత బలంగా సహజంగా చిత్రించగలిగానని నమ్ముతున్నాను. అలాగే మిత్రులు ఎస్. కృష్ణన్ గారికి

కూడా ఈ రచన ఋణపడి వున్నది. చారిత్రక వ్యక్తులని గురించి సంఘటనలని గురించి పరిశీలించడానికి అవసరమైన సాధన, ఒక దృక్పథం వీరి ద్వారా నాకు సాధ్యమైంది. ఇన్నింటినీ మించి ఈ నవలలో లోపాలేవైనా వుంటే అవి నావిగాని వారివి మాత్రంకావు.

కె. కస్తూర్తి రంగన్ ! సీరియల్ నవలా లక్షణాలు మచ్చుకైనా లేని దీన్ని 'కనయాళి' పత్రికలో దాదాపు ఒకటిన్నర సంవత్సరం ప్రచురించిన ధీశాలి ఇతను. వీరి ఆత్మ విశ్వాసము, ఇచ్చిన ప్రోత్సాహము లేకపోయినట్టయితే ఈ నవలా ప్రచురణ మరికొన్నేండ్లు వాయిదాపడివుండేది.

ఈ ముగ్గురికీ ఈ నవల అంకితం.

— అశోక మిత్రన్

మద్రాసు,
30–4–1977

"భారత సర్కారు నిజాం ప్రదేశాన్ని గుత్తకు తీసుకున్నారా ఏమి? నిన్నటిదాకా జైలు పక్షుల్లా పడివున్న వాళ్లంతా, ఈనాడు, చారిత్రక వైపరీత్యంచేత తరతరాలుగా సాగుతూ వచ్చిన వంశాన్ని ధ్వంసం చేస్తున్నారు. అల్లాకి ప్రియమైన మన నిజాం వంశం మూడు వందల సంవత్సరాలనాటిది! ఏడు తరాల రాజవంశం. అయితే భారత సర్కారు అయోగ్యుల ఈ అక్రమం ఎంతో కాలం సాగదు. మన రుస్తమి దివాన్ అరస్తుయి జామన్ ముసఫరల్ ముల్క్‌వాల్ ముమైక్ ఫతేజంగ్ సిబ్బహ్ సలార్‌మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్ నిజాముల్ ముల్క్ అసఫ్‌జాగారి పాదాలని అతి త్వరలోనే బంగాళాఖాతపు అలల, నురగలు ప్రక్షాళనం చేయబోతున్నాయి. అరేబియా సముద్రపు అలల పొంగు వారి అందమైన పాద రక్షల్ని కడగబోతున్నది. ఢిల్లీ ఎర్రకోటమీద అసఫ్‌జాగారి పవిత్రమైన జెండా ఎగరబోతున్నది".

**— 1949లో ఒక రజాకారుని ప్రసంగం.**

# 1

"దోస్త్, ఆజ్ నెట్ ప్రాక్టీస్ హై, జరూర్ ఆ జాతా" అని చెప్పి వెళ్లాడు నజీర్ అలీఖాన్. ఆ సంవత్సరం కాలేజీ క్రికెట్ టీమ్‌కి నజీర్ అలీఖాన్‌ని కెప్టెన్‌గా ఎన్నుకున్నారు. నజీర్ అలీఖాన్ మొయినుద్దవులా కప్ పోటీలో ప్రముఖ ఆటగాళ్ల మధ్య పదవ స్థానంలో ఒకడుగా నిలిచి బ్యాటింగు చేసినా పది నిముషాల్లో ముప్పై మూడు పరుగులు తీసి చివరిదాక అవుటవకుండా ఆడగలిగాడు. నాలుగు వందల మంది చదివే ఆ కాలేజీలో నలభై మంది ధైర్యంగా క్రికెట్ ఆడటానికి వచ్చేవాళ్లు. ఆ సంవత్సరం మాత్రమేకాదు ఇంకా రాబోయే సంవత్సరాలలో కూడా నజీర్ అలీఖానే కెప్టెన్‌గా వుంటాడనేది నిస్సందేహం. సాయంత్రాలు ఆట ప్రాక్టీసు చేసేటప్పుడు సైతం సిల్కు షర్టు, ఫ్లానల్ ప్యాంటు తొడుక్కుని వచ్చేవాడు. అంతకుముందెన్నడూ చంద్రశేఖరానికి ఆట గురించి ఏమీ తెలియకపోయినా ఆరోజు అతడిని నెట్ ప్రాక్టీసుకు రమ్మని పిలిచాడు నజీర్ అలీఖాన్. అతనా మాట చెప్పి వెళ్లగానే చంద్రశేఖర్ సైకిల్ స్టాండుకు పరుగెత్తి తన సైకిల్ చక్రాలని అదిమి చూశాడు. పరవాలేదు. రెండు చక్రాల్లోనూ గాలి వుంది.

పగటిపూట క్లాసులు రెండు పీరియడ్లూ కెమిస్ట్రీ ప్రాక్టికల్స్. ఈ ప్రాక్టికల్స్‌లో ఒక లాభమేమిటంటే చివరిదాక మేష్టారి దృష్టిలో వుండాల్సిన పనిలేదు. చంద్రశేఖర్ ఉప్పు ద్రావణాన్ని నింపిన టెస్టు ట్యూబ్ చేతబట్టుకుని నాలుగుసార్లు హైడ్రోజన్ సల్ఫైడ్ గూటికి వెళ్లి వచ్చాడు. ఆ ద్రావణంలో హైడ్రోజన్ సల్ఫైడ్ బుడగలై బుసబుసమని పొంగి నలుపు రంగుకి తిరిగింది. తనకి యిచ్చిన లవణం ఏమిటో కనుక్కోవటానికి ఇదొక జనరల్ టెస్ట్. లవణం ఏ రసాయనిక కుటుంబానికి చెందినదో ఈ పరిశోధన ద్వారా తెలుస్తుంది. ఆ తరువాత అది ప్రత్యేకించి ఏ లోహానికి చెందిన లవణమో నిర్ణయించడానికి వేరే ఒక ప్రయోగం జరపాల్సి వుంది. ఇంతకుముందు బేరియం యిచ్చారు. ఈసారి

ఇచ్చింది ఏదై వుంటుందో ఊహించటం అంత కష్టం కాదు. ఆరోజు కెమిస్ట్రీ ప్రాక్టికల్స్ చేసే ఇరవై జతల విద్యార్థుల్లో అయిదారు మందయినా సరైన లోహాన్ని కనుక్కోగలుగుతారు. ఆ తరువాత తక్కిన వాళ్లకి అదే లోహాన్ని కనుక్కోవడం అసాధ్యమేమీకాదు.

మూడుంబావు గంటలకే పుస్తకాలు సర్దుకుని సైకిల్ స్టాండుకు చేరుకున్నాడు చంద్రశేఖర్. "సైకిల్ ఇప్పుడు తియ్యటానికి వీల్లేదు" అన్నాడు అక్కడుండే ముసలాడు.

"నాకు క్రికెట్ ప్రాక్టీసుంది. ఇంటికెళ్లి రావాలి" అన్నాడు. చంద్రశేఖర్. "అదంతా నాకు తెలియదు. నాలుగుగంటలకొచ్చి తీసుకుపో".

ఆ ముసలాణ్ణి ఉరిమి చూశాడు చంద్రశేఖర్. అయిదడుగుల ఎత్తు వుంటాడు. వృద్ధుడు. మాసిన పైజమా, మురికి కొట్టుకున్న మోకాళ్ల దాకా వేళ్లాడే చొక్కా. తెల్లగా పండిపోయిన గడ్డం. నాలుగు పళ్ళూడిపోయిన దవడలు. పైగా బీడీలు తాగడంవల్ల గుంటలు పడి లోపలికి పీక్కుపోయిన బుగ్గలు. పాతబడిన గాజుగోలీల వంటి కళ్లు. ఈ ముసలాడు ఎందరికో సలాంకొట్టి ఎన్నెన్నో పనులు చేసి పెడతాడు. సైకిల్ తుడుస్తాడు సైకిల్ భాగాలకి నూనె పూసేవాడు, చక్రాలకి గాలి కొట్టేవాడు, పుస్తకాలు చూసుకునేవాడు, బీడీ సిగరెట్లు తెచ్చిపెట్టేవాడు, కొందరికి మోటార్ సైకిల్ స్టార్టు కానప్పుడు తోసేవాడు. ఎర్రతోలు, ట్వీడ్ పాంటు, ఉరుదూ భాష, ఖాన్, అలీ, అహమ్మద్ అనే ప్రభువుల వంశానికి చెందినపేర్లు వుంటే చాలు వారికి ముసలాడు సేవకుడై పోతాడు.

చంద్రశేఖర్ తన దగ్గరుండే రెండు అణాలు అతని చేతిలో పెట్టాడు. ముసలాడు అడ్డు తొలగి దారిచ్చాడు. చంద్రశేఖర్ సైకిల్ తీసుకుని బయటికి వస్తుంటే తనకేమీ సంబంధం లేనట్లు చూస్తూ నుంచున్నాడు ముసలాడు. కాలేజీ నుంచి అయిదు నిమిషాల్లో టాంక్ బండ్ కి చేరుకున్నాడు చంద్రశేఖర్. ఇప్పుడు ఈ టాంక్ బండ్ మైలుదూరం దాటాలి. హుసేన్ సాగర్ ఏమీ ఎరగని సాధువులా అమాయకంగా వుంది. గట్టుని ఆనుకుని వున్న టాంక్ బండ్ సిమెంటురోడ్డు మాత్రం ఊపిరాడనంత గాలితో నిండివుంది.

అతని కళ్లు వాచి నీళ్లు కారేలా వున్నా దయ్యంలా వీచే ఆ గాలి వేగంలో టాంక్ బండ్ రోడ్డు ఎంతో అందంగా కనిపించింది చంద్రశేఖరానికి. ఏటికి

ఆనకట్టవలె అడ్డంగా రాళ్లు పేర్చి నిర్మించిన రోడ్డు. ఎగుడు దిగుళ్లు లేని పొడుగాటి సమతలమైన సిమెంటు రోడ్డు. మైలు పొడవుకు పోత ఇనుముతో నిర్మించిన చేపట్టు ఫెన్సింగ్. మూడుచోట్ల చెరు మీదికి చొచ్చుకు వచ్చినట్లు కట్టిన బాల్కనీలు. సాయంత్రం పూట అక్కడికొచ్చి కూర్చుంటే ఎంతో హాయిగా వుంటుంది. ఈ ఆనందం కోసరం ఇంటి నుంచి మూడు మైళ్లు సైకిల్ తొక్కుతూ రావాలి. పెద్దవాళ్లయితే బస్సులో రావచ్చు. తను ఆ స్థితికి ఎదగడానికి ఇంకా చాలా కాలం వుంది. ఈ రోజు క్రికెట్ ప్రాక్టీసు అయిపోయిన తరువాతైనా ఈ టాంక్‌బండ్‌మీద ఓ పది నిమిషాలు కూర్చుని వెళ్లాలి. వీలవుతుందా?

"ఏరా? త్వరగా వచ్చేశావు?" అడిగింది అమ్మ.

బదులు పలక్కుండా పెట్టె తెరిచి ఒక తెల్లపాంటు బయటికి తీశాడు చంద్రశేఖర్.

"క్రికెట్ ఆడేందుకు పోతున్నావా?"

చంద్రశేఖర్ మాట్లాడలేదు.

"మీరు ఆడే చోట తురకాళ్లందరూ గొడవ చెయ్యడానికి వస్తున్నారని చెప్పావే"

"ఈ రోజు కాలేజీలో"

"కాలేజీలోనా? అయితే మళ్లీ కాలేజీకి వెళుతున్నావా?"

"అవును"

"అయితే ఆ బర్రెను కాస్తా పెరట్లో కట్టేసి వెళ్లు. పశువుల కాపరి అట్లాగే వదిలేసి వెళ్లాడు".

చంద్రశేఖర్ వెంటనే పెరటి తలుపు తెరచుకుని మైదానం కేసి పరుగెత్తాడు. ఆ మైదానంలో ఒకవేపు చర్చి. తరువాత వరుసగా నాలుగు పెద్ద బంగళాలు వున్నాయి. పోయిన వారం కూడా ఒక రోజు ఇలాగే బర్రెని తోలుకుని వెళ్లిన కాపరి పిల్లాడు ఇంట్లో కట్టెయ్యకుండా విడిచిపోయాడు. ఆ వంకర కొమ్ముల బర్రె చర్చి కాంపౌండులో దూరింది. తోటమాలి దాన్ని కట్టేసి బదా బదా బారి మూడు మైళ్ల దూరంలో వున్న పోలీసు స్టేషన్ బందెల దొడ్డిలో వదిలిపెట్టాడు. మూడు రూపాయలు జరిమానా. రెండు రాత్రులు నిద్ర పాడుచేసుకొని దాని కోసరం వూరంతా వెతుకులాట. చర్చి కాంపౌండులోకి బర్రె వచ్చిందన్న సంగతి ఆ

తోటమాలి చెప్పాడుకాదు. వెళ్లి అడిగితే మరోసారి అది కాంపౌండులోకి వచ్చినట్లయితే దాన్ని నరికి పారేస్తానని బెదిరించాడు కూడా.

చంద్రశేఖర్ చర్చి కాంపౌండులోకి వెళ్లి చూశాడు. హమ్మయ్య బర్రె అక్కడలేదు. బ్రతికిపోయాం అనుకోవడానికి వీల్లేదు. ఎంచేతనంటే అంతకన్న చిక్కులు తెచ్చి పెట్టే చోటికి వెళ్లి వుంటే ఒక వేళ?

"నాకేవైనా అవసరమైన పనులున్నప్పుడే ఇలాంటి పనులు పెడతావమ్మా నువ్వు" అంటూ సణిగాడు చంద్రశేఖర్. ఆ తరువాత సైకిల్ తీసుకుని బయలుదేరాడు.

సైకిల్ దిగకుండానే బంగళాల కాంపౌండు గోడలన్నీ చుట్టివచ్చాడు చంద్రశేఖర్, బర్రెకోసం వెతుకుతూ. ఈసారి కూడా వెళ్లకూడని చోటికే వెళ్లింది అది. 'మహమ్మద్ ఖాసిం, హైదరాబాద్ పోలీస్' అనే బోర్డు తగిలించిన బంగళాలోకి దూరి అక్కడ తోట్లలోని క్రోటన్సు మొక్కల్ని తీరిగ్గా ఆరగిస్తోంది పాపం. చంద్రశేఖర్ సైకిల్‌ని కాంపౌండు గోడ కానించి గేటు తెరుచుకుని తిన్నగా లోపలికి నడిచాడు. బర్రెని కొమ్ము పట్టుకుని లాగాడు. అది ఏమాత్రం లక్ష్యపెట్టలేదు. ఒక రాయిని తీసుకుని వెనుకనుంచి బలంగా కొట్టాడు చంద్రశేఖర్. అది ఒక్క దూకు దూకి నాలుగైదు పూల తొట్టెల్ని పగులగొట్టి బయటికి పరిగెత్తింది. దాన్ని తరుముకుంటూ బయటికి వచ్చిన చంద్రశేఖరాన్ని గేటు బయట కాపలావున్న పోలీసు జవాను పట్టుకున్నాడు. 'మెహర్‌బాన్ కర్‌కే మాఫ్ కర్నా మాఫ్ కర్నా" అంటూ చంద్రశేఖర్ పోలీసువాణ్ణి బ్రతిమాలుకున్నాడు. బర్రె చేసిన ధ్వంసాన్ని ఒకసారి పరిశీలించాడు పోలీసు. చంద్రశేఖర్ చొక్కా కాలర్‌ని పట్టుకుని లాగుతూ 'రా అయ్యగారి దగ్గరికి' అన్నాడు. 'దయచేసి వదిలెయ్యండి' అంటూ మళ్లీ బ్రతిమాలేడు చంద్రశేఖర్. అంతలో ఎర్రగులాబీ రంగు శరీరంతో పొట్టిగాను లావుగాను వున్న ఒకావిడ గుమ్మం దగ్గరకొచ్చి ఉర్దూలో తిట్టిపోసింది పోలీసు జవానుని. "గాడిద, పంది గాడిద, పంది' అని తిట్టుకుంటూ తోటచుట్టూ తిరిగింది. ఆమె వెనకే తోకలా నడిచాడు పోలీసు. తను ఏం చెయ్యాలో తోచక అక్కడే నిలబడ్డాడు చంద్రశేఖర్. ఆమె, పోలీసు బంగళా వెనక్కి వెళ్లడం చూసి ఇక తను అక్కడ నిలబడాల్సిన అవసరంలేదని గ్రహించి ఒక్క పరుగులో గేటు బయటికి వచ్చి పడ్డాడు చంద్రశేఖర్. బర్రె ఇంటికేసి నడుస్తూ కనిపించింది. సైకిల్ తీసుకొని బర్రె దగ్గరికి చేరుకున్నాడు. ఎంతో

మంచిదానిలా బుద్ధిగా పెరట్లోకి వెళ్లి తన స్థానంలో నుంచుంది బర్రె. కట్టుకొయ్యకి చుట్టి వున్న తాడుని తీసి బర్రె మెడకి తగిలించాడు చంద్రశేఖర్. క్రింద పడివున్న ఒక పెద్ద కట్టెని చేతికి తీసుకున్నాడు.

"వద్దురా నోరులేని ప్రాణి పాపంరా" మందలించింది అమ్మ. చేతిలోని కట్టెని నేలమీదికి విసిరేశాడు. 'ఛీ పాడుముండా, శని" అంటూ తిట్టుకున్నాడు బర్రెని. లోపలికి వెళ్లి తెల్లచొక్కా, తెల్లపాంటు తీసి ధరించాడు.

"మళ్లీ అంత దూరం వెళుతున్నావు. టిఫిన్ తినేసి పోరా" అంది అమ్మ.

"టిఫిన్ వద్దు పాడూ వద్దు" అని విసుక్కుంటూ క్రికెట్ బూట్సు తొడుక్కోసాగాడు చంద్రశేఖర్.

"పోనీ టీ అయినా తాగి వెళ్లరా" అంది అమ్మ.

"సరే, యిచ్చి తగలడు. ఎంత సేపని నేనిక్కడే తగలడేది" విసుక్కుంటూ అన్నాడు చంద్రశేఖర్. చంద్రశేఖర్ అక్క, తమ్ముడు, చెల్లెళ్లు వారి వారి బళ్ల నుంచి తిరిగి వచ్చారు. వచ్చీ రావడంతోటే పిచ్చుమణి తన క్రికెట్ బూట్ ని తీసి తొడుక్కోవడం గమనించాడు చంద్రశేఖర్. లాగి ఒక్కటిచ్చాడు తమ్ముణ్ణి. పిచ్చుమణి పెద్దగా అరవటం మొదలెట్టాడు. 'ఏమైందిరా నీకీరోజు. అందరిమీదా ఎందుకిలా ధాంధూం అని ఎగిరిపడుతున్నావు?" అంది అమ్మ కోపంగా.

"నాకు శని పట్టింది" అని అరుస్తూ బూట్సు నాడా కూడా సరిగ్గా కట్టుకోకుండా సైకిల్ దగ్గరికి పరుగెత్తాడు చంద్రశేఖరం.

"నిజంగానే శని పట్టినట్టే వుంది నీకు" అంది అమ్మ. తనకి ఏడేళ్ల శనిదశ ప్రారంభమై నాలుగు మాసాలైందని జోస్యులు చెప్పి వున్నారు. ఇంట్లో పెళ్లికెదిగిన ఆడపిల్లలుంటే ఈ జోస్యుల ప్రాబల్యం ఎక్కువగానే వుంటుంది మరి.

ఇప్పుడు టాంక్ బండ్ మీద ఎదురుగాలి ఎక్కువగా లేదు. ప్రకృతి నియమాలకి అతీతమైంది ఈ హుసేన్ సాగర్ టాంక్ బండ్. రెండు వేపులా కొంచెమైనా ఎదురుగాలి వుంటుంది. బస్సులో వెళుతుంటే ఈ గాలే ఎంతో హాయిగా వుంటుంది శరీరానికి. అయితే అరగంటకి ఓ బస్సు. ఇంటికీ బస్టాండుకీ ఒక మైలు దూరం. నాలుగున్నరకి ప్రారంభమై ఆరు ఆరున్నర లోగా ముగిసే క్రికెట్ ప్రాక్టీసుకు బస్సుని నమ్ముకుని లాభంలేదు. అరణాల ఖర్చు వేరే. ఇల్లు కాలేజీకి దగ్గర్లో వుంటే బావుండేది. అయితే నాన్నకి క్వార్టర్లు ఆఫీసుకి దగ్గర్లోనే

యిస్తారు. ఆ ఇంటికి వచ్చి కూడా చాలా సంవత్సరాలైంది. ఒకే ఇంట్లో చాలా సంవత్సరాలు నివసించటంవల్ల ఇంట్లో నిండిపోయే నానా రకాల పనికిరాని సామాన్లు తమ ఇంట్లోనూ నిండిపోయినయ్.

ఇదో వచ్చేసింది. టాంక్ బండ్ ఆఖరి ఫర్లాంగు మాత్రమే బాకీ. ఇంటి నుంచి కాలేజీకి వుండే ఐదు మైళ్ల దూరంలో ఈ ఒక్క మైలు దూరం మాత్రమే చెప్పుకోదగ్గది. ఒకవేపు హుస్సేనుసాగర్. మరోవేపు ఇరవై అడుగులకన్నా లోతైన ప్రదేశం. మరే ఇతర కట్టడాలుగాని, అంగళ్లుకాని లేవు. అందుచేతనే ఈ మైలుదూరంలో ఒక్కొక్క అంగుళం మేరా మనసులో ముద్ర వేసుకుంటుంది. ఇలా ఆదరాబాదరాగా ఒక గంటలో పది మైళ్లు సైకిల్ మీద తిరిగి వెధవ బ్రెకోసం వెతుకులాడి, దాన్ని పట్టితెచ్చి టిఫిన్ తినకుండా, టీ తాగకుండా క్రికెట్ ప్రాక్టీసుకు వెళ్లి ఏమాత్రం ఆడగలడు? ఎట్లాగైనా ఈ వారం రోజులు క్రమంగా ప్రాక్టీసుకి వెడితే 'ఎ' టీములో కాకపోయినా 'బి' టీములోనైనా చేరిపోవచ్చు. 'బి' టీముకి ఎవరు కెప్టెనో? తనే ఒక జట్టుకి కెప్టెన్‌గా వుండి ఇప్పుడు కాలేజీ 'బి' టీములో ఎవరి కిందో ఆడాల్సి వుంటుంది. తనకి ఎత్తుకోవటమే బాగా ఆడటంరాదు. బోలింగ్ చేస్తే రెండు ఓవర్ల తర్వాతగానీ బంతి చెప్పిన మాట వినదు. కొత్త కెప్టెన్‌కి ఇవన్నీ గ్రహించే పాటి ఓర్పు ఎక్కడుంటుంది? అంతా ఉర్దూలోనే మాట్లాడతాడాయె. తనకి తెలిసిన బోటా బొటీ ఉర్దూలో అతనికి అర్థమయ్యేలా మాట్లాడటం అసాధ్యం. నజీర్ అలీఖాన్ సంగతివేరు. అతను అర్థం చేసుకోగలడు. తనని గురించి ఎవరి ద్వారానో విని వుంటాడు గనుకనే స్వయంగా ఈ రోజు ప్రాక్టీసుకి రమ్మని పిలిచాడు. ఈ బ్రెగొడవే వుండకపోతే ఇలా ఖాళీ కడుపుతో ఆటకి వెళ్లాల్సిన ఖర్మ పట్టకపోను. అంతా శని ప్రభావం. ఏడేళ్ల శని. ఈ క్రికెట్ కూడా ఇంకెన్నాళ్లో !

చంద్రశేఖరన్ టాంక్ బండ్ దాటి రోస్ బిస్కెట్ ఫ్యాక్టరీని ఆనుకుని వున్న రోడ్డు మీదికి తిరిగాడు. బిస్కట్ ఫ్యాక్టరీకి చెందిన మైదానంలో సుమారు యాభై మంది బారులు తీరి నిలబడి వున్నారు. ఎత్తు, పొట్టి, సన్నము, లావు, వయసు మళ్లినవాళ్లు, యువకులు ఇలా రకరకాలు. పైజమా చొక్కా, పాంటు, షేర్వాణి ఇలా రకరకాల దుస్తుల్లో వున్నారు. అందరూ తుపాకీని పట్టుకున్నట్లుగా ఒక వెదురు కర్రని బుజానికానించుకుని నిలబడివున్నారు. చంద్రశేఖరానికి కడుపులో ఏదో కలియబెట్టినట్లయింది. ఈ మాదిరిగానే ఇంటిదగ్గర తమ క్రికెట్

జట్టు ఆడే మైదానంలో కూడా నాలుగైదు రోజులుగా పొద్దున్నే ఈ రకమైన సాధన జరుగుతోంది. అకస్మాత్తుగా మునుపెన్నడూ చూసి వుండని కొత్త ముఖాలు హైదరాబాదులోను, సికిందరాబాదులలోనూ చాలా మంది కనబడుతున్నారు. సికిందరాబాదు స్టేషన్ రోడ్డు వారగా తడికెలతోను రేకులతోను వరుసగా చిన్న చిన్నగుడారాల వంటి షెడ్లు వెలిశాయి. రోడ్డు కిరువైపులా ఇటువంటి గుడారాలు, ఒక్కొక్క దాంట్లోనూ జనం నిండిపోయి వున్నారు. ఇంకా చాలా మంది కాజీపేట రైల్వే ప్లాట్ ఫారాలమీద పడిగాపులు కాస్తున్నట్టు నాన్న, బాబాయి అనుకుంటూ వుండగా విని వున్నాడు చంద్రశేఖర్. నాగపూర్ వేపు నుంచే వీళ్లంతా వచ్చి పడుతున్నారు. అంతా నేరుపేదలు తురకలే అయినా బీదజనం. ఈ టాంక్ బండ్ దాటి హైదరాబాదు కొస్తే ఇటువంటి జనం గుంపులుగుంపులుగా వీధుల్లో దర్శనమిస్తారు. వీళ్ల హైదరాబాదు నగర వాసులు కారని వీళ్లని చూస్తే స్పష్టంగా తెలుస్తోంది. వేరే వూళ్లనుంచి ఇక్కడికొచ్చి పడ్డారు. క్రికెట్ ఆట ఇంకెన్నాళ్లో సాగేట్టులేదు. ఈ పరిస్థితుల్లోనే నజీర్ అలీఖాన్ తనని నెట్ ప్రాక్టీసుకి రమ్మని పిలిచాడు. నజీర్ అలీఖాన్ కూడా ఈ కర్రసాముకి వెళ్లి వస్తున్నాడా? ఇతని వంటి జాగీర్దార్ పిల్లలుకూడా వదులు చొక్కాలు, పైజమాలు, వెదురు కర్రలతో లేఫ్ట్ రైట్ చేస్తారా? చంద్రశేఖరానికూడా లేఫ్ట్రైట్ చెయ్యాలనే కోరిక లేకపోలేదు. కాని కాలేజీలో చేరిన మొదటి సంవత్సరంలోనే అతణ్ణి ఆక్సిలరీ కోర్‌లో చేర్చుకోలేదు. చాలా పీలగా వున్నాడని మరి నాలుగైదు పౌండ్లు బరువు పెరగాలని అతడిని తీసుకోలేదు. ఈ సంవత్సరం ఎవరెవరినో చేర్చుకున్నారు. వేసవి సెలవుల తరువాత కాలేజీ తెరచినప్పుడు కాలేజీ బయట అర్థంకాని ఏదో అలజడి. దేశంలోని ఇతర ప్రదేశాలలో ఆగస్టు నెలని ఒక విధంగా ఆహ్వానిస్తే ఇక్కడ మాత్రం భిన్నంగా వుంది. తిరువాన్కూరు స్వతంత్రం కాబోతున్నది. జూనకట్ భారతదేశంలో చేరలేదు. కాశ్మీర్ లేదు. తిరువాన్కూరులో అల్లర్లు. సర్ సి.పి.ని ఎవరో ముఖంమీద కత్తితో పొడిచారు. ఎవరీ సి.పి దివాన్. తిరువాన్కూరు సంస్థానపు దివాన్. బెంగాల్‌లో అయిదు వందల మంది హత్య గావించబడ్డారు. బీహారులో అయిదువేల మంది ఘోరంగా చంపబడ్డారు. పంజాబులో ఏభై వేల మంది చనిపోయారు. సింధ్ హైదరాబాదు, పాకిస్తాన్‌కు చెందినది. దక్షిణ హైదరాబాదు ఇంకా స్వతంత్ర దేశం. ఆగష్టు 14 అర్ధరాత్రి. చంద్రశేఖరం

కుటుంబం తమ డొక్కు రేడియోలో ఢిల్లీలో యూనియన్ జాక్ పతాకం దిగిపోయి మూడు రంగుల జెండా పైకెక్కడాన్ని వింటున్నారు. వందేమాతరం, జై హింద్.... రేడియో అధ్వాన్నంగా వుంది. గర...గర...గర...గొర...గొర...గొర... ఆపెయ్యరాదూ దాన్ని. ఈ పాడు రేడియోలో ఏది తిన్నగా వినడానికుంది? ఆగస్టు నుంచి ఏడేళ్ళ శని. కొంచెం జాగ్రత్తగా వుండటం మంచిది. ఊళ్లో పరిస్థితి బాగోలేదు. బొత్తిగా బాగులేదు. ఈ క్రికెట్ గిర్‌కెట్ వద్దురా.

టాంక్‌బండ్ మీద అంతగా తెలీలేదుగాని ఇప్పుడు బషీర్‌బాగ్ మిట్ట సమీపాన ఊపిరి తిరగనీకుండా వీస్తోంది గాలి. ఇంకా యాభై గజాలు దాటితే కాలేజి. చంద్రశేఖర్ ఆ చివరి దూరాన్ని ముక్కుతూ మూలుగుతూ తొక్కుతున్నాడు. గంట నాలుగున్నరయింది. చేతి గడియారం వుంటే బావుణ్ను. నాన్న ఇప్పుడప్పుడే కొనివ్వనని అంటున్నాడు. పోయిన సంవత్సరమేగా సైకిల్ కొని ఇచ్చింది. సైకిలువల్ల రోజుకి అరణాలు మిగులు. కొత్త సైకిల్ నూట ముప్పై రూపాయలు మాత్రమే. యుద్ధం ముగిసి రెండేళ్ళు పూర్తయింది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేసింది. కాని ఇక్కడికి మాత్రం రాలేదు. హైదరాబాదు చుట్టుపక్కల వున్న భారతదేశ ప్రాంతాలనించి లెక్కలేనంతమంది ఈ రెండు నగరాల్లో వచ్చి నిండిపోతున్నారు. ఇక్కడికి వచ్చి ఇలా వెదురు తడికెలతోను, రేకులతోను, కట్టుకున్న గుడారాల్లో చేరి వెదురు కర్రలని తుపాకీలవలె మోస్తూ లెఫ్ట్‌రైట్ వేయడానికి సిద్ధపడుతున్నారంటే వాళ్ళు వదిలిపెట్టి వచ్చిన ప్రాంతాలు భరింపరానివిగా తయారై వుండాలి. వీళ్లని ఏమని పిలుస్తారు? కాందీశీకులు.

చంద్రశేఖరం కాలేజీ గేటులోంచి సైకిల్‌ని వేగంగా పోనిచ్చాడు. ఈ సైన్సు బిల్డింగు దాటాకనే ప్లేగ్రౌండ్ కనిపిస్తుంది. మైదానంతో బాటు అక్కడ కూడిన చాలా తలలు కనిపించేయి. ముందు భాగంలో అంతగా లేరు. ఎక్కువమంది అటుచివర వున్నారు. అక్కడే క్రికెట్ కోసం కర్రలు దించి వల కట్టి వుంచారు. ఇంతకుముందు సంవత్సరం అయిదారుసార్లు ఇక్కడికి ఆట చూట్టానికి వచ్చి వున్నాడు చంద్రశేఖరం. నజీర్ అలీఖాన్ ఆడటం కూడా చూశాడు. అయితే ఈ రోజు తనూ ఒక క్రికెట్ ఆటగాడి హోదాలో ఆడబోతున్నాడు. సైకిల్‌ని మైదానానికి అడ్డంగా తొక్కుకుంటూ వెళ్ళకూడదు. చుట్టు తిరిగే వెళ్ళాలి. ఈ

సంవత్సరం మొదటిరోజు అని ఇంత గుంపు లేక రోజూ ఇంతేనా? ఇంతమందికి అవకాశం దొరికి తన వంతు వచ్చేసరికి గంట ఏడు అయ్యేట్టుంది. అనేకంగా ఈరోజు ఆట అందదు. ఇంత ఆలస్యంగా వస్తే ఎట్లామరి? ఈరోజేనా ఆ రాస్కెల్ బ్రెని కట్టకుండా వెళ్ళిపోవాలి? అయినా బ్రె దొరికింది. లేకుంటే అసలిక్కడికి రావడమే కుదిరేదికాదు.

నజీర్ అలీఖాన్ చంద్రశేఖరంకేసి చూసిన ఆ చూపులో ఎంచేతో స్నేహభావం కనిపించలేదు. సుందర్‌సింగ్ వచ్చి వున్నాడు. ఇంకా పేరు తెలీని, అయినా కాలేజీలో అప్పుడప్పుడూ పరిచయమైన చాలా ముఖాలు కనిపిస్తున్నాయి అక్కడ. వాళ్ళంతా ఆ కాంపౌండులోనే వున్న నవాబుల బళ్ళో చదువుకుని అట్టాగే కాలేజీలో చేరినవాళ్ళు. ఇప్పుడు కూడా నిజాంగారి ఇద్దరు మనుమలు ఆ బళ్లోనే చదువుకుంటున్నారు. వీళ్ళందరికి బడి, కాలేజి అనే వ్యత్యాసం లేదు. అందరూ తెల్లచొక్కా, ప్యాంటు, క్రికెట్ బూట్సు ధరించి ఆట ప్రాక్టీసు చేస్తున్నారు. మూడు బంతులున్నాయి. ముగ్గురు మార్చి మార్చి బోలింగ్ చేస్తున్నారు ఏకధాటిగా. హిస్టరీ గ్రూపు కుర్రాడు బాట్ చేస్తున్నాడు. "బహుత్ లేట్ కర్దియా దోస్త్" (బాగా ఆలస్యం చేశావు) అన్నాడు. నజీర్ అలీఖాన్. కాని అతడు చంద్రశేఖర్‌కి బంతినిచ్చి బోలింగ్ చెయ్యమన్నప్పుడు అతనిలో కోపం వున్నట్లు అనిపించలేదు. ఒక్కక్షణం సంకోచించాడు చంద్రశేఖర్. "నేనిప్పుడు బోలింగ్ చెయ్యలేను" అన్నాడు. నజీర్ అలీఖాన్ ఆ బంతిని వేరొకరికి విసిరేసి చంద్రశేఖరంతో ఏదో అన్నాడు. ఈ రోజంతా బంతిని పట్టుకుని అందించడమే తన పని కాబోలు అనుకున్నాడు చంద్రశేఖర్.

"ఐ సెడ్ పాడ్ అప్" పెద్దగా అరిచాడు నజీర్ అలీఖాన్. బంతి కాళ్లకి తగలకుండా వుండేందుకు పాడ్‌లు కట్టుకున్నాడు చంద్రశేఖర్. ఆ తరువాత వున్నవాటిల్లో మంచి బాట్ తీసుకొని తన వంతు కోసం ఎదురుచూస్తూ నించున్నాడు. "ఇప్పుడే కదా వచ్చాడు. అంతలోకే ఆడటానికి అవకాశం యిస్తున్నాడేమి మన కెప్టెన్" అనుకున్నారు అక్కడున్న వాళ్ళు.

## 2

నా క్రికెట్ చరిత్ర గురించి చెప్పేముందు మేము నివసించే ప్రదేశాన్ని గురించి చెప్పాలి. దాదాపు ప్రతి సంవత్సరం ఇల్లు మారుతూ వచ్చిన మేము నా

పన్నెండో ఏట అంతకుముందు నివసించిన ప్రదేశాల వలె గాక ఊరిబయటి ప్రదేశానికి ఇంటి సామానంతా రెండు తోపుడు బండ్లలో వేసుకుని వెళ్ళాము. మా నాన్నగారికి కూడా క్వార్టర్సు దొరికింది. రైల్వేస్టేషన్నుంచి, బజారునుంచి, దగ్గర్లోవున్న బడి నుంచి కనీసం మైలున్నర దూరంలో వుండే లాన్సర్ బారక్సుకి తరలివెళ్ళాము. మొదట్లో ఆ పేరు ఉచ్చరించడం ఎలాగో వుండేది నాకు. మిట్టపల్లాలుగా వుండే విశాలమైన ప్రదేశం. పది ఎకరాలకు మించిన గట్టినేల. చుట్టూ ఇటుకలతో కట్టిన మూడు అడుగుల ఎత్తు కాంపౌండు గోడ. మధ్యలో రెండు వరుసలుగా పొడుగ్గా కట్టిన సీమ పెంకుల కట్టడం. ఒక్కో వరుసలో పన్నెండు ఇళ్ళ చొప్పున మొత్తం ఇరవై నాలుగు ఇళ్ళుగా మార్చబడింది. ఇదే లాన్సర్ బారక్సు. దీన్ని ఎప్పుడు కట్టారో తెలీదు. పదడుగులు ఎత్తుండే రక్కసుల వంటి వారి కోసమని కట్టి వుండాలి. ఒక్క తలుపుకైనా, స్టూలు లేక కుర్చీ సాయం లేకుండా గడియ పెట్టటం సాధ్యంకాదు. ఇంటి మధ్యలో వున్న చూరు సుమారు ఇరవై ఇరవై అయిదడుగుల ఎత్తున ఏటవాలుగా వుంటుంది. ఒక్కో గోడ రెండు అడుగలు ఘనం వుంటుంది. అంత ఎత్తున్న ఇంట్లో బూజు కొట్టటం కూడా సాధ్యంకాదు. మసక చీకట్లో ఇంటి కప్పుకేసి చూసినప్పుడు ఒక్కోసారి భయమేసేది కూడా. బ్రిటీష్ సైనికుల కోసం కట్టిందని తెలిసింది. ఈ బ్రిటీష్ సిపాయిలు ఎప్పుడూ ఈటెలు చేతబట్టుకుని వుండేవారులా వుంది. ఈటెలు కూడా చాలా పొడవైనవి అయి వుండాలి. ఆ ఈటెలు చూరుకి తగలకూడదని అంత ఎత్తుగా కట్టేరేమో. ఎలాగైతేనేం ఈ బారక్సు రైల్వేకి సొంతమై క్వార్టర్సుగా మారి మా నాన్నగారికి ఇల్లు దొరికింది. దీని కోసం నాన్న పదిహేను సంవత్సరాలు వేచివుండాల్సి వచ్చిందంట.

తక్కినవాళ్లు కూడా ఇలాగే సంవత్సరాల తరబడి ఎదురుచూచిన తరువాత క్వార్టర్సు సంపాయించుకోగలిగారు. మా లైనులో రెండు తమిళ కుటుంబాలు, మూడు ఆంగ్లో ఇండియన్ల కుటుంబాలు, నలుగురు ముస్లింలు, ఒక పార్శీ, రెండు నాయుళ్ల ఇళ్ళు వుండేవి. వెనుక వరుసలో ఒకే ఒక తమిళ కుటుంబం తక్కినవి ఆంగ్లో ఇండియన్లు, పార్శీలు, ముస్లింలు, నాయుళ్ళు (తెలుగు మాట్లాడేవాళ్ళంతా నాయుళ్ళేనా?) మా బారక్సు వుండే ప్రదేశం ఊరిబయట పెద్దమైదానంలో. దాన్ని దాటితే మరో పెద్ద కాంపౌండులో ఒక చర్చి, దాని నానుకుని చిన్న చిన్న ఇళ్ళు. వాటి తరువాత ఒక లైనులో అయిదారు పెద్ద పెద్ద

బంగళాలు. చర్చికి అరమైలు దూరంలో మరొక పెద్ద కాంపౌండు. అందులో క్రైస్తవ సమాధులు. ఆ స్మశానాన్ని ఇప్పుడెవరూ ఉపయోగించగా మేము చూడలేదు. చెట్లు, పుట్టలతో నిండిన ఆ ప్రదేశంలో రకరకాల స్మృతి చిహ్నాలు. గతించిన వారి పేర్లు చెక్కించి నాటిన రాతి పలకలు. గోరీలు భయముకుతూహలము, వుత్సాహమూ ముప్పిరిగొనగా అదిరే గుండెలతో నేనూ, వయసులో నా కంటే చాలా చిన్నవాడైన మా తమ్ముడు ఆ స్మశానపు కాంపౌండు గోడమీదికెక్కి లోపలికి దూకి ఆ సమాధుల మధ్య తిరిగేవాళ్ళం. ఇరవయ్యో శతాబ్దపు సమాధులు చాలా కొద్దిగా మాత్రమే వుండేవి అక్కడ. చాలా వరకు పందొమ్మిదో శతాబ్దంకి చెందినవే వున్నాయి. మృతులంతా సైనికులే. మేము నివసించే బారక్సులో ఒకప్పుడు చాలామంది సిపాయిలు నివసించి వుండాలి. ఎందరో మరణించగా మరెందరో వారి స్థానంలో వచ్చివుండాలి. ఒక్కొక్క రాతి ఫలకం మీద ఇరవై ముప్పై పేర్లు చెక్కబడి వున్నాయి. వాళ్ళంతా ఏదో యుద్ధంలో మరణించిన వారై వుండాలి. లేదా జంట నగరాల్లో తరచుగా చెలరేగే ప్లేగు, మహమ్మారి వంటి అంటువ్యాధుల వాతబడిన వారైనా అయివుండాలి. మా బారక్సు చర్చి, బంగళాలు, స్మశానం, ఇవి తప్ప చుట్టుపక్కల కనుచూపుమేరదాకా మిట్టపల్లాలుగా పరచుకున్న మైదానం మాత్రమే. చాలాదూరాన కొన్ని బండరాళ్ళు, గుట్టలు. మనుషులై తిరగడం కంటె దయ్యాలై సంచరించడానికి అనువైన ప్రదేశం. పశువుల్ని మేపడానికి కూడా పనికొచ్చేస్థలం.

మాబారక్సు కాంపౌండులో ఖాళీ స్థలానికి కొదవ లేకపోయినా సమతలమైన ప్రదేశం మాత్రం చాలా తక్కువే. ఆ స్థలాన్ని పెద్ద వాళ్ళు బాట్ మింటన్ కోర్టుగా ఉపయోగించుకుంటున్నారు. మిట్టపల్లాలు అంత ఎక్కువగా లేని ఒకే ఒక ప్రదేశాన్ని చూసుకుని నేనూ సంతానం మొట్టమొదటగా క్రికెట్ ఆడటం ప్రారంభించాము. సంతానం మాలైనులోనే చివరి ఇంట్లో వుండేవాడు. నాక్లాసే వాడిది కూడా. వాడికూడా ఒక తమ్ముడు నాకులాగే. నాకు అక్క చెల్లెళ్ళు బోల్డుమంది. వాడికి మాత్రం ఆ తమ్ముడొక్కడే. మా తమ్ముడు అప్పుడు చాలా చిన్నపిల్లాడు. అంచేతనేను, సంతానం, వాళ్ల తమ్ముడు ముగ్గురం కలసి ఒక గోడ మీద బొగ్గుతో మూడు గీతలు గీసి ఒక పల్చని చెక్కని బాట్ గా చేసుకుని టెన్నిస్ బంతితో క్రికెట్ ఆడేవాళ్ళం. ఇంత వివరంగా చెప్పటం వల్ల మేమేదో సంవత్సరాల తరబడి క్రికెట్ ఆడేవాళ్ళమని అనిపించవచ్చు. కాని అలా జరగలేదు. ఒకనెలో

మహాఅయితే రెండు నెలలో మేము ఆవిధంగా క్రికెట్ ఆడాము. ఉన్నది ముగ్గురమే అయినా ఎవరు ముందు బాటింగు చెయ్యాలనే నిర్ణయం మాత్రం ఇద్దరి మధ్యే జరిగేది. సంతానం తమ్ముడెప్పుడూ మూడోవాడే. సంతానం మొదటబాటింగ్ చేస్తే మా ఆట మొత్తం అర్థగంటలో పూర్తయిపోయేది. నేను మొదట బ్యాటింగు చేస్తే రోజంతా ఆడినా ఆట పూర్తయ్యేదికాదు. అందుకు కారణం నేను బాగా ఆడతాననికాదు. సంతానంగాడి బౌలింగు ప్రభావం అది.

సంతానం చేసే బౌలింగుని వివరించడానికి భారతదేశం మ్యాపు బాగా పనికొస్తుంది. సికిందరాబాదుకు నేరుగా ఉత్తరానఢిల్లీ. నేను బాట్ పట్టుకుని ఢిల్లీ దగ్గర నిలబడితే సంతానం సికిందరాబాదు నుంచి బంతి విసరాలి. ఎక్కడ నుంచో రొప్పుతూ పరుగెత్తుకొచ్చి బంతి విసిరేవాడు. కాని అది కలకత్తా కేసో లేక కరాచీ కేసో దూసుకుపోయేది. చాలా సందర్భాల్లో కరాచీ దిక్కుకేసి దూసుకుపోయేది. అతని శరీర నిర్మాణంలోనే ఏదో వంకర వుండి వుండాలి. వాడు అలా బంతి విసరడంతో నేను దానితో పోటీ పడుతూ కరాచీకి దౌడు తీసి దాన్ని కొట్టాల్సి వచ్చేది. నా దెబ్బకి బంతి ఆఫ్రికా దేశాల వేపుగా దూసుకుపోయేది. సంతానం తన తమ్ముడి మీద కేకలేసేవాడు. "ప్రాణాలు బిగబట్టి బోలింగు చేస్తుంటే ఫీల్డింగు చెయ్యకుండా బొమ్మలా నిలబడతావేందిరా వెధవా?" అని అరిచేడు సంతానం. వాడు విసిరే బంతిని కొట్టడానికి నేనెంత శ్రమపడుతున్నానో వాడికి పట్టేదికాదు. బొగ్గు గీతల మీద బంతి పడి అవుటవడమనేది జరిగే పనికాదు. కాచ్ పడితే అవుటయినట్లు పెట్టుకున్నాం. బంతి ఒకసారి నేలమీద పడి కాచ్ చేసినా అవుటు కిందే లెక్క. రెండుసార్లు నేలమీద ఎగిరి వచ్చినా, నాలుగుసార్లు ఎగిరి పట్టినా కూడా అవుటే. మేము ఆడేది క్రికెట్ కింద లెక్కకాదు. వాడు బంతి విసరడం, నేను కొట్టడం, దాని వెంట సంతానం పరుగెత్తడం, సంతానం తమ్ముడు ఏదో మూలకి పరుగెత్తి బంతిని పట్టుకోవడం, ఈలోగా నేను అటూ ఇటూ రన్నులు చెయ్యడం, అంతా తలో దిశగా పరుగెట్టే గందరగోళమైన పరుగు పందెం లాగ వుండేది మా క్రికెట్ ఆట.

సంతానం వేసే కరాచీ దిశ బోలింగు నాకు చాలా ఇబ్బందిగా అనిపించినా వాడితో ఆడటం మానేసేటంత విసుగుని కలిగించలేదు. అయినా వేరే కారణాల చేత మా ఆట ఎక్కువ రోజులు సాగలేదు. లాన్సర్ బారక్సులోని మిగతా కుర్రాళ్ళే అందుకు కారణం.

ఆంగ్లో ఇండియన్‌లు, ముస్లింలు అంతా చేరి మా లైనులోనే పది పదిహేను మంది వుండేవారు. వాళ్ళతో వాళ్ళ భాషలో మాట్లాడటం నాకు చేతనయ్యేదికాదు. సంతానం తమిళ కుర్రవాడవటం చేతను, వాడికూడా ఇంగ్లీషు, ఉర్దూ సరిగ్గా రాని కారణం చేతను నేను, వాడు మాత్రం మొదట్లో ఆడుకునేవాళ్ళం. మొదట్లో రెండు మూడు రోజులు మా చిత్రమైన క్రికెట్ ఆట ఎటువంటి అడ్డంకులు లేకుండా కొనసాగింది. ఆ తరువాత ఆంగ్లో ఇండియన్ కుర్రాళ్ళు, వాళ్ళతో చేరిన ముస్లిం పిల్లలు బారక్సు కాంపౌండు గోడ మీద కూర్చుని మేము ఆడుతూంటే తమాషా చూసేవారు. వాళ్ళకంతా తమాషాగా వుండేది. అరమైలు దూరంనుంచి వంకర టింకరగా పరుగెత్తుకుంటూ వచ్చి సంతానం బంతి విసరడం, నేను బంతిని కొట్టడం, సంతానం తన తమ్ముడి మీద కేకలు వెయ్యటం ఇదంతా వాళ్ళకి చాలా సరదాగా అనిపించేది. సంతానం తన తమ్ముడి మీద కేకలు వెయ్యటం ఇదంతా వాళ్ళకి చాలా సరదాగా అనిపించేది. వాళ్ళ స్థానంలో వుంటే నాకూ అలాగే అనిపించిందేమో! "బొమ్మన్, బొమ్మన్" అంటూ అరిచేవాళ్ళు. వాళ్ళ భాషలో మాట్లాడలేని వారంతా వాళ్ళ దృష్టిలో 'బొమ్మన్'లే . సంతానం 'బడా బొమ్మన్', నేను 'ఛోటా బొమ్మన్'ని. వీళ్ళు గేలిచేసే కొద్దీ సంతానం బోలింగు మరింత అధ్వాన్నంగా తయారయ్యేది. ఎప్పుడూ అతడిని తప్పు పట్టని నేను "కొంచెం సరిగ్గా వెయ్యరాదూ" అనేవాడిని. "నేనే ఎంతో కష్టపడి బోలింగు చేస్తున్నా కదా" అనేవాడు సంతానం. అతడు చెమటలు కక్కుతూ బోలింగు చేసే కొద్దీ ఆంగ్లో ఇండియన్ కుర్రాళ్ళు ఆగడం మరింత అధికమయ్యేది. అందరిలో మారిస్ అనే కుర్రాడు అసాధ్యుడు. బారక్సు కాంపౌండులోనే సిగరెట్ తాగేవాడు. సంతానం బోలింగ్ చేసేటప్పుడు నా మీదికి రాయి విసిరేవాడు. సంతానంని అనుకరిస్తూ శరారాన్ని నాలుగు వంకర్లు తిప్పుతూ పరుగెట్టేవాడు. ఒకసారి బంతిని లాక్కుని తనే విసిరేవాడు. వాడు అలా బంతిని లాక్కోగానే తక్కిన పిల్లలు నా చేతిలోంచి బాటు లాక్కోవటానికి వచ్చారు. నేను బారక్సు చుట్టూ పరుగుతీశాను. కాని వాళ్ళంతా నాకన్నా పెద్దవాళ్ళు సులభంగా నా దగ్గర్నించి బాటుని లాక్కుని ఆడటం మొదలెట్టారు. అయితే ఒక్కటి చెప్పాలి. వాళ్లు మాకంటే బాగా ఆడేవాళ్ళు.

మేం కొంతకాలం వాళ్ళ కంట పడకుండా తప్పించుకుని ఆడేవాళ్ళం. అయితే క్రికెట్ లాంటి ఆటని ఎంతకాలమని రహస్యంగా ఆడగలం? ఒక రోజూ

మా బంతి, బాటు మారిస్ జట్టుకి చిక్కిపోయినయ్. మారిస్ విసురుగా కొట్టిన దెబ్బకి బాటు విరిగిపోయింది. సంతానం మా ఇంటి కొచ్చి "నా బాటిచ్చెయ్" లేకుంటే మా నాన్నతో చెప్పి మీ నాన్నని తన్నిస్తాను" అన్నాడు. "మా నాన్నతో చెప్పి మీ నాన్నని కొట్టిస్తాను" అన్నాను నేను. మా నాన్నలెవ్వరూ తన్నుకోలేదు. కాని నాకూ సంతానానికీ చెడింది. ఆ తరువాత చాలా సంవత్సరాలు నేనూ సంతానం ముఖాముఖీ ఎదురుపడినా మాట్లాడుకోలేదు. ఆ తరువాత సంతానం ఏ ఆటా ఆడినట్లూ నేను చూడలేదు. వాడు కళ్ళజోడు పెట్టుకున్నా అది కూడా వాడు ఆటలు మానడానికి కారణమై వుండవచ్చు.

అయితే నేను మాత్రం అలా వుండలేకపోయాను. తురక పిల్లలతోను, ఆంగ్లో ఇండియన్ పిల్లలతోను గోలీలు ఆడాను. జాట్-బందర్ అనే కోతి కొమ్మచ్చి ఆటలాడాను. గిల్లిదండా ఆడాను. మారిస్‌తో చేరి వూళ్ళో ఆడే ప్రతి టార్జాన్ సినిమాకి వెళ్ళేను. లాన్సర్ బారక్సులో వుండే రెండు మర్రిచెట్ల క్రింద వూడల్ని పట్టుకుని జాన్ వైస్ మిల్లర్ మాదిరి ఆ-ఆ-ఆ- అని అరుచుకుంటూ వూగేవాడిని. అవకాశం చిక్కినపుడు పెద్దవాళ్ళతో బాట్‌మింటన్ ఆడేవాణ్ణి. కార్యంబోర్డు ఆడేవాణ్ణి.

ఈ ఉత్సాహానికి అప్పుడప్పుడూ భంగం కలగటానికి రెండు కారణాలుండేవి. ఒకటి మా వాళ్ళు ఒక బర్రెను కొనడం. రెండోది లాన్సర్ బారక్సులోని రెండో వరుసలోని ఆరవ కుటుంబానికి చెందిన కుర్రాళ్ళు. అసలు బర్రెని కొనాలనే వుద్దేశ్యం నాన్నకి లేదు. చోట్టు అనే పాలవానికి యాభయ్యో అరవయ్యో అప్పిచ్చి వున్నాడు నాన్న. ఎంత ప్రయత్నించినా ఆ డబ్బులో పదిహేను రూపాయల కన్నా వసూలు కాలేదు. ఒకరోజు ఆ చోట్టు వూరు వదలి వెళ్ళిపోయాడు. మొగుడు చెప్పాడంటూ అతని భార్య ఒక ముసలి బర్రెని తోలుకొచ్చి మా ఇంటిగేటుకి కట్టేసి వెళ్ళింది. ఆమె వెళ్లిన అరగంటకి ఆ బర్రె మా గూటేటె సహా వూడదెంచుకుని పారిపోయింది. నేనూ మా నాన్న "కొయ్య గేటుతో సహా బర్రె ఏదైనా ఇటుకేసి రావడం చూశారా?" అని విచారించుకుంటూ వెళ్ళాము. చాలామందికి అర్థంగాక మాకేసి వింతగా చూశారు. ఎక్కడెక్కడో వెతికి చివరికి చర్చిలోకి వెళ్ళాము. మా జీవితంలో చర్చికి వెళ్ళటం అదే మొదటిసారి. అక్కడ కనిపించింది. మా బర్రెని మాకిచ్చారు. ఇంతటి మొండి బర్రెని వీధి గేటుకి కట్టెయ్యడం ఉచితం కాదని

ఫాదర్‌గారు సలహా ఇచ్చారు. ఆపసోపాలు పడుతూ ఎలాగో దాన్ని ఇంటికి తోలుకొచ్చి స్నానాలగదిలో కట్టిపడేశాము. అది చూసి అమ్మ "అయ్యయ్యో. బాయిలరు జరపలేదే అంటూ కంగారుపడింది.

"ఫరవాలేదు. అది బాయిలర్‌ని తినలేదులే" అన్నాడు నాన్న.

తెల్లారు జాము మూడు గంటల నుంచే రంకెలు పెట్టసాగింది బర్రె. అంతకుముందు రోజు సాయంత్రం దానికి పాలు పితకలేదు. తిండి కూడా పెట్టలేదు. ఆ ఆకలి మీద అది బాయిలర్‌ని కూడా తినేస్తుందేమో అనిపించేటట్టుంది. మాకు పాలు తెచ్చిపోసే మనిషి తనకు పాలు పితకడం రాదని చెప్పేసి వెళ్ళిపోయాడు. నాన్నకి స్నానాలగది తలుపు తెరవాలంటేనే భయంగా వుంది. ఇంటి పనులు చేసుకోవాలి గనుక అమ్మకి తప్పలేదు. తిన్నగా తలుపుతీసి బర్రెని బయటికి వదిలింది. ఆ తరువాత ఎట్టాగో తంటాలు పడి తనే పాలు కూడా పితికింది. మా ఇంటికి ఆ బర్రె వచ్చినప్పటినుంచీ మా దిన చర్యలలో చెప్పుకోదగ్గ మార్పు వచ్చింది. బర్రె పేడ మాత్రం ఎక్కువగానే వేసేది. ఏమాత్రం అసహ్యించుకోకుండా ఆ పేడని సేకరించి ఓ మూలకి పెట్టడానికి అలవాటు పడ్డాము. ఎవరూ నేర్పించనవసరం లేకుండా, ఎటువంటి తర్ఫీదు పొందకుండా గేదెకి పాలు పితకడం నేర్చుకోగలిగింది అమ్మ. మగపిల్లల్లో పెద్దవాణ్ణి కావటంచేత నేను కూడా పాలు పిండటం నేర్చుకున్నాను. మా గేదెని మొదట్లో అంతా బర్రె అని పిలిచేవాళ్ళం. మా ఇంట్లో కాఫీ రుచి పెరగడానికి మూలకారణమైన మా బర్రె బర్రే అయినా ఎందుకో దానినలా పిలవడం ఉచితంకాదనిపించింది. కొన్నాళ్ళు దాన్ని ముచ్చటగా 'లక్ష్మి' అని పిల్చుకున్నాం. బర్రెకి లక్ష్మి అని పేరు పెట్టుకున్నందుకు కొంతమంది నవ్వకపోలేదు. బాగా అలవాటు పడిన మా గేదె మా ప్రమేయం లేకుండా కొంత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు తీసుకోవటం ప్రారంభించింది. అయిదారు మెట్లెక్కి తిన్నగా వంటింటిలోకి చొరబడేది. దోసెలకని నానబెట్టిన పప్పుని, బియ్యాన్ని హాయిగా ఆరగించేది. అంతటితో అయితే ఫరవాలేదు, సహించగలం. ఒక్కోసారి వున్నట్లుండి పలుపుతాడు తెంచుకుని చర్చి కాంపౌండులోకి చొరబడేది. ఆ చర్చి ఫాదర్‌కి మరి కొందరికి మా 'లక్ష్మి' వాళ్ళ మత సంప్రదాయాలకి అడ్డుతగులుతున్నట్లుగా అనిపించి వుంటుంది. 'లక్ష్మి' అనే పేరుకి బదులుగా మా గేదెకి "వంకర కొమ్ములది" అనే బిరుదు మిగిలింది. పగటిపూట కొన్ని

గంటలు ఒక పిల్లవాడు మా గేదెని మేతకి తోలుకుని వెళ్లేవాడు. అయితే మేసే ఆ ప్రదేశంలో పచ్చగడ్డి అంతంత మాత్రంగానే వుండేది. అంచేత మాకు ఎండుగడ్డి కొనక తప్పేదికాదు. అయితే మా లాన్సర్ బారక్స్ ఎక్కడో వూరికి దూరంగా వున్నందువల్ల ఎండుగడ్డి మోపులబండ్లు తరచుగ వచ్చేవికాదు అటుకేసి. వచ్చినప్పుడు మాత్రం ఎక్కువ మోపులు కొని పెట్టుకోవలసి వచ్చేది. ఎంత ముందు జాగ్రత్త పడినా ఒక్కోసారి మేత సరిపోయేదికాదు గేదెకి. సరిపడా మేతలేకుంటే అది చిక్కిపోయేది. దాని కళ్ళల్లో ఆకలి దీనంగా తొంగిచూసేది. కాళ్ళు సన్నగా ఒణికేవి. దానికి ఆకలి తీరని రోజుల్లో ఇంట్లో నాకు, మా అమ్మకి, నాన్నకి అన్నం సహించేది కాదు. రాత్రుళ్ళు సరిగ్గా నిద్రపోయేవాళ్ళంకాదు. ఒకటి రెండు రోజులు గడ్డిమోపుల బండి కోసం చూసి రాకపోతే రెండు మైళ్ళదూరం నడిచి వెళ్ళి మోండా అనే మా ఊరి సంతలో పాతిక గడ్డి మోపుల్ని కొని తెచ్చేవాణ్ణి. అంత గడ్డినీ అరగంటలో మా వంకర కొమ్ముల్దిస్వాహా చేసి పారేసేది. సైకిల్ మీద పాతిక కట్టలకన్నా ఎక్కువ మోసుకురావటానికి వీలు పడదాయే. నా పసితనపు జీవిత చరిత్రలో ఈ గేదె, దీని తరువాత మా ఇంటికి వచ్చి చేరిన మరొక గేదె, ఆవు వీటి దూడలు ఎంతటి పాత్ర వహించాయన్నది చెప్పడం అంత సులభమేమీ కాదు. సంతాసం మూలంగా నాలో ఏర్పడిన క్రికెట్ మీది మోజుకి మా గేదె అడ్డు తగులుతున్నట్టుగా అనిపించసాగింది నా మట్టుకు. దీనితోబాటు నా ఈ ఉత్సాహానికి తాత్కాలికంగా సంకెళ్ళు వేసి నాలో తీవ్రమైన అశాంతిని కలిగించి, హత్య, ఆత్మహత్యల్ని గురించి నేను ఆలోచించేట్టు చేసినవాళ్ళు మా బారక్సు వెనుక వరుసలో కాపురమున్న తమిళులైన కృష్ణస్వామి సోదరులు.

లాన్సర్ బారక్సులోని ముందు వరుసలోని చివరిది మా ఇల్లయితే రెండో వరుసలో చివరగా వుండేది కృష్ణస్వామి వాళ్ళు ఇల్లు. వాళ్ళ నాన్న తెల్ల యూనిఫారం వేసుకుని రెండు రోజులకోసారి వూరికి వెళ్ళివస్తుంటాడు. ఆయన గార్డుగా వుంటున్నాడా, లేక టి.సి.యా అనేది నాకప్పుడు తెలీదు. నా దృష్టిలో అతనో పెద్ద ఆఫీసరుగా కనిపించేవాడు. కృష్ణస్వామి నా కన్న పెద్దవాడు. బళ్ళో కూడా నాకు పై తరగతిలో వుండేవాడు. వాడి తమ్ముడు బాలు నా తరగతేగాని వేరే సెక్షన్. మూడోవాడైన గోపు నా కింది క్లాసు. వాళ్ళు పాలఘాట్ యాసతో మాట్లాడేవాళ్ళు. బళ్ళో తరచుగా బాలు మాత్రమే కనిపించేవాడు నాకు. వందలకొద్ది తెలుగు, ముస్లిం విద్యార్థుల మధ్య తక్కిన

తమిళ విద్యార్థుల్లాగే వాడు కూడా దారి తప్పిన ఒంటరి మేకలాగ దీనంగా కనిపించేవాడు. అయితే అదే వాడు తన అన్నదమ్ములతో వున్నట్టయితే నా మట్టుకు వాడొక సైతానుగా అనిపించేవాడు.

ఎట్లా మొదలైందో ఇప్పుడు జ్ఞాపకం లేదు. నేను, బాలు 'ఎనిమీస్'గా మారిన తరువాత వాడు కృష్ణసామి గోకు - వీళ్ళ జట్టుతో కలిసే బడికి రావడం, బడి నించి ఇంటికి వెళ్ళటం చేసేవాడు. ఒకరోజు సాయంత్రం వాళ్ళు ముగ్గురూ నన్ను నెట్టుకుంటూ రోడ్డువారగా వున్న కాలిబాట మీదికి, దాని ప్రక్కనే వుండే ముళ్ళ తుప్పల్లోకి లాక్కువెళ్ళి తోసేశారు. ఆ బాట మీదుగా మనుషులెక్కువగా నడవరు. నేను తుప్పల్లోంచి మెల్లగా లేచి చొక్కా, వెడ్డీ దులుపుకున్నాను. వాళ్ళకి యాభై గజాలు వెనగ్గా నడక సాగించాను. అయితే ఒకసారి రుచి మరిగిన పులి వూరికే వుండదుగదా. మళ్ళీ ఒకసారి నన్ను ముళ్ళతుప్పలోకి లాగి పడేశారు వాళ్ళు. అయితే ఈసారి నేను ఊరుకోలేదు. కృష్ణసామి, బాలు - ఇద్దరి ముఖాలని గోళ్ళతో రక్కి వదిలిపెట్టాను. అంతటితో మా కొట్లాటలు ఆగిపోయినయ్.

ఇంట్లో నేను పరధ్యానంగా వుండటం మా వాళ్ళు కనిపెట్టారు. పదిగంటలకి బడికి తొమ్మిదింటికి వెళ్ళటానికి తొందరపడే వాడిని. బడి వదలిన పది నిమిషాలకంతా ఇల్లు చేరుకునేవాడిని. ఇదంతా కృష్ణసామి సోదరులనించి తప్పించుకోడానికే అని మా వాళ్ళకెలా తెలుస్తుంది. బడికి వెళ్ళేటపుడు సులభంగానే వుండేది వాళ్ళ బాధనించి తప్పించుకోవడం. అయితే బడి వదలడం మాత్రం అందరికీ ఒకేసారి వదిలేవారు. గణగణమని బడి గంట కొట్టినప్పుడు మాత్రమే గేటు తెరిచేవాళ్ళు. అందరినీ తోసుకుంటూ ఎంతముందుగా పరుగెత్తినా ఒకేదారి గుండా వెళ్ళే వాళ్ళ కంటబడకుండా తప్పించుకోవడం కష్టంగానే వుండేది. అందుకని స్కూల్ గేటు గుండా గాక కాంపౌండు గోడ దూకి వెళ్ళటం సాగించాను. ఇందు మూలంగా నా శత్రువులకన్నా రెండు నిమిషాలు ముందుగా స్కూల్ నుంచి బయటపడటానికి వీలయ్యేది నాకు.

నేను గోడ దూకడం చూసి మరికొందరు కూడా ఆ పద్ధతిని అవలంబించసాగేరు. ఆ తరువాత స్కూల్ లోపలికి వెళ్ళడానికి కూడా గోడ దూకడం అలవాటైంది నాకు. కృష్ణసామి సోదరులు బడికి రాని రోజుల్లో కూడా నేను గోడదూకేవాడిని. రోడ్డుమీద చాలా వేగంగా నడిచేవాణ్ణి. ఎప్పుడూ హుషారుగా వుండేవాడిని. నాలో వచ్చిన ఈ మార్పును ఇంట్లో ముఖ్యంగా అమ్మ

దగ్గర దాచలేకపోయాను. అమ్మ నా గురించి నాన్నతో చెప్పినట్టుంది. ఒకసారి నాన్న నన్ను పట్టుకుని కొట్టాడు కూడా విషయమేమిటని అడుగుతూ, అయినా నేను మాత్రం నోరుమెదపలేదు. కృష్ణసామి సోదరుల విషయం నా వ్యక్తిగతమైన సంగతి. ఆ సమస్యని నాకు తోచిన విధంగా నేనే పరిష్కరించుకోవాలి. ఎలా అన్నదే తెలీటం లేదు.

ఒక్కొక్కళ్ణీ కాళ్ళూ చేతులూ కట్టిపడేసి, పెట్టెలోపెట్టి తాళం వేసి, రైల్లోకి ఎక్కించి, బొంబాయికి చేర్చి, అతణ్ణి స్టీమర్లో దక్షిణాఫ్రికాకు పంపెయ్యాలని నా ఊహల్లో చిత్రించుకున్నాను. ఇలా ఎన్నో పథకాలు ఆలోచించి పెట్టాను వాళ్ళమీద పగతీర్చుకోవటానికి. నా ఊహలలో వాళ్ళని హతమార్చాలనే ఉద్దేశం ఏమాత్రం లేకపోయినా, దురదృష్టవశాత్తూ ఆ ముగ్గురిలో ఎవడైనా మరణిస్తే శవాన్ని ఎలా మాయం చేయాలి, బట్టల్ని స్టీమర్ పొగ గొట్టంలో ఎలా దాచెయ్యాలి అనే ఆలోచనలు కూడా వచ్చేవి. నా పగవాళ్ళని కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో నవలలో లాగ వెంటనే శిక్షించకుండా ఇరవై ముప్పై ఏళ్ళ తరువాత ప్రతీకారం తీర్చుకుంటే ఎలా వుంటుంది అని కూడా ఆలోచించి పెట్టాను. అలా జరగాలంటే ముందుగా ఒక సముద్ర మధ్యంలోని ద్వీపంలో, కారాగృహంలో బంధింపబడి వుండాలి కదా. అక్కణ్ణించి ఒక రహస్య సొరంగం తవ్వి మరో ఖైదీని కలుసుకోవాలి. చెరసాల నుంచి తప్పించుకుని అపారమైన నిధిని చేజిక్కించుకోవాలి. మారువేషంలో తిరుగుతూ ఎన్నో సాహసకృత్యాలు చేయాలి. ఇలా ఆలోచిస్తూ పద్దెనిమిది, పంథొమ్మిది శతాబ్దాల జీవితంలోకి వెళ్ళిపోయేవాణ్ణి. అయినా అప్పుడప్పుడూ వాస్తవం గుర్తుకి వచ్చినా ఈ పథకాలన్నీ పనికిరాని వ్యూహాగానాలు మాత్రమేనని అనిపించి బాధ కలిగేది. అటువంటి సమయాల్లో నాకు ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన కూడా కలిగేది అయితే ఆత్మహత్య ఎట్లా చేసుకోవాలి? నేను ఆత్మహత్య చేసుకున్న సంగతి ఎవరికీ తెలియకూడదు. అలా **తెలియకుండా** వుండాలంటే నా మృతదేహాన్ని ఎవరి కంటా పడకుండా దాచెయ్యాలి. అలా జరగాలంటూ నా శవాన్ని భూమికి అడుగున పాతెయ్యాలి. ఇందుకోసరం ఆ బ్రిటిష్ సిపాయిల స్మశానాన్ని ఎంచుకున్నాను. రహస్యంగా ఒక చిన్న గడ్డపారని అక్కడికి మోసుకెళ్ళి ఓ మూలగా గొయ్యి తవ్వడం ప్రారంభించాను. వారం

పదిరోజులు తవ్వినా గొయ్యి అడుగులోతు కూడా దిగలేదు. పైగా ఆ వాతావరణం కొంచెం భయం కలిగించింది కూడా. ఇంగ్లీషు మాట్లాడే స్మశాన పిశాచాలతో ఎల్లా పొద్దు పుచ్చడం? చచ్చి బతకడం? నా శవాన్ని పాతడానికి మరొకచోటు కోసరం వెదికాను. మా ఇంటికి గేదె వచ్చినప్పట్నించి నా ఈ అన్వేషణకు మంచి అవకాశం, సమయం లభించింది. గేదెను వెతికే మిషతో గుట్టలూ, పుట్టలూ తిరిగి వాటి మధ్య అనువైన చోటేదైనా దొరుకుతుందేమో అని వెతకసాగేను. మా ఇంట్లో విషంతాగి చచ్చిపోయి నా శవాన్ని నేనే మోసుకెళ్ళి రహస్యంగా పాతి పెట్టడానికి ఊహించిన అనువైన ప్రదేశమేదీ కనబడలేదు. అయితే ఆ చుట్టుపక్కల కొన్ని మైళ్ళ దాకా విస్తరించిన పరిసరాలని బాగా పరిశీలించే అవకాశం కలిగింది. ఆ ప్రదేశం చాలా భాగం ఎర్రమట్టి నేల కావడంతో తేళ్ళు ఎక్కువగా వుండేవి. ఏ రాతి బండను జరిపినా దాని క్రింద తేలు నక్కి వుంటుందనే భ్రమ నాలో బాగా నాటుకుంది. ఆ రాళ్ళని తొలగించి, రక్షణ కోల్పోయి అటూ ఇటూ అల్లల్లాడే తేళ్ళ అవస్థను గమనించి నాకు జాలి కలిగేది. వాటికి అనవసరంగా ఇబ్బంది కలిగించరాదని కూడా అనుకునేవాణ్ణి.

ఆ తరువాత సంతానం వచ్చేడు. కృష్ణసామి సోదరుల బారి నుంచి తప్పించుకోవడానికి అతనే విధంగాను నాకు సాయపడడని త్వరలోనే గ్రహించాను. సంతానం తోడుగా వున్నాడనే ధైర్యంతో స్కూల్ నించి పరుగులు తీయకుండా నడిచి వచ్చేవాణ్ణి. "చాలా రోజులకి చిక్కాడు భడవ" అంటూ కృష్ణసామి నన్ను పట్టుకుని తోశాడు. అది చూసి నాకు బదులుగా సంతానమే భయపడి పరుగులు తీశాడు. ఆ విషయం నేను సంతానంతో ప్రస్తావించదలచుకోలేదు. ఇది జరిగిన తరువాత నేను సంతానం క్రికెట్ ఆడాము. అప్పుడు ఈ క్రికెట్ ఆట ఒక్కటే మమ్మల్ని దగ్గరికి చేర్చిన బంధం అనుకోవాలి. అయితే ఈ బంధం కూడా త్వరలోనే తెగిపోయింది.

భాష వేరైన వూళ్ళో వుండటం నాకు అలవాటైపోయింది. అదీగాక లాన్సర్ బారక్సులో నివసించే ఆంగ్లో ఇండియన్, ముస్లిం పిల్లలు ఆటల్లో తమతో నన్నుకూడా చేర్చుకున్నారు. వాళ్ళు నన్ను 'బామ్మన్' అని పిలిచినా నేను అందుకేమీ కోపగించుకోవటం లేదు. వాళ్ళు తొండల్ని రాళ్ళతో కొట్టి చంపేవాళ్ళు. ఉడుతల్ని కూడా. ఇంగ్లీషులో యధేచ్ఛగా బూతులు

మాట్లాడుకునే వాళ్ళు. ఆ బూతు పదాలకి ఒక కారణమంటూ వుండక్కర్లేదు. ఆఁ-అంటే ఒక బూతు మాట. ఊఁ- అంటే బూతుమాట. ఆబూతుల్లో నాలుగక్షరాల పదం (Four letter word) తరచుగా వాడేవారు. రాయి తట్టుకుని పడబోతే అదే పదం. గిల్లి దాండు కొట్టకపోతే ఆ పదమే. బొంగరాల ఆటలో తప్పినా ఆ పదమే. చెట్టెక్కినా ఆ పదమే. ఆవు పరుగెత్తినా ఆ పదమే. ప్లాజా థియేటర్లో రెండు గంటలు క్యూలో నిలబడి జాన్ హాల్ – మరియా మంటేజ్ సినిమా టిక్కెట్లు దొరక్కపోయినా ఆ పదమే. మారిస్‌కి అన్నదమ్ములే గాక ఇద్దరు అక్కలు, ఒక చెల్లెలు కూడా వున్నారు. వాళ్ళతో ఏదైనా పేచీ వచ్చినా ఆ బూతు పదమే. చిత్రమేమిటంటే ఆ ఆడపిల్లలు సైతం ఆ నాలుగక్షరాల మాటలని సులభంగా వాడేయటం. అయితే వారిలో మారిస్ పెద్దక్క మాత్రం ఈ మాటని చాలా తక్కువగా ప్రయోగిస్తుంది. వాళ్ళింట్లో ఈ అమ్మాయి మాత్రమే కంటికి నదురుగా కనిపిస్తుంది. యుద్ధం ప్రారంభమయి సికిందరాబాదులో వందలకొద్ది బ్రిటిషు సిపాయిలు నిండి వున్న రోజుల్లో ఆ అమ్మాయిలో మార్పు కొట్టొచ్చినట్టు కనిపించేది. మేము తరచుగా చూసే ఇంగ్లీషు సినిమాల్లో వచ్చే అమ్మాయిలాగా కనిపించేది నా కళ్ళకి. మాతో ఆమె మాట్లాడేటప్పుడు బాగా అర్థమయ్యే ఆ ఇంగ్లీషు, సిపాయిలతో ఆమె మాట్లాడేటప్పుడు ఏదో అర్థంకాని భాషలా వుండేది. ఒకరోజు ఎవరో సిపాయితో మాట్లాడుతూంది ఆమె. అప్పుడే అక్కడికి వచ్చిన నన్ను దగ్గరికి పిలిచి తన ప్రక్కనే కూచోబెట్టుకుంది. అతనితో మాట్లాడుతూ అయిదుమిషాలోసారి నన్ను ముద్దు పెట్టుకునేది బుగ్గలమీద. ఆమె విషయంలో నాకేమీ ఇబ్బంది **అనిపించేదికాదు. కాని** ఆ సిపాయి నా కంటికి ఏదో రాక్షసునిలా అవుపించేవాడు. **ఆ కళ్ళు, ముఖం,** కాళ్ళు, చేతులు అంతా ఎర్రగా నెత్తురు చిమ్ముతున్నట్లుగా **వుండేది.** పైగా వొళ్ళంతా ఒత్తుకలు. నోటి నుంచి భరించరాని దుర్వాసన. మారిస్ నన్ను చూసి కన్నుకొట్టేడు.

కృష్ణసామి ఇంటికి మరో ఇద్దరు వచ్చి చేరారు. సికిందరాబాదులో ఉద్యోగం కోసరం వచ్చిన వాళ్ళు అతనికి మామలు అని తెలిసింది. వాళ్ళు మాట్లాడే తమిళం మరీ ఘోరంగా వుండేది.

సికిందరాబాద్‌కి వచ్చి చేరిన రెండు మూడు రోజుల్లోనే వారిద్దరికీ ఆర్డినెన్సు ఫ్యాక్టరీలో ఉద్యోగం దొరికింది. పదహారు సంవత్సరాలు దాటి రెండు ఇంగ్లీషు ముక్కలు తెలిసుంటే చాలు ఆర్డినెన్సు ఫ్యాక్టరీలో ఇట్టే ఉద్యోగం

దొరికిపోయేది ఆ రోజుల్లో. పొద్దున ఎనిమిదింటికి పనికి వెడితే మధ్యాహ్నం మూడున్నర కల్లా ఇంటికి తిరిగి వచ్చేవాళ్ళు. కృష్ణసామి ఇంట్లో ఇప్పుడు వాళ్ళనాన్న మినహా అయిదుగురు మగవాళ్ళు. వాళ్ళు క్రికెట్ ఆడటం మొదలెట్టారు. వారిలో ఇద్దరు బాగా పెద్దవాళ్ళు కావటం చేత నాకూ సంతానానికి ఏర్పడిన చేదు అనుభవాలు వాళ్ళకి ఎదురుకాలేదు.

లాన్సర్ బారక్సులోని ఆంగ్లో ఇండియన్ కుటుంబాలకి నేను ఎంతో అప్తుణ్ణి అయ్యాను. అలాగే ముస్లిం ఇళ్ళలో పరదాని తొలగించుకుని లోపలికి వెళ్ళగలిగినంత చనువు ఏర్పరచుకోగలిగాను. కోడి మెడని కరకరా కోస్తుంటే ఏమాత్రం చలించకుండా నిలబడి చూడగల నిబ్బరం అలవరచుకున్నాను. మారిస్ తల్లిదండ్రులిద్దరూ తప్పతాగి ఒకర్నొకరు తిట్టుకుంటూ కొట్టుకొంటూ వుంటే అదే గదిలో మారిస్, వాళ్ళ అన్న టెరిన్సు వాళ్ళ అక్కచెల్లెళ్ళతో కూర్చుని 'మోనాపలీ' ఆట ఆడేను. ఆ రోజుల్లో ప్రసిద్ధిగాంచిన గురుషీత్, జోరాబేగం, నూర్జహాన్ - వీళ్ళు పాడిన సినిమా పాటల్ని పాడటం నేర్చుకున్నాను. ఎట్లాగో అమ్మానాన్నల్ని ఒప్పించి పైజామా కుట్టించుకున్నాను. జార్జన్ అనే నాయుడోళ్ళ అబ్బాయితో కలిసి, వాళ్ళ అన్న సుందర్, సుందర్ స్నేహితులైన వెంకట్, అప్పారావులతో కలిసి కారంబోర్డు ఆడటం నేర్చుకున్నాను. మా ఇంట్లోకి ఎట్లాగో ఒక బాడ్మింటన్ నెట్ ఒకటి వచ్చి చేరింది. ఆ నెట్ సొంతదారుడిని కావటంచేత ఆటలో నాక్కూడా ఒక అవకాశం ఇచ్చేవాళ్ళు. వాళ్లంతా నవ్వుతూ గలగల మాట్లాడుకునే మాటలకి, మారిస్ ప్రభృతులు వాడేబూతులకి ఏదో వ్యత్యాసం కనిపించింది నాకు. ఆంగ్లో ఇండియన్ కుర్రాళ్ళు వాడే బూతులు అంటే అసహ్యంగా అనిపించలేదు. అయితే ఈ నాయుడబ్బాయి వాడే బూతులు వినడానికి ఆదోలా వుండేవి. అందులోనూ వెంకట్ మరీ పచ్చిగా మాట్లాడేవాడు. గౌను, పావడ, ఓణీ, చీరలు ధరించిన కాన్వెంటు అమ్మాయిలు అప్పుడప్పుడూ మా బారక్సు మీదుగా నడిచి వెళ్ళేవారు. అలాంటప్పుడు కావాలనే బంతి వాళ్ళకి తగిలేలా విసిరి, దాన్ని తెమ్మనేవాడు వెంకట్ నాతో. ఒకసారి మా గేదె పేడ అంటిన తోకతో వాణ్ణి పలకరించింది. అప్పుడు వాడి చొక్కాకి అంటిన పేడ మరకల్ని కడుక్కోవడానికి బక్కెట్ నీళ్ళు నేనే తెచ్చిచ్చాను వాడికి. కావాలనే నీళ్ళుపోస్తూ వాడి ప్యాంటుని సగంపైగా తడిపేశాను.

కృష్ణసామి సోదరులు వాళ్ళ ఇంటికి చేరువలోనే ఒక క్రికెట్ గోష్ఠి ప్రారంభించారు. బయటి నుంచి వచ్చిన నలుగురైదుగురు అరవ పిల్లలు కూడా ఆటలో పాల్గొన్నారు. నేను బాడ్మింటన్ ఆడుతున్నట్లుగా ఎంత భావించుకున్నా వెంకట్ అప్పారావుల సరదా తీర్చడానికి కాన్వెంటు అమ్మాయిలని తరుముకుంటూ వెళ్ళడం నాకు చాలా ఇబ్బందిగా తోచింది. బాడ్మింటన్ తప్ప నాకు తెలిసిన, అందుబాటులో వున్న ఆటలు గోలీ, గిల్లికోతు జాట్‌బందర్, క్రికెట్‌తో పోలిస్తే ఇవన్నీ నాసిరకం ఆటలే. ఈ సంగతి అప్పట్లో నాకు తెలిసినా తెలీకపోయినా కృష్ణసామి సోదరుల దృష్టిలో నేను చులకనకావడానికి కారణమైనవి. ఒకసారి మారిస్, సయ్యదు, వహాబ్ – ఈ ముగ్గురి చేతికి వాయినంగా చిక్కాడు కృష్ణసామి. ఈ ముగ్గురూ వాణ్ణి మట్టిలో పడదోసి పొర్లిస్తుంటే నేను చూస్తూ నిలబడ్డాను. ఇది జరిగిన తరువాత బడికి వెళ్ళేటప్పుడు, తిరిగి వచ్చేటప్పుడు మరింతగా జాగ్రత్తపడాల్సివచ్చేది. ఇదంతా కొన్ని సంవత్సరాల కాలంలో జరిగిన సంగతులుగా అనిపించవచ్చుగాని అదేమీకాదు. మహా అయితే ఏడాదిలోపుగా సంభవించినదే ఇదంతా. అంటే మాగేదె, మారిస్, కృష్ణసామి సోదరులతో యుద్ధం, జాట్‌బందర్, టార్జాన్ న్యూయార్క్ సాహసాలు, వెంకట్, అప్పారావుల అశ్లీల ప్రవర్తన, సమాధుల మధ్య నా చోటుకోసం అన్వేషణ, వాటి మధ్య ఎలానన్ను నేను పాతి పెట్టుకోవటం అనే పరిశోధన, మారిస్ పెద్దక్క కనబరచిన అన్యోన్యత, ...నేను ఆరో తరగతి చదువుతున్నప్పుడు యుద్ధం ముగిసింది. అప్పుడే మారిస్ వాళ్ళ చిన్నక్కలో కూడా ఏదోమార్పు వచ్చింది. ఉన్నట్టుండి ఎంతో పెద్దదైపోయి నట్టనిపించింది నా కంటికి. అయితే ఈ అమ్మాయి కొంచెం నల్లగా వుంటుంది. పేరు లారా. పెద్దమ్మాయి పేరు ఎంచేతో గుర్తు రావటంలేదు. ఎంత ప్రయత్నించినా జ్ఞాపకానికి రావటంలేదు. మనిషి మనస్సు నమ్మశక్యంకానిదిగా వుంది. ఎన్నో సంవత్సరాలుగా అనుభవమైన వాటిని అయిపు లేకుండా తుడిచెయ్యగలదు. అయిదు నిమిషాల అనుభవాన్ని మాత్రం అణువణువూ చెరిగిపోకుండా మనసు పొరల్లో నిక్షిప్తం చేసుకోగలదు. దాని గడియారమూ, కేలండరూ చిత్రమైనవి. అసలు ఇలాటివన్నీ ఈ మనస్సుకు లేవేమో!

యుద్ధం జరిగే రోజుల్లో ఎంతో ఉత్సాహంతో వుండిన మారిస్ పెద్దక్క ఇప్పుడెందుకో దిగాలు పడిపోయినట్టుగా వుంటున్నది. తరచుగా వచ్చిపోతుండే

ఆ సిపాయి ఇప్పుడు కనబట్టంలేదు. తనని పెళ్ళాడి ఇంగ్లండుకి తీసికెడతాడనే ఆశతో వుండింది ఆమె. ఇంట్లో కూడా అలాగే భావించారు. కాని అలా జరగలేదు. తక్కిన ఆంగ్లో ఇండియన్ యువతులవలె తను కూడా సికిందరాబాదులోనే వుండిపోవలసిందే. పెద్దమ్మాయి ఇంట్లోనే వుండేదిగాని, మారిస్ చిన్నక్కలారా మాత్రం మాతో సినిమాకి వచ్చేది. నేను, మారిస్, అన్న టెరిన్స్, లారా, ఎప్పుడైనా వాళ్ళ చెల్లెలు అంతా కలిసి ప్లాజా థియేటరుకు వెళ్ళేవారం. మాట్నీకి అయితే ఆఖరి తరగతి టిక్కెట్టు నాలుగణాలు మాత్రమే. అయితే బ్రిటిష్ పావలా. అదే హైదరాబాదు డబ్బు హాలీ నాణెం రూపంలో అయితే అయిదణాలు చెల్లించాల్సి వుంటుంది. ప్లాజాకి టిక్కెట్టు దొరక్కపోతే డిలైట్ టాకీసుకి వెళ్ళేవాళ్ళం. అక్కడా దొరక్కపోతే డ్రీంలాండ్ కి. టెరిన్సు పక్కా రౌడీ లాగా ప్రవర్తించేవాడు. కావాలనే ముందున్న కుర్చీని తన బూట్సుకాళ్ళతో తన్నేవాడు. లోపలికి వెళ్ళగానే సిగరెట్ కాల్చేవాడు. మారిస్ కూడా పోకిరీవాడే అయినా టెరిన్సులా మరీ అంత అనాగరికంగా ప్రవర్తించే వాడు కాదు. అయితే లారాకీ వీళ్ళ ప్రవర్తన సరదాగానే వుండేది. వాళ్ళకి ఆంగ్లో ఇండియన్ స్నేహితులు దొరికినప్పుడు నన్ను దూరంగా తోసేసినా మిగతా సమయాల్లో నన్ను తమలోని ఒక వ్యక్తిగానే భావించేవాళ్ళు. లారాకి ఒక విధంగా నేను నచ్చితే. ఆమె అక్కకి వేరొకందుకు నా సాహచర్యం ఊరట కలిగించేది. ట్రంకు పెట్టె తెరచి ఆ బ్రిటిషు సిపాయి తనకిచ్చి వెళ్ళిన ఇంగ్లీషు పత్రికల్ని తీసి వాటిలోని బొమ్మల్ని నాకు వివరించి చెప్పేది లారా అక్క.

ఒకసారి అలా బొమ్మలు నాకు చూపిస్తూ వున్నట్టుండి నన్ను కావలించుకుని వెక్కివెక్కి ఏడ్చింది ఆమె. నాక్కూడా దుఃఖం ఆపుకోలేక ఏడ్చేశాను. మేమిద్దరం అలా ఏడవటం చూసి వాళ్ళనాన్న మన్నాస్‌కి కోపమొచ్చింది. మా ఇద్దర్నీ విసురుగా సోఫాలోంచి కిందికి తోశాడు. అప్పుడక్కడికి వాళ్ళ అమ్మ వచ్చింది. అమ్మా నాన్నా పెద్దగా అరుచుకుంటూ గొడవపడ్డారు. ఫలితంగా అక్కడ గోడకి తగిలించిన పటాలలో రెండు మూడు కింద పడి ముక్కలయ్యాయి.

ఇదంతా ఇప్పుడు మారిపోయిందని కాదు. నా దైనందిన జీవితంలోంచి ఇదంతా మరుగున పడిపోయింది. మారిస్, వాళ్ళ అక్క, మిసమిసలాడుతున్న లారా, టెరిన్స్, మన్నాస్, మిసెస్ మన్నాస్ అందరూ తెర మరుగున

పడిపోయినట్లయింది. నా ముస్లిం మిత్రులు, నాయుడు, దోస్తులు జనార్దన్, అప్పారావ్‌లు కూడా. ఎప్పటికీ సాధ్యం కాదనుకున్నది చాలా సహజంగా జరిగింది. కృష్ణసామి సోదరులకి నేను చాలా దగ్గరి వాడినయ్యాను. ఇలా జరగడానికి ముఖ్య కారకుడు రంగరామానుజం.

అర్బత్ నాట్ బాంక్ దివాలా తీసినప్పుడు మా నాన్న చాలా నష్టపోయారు అని చెప్పారు. చాలా రోజులుదాకా ఎంత తెలివితక్కువవాడైతే మాత్రం పోయి పోయి ఆ బాంకులో అంత డబ్బు వేసుకుంటారా? అంటాను. 'పాపం కష్టపడి సంపాయించిన డబ్బంతా పోయింది వీడికి' అంటూ ఎరిగున్నవాళ్ళు నాన్నపట్ల జాలి కనబరుస్తూ అనుకోవటం నాకు తెలుసు. అయితే ఇంతా చేసి మా నాన్న పోగొట్టుకున్నది ఎనిమిది వందలు, అప్పట్లో సుమారు యాభై సవర్ల బంగారం వచ్చేది ఆ డబ్బుకి. ఆ దర్జీదగ్గర్నించి రెండు అల్పాకాకోట్లు కుట్టించుకురావటం, వెయ్యిమైళ్ళ దూరంలో వుండే అర్బత్ నాట్ బాంక్ దివాలా తియ్యటం ఒక్కసారే జరిగింది. ఎన్నో యేళ్ళ దాకా పెట్టెలో మూలుగుతూ పడివున్న ఆ కోట్లని నేను సంతానంతో చేరి క్రికెట్ ఆడే రోజుల్లోను ఆ తరువాత మరి కొన్నేళ్లపాటు - మానాన్న మార్చి మార్చి ధరించేవాడు. ముదురాకుపచ్చ రంగులో మెరుస్తూ, వెలుతురు తగలగానే అంతలో ఊదారంగుకు మారి మెరిసేది. మళ్ళీ పచ్చరంగు. తరువాత ఊదా. అక్కడక్కడ దారాల పోగులు తెగి కనిపించేవి. అలా చిరిగిన చోట్ల ఎర్రగా కనిపించేది. దాదాపు పదేళ్ళపాటు పెట్టెలో మూలుగుతూ వుండిన ఆ కోట్లని దులిపి ధరించేటప్పుడు అక్కడక్కడ చిమటలు కొట్టేసి నాయనే తప్ప మరే విధమైన సంకోచమూ మాకెవరికీ కలగలేదు. ఎంచేతనంటే వాటినెవరూ పదేళ్ళ పాతవి అని అనుకోలేరు గనుక. హైదరాబాదు, సికిందరాబాదు నగరాల దర్జీలు ఇరవై యేళ్ళ నించీ ఒకే రకంగా కోట్లు కుడుతున్నారు. దుస్తుల తీరు మార్చుకునే అవసరం కలగలేదెవరికీ. స్కూలుకి వెళ్ళే పిల్లలు ఓపెన్‌కాలర్ మెడతో కూడిన చొక్కాలే వేసుకుని వెళ్ళేవారు. పెద్దవాళ్ళలో కూడా చాలామందికి ఈరకం చొక్కాలే అలవాటు. కొంచెం ఖరీదైనదీ చాలినంత గుడ్డగలదీ అయితే పై కాలర్ పెట్టుకునేవారు. ఇలా ఒకే రకమైనటు వంటి పై కాలరు షర్టు నిజారువేసుకోవడాన్నిబట్టి వారు ఏ జాతికి చెందినవారో కూడా ఒక రకంగా వూహించవచ్చును. హిందువులు,

ముస్లింల పిల్లలైతే నిజారు లేక పైజామా పేంటు మీద చొక్కా వేసుకుంటారు. యాంగ్లో ఇండియన్ పిల్లలైతే చొక్కాని నిజారు లోపలగాని, పాంటులోపలగాని దోపుకుంటారు. అయితే జంటనగరాలలో స్థిరపడిన తమిళ కుటుంబాలవారంతా ముఖ్యంగా పెద్దవాళ్ళు కలిసికట్టుగా ఒక నిర్ణయం తీసుకున్నవారిలా ఒకేరకమైన వస్త్రధారణ చేసేవాళ్ళు. **పొడుగు** చేతుల చొక్కా. చొక్కాని లోపల దోపుకుని దాని మీద కచ్చపోసిన పంచెకట్టు, మళ్ళీ వీటిమీద ఒక కోటు, అయ్యావార్లైనా, రాఘవాచారి అయినా, గోవిందసామి నాయుడైనా, పినాకపాని ముదలియార్లైనా, అరవదేశం నుంచి ఈ ప్రాంతానికి వస్తే టోపీ ఒకటి తప్పకుండా వుండి తీరాల్సిందే. వకీళ్ళు, కాలేజీ ప్రొఫెసర్లు తలపాగా ధరిస్తారు.

ఎదిగే పిల్లవాడిననే కారణంతో చొక్కా కుట్టినా నిజారుకుట్టినా రెండంగుళాలు పొడవు, వెడల్పు ఎక్కువగా పెట్టి కుట్టించేవాడు. మా నాన్న. నడుందగ్గర మరీ వదులుగా వుంటే సరిచేసుకోవడానికి బకుల్సు వుండేవి. ఎంతగా బిగించి బకుల్స్ పెట్టుకున్నా నాచెడ్డీ ఎప్పుడూ వదులుగానే వుండేది. జారిపోతూ వుండేది. అందుకని నా చెడ్డీని లోపలికి మడిచి దోపుకునేవాణ్ణి. దీనివల్ల పొడవు కూడా తగ్గేది. అలా దోపుకున్న చెడ్డీమీద చొక్కా వేసుకునే వాణ్ణి. అలా చేయడం వల్ల చీర కుచ్చెళ్ళవలె నేను దోపుకున్న చెడ్డీ మడత బయటికి కనబడేదికాదు.

సికిందరాబాదు కుర్రాళ్ళ వస్త్రధారణలో మార్పు తేవడానికని అవతారమెత్తినట్లుగా ఇద్దరొచ్చి చేరారు. ఒకడు రాజ్‌కుమార్, మరొకడు రంగరామానుజం. వాళ్ళిద్దరికీ తండ్రో, అన్నో, మామగారో ఎవరో ఒకరు ఒక మిలిటరీ వుండేవాళ్ళు. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన ఒకటి రెండేళ్ళ మధ్యకాలంలో సికిందరాబాదుకొచ్చి స్థిరపడిన కుటుంబాలలో వీళ్లూ వున్నారు. ఎంతో అధునాతనంగా డ్రెస్ చేసుకొని స్కూల్‌కి వచ్చేవాడు రాజ్‌కుమార్. అది చొక్కాలాగూ కాక, కోటులాగూ కాక కనిపించేది. పెద్ద పెద్ద జేబులుండేవి. నడుముదగ్గర ఆ చొక్కా కోటుకి బెల్టుకూడా కుట్టివుండేది. ఈ కొత్తరకం చొక్కాని బుష్‌కోటు అంటారని అతనే చెప్పాడు. రంగరామానుజం చొక్కా ముందు భాగం పూర్తిగా ఓపనై దానికి బొత్తాములుండేవి. మేమంతా చొక్కా లోపలి తలదూర్చి వేసుకుంటే వాడు కోటు తొడుక్కున్నట్టుగా అతి

సులభంగా వేసుకునేవాడు ఆ బొత్తాముల షర్టుని. మా తలలు చెరగకుండా షర్టు వేసుకోవడం కుదరదు మాకు. అయితే అతనికి ఆ ఇబ్బంది లేదు. అంతకుముందు వాడు చదివిన బళ్ళో సిలబస్ వేరే విధంగా వుండటంచేత ఇప్పుడు మా బళ్ళో వాణ్ణి ఏ తరగతిలో చేర్చుకోవాలా అన్నది చర్చనీయమైంది కాబోలు.

మొదటివారంరోజులు పై తరగతిలో కూర్చుని ఆ తరువాత నా తరగతికే వచ్చి చేరాడు. తమిళ పాఠం జరుగుతున్నప్పుడు ఏమీ అర్థంగాక దిక్కులు చూస్తూ కూర్చునేవాడు. చివరి దాకా తమిళ పరీక్షకి కూర్చొనేలేదు. ఒకరోజు క్లాసులో మేష్టరు ఇంగ్లీషు గ్రామరులో మా తెలివితేటల్ని పరిశీలించాలని అనుకున్నాడు. చేంతాడు లాంటి పొడవైన ఒక ఇంగ్లీషు వాక్యం బోర్డుమీద రాసి అందులోని ఒక భాగాన్ని గుర్తుపెట్టి అది ఏ క్లాజో చెప్పమని ప్రశ్నించారు. ఒక్కొక్కరే వరుసగా లేచి నిలుచున్నారు. సమాధానం చెప్పలేని వాళ్ళు అలాగే నిలబడితే, ఒకడు మాత్రం లేచి నిలబడి 'నౌన్ క్లాజ్' అని జవాబిచ్చాడు.

"నోనెక్స్ట్"

"అడ్జెక్టివల్ క్లాజ్" అన్నాడు మరొకడు.

"నోనెక్స్ట్"

"అడ్వెర్బియల్ క్లాజ్" మరొకని సమాధానం.

ఇంగ్లీషు వాక్య నిర్మాణంలో పై మూడు మాత్రమే సబార్డినేట్ క్లాజ్ కిందికి వస్తాయని మాకు బోధించారు. నాకు మాత్రమేగాక క్లాసులోని పిల్లలందరికీ ఈ మూడూ సందేహంగానే వున్నాయ్. ఇంగ్లీషు గ్రామర్‌కి సంబంధించినంతవరకు ఇది కాకపోతే అది అనే రకంగా సమాధానాలు చెప్పటం అలవాటు మాకు. ఇప్పుడు ఈ ప్రశ్నకు పై మూడింటిలో ఏదీ సరైన సమాధానం కాదంటే ఏమిటి చెయడం? మేష్టారు 'నెక్స్ట్ నెక్స్ట్' అంటున్నారు. నా వంతు వచ్చింది. లేచి నిలుచున్నాను. నా కంటికి మేష్టారు శకుని లాగ, క్లాస్ కౌరవసభలాగ కనపించింది. పాచికలు వేశాను.

"పెరంతిటికల్ క్లాజ్ సర్"

ఒక్కక్షణం క్లాసంతా చీమ చిట్టుక్కుమన్నా వినిపించేంతటి నిశ్శబ్దం. మేష్టారు 'నెక్స్ట్' అన్నారు. తరువాత బెంచిలో మొదటగా కూర్చుని వున్నాడు రంగరామానుజం. ధైర్యంగా లేచి 'పెరంతిటికల్ క్లాజ్' అన్నాడు తొణక్కుండా.

'గుడ్' అన్నాడు మా మేష్టారు.

క్లాసు ముగిసిన తరువాత ఇంగ్లీషు భాషని మధించి వేసిన పండితులలాగా గర్వంగా ఇద్దరం ఒకరినొకరు చూసుకుని చిరునవ్వులు చిందించు కున్నాము. వాడు నా పేరడిగి తెలుసుకున్నాడు. నేను రంగరామానుజం షర్టుని తాకి చూశాను. రెండు రోజుల తరువాత వాడిని పై తరగతికి, కృష్ణసామి సెక్షన్‌కి మార్చారు. మా ఇద్దరి స్కూలు చదువు పూర్తయి, ఊరికి నాలుగు మైళ్ళ దూరంలో వున్న కాలేజీలో చేరిన తరువాత మళ్ళీ మేమిద్దరం కలుసుకోవటం తటస్థించింది. కృష్ణసామి జట్టుతో చేరి క్రికెట్ ఆడటానికి మా లాన్సర్ బారక్స్‌కి వచ్చేవాడు.

సికిందరాబాదులో సైతం బుష్‌కోటు, ఫ్రంట్ ఓపెన్ షర్టు ప్రచారంలోకి వచ్చినయ్. ఇవి కుట్టడానికి దర్జీలు ఎక్కువగా ఛార్జి చేసేవాళ్లు. అయితే ఈ రకమైన చొక్కాలు పైజామా మీద వేసుకోవడానికి అనువుగా వుండవు అంతగా. కుర్చీలో కూర్చున్నప్పుడు షర్టు ముందు భాగం తెరుచుకుని లోపలి పైజమా నాడా కనిపించేది. అంచేత పైజామాల్ని నాడా లేకుండా పాంటులాగా కుట్టించుకోనారంభించారు. ఆరోజుల్లో 'ఎం.ఎస్.-55' గుడ్డ చాలా విలువైనదిగా పరిగణించబడేది. ఎప్పుడో అరుదుగా మాత్రమే లభ్యమయ్యేది. ఎవరెవరికో ముందుగానే చెప్పి వుంచి ఆ గుడ్డకొని పాంటులాంటి పైజామా కుట్టించుకుని, దానిపైకి ఫుల్ ఓపెన్ షర్టు ధరించి వీధిలో దర్జాగా నడుస్తూనన్ను నేను జనాబ్ జిన్నాగా భావించుకునేవాడిని. ప్రపంచంలో అందరికంటె ఖరీదైన దుస్తులు తొడుక్కునేవాడని జిన్నాకి ఆ రోజుల్లో ఒక పేరుండేది.

ఒక రోజు లాన్సర్ బారక్స్ కాంపౌండులోకి ప్రవేశిస్తుండగా రంగరామానుజం అటువేపుగా వచ్చాడు.

"మీ ఇల్లెక్కడ?" అని అడిగాడు.

"మొదటి వరుసలో ఆ చివరిది"

అతను నాతోబాటు నడిచాడు. మన్నాస్ ఇంటిని దాటుతుండగా మారిస్ పెద్దక్క "చందూ" అంటూ పిలిచింది నన్ను. నేను రంగరామానుజాన్ని అక్కడే వుండమని చెప్పి ఇంటిలోపలికి వెళ్ళాను. మారిస్ అక్క చనువుగా నా భుజాలమీద చేతులేసి మాట్లాడటాన్ని రంగరామానుజం గమనించే వుంటాడు. ఆమెకి పిక్చర్

గోయర్ తెచ్చిపెట్టాలట, నేను. ఇంగ్లండు నుంచి వెలువడే సినిమా పత్రిక అది. సికిందరాబాదు రైల్వేస్టేషన్ ఎ.హెచ్. వీలర్ బుక్‌స్టాల్ లో మాత్రమే అప్పుడప్పుడూ దొరుకుతుంది ఆ పత్రిక. బ్రిటిష్ నాణేంలో అయితే దాని వెల పావలా. హైదరాబాదునాణేల రూపంలో అయితే వీలర్ బుక్‌స్టాల్లో నాలుగణాల నాలుగు పైసలివ్వాల్సి వుంటుంది. ఆమె నా చేతికి నాలుగణాల నాలుగు పైసలిచ్చింది.

నేనా చిల్లర తీసుకుని బయటికి వస్తుంటే లారా ఎదురైంది. మామూలుకంటె మరింత మిసమిసలాడుతున్నట్టుగా కనిపించింది నా కంటికి. లారా రావడం కూడా గమనించి వుండాలి రంగరామానుజం. 'వాట్ మేన్? వేర్ యూగోయింగ్ మేన్?" అని ప్రశ్నించింది లారా నన్ను. ఆ ఇంట్లో మారిస్ అక్కామినహా తక్కిన ఆడపిల్లలంతా మాటికి ముందు ఈ 'మేన్' అనే వూతపదాన్ని ఉపయోగించకుండా వుండలేరు. "ఇంటికి" అని చెప్పాలని తోచినా ఇంగ్లీషులో హోమ్ అనాలా లేక హవుస్ అనాలో తోచక మౌనంగా నిలుచున్నాను. నేనలా బుద్ధావతారంలా మౌనంగా నిలబట్టం లారాకి తమాషాగా అనిపించి వుండాలి. "నీ నోట్లో ఏమున్నది మేన్?" అంటూ నాకు దగ్గరగా వచ్చి రెండు చేతులతోటి నా బుగ్గలు సాగదీసి నా నోట్లోకి తొంగి చూసింది. ఈ దృశ్యం సైతం రంగరామానుజం కంటబడి వుండాలి.

మన్నాస్ ఇంటి నుంచి బయలుదేరి మా ఇంటికి చేరేలోపల మరొక దృశ్యం. మా పక్కింటి ప్యారీ బేగం ఇంటి వాకిట్లో నిలబడి వుంది. టికెట్ ఎక్సామినర్ ఖాసింగారి రెండో అమ్మాయి ఆ పిల్ల. ఆమెను మా ఇంట్లో అంతా ముద్దుగా 'అడివిపంది' అని వ్యవహరిస్తారు. అడవిపంది ఎట్టావుంటుందో నేను ఎరుగను. ప్యారీ బేగం మాత్రం చెంబులాంటి ముఖంతో పీపాయ్ మాదిరిగా వుంటుంది చూట్టానికి. ఇదంతా చాలదన్నట్లుగా మా ఇంట్లో ఆ సమయానికి నాగరత్నంకూడా వుంది. మా అక్కయ్య స్నేహితురాలు ఈ నాగరత్నం. సికిందరాబాదులోని తమిళ కుటుంబాల్లో చాలా ప్రబలమైన అమ్మాయి ఈమె. వై.యం.సి.ఎ. వక్తృత్వ పోటీల్లో పాల్గొంటుంది. స్కూల్ వార్షికోత్సవాల్లో నాటకాలలో వేషం వేస్తుంది. డాన్సు చేస్తుంది. వారు, వీరు అనే తేడా లేకుండా అందరు మగాళ్ళనీ తన చిలిపి కళ్ళతో పలకరిస్తుంది. నా ఈ స్నేహితురాళ్ళ మూలంగా రంగరామానుజం దృష్టిలో నా విలువ చాలా పెరిగింది. క్రికెట్

ఆట్టానికి కృష్ణసామి ఇంటికి వెడుతూ రోజూ నా దర్శనం చేసుకుని వెళ్ళటం ప్రారంభించాడు రంగరామానుజం.

మొదట్లో మా ఇంటికి రావటం తటస్థిస్తే ఒక పది ఎనిమిషాలకే విసుగుపుట్టి క్రికెట్ ఆట్టానికి వెళ్ళేవాడు. నేనేమో మారిస్, హబీబ్ లాంటి నా జట్టు వాళ్ళని వెతుక్కుంటూ వెళ్ళేవాణ్ణి. నేను ఆడే ఆటల్లో ఒక్క గిల్లిదాండు ఆటలో తప్ప మరెందులోనూ నా నిపుణత్వం బయటపడేదికాదు. కోతికొమ్మచ్చి ఆగలోగాని గోలీల ఆటలోగాని నేనెప్పుడూ గెలిచినట్టు గుర్తులేదు. ఈ కారణం చేతనే ఈ ఆటల్లో నాకు ఆసక్తి తగ్గుతూ వచ్చింది.

ఒకరోజు "సుఫ్వారారాదూనాతో" అంటూ రంగరామానుజం నన్ను లాక్కువెళ్ళాడు. కృష్ణసామి గోష్టిలో వాళ్ల ఇద్దరు మామయ్యల తరువాత పెద్దవాళ్ళుగా కనబడేది కృష్ణసామి, రంగరామానుజం మాత్రమే. ఆ ఇద్దరు మామయ్యలకు మాలాంటి పసికుంకలతో ఆడటం మొహం మొత్తి వుండాలి. అంచేత ఎప్పుడోగాని ఆటలో కనిపించే వాళ్ళుకాదు. కృష్ణసామి రంగరామానుజంల సారథ్యంలో సుమారు పదిమంది కుర్రకుంకలు మోకాళ్లకి కట్టుకునే ప్యాడ్, ఒకబాటు, నాలుగుస్టంపు, పాత క్రికెట్ బంతి - ఇత్యాదిసరంజామాతో మా బారక్సు కాంపౌండు నించి బయలుదేరి అరమైలు దూరాన వున్న మైదానానికి వెళ్ళి క్రికెట్ ఆడేవారు. ప్రతిరోజూ ప్రాక్టీస్ మాచే. ఒక గోష్టికి కాప్టన్ కృష్ణసామి. రెండోదానికి కాప్టన్ రంగరామానుజం. నేను చెట్టుకింద కూర్చుని ఆటను చూస్తుండేవాణ్ణి. మధ్య మధ్య రంగరామానుజం నా దగ్గరకొచ్చి ఏవో రెండు మాటలాడి వెళుతుండేవాడు. తనకి సమంగా నన్నుతను భావిస్తూ గౌరవించటం చూసి కృష్ణస్వామి సోదరులు కూడా నా పట్ల మునుపటి వైషమ్యాన్ని ప్రదర్శించటం క్రమంగా తగ్గించుకున్నారు.

మా ఇంట్లో తరచుగా నాగరత్నం కనిపించినా, పక్కింటి ప్యారీబేగం కాక ఇంకా ముగ్గురు నలుగురు ముస్లిం పడతులున్నా, లాన్సర్ బారక్సు ముందు వరుసలో ఆంగ్లో ఇండియన్ అమ్మాయిలంతా నాతో ఎంత చనువుని ప్రదర్శించినా - ఇదంతా తనకేమాత్రం ఉపయోగించదని తొందర్లోనే గ్రహించాడు రంగరామానుజం. మా వరుసలో ముస్లిం కుర్రాళ్ళంతా ప్రతిమాటకి ముందు 'క్యాబే సాలా' అని చేర్చి మాట్లాడే వాళ్ళు. రంగరామానుజానికి అక్కా చెల్లెళ్ళెవరూ లేకపోయినా ఈ 'సాలా' అనే సంబోధనని సహించలేకపోయేవాడు. మారిస్‌కి,

టెరిన్సుకి అతణ్ని పరిచయం చేశాను. లారాతోబాటు ఒకసారి అందరం రీవోలీలో ఒక సినిమాకి కూడా వెళ్ళివచ్చాము. ఆ సినిమా బావుంటుందని రంగరామానుజమే చెప్పాడు. అది అతని పొరపాటు. లారెన్సు ఆలివర్ నటించిన షేక్స్పియర్ నాటకం 'హెన్రీ ది ఫిఫ్త్' ఆ సినిమా. లారెన్స్ ఆలివర్ నటనని ఆనందించగల స్థితికే మేమెవ్వరం చేరుకోలేదు. అసలేమీ అర్థంకాకపోయినా ఓపిగ్గా సినిమా చూసే ఓర్పు మాత్రం అలవరచుకోగలిగాను. టెరిన్సు మాత్రం అసహనంతో గలభా చెయ్యడం మొదలెట్టాడు. హాల్లోనే సిగరెట్టు తాగుతూ నా ముఖంమీద, రంగరామానుజం ముఖంమీద మాటి మాటికి పొగ వదలసాగాడు. నాలుగు అక్షరాల బూతుమాటని వల్లించసాగాడు. తాటి తేగలని చీల్చి తింటూ ముందు వరుసలోని కుర్చీల మీదికి తుపుక్కుమని మాటి మాటికీ వూస్తూ కూర్చుంది లారా. ఆ కుర్చీల్లో మనుషులున్నా కూడా అలాగే కూర్చోగల గడుసుదనం ఆమెలో వుంది. ఈ యాంగ్లో ఇండియన్ 'లోఫర్ల'తో నేను సఖ్యంగా వుండటాన్ని కృష్ణసామి సహించగలిగేడు. కాని రంగరామానుజం విషయంలో మాత్రం సహించలేకపోయేడు. ఒకసారి క్రికెట్ ఆటని వదిలేసి రంగరామానుజం మాతో కలిసి జాట్ బందర్ ఆడటానికి వచ్చాడు. చెట్టు కింద నుంచుని వలయంలోని పుల్లల్ని కాపాడుకుంటూ మమ్మల్ని పట్టుకుని ఔట్ చేయాల్సి వుంది అతను. మాలో ఒకరిని పట్టుకోవడానికి ఏమాత్రం చెట్టుమీదకెక్కినా వెంటనే మాలో ఒకడు కిందికి దూకి పుల్లని తాకగలడు. అలా తాకి విసిరేసిన పుల్ల వెంబడి రంగరామానుజం పరుగెత్తేవాడు. తనే మొనగాడుగా వుంటూ అతను ఆడిన క్రికెట్‌కి, మారిస్, టెరిన్స్, వహమ్, సత్తార్‌ల చేతుల్లో చిక్కి అల్లాడుతూ ఓడిపోయే ఈ జాట్ బందర్ ఆటకీ ఎంత వ్యత్యాసం! నాకు అతడంటే జాలేసింది. ఒకటి రెండుసార్లు వాడికి చిక్కిపోవడానికి వీలుగా నేలకి దగ్గరగా వున్న కొమ్మలమీద కూర్చున్నాను కూడా. అయినా అతను నన్ను తాకే లోపున ఎవరో ఒకరు వూడల మీదుగా క్షణంలో కిందికి జారి వచ్చి వలయంలోని పుల్లని అందుకునేవారు. కాలేజీలోను, బస్సుస్టాండులోను, బస్సుల్లోను, క్రికెట్ ఆటల్లోనూ ఎప్పుడూ ఉత్సాహంగా కనిపించే రంగరామానుజం ఏడవడం మొదటిసారిగా ఆ రోజు చూశాను. పెద్దగా పైకి ఏడవకపోయినా లోలోపలే దుఃఖిస్తున్నాడన్నది అతని ముఖంలో ద్యోతకమైంది. అతను బాధపడుతున్నకొద్దీ అతనికి మరింత వేదన కలిగించాలనే పాశవిక ప్రవృత్తి ఎక్కువయింది మారిన్స్ టెరిన్స్‌లలో.

ప్రతీసారీ కావాలనే పుల్లని గోడ అవతలికి విసిరేవారు. గోడెక్కి దూకడంలో పట్టుతప్పి పడిపోయి ఒకసారి మోకాళ్ళు చీరుకుపోయాయి రంగరామానుజానికి. రక్త కారజొచ్చింది. అయినా వదల్లేదు వాళ్ళు. ఆట ఆడి తీరాల్సిందేనని పట్టుబట్టారు.

ఇంత జరిగిన తరువాత రంగరామానుజం మునుపటిలా నాతో మాట్లాడతాడు అనుకోలేదు నేను. అయినా అతను ఏమీ జరగనట్లే మా ఇంటికి వచ్చాడు. ప్యారీ బేగం - నాగరత్నం ఆకర్షణ చాలా బలమైందిగానే వుండి వుండాలి. నేనూ కోతికొమ్మచ్చి ఆటల్లో ఎన్నిసార్లో రంగరామానుజానికంటె ఎక్కువ అవస్థలే అనుభవించి వున్నాను. ఇంకా అనుభవిస్తున్నాను. తరిమి తరిమి కొట్టబడి వున్నాను.

నాకు కలిగిన అవస్థలతో పోలిస్తే రంగరామానుజానికి కలిగిన అవమానం ఎక్కువేమీకాదు. అయినా అతనిపట్ల నాకు చాలా జాలి కలిగింది. వయసులోను, అనుభవంలోను అతను నా కంటె పెద్దవాడు కావడం దీనికి కారణం కావచ్చు. ఈ సానుభూతి కారణంగానే అతనితోబాటు కృష్ణసామి సోదరులు క్రికెట్ ఆడే ప్రదేశానికి వెళ్ళేను. మొదట్లో రెండు మూడు రోజులు వూరికే చెట్టుకింద కూర్చుని ఆటనీ, ఆ పరిసరాలనీ చూస్తూ వుండేవాణ్ణి. అప్పుడప్పుడూ రంగరామానుజంతో మాత్రమే మాట్లాడుతూ ఇంటికి వచ్చేవాణ్ణి. ఒకరోజు నా దగ్గర పడిన బంతిని గ్రౌండులోకి విసిరేశాను. ఒకసారి చీకటి పడుతుండగా నన్ను గ్రౌండులోకి రమ్మని నా చేతికి బాటు ఇచ్చి నన్ను కూడా ఆడమన్నాడు రంగరామానుజం. ఆ తరువాత నేను కూడా ఆ బాచిలో చేరి క్రికెట్ ఆటగాణ్ణిగా తయారవడానికి ఎక్కువకాలం పట్టలేదు.

చాలా సంవత్సరాలు కృష్ణసామి సోదరులతో విరోధంగా వుంది. చివరికి రంగరామానుజం మూలంగా వాళ్ళ బాచిలో చేరి క్రికెట్ ఆడడంతో నాకు ప్రత్యేకత లభించినట్లయింది. అంతకుముందు నన్నొక చిన్నపిల్లవాణ్ణిగా భావించి కొంత చులకనగా చూసేవాళ్ళు. కానీ ఇప్పుడు రంగరామానుజంతో సమంగా ఎంచవలసి వచ్చింది. సంతానంతో కలిసి ఆడిన క్రికెట్ ఆటలో నేను మొనగాణ్ణి అయివుండవచ్చు. కాని వీళ్ళు ఆటని బాగా సాధన చేసినవాళ్ళు. కృష్ణసామి ఎంతో నేర్పుగా బాటింగ్, బౌలింగ్ చేసేవాడు. రంగరామానుజంలో స్టైల్ కనిపించేదిగాని

బాటింగు సుమారుగా మాత్రమే చేసేవాడు. కృష్ణసామి తమ్ముళ్ళు బాలు, గోకు ఇద్దరూ చాలా బాగా బౌల్ చేసేవారు. గోకు ఒక ఓవర్‌లోని ఆరు బంతుల్లో మూడింటిని మధ్య స్టంపుకి తగిలేట్టుగా విసిరేవాడు. నేను ఆడటం ప్రారంభించిన తొలిరోజుల్లో అదేమిటోగాని నేనెపుడు బ్యాటు పట్టుకున్నా బోలింగ్ చేసే వంతు గోకుదే అయ్యేది. సాధారణంగా మొదటి బంతే వికెట్‌కి సూటిగాదూసుకుని వచ్చేది. అలా బాణంలా రివ్వున దూసుకొచ్చి స్టంపు మొనలకి తగిలేలోగా, ఆ ఒకటి రెండు క్షణాల్లోనూ చేతులు, కాళ్ళు గజగజ వణికేవి. వేరే ఎవరు ఔటైనా మోగే చప్పట్ల మోత నేను అవుటైనప్పుడు వుండేదికాదు. 'బెటర్ లక్ నెక్స్టైం' అని మాత్రం అనేవాళ్ళు. కృష్ణసామికి సమవుజ్జీ రంగరామానుజం మాత్రమే. కొన్ని విషయాల్లో అతని కంటె అధికుడు కూడా. అట్టి రంగరామానుజానికి అనుంగు చెలికాడిని నేను. అంచేత నేనెంత అధ్వాన్నంగా ఆడినా హేళన దూషణలు వినిపించేవికావు. ఆటలో నా ఈ నైపుణ్యం మా స్నేహానికేమాత్రం అడ్డు నిలవలేదు. నేను అతనితో సమానంగా చూడబడటం చేత కొత్తగా ఆట నేర్చుకునేవాళ్ళకి లభించే తర్ఫీదు, సలహాలు నాకు లభించకుండా పోయాయి. నేను బాటు చేతబట్టుకునేవాణ్ణి. గోకు బంతి విసిరేవాడు. ఔటయిపోయిన నేను బాటుని నా పక్కవాడి చేతికిచ్చి ఇవతలికి వచ్చేవాణ్ణి.

మారిస్ పెద్దక్క క్రమంగా చిక్కిపోసాగింది. ఒకసారి ఇంటి నుంచి ఎక్కడికో పారిపోయి కొన్నాళ్ళకి మళ్ళీ తిరిగి వచ్చాడు పెరిన్సు. బొంబాయి హార్బరులో బాంబు పేలి ఆ ప్రమాదం వల్ల ఎన్నో భవనాలు కూలిపోయాయి. ఎంతో జననష్టం కలిగింది. భారతి ఎట్టయపురం స్మారక నిధి కోసరం మా వూళ్ళో నాన్న, మరి ఇద్దరు నిధి సేకరించిన వివరం 'కల్కి' పత్రికలో నెల నెలా ప్రచురించే పట్టికలో రెండు పంక్తుల వార్తగా అచ్చుపడింది. ఏలంలో మేము కొన్న పాత జి.ఇ.సి. రేడియోలో మద్రా సు తిరుచ్చి కేంద్రాల ప్రోగ్రాంలు రాను రాను గరగర శబ్దాలతో చాలా మందంగా వినిపించసాగాయి. రెజిమెంటల్ బజారులోని చిన్న మసీదు కెదురుగా వున్న కాయ గూరల కొట్టు, ఒక చిల్లర దుకాణం, మరి మూడు పూలకొట్లు ధ్వంసం అయ్యాయి. పోలీసు కాల్పులు జరపగా ఆ కాల్పుల్లో ఒక పసిపిల్లవానికి తూటా తగిలి తొడ ఎముక విరిగింది. కృష్ణసామికి ఉత్తరదేశంలో ఏదో వూళ్ళో అప్రెంటిస్ పని దొరికింది. చదువుని మధ్యలో ఆపేసి వారం

రోజుల్లో బయలుదేరి వెళ్ళిపోయాడు. నేనూ రంగరామానుజం రెండు బాచిలుగా విడిపోయి క్రికెట్ ఆడసాగాము. మా జట్టులో ముగ్గురు తెలుగు కుర్రాళ్ళు వచ్చి చేరారు. కావాలనే తమిళంలో మాత్రమే మాట్లాడుతూ వాళ్ళని ఏడిపించాలని ప్రయత్నించినా ఆ ముగ్గురూ జంట నగరాలలో నెలకొన్న భీకర పరిస్థితులని గురించి వర్ణించి చెపుతుంటే చెవులు రిక్కించుకుని వినేవాళ్ళం.

క్రమం తప్పకుండా మొదటి నాలుగైదు బంతులలోనే నన్ను ఓడిస్తూ వచ్చాడు గోకు. మేము క్రికెట్ ఆడే మైదానంలోనే కొందరు ముస్లిం కుర్రాళ్ళు హాకీ ప్రాక్టీసు మొదలెట్టారు. వాళ్ళ బంతిని మా గ్రౌండులో పడేట్టుకొట్టేవాళ్ళు. ఒకరోజు మా బాచిలో కామేష్ అనే అబ్బాయికి కోపమొచ్చి వాళ్ళ బంతిని కావాలనే వేరొక దిక్కుకి విసిరేశాడు. అప్పుడు వాళ్ళంతా రెచ్చిపోయి హాకీ కర్రలతో మా మీదికి యుద్ధానికి వచ్చారు. మాలో పద్మనాభం అనే అతణ్ణి నెత్తిమీద నెత్తురు కారేలా కొట్టి పారిపోయారు. పద్మనాభన్ వాళ్ళ నాన్న ఒక పెద్ద ఆఫీసరు. అతను కల్పించుకుంటాడనుకున్నాం. కాని అలా జరగలేదు. ఆ తరువాత రెండు రోజులదాకా మేము గ్రౌండుకు వెళ్ళలేదు. తరువాత తెలిసింది ఆ ముస్లిం కుర్రాళ్ళు కూడా అక్కడికి రాలేదని. మళ్ళీ గ్రౌండుకి వెళ్ళి యధాప్రకారం క్రికెట్ ఆట కొనసాగించాము. ఎంతో డబ్బు ఖర్చుచేసి మంచి పిచ్ తయారుచేసుకున్నాము. అంచేతే ఆ గ్రౌండ్ వదలి వేరేచోటకి వెళ్ళలేకపోయాము. రంగరామానుజం చాలా బాగా బోలింగ్ చేసేవాడు. కృష్ణసామి వెళ్ళిపోయిన తరువాత రంగరామానుజం కెప్టన్‌గాను, నేను వైస్‌కెప్టన్‌గాను వుండి వేరొక టీముతో మాచ్ ఆడాము. ఎనభై ఒక్క పరుగుల తరువాత వాళ్ళు ఔటైనారు. మేము ఆడుతుండగా వాళ్ళు లెక్కించిన స్కోరు ప్రకారం మేము డెబ్బై ఏడు పరుగుల్లో అవుట్ అయ్యాము. అయితే మా స్కోర్ బుక్ ప్రకారం, అదీ రంగరామానుజం లెక్కించిన దాన్ని బట్టి చూస్తే మేము నూట రెండు పరుగులు తీశాము. వాళ్ళంతా ఛీటింగ్, ఛీటింగ్ అని అరుస్తూ, రంగరామానుజాన్ని సంతకం పెట్టమంటూ వొత్తిడి చేశారు. అయితే అతను మరికొందరు అక్కడ్నించి తప్పించుపారిపోయారు. నేను చిక్కడి పోయాను. వైస్‌కాప్టన్‌ని కావడంతో నా చేత బలవంతంగా సంతకం పెట్టించుకున్నారు. నేను తెలివిగా పేరు రాయకుండా 'రామసామి' అని గిలికాను. నేనా రోజు ఒక్క పరుగు కూడా తియ్యలేదు. ఎదుటి

టీములో కూడా ఒక గోకు తగలడ్డాడు నా పాలిటికి.

హఠాత్తుగా ఒకరోజు తను వూరికి వెళ్ళిపోతున్నట్లు చెప్పాడు రంగరామానుజం. వాళ్ళ కుటుంబం మొత్తం బయలుదేరింది. అలా వెళ్ళిన వాడు మళ్ళీ సికిందరాబాదుకి తిరిగి రానేలేదు.

నేను క్రికెట్ గోష్టికి కెప్టెన్ అయ్యాను.

## 3

వేగంగా ఇంటికి తిరిగి వస్తున్న చంద్రశేఖరానికి రాణిగంజ్ రైల్వే బ్రిడ్జ్ దగ్గర నరసింహారావు కనిపించి ఆగమన్నాడు.

"ఎక్కడికిరా పోయి వస్తున్నావు?" అడిగాడు.

"క్రికెట్ ప్రాక్టీసు నుంచి"

"ఎక్కడ"?

"కాలేజీలో"

"థూ..."

"ఏమిటి థూ?"

"నీకు సిగ్గులేదురా? ఆ కొజ్జా నాకొడుకులతో కలిసి ఆట్టానికి?"

చంద్రశేఖరం సమాధానం చెప్పలేదు.

"నా జీర్ అలీఖానేనా కెప్టన్?"

"అవును"

"థూ"

"సరే, నేను వస్తాను.. సైకిల్‌కి దీపం కూడా లేదు. ఈ మధ్య దీపం లేకుండా వెళితే పట్టుకుంటున్నారు"

"ఇక్కడ పోలీసు నా కొడుకులంతా ఎవర్రా? ఒక్కడు కూడా బాకీ లేకుండా అంతా ఈ ముస్లింలేకదా. అందుకే కదా మనల్ని పట్టుకుంటున్నది. ఈ వూళ్ళో సైకిల్‌కి దీపం పెట్టుకుని పోయే ఒక్క రజాకార్ నా కొడుకుని చూపించగలవా? వాళ్ళని ఏ పోలీసు ఏం చేయగలుగుతున్నాడు? కత్తులూ-కటార్లు పట్టుకుని వీధుల్లో తిరుగుతున్నారే రజాకార్లు ఏ పోలీసు పట్టుకుంటున్నాడు? సిగ్గులేకుండా వాళ్ళతో ఆడి వస్తున్నావే? ఆటలాడాల్సిన రోజులా ఇవి? నాజీర్ అలీఖాన్‌తో ఆడివస్తున్నావే ఈ నాజీర్ అలీఖాన్ అసలెవడో నీకు తెలుసా? వీడి అబ్బేకదరా ఇప్పుడు రజాకార్లకి మిలిటరీ ట్రైనింగ్ ఇస్తున్నది?

ఎదుటివాళ్ళని వాజమ్మల కింద ఏమీ తెలియని అమాయకుల కింద జమకట్టి మాట్లాడటం ఈ నరసింహారావుకి ఎలా సాధ్యమవుతున్నదా అనిపించి ఆశ్చర్యం కలిగింది చంద్రశేఖరానికి. తనకి కూడా నాజీర్ అలీఖాన్ గురించి తెలుసు. ఒకసారి వాళ్ళ కుటుంబాన్ని మొత్తం చూసి వున్నాడు కూడా. నాజీర్ అలీఖాన్ చెల్లెల్ని ఒక మానవ మాత్రురాలిగా భావించుకోవడానికి వీల్లేనట్లుగా వుంటుంది. అతని తండ్రి పెద్ద పెద్ద మీసాలు, నిప్పులు చెరుగుతున్నట్టుండే కళ్ళు. నిలువెత్తు భారీ విగ్రహంతో రాక్షసునిలా అవుపిస్తాడు. నాజీర్ అలీఖాన్ మాత్రమే చంద్రశేఖరానికి మామూలుగా కనిపించేడు. కొన్ని విషయాలలో అధికారదర్పం చలాయించినా తక్కిన విషయాల్లో అందరితోటీ స్నేహంగా వుండగల స్వభావం నాజీర్ అలీఖాన్‌ది. ఈ రోజు ఈ విషయం ప్రత్యక్షంగా అనుభవమైంది చంద్రశేఖరానికి. అసలేం జరిగిందంటే, నాజీర్ అలీఖాన్ 'నెక్స్ట్' అన్న తరువాత కూడా అప్పుడు బాటింగ్ చేస్తున్న ఒకడు అవతలి వానికి అవకాశం ఇవ్వకుండా రెండుసార్లు బ్యాట్ చేశాడు. నాజీర్ అలీఖాన్‌కి పెద్దకోపమొచ్చి "గెటవుట్" అని పెద్దగా అరిచాడు. అతని వుత్తర్వు కోసం ఆగకుండా ప్రాక్టీస్ నెట్ లోపలికి వెళ్ళి వికెట్ల కెదురుగా నుంచున్నాడు చంద్రశేఖరం. అక్కడే అలా నిలబడటం అతనికి కొత్త. తనొక బోనులో చిక్కుకున్నట్లుగా అనిపించింది మూడు వేపులా కట్టబడిన ఆ వలని చూస్తుంటే. ఇలా వలల నడుమ నుంచుని క్రికెట్ ఆడడంగాని, ప్రాక్టీసు చెయ్యటంగాని ఇదివరకు అతనికి అనుభవంకాలేదు. మూడువేపులా నాటబడిన ఇనుప స్తంభాలకి గట్టిగాలాగి బిగించి కట్టకపోవడంచేత గాలికి కదలాడి టపటప శబ్దం చేస్తూంది ఆ వల. బోలింగ్ వేసేవాళ్ళని చూస్తూ నిలబడ్డాడు చంద్రశేఖరం. ఎంతో మేలు – బంతి వేసే అతను కాస్త మెల్లిగానే విసిరాడు బంతిని. పదడుగుల ముందుకి పడి ఎగురుతూ వచ్చింది బంతి. చాలా మెల్లిగానే కొట్టాడు బంతిని చంద్రశేఖరం. అయితే ఆ దెబ్బ చాలా కీలకమైన చోటే తగిలి వుండాలి ఆ బంతికి. రివ్వున దూసుకుపోయింది. ఆ తరువాత బంతి చాలా విసురుగా వచ్చింది. చంద్రశేఖరం నిలుచున్న చోటికి సూటిగా దూసుకువచ్చింది. ఆ బంతి బారి నుంచి తనని తాను రక్షించుకోడానికి అన్నట్టుగా బాటు అడ్డంపెట్టాడు. అయితే ఈసారి దిశమారి వేగంగా వెనక్కి ఎగిరివెళ్ళింది బంతి. మరుక్షణం వలకి తగిలి వల గడగడలాడినట్టుగా కదిలింది ఆ వూపుకి. తరువాత అతని బ్యాటింగు అదుపు తప్పింది. రెండుసార్లు బంతి వికెట్లని పడగొట్టింది. ఒకసారి విసురుగా వచ్చి అతని కాలికి సూటిగా తగిలింది.

ఈ ప్రమాదభరితమైన వలయంలోంచి ఎప్పుడు బయటపడదామా,

నాజీర్ అలీఖాన్ నెక్స్ట్ బాట్స్‌మన్' అని ఎప్పుడు చెపుతాడా అని ప్రతిక్షణం ఎదురు చూడసాగేడు చంద్రశేఖరం. మొదటి నిముషంలోనే ఈ ఆటలో తన సామర్థ్యాన్ని గురించిన భ్రమలన్నీ పటాపంచలయినయ్ అతనికి. తనకీ ఈ ఆటకీ ఏ రకమైన సంబంధమూలేదు. అసలు ఆటతో సంబంధం అంటే ఏమిటి? ఏ పరిస్థితుల్లో, ఎవరితో ఆడినా నేర్పుగా ఆడగలగాలి. నేర్పుగా అంటే ఎలా ఆడటం? ఏ ఆటకైనా ఒక ఆరంభం, అంతం అని వుంటుంది. ఆరంభం నుంచి ముగింపు కేసి ఒక రకమైన పయనం. ఇది ముందుకి, మునుముందుకి వెళ్ళాల్సిన పయనం. దీన్ని ఎవరు ఎంత వేగంగా ఎంత జాగ్రత్తగా, తడబాటు లేకుండా పూర్తి చెయ్యగలరో వాళ్ళు నేర్పరులైన ఆటగాళ్ళు. ఆటని గురించిన ప్రజ్ఞ, ఆసక్తి అతనిలో సహజంగానే వుండాలి. కనీసం వీటిని పెంపొందించుకుని వుండాలి. అతని శరీరం పూర్తిగా ఆటలో నిమగ్నమై వుండాలి. మనస్సు శరీరం పూర్తిగా ఆటలో లీనమవాలి. నాజీర్ అలీఖాన్ ఆటలో ఇది గమనించవచ్చును.

దీనికోసరం ఈ బోనులో చిక్కుకుపోవాలి? నన్ను ఛిన్నాభిన్నం చెయ్యడానికి కంకణం కట్టుకున్న వాళ్ళలా ఈ నలుగురూ వంతులవారీగా **బౌలింగు** చేస్తున్నారేమిటి? సాధారణంగా నెమ్మదిగా వేసేవాళ్ళు కూడా శివమెత్తినట్లు **విసురుతున్నా**రేమిటీ రోజు? బయటి నుంచి చూస్తే చాలా తేలిగ్గా కనపడే ఈ **నెట్** ప్రాక్టీసు వలయంలోకి రాగానే ఇంత భయంకరంగా కనిపిస్తున్నదేమిటి? ఈ **వల** టపటపమని కొట్టుకుంటూనే వున్నది. తనకు ముందు ఆడిన అతను ఏమాత్రం తత్తరపడకుండా ఆడగలిగేడు. ఎంతో ఉత్సాహంగా ఆడగలిగేడు. కెప్టెన్ కోపగించుకుంటాడని తెలిసినా చాలాసేపు ఆడుతూనే వున్నాడు. అతడ్ని మరికాసేపు ఆడనిచ్చి వుండాల్సింది. లేకపోతే నన్ను ఇంత త్వరగా బాటింగుకి పిలవకుండానైనా వుండాల్సింది. బోలింగు చెయ్యమని అడిగినప్పుడే వీల్లేదని చెప్పాను. ఇప్పుడు బాటింగు చెయ్యమంటే దానికీ కాదని చెప్పడం ఎలా? అలా అంటే 'అయితే ఇక్కడికి ఎందుకొచ్చినట్టోయ్?' అని అడగరా? ఇదో ఇప్పుడు మళ్ళా సుందర్‌సింగ్ పరిగెట్టుకొస్తున్నాడు. వీడికీ నాకూ చాలాకాలంగా పొత్తు కుదరటం లేదు. అంతేగాక మా ఇద్దరి మధ్య మాటి మాటికీ ఏదో తగాదా జరుగుతూనే వున్నది. సికిందరాబాదులో ఆ టికెట్ సంగతి – వాళ్ళింటి దగ్గరే కాలేజీ డ్రామా టిక్కెట్లు అయిదారు మందికి అంటగట్టగలిగేను. అంచేత వీడు వెళ్ళినప్పుడు ఎవరూ కొనలేదు వీడి దగ్గర్నుంచి. ఆ కక్షతో నా మీద మండిపడ్డాడు. ఆ తర్వాత ఆ పద్మా శివరావు విషయంలో కూడా మా ఇద్దరికీ గొడవవచ్చింది. సైన్సు గ్రూపులో సాధారణంగా అమ్మాయిలు చాలా తక్కువ. ఉన్న ఆ అయిదుగురిలో చూట్టానికి

కాస్త నదురుగా కనిపించేది ఈ పద్మాశివరావు ఒక్కతే. ప్రాక్టికల్స్ చేసేటప్పుడు ఒక బల్లని ఇద్దరు చొప్పున పంచుకోవాలి. మొదట్లో ఒక బల్లకి సుందర్ సింగ్, పద్మాశివరావుని వేశారు. అయితే డిమానిస్ట్రేటర్ తో చెప్పి మార్పించుకుంది పద్మ. సుందర్ సింగ్ గిరదాల జుట్టుని చూసి భయమేసి వుంటుంది ఆమెకు. చాలా మెతక పిల్ల. అటెండెన్సు రిజిష్టరులో ఆమె పేరుకీ నా పేరుకీ మధ్య కనీసం ముప్ఫైమందైనా వుంటారు. అయినా గాని యాదృచ్ఛికమో ఏమో ఆమె-నేనూ ఒకే టేబిల్ ని పంచుకోవలసి వచ్చింది. ఆ కక్షఇప్పుడు సుందర్ సింగ్ బోలింగులో వ్యక్తమవుతున్నది. సూటిగా నా తలకి తగిలేట్టుగా బౌల్ చేస్తున్నాడిప్పుడు. తనని గుక్క తిప్పుకోనివ్వకుండా బౌల్ చేస్తున్నాడు. ఈ వలలో వికెట్ లకి ముందు పరుచుకున్న కార్పెట్ తన దుంప తెంచుతున్నది. సరిగ్గా పరచినట్టులేదు దీనిని. తను నిలబడ్డచోట బాగా చిరిగి వున్నది.

ఆ చిరిగిన చోట పాదం చిక్కుకుని పడదోస్తున్నట్లుగా వున్నది. ఇదుగో మరో బంతి. కొంచెం నెమ్మదిగానే విసరబడింది. దీనిని విసిరిన బోలర్ నెమ్మదస్తుడు. బంతి అతని చేతి నించి వలయాకారంగా పైకెగిరి, కిందికి జారి, దిశ మారి తన దగ్గరికి వస్తుంది. ఎంత సులభంగా సమీపిస్తున్నా నా బాటుని తప్పించుకుని ఎక్కడికో వెళ్ళి పడుతున్నది. నా బేటు సంబంధం లేకుండా ఎటు వేపో దెబ్బతీస్తున్నది. నెట్ ప్రాక్టీసులో ఎవ్వరూ బంతిని మిస్ చెయ్యరు. ఎంత బాగా బంతి విసిరినా దాన్ని బాటుతో బలంగా కొట్టడానికే అందరూ ప్రయత్నిస్తారు. నాకు ముందు ఆడిన తను స్వైరవిహారం చేశాడు. నేనేమో బంతిని అడ్డుకోవడానికి మాత్రమే ప్రయత్నిస్తున్నాను. అదైనా సక్రమంగా చెయ్యటంలేదు. ప్రతిసారీ బంతి నన్ను తప్పించుకుని అందకుండా పోతూనే వుంది. మళ్ళీ సుందర్ సింగ్. రాస్కెల్! బ్లాగార్డ్! అసలు వీణ్ణెవడు బోలింగ్ చెయ్యమన్నది? నన్ను బాటింగ్ చెయ్యమన్నవాడేగా. ఇలా ప్రతి బంతిని తలకిపైగా వెళ్ళేట్టు బోలింగు చేసేవాడికి ఏ మాచ్ లో అవకాశమిస్తారని? అందుకోసరమే ఇక్కడ తైతక్కలాడుతున్నాడు... తైతక్కలు...రైట్... ఇక్కడ అందరూ తైతక్కలే ఆడుతున్నారు. నేను తైతక్కలాడుతున్నాను. బోనులో చిక్కుకున్న ఎలుకలా తన్నుకుంటున్నాను. ఈ బంతి సూటిగా వికెట్లకేసి వస్తున్నది. ఏం ప్రమాదం లేదు. ఇలా ఎడంకాలిని ముందుకి తెచ్చి బాటుని నేలకానిస్తే సరిపోతుంది. బంతి తనిచ్చగా ఎక్స్ట్రా కవర్ కేసి ఎగురుతుంది. ఛీ! దీన్ని కూడా మిస్సయ్యాను. మళ్ళీ బౌల్డ్. మేచ్ అయితే ఈ అవమానం వుండదు. బౌల్డ్ అయిపోతే గప్ చిప్ గా బయటికెళ్ళిపోవచ్చు. ఇక్కడైతే పడిపోయిన వికెట్లని మనమే సరిచేసుకుని మళ్ళీ ఆడటం ప్రారంభించాలి.

ఇంకా ఏమని ఆడాలి. ఒక్కోసారీ బంతి బాటుని తప్పించుకుని వెనక వలకి గుద్దుకుంటున్నది. దాన్ని పట్టుకుని విసరాల్సిన అవమానం ఒకటి పై గా. అసలు నేను చేసేది బాటింగ్ ప్రాక్టీసా లేక బంతిని విసిరే ప్రాక్టీసా? ఇప్పుడు నాజీర్ అలీఖానే బోలింగు చెయ్యడానికొస్తున్నాడు. ఇప్పుడు హైదరాబాదు రాష్ట్రంలోకెల్లా ఎంతో నేర్పుగా హాఫ్‌బ్రేక్ వెయ్యగల బోలర్సులో ఇతనూ ఒకడు. ఇతని బోలింగ్ పద్ధతి కొంతవరకూ నా బోలింగ్‌ని పోలి వుంది. నేనూ ఇతనిలా అయిదారేళ్ళ ప్రాయం నించీ మంచి క్రికెట్ ఆటగాళ్ళతో స్నేహం చేసి, సాధన చేసి సదా క్రికెట్ ధ్యాసతోనే వుండి వుంటే ఈ రోజు ఇతనితో సమానంగా, అంతకంటే కూడా బాగా ఆడగలిగి వుండేవాణ్ణేమో! అలా అనుకోవడానికీలేదు. క్రికెట్ బాగా ఆడాలంటే శరీరంలోని ప్రతి కదలికా సహకరించాలి. ఇది నాకు సాధ్యపడేది కాదు. ఇదిగో నాజీర్ అలీఖాన్ విసిరిన బంతి. కుడికాలిని నొక్కి పట్టి పక్కకి తిరిగి బలంగా కొట్టాల్సిన బంతి. సరిగ్గా కొట్టగలిగితే స్క్వేర్ లెగ్‌లో తప్పకుండా బౌండ్రీకావాల్సింది అయ్యో!

ఛాప్! మిస్సయిందే! ఇంకా బంతి సమీపించకముందే బాటుని పై కెత్తేశాను. ఇప్పుడే జరిగింది. తొడకి బలంగా దెబ్బ తగిలింది. "సారీ దోస్త్" అంటున్నాడు నాజీర్ అలీఖాన్. ఇందులో అతను సారీ చెప్పడం దేనికి? నా చేతగాని తనం గాకపోతే. చేతగాకుండానా సంవత్సరంపాటు ఒక క్రికెట్ టీమ్‌కి కెప్టెన్‌గా వుండి నెగ్గుకొచ్చాను. ఆ టీములో ముగ్గురి కన్న ఎక్కువమందికి క్రికెట్ బూట్స్ కూడా లేవు. నేనూ మొదటి నాలుగు నెలలదాకా బూట్సు లేకుండానే ఆడాను. ఆ తరువాతనే బూట్సు కుట్టించుకున్నాను. పన్నెండు రూపాయలు. అయితే అంతమంచివికావు. వీటిని కుట్టిన చెట్టుక్రింద చెప్పులు కుట్టేవానికి అంతమాత్రమే తెలుసు. చిరిగిన ఈ కార్పెట్ కాళ్ళకి తగులుకుంటోంది మాటిమాటికీ. నాజీర్ అలీఖాన్ మళ్ళీ బోలింగ్ చేస్తున్నాడు. ఈసారి అయినా తెలివిగా ఆడాలి: అబ్బా! ఎలాగో బంతిని అడ్డగించగలిగాను.

గురి చూసి బలంగా ఆకాశంలోకి ఎగిరేలా కొట్టాల్సిన బంతిని ఊరికే అడ్డగించి వదిలిపెట్టానేమిటి? ఇప్పుడా పాట్టినాయాలు బోలింగు వేస్తున్నాడు. అసలది బోలింగనే చెప్పడానికి లేదు. ఏదో పై కెగరేస్తున్నట్టుగా వేస్తున్నాడు. మాచ్‌లో అయితే ఇలా వేయడాన్ని అనుమతించరు. మా టీములో రామనాధానికి చుక్కెదురు వీడి బోలింగు. మా రామనాధం బంతిని నేలమీదికి దొర్లిస్తున్నట్టుగా బోల్ చేసేవాడు. వాడికి గ్రౌండ్ బౌలర్ అనే పేరుండేది. ఛీ! ఈసారి కూడా మిస్సయ్యానే. ఇహ ఈ నెట్ ప్రాక్టీసుకి రానేకూడదు. అయితేనెట్ ప్రాక్టీసుకి

వెళ్ళకుండా కాలేజీ క్రికెట్ టీములో చేరడం కుదరదే. పెద్ద ఆటగాడిగా పేరు పొంది, నిరూపించుకోగలిగితే ఒకవేళ వీలవుతుందేమో. అలా తన సామర్థ్యాన్ని నిరూపించుకోగలిగిన వాడే నాజీర్ అలీఖాన్. అతని క్రికెట్ సామర్థ్యాన్ని ఎవరు కాదనలేరు. అయినా అతనూ అందరిలా బంతి ఏరి విసరటం, బౌలింగు చెయ్యటం చేస్తున్నాడు కదా. ఇంకా ఇతను బాటింగు చెయ్యలేదు. కాప్టన్ అయినంత మాత్రంచేత తను ప్రత్యేకమైన అవకాశాలు తీసుకోరాదన్న క్రమశిక్షణ కారణంగానా? మైదానంలో వుండేవాళ్ళని పిలిచి, ఎన్నికచేసి బాటింగు చెయ్యడానికీ, బౌలింగు చెయ్యడానికీ అవకాశాలు కల్పిస్తున్నాడు. ఎవరూ ఊహించని విధంగా క్రమశిక్షణని అమలు పరుస్తున్నాడు. చాలామందికి నాలుగైదుసార్లకంటే బౌల్ చేసే అవకాశాన్ని ఇవ్వటంలేదు. అయితే ఈ సుందర్‌సింగ్ మాత్రం అంతులేకుండా బంతులు విసురుతూనే వున్నాడెందుకని? ఇది నా పాలిటి శాపంగా తయారయింది. ఈ చిన్న గూట్లో నెత్తికి నేరుగా వచ్చే బంతినించి తప్పించుకోవడమెల్లాగు? తలకి తగలకుండా తప్పించుకుందుకు కొంతచోటు లేకపోలేదు. ఎంతమంది గొప్ప ఆటగాళ్ళు ప్రాక్టీసు చెయ్యలేదు ఇలాంటి నెట్స్‌లో. నేనే ఎన్నిసార్లో చూశాను. ఇదే కాలేజీలో ఇదే స్థలంలో చూసివున్నాను. చూసే కొద్దీ ఎంత ఆశ పుట్టుకొస్తున్నదో. ఇది కూడా ఒక కారణమే నేను కుర్రకుంకల్నందరినీ పోగేసుకుని క్రికెట్ టీముని ఏర్పాటు చేసుకుని పడరానిపాట్లు పడుతూ వుండటానికి. ఇదో ఈ బంతి. కుడివేపుకి కొడితే అటువేపు ఎగిరిపోతున్నది. మళ్ళీ నాజీర్ అలీఖాన్ బౌల్ చేస్తున్నాడు. పైకెగిరి గాలిలో తేలిపోతూ వస్తున్నది. అది అలా గింగిరీలు కొడుతూ వస్తుంటే దాని దగ్గర చెవి పెట్టి విన్నట్టయితే 'సర్' మనే శబ్దం రావాలి. సరిగ్గా నాకు అరడుగు ముందు నేలని తాకుతున్నది. అది కింద పడటానికి ముందేనేను ముందుకి అడుగేసి దాన్ని కొట్టాలి. లేదా అది నేలని తాకే చోట బాటును ఆనించి తొయ్యాలి. ఇది అలా తొయ్యాల్సిన బంతే. చాలా ప్రమాదకరమైన బంతి. దీన్నిగాని కొట్టలేకపోతే నేను ఔటవడం ఖాయం. వేగంగా బాటుని పైకి లేపాను. అయిపోయింది. క్లీన్‌బౌల్డ్. అయ్యో! ఇప్పటికైనా ఈ నాజీర్ అలీఖాన్ గాడు 'నెక్స్టుబాట్స్‌మన్' అని అనకూడదూ. నన్ను ఒక్కణ్ణే ఈ వలలో బంధించి క్రికెట్ ప్రాక్టీసుపేరుతో పడరాని ఇబ్బందులకి గురిచేసి గాని వదలడా? 'మాతో సమంగా ఆడాలని రావటానికి నీకెన్ని గుండెలూ?' అని చెప్పక చెబుతున్నాడేమిటి? 'కుర్రకుంకలతో ఆడటం లాంటి దనుకున్నావా కాలేజీ టీములో చేరి ఆడటమంటే?' అంటూ ఎగతాళి చెయ్యటం కాదుగదా ఇది. ఇలా అందరి ముందూ నన్ను అవమానిస్తున్నాడా? ఇక నుంచి నేనిక్కడ నిలవను. ఇక్కడ

ఆడటానికి రాను. ఈ నవాబు జాగీర్దార్ల స్నేహమూ, వీళ్ళ ఆటా నాకొద్దు. నాకొద్దు. "నెక్స్ట్ బాట్స్‌మెన్".

చంద్రశేఖరం నరసింహారావు ముఖంకేసి చూస్తూ నిలుచున్నాడు. చాలాఅందమైన ముఖం నరసింహారావుది. విశాలమైన నుదురు. మంచి తీరైన తెలుగు ముఖం. గంభీరమైన ముఖం. 'ఆంధ్రుడంటే వీడికి కోపమొస్తుంది. 'తెలంగాణా వాడు' అనాలి. తరతరాలుగా ఈ హైదరాబాదు సంస్థానంలో స్థిరపడిపోయిన కుటుంబానికి చెందిన వాడితను. వీళ్లింట్లో సగం ఉర్దూలోనే మాట్లాడుకుంటారు. అర్ధ తురకలు. వీడు 'తురకాళ్ళతో ఆడుతున్నావే సిగ్గులేదా?' అని నన్ను నిలేస్తున్నాడు. అయితే ఈ రోజు ప్రాక్టీసు ముగిసిన తరువాత నాజీర్ అలీఖాన్ నాతో అన్నమాటలు వీడికెలా తెలుస్తాయ్? 'ఆజ్ క్యాహువా దోస్త్?' అని ఎంత ఆప్యాయంగా పలకరించాడు అలీఖాన్ తనని.

"ఇక నేను వెళతాను నరసింహా. రేపు మాట్లాడుకుందాం. సైకిల్‌కి దీపంలేదు".

అయ్యో మళ్ళీ ఈ సైకిల్ దీపం ప్రసక్తి ఎందుకు తెచ్చానా అని నాలిక కరచుకున్నాడు చంద్రశేఖర్. నరసింహారావు అతణ్ణి వెళ్ళనిచ్చేడు.

జేమ్స్ స్ట్రీట్‌నీ, కింగ్స్‌వేని కలిపే వంకర టింకర సందులగుండా సైకిల్ తొక్కుతూ పోతున్నాడు చంద్రశేఖర్. సాధారణంగా ఆవేళప్పుడు అంత తేలిగ్గా సైకిల్ తొక్కుకుంటూ వెళ్ళటం సాధ్యంకాదు ఆ ప్రాంతాలలో. చాలా జనసమ్మర్దంగా వుండే ప్రాంతమది. అయితే ఇప్పుడు అయిదారుమంది మాత్రమే తిరుగాడుతున్నారు ఆ ప్రాంతాలలో. ఈ ప్రాంతంలో పెద్దగా అల్లరి జరిగినట్టు కూడా లేదు. అయితే ఎంతో కాలంగా అక్కడ నివసిస్తూ వచ్చిన ముస్లిం కుటుంబాలు వేరే ప్రాంతాలకి తరలివెళ్ళారు. సికిందరాబాదులోనే ముస్లింలు ఎక్కువగా నివసించే ప్రాంతానికి వెళ్ళారు. అదే సమయంలో చాలా హిందూ కుటుంబాలు తమ స్త్రీలని పసిపిల్లల్ని వేరే వూళ్ళకి పంపేశారు. ఈ కారణంవల్లే ఆ పేటలో జనసంచారం పలచబడింది. సైకిల్ గంట మోగించనవసరం లేకుండా తొక్కుతున్నాడు చంద్రశేఖరం. ఇలా వున్న చోటు వదలి వెళ్ళిన కుటుంబాలన్నీ పేద కుటుంబాలే. చిన్న వ్యాపారులు, కాయగూరలు అమ్ముకునేవాళ్ళు, తమలపాకులు, పళ్ళు అమ్ముకునేవాళ్ళు, తినుబండారాలు చేసి బళ్ళలో పెట్టి వీధి వీధికీ తిరిగి అమ్ముకునేవాళ్ళు. వీళ్ళు తయారుచేసే పకోడీ భలే రుచిగా వుంటుంది. రూపాయికి ఒక సేరు పకోడీలు. శెనగనూనెతో తయారుచేసే వీళ్ల మురుకులు కూడా ఎంతో రుచిగా వుంటాయి. అణా మురుకులు తింటే చాలు

కడుపునిండిపోతుంది. ఇదే హోటల్లో అయితే రెండణాలు. అణా ఇస్తే చేతినిండా మురుకులూ, పకోడీలు ఇచ్చే ఈ సన్నకారు జనమంతా ఎక్కడెక్కడికో పారిపోయారు. ఇప్పుడు వీరి స్థానంలో రెఫ్యూజీలు ఈ వ్యాపారం చేస్తున్నారు. ఈ వూళ్ళో మరో వెయ్యిమంది వచ్చి ఈ తినుబండారాల వ్యాపారం చేసినా అన్నీ చెల్లిపోతాయి. అంచేత వీళ్ళ పోటీకి తట్టుకోలేక వాళ్ళందరూ వెళ్ళిపోయారని కాదు. ఏడాది నించీ ఓ మోస్తరుగా వున్న పరిస్థితి 'జాయిన్ ఇండియన్ యూనియన్ డే' నాడు విషమించింది. ఊరేగింపులు, లాఠీఛార్జి, అరెస్టులు ఇదంతా జరిగింది హైదరాబాదులోనే. సికిందరాబాదులో అంగళ్ళన్నీ మూసేశారు. పిల్లలు బళ్ళకి వెళ్ళలేదు. అంతా అలా ప్రశాంతంగా జరిగి వుండాల్సింది కాని రెజిమెంటల్ బజారులో ప్రారంభమైంది అసలు గొడవ. ఒక ముస్లింకి చెందిన పిండి మిల్లులోకి కొందరు చొరబడి అక్కడి మిషన్లని ధ్వంసం చేశారు. దాని ఫలితం హిందువులకి చెందిన మూడు దర్జీ కొట్టులు నాశనం చెయ్యబడ్డాయి. ఆ తరువాత రజాకార్లు, ఆర్య సమాజ్ వాళ్ళు, పోలీసులు కలయబడటం...

చంద్రశేఖరం ఇస్లామియా హైస్కూల్‌ని సమీపించేడు. అది దాటితే అక్కడ ఖచ్చితంగా పోలీసువాడుంటాడు. అంచేత సైకిల్ దిగి కొంతదూరం నడిపించుకుంటూ వెళ్ళవలసిందే. తప్పదు.

ఉన్నట్టుండి ఆ చీకట్లోంచి ఎవరో ఇద్దరు చంద్రశేఖరన్ కేసి పరుగెత్తుకుంటూ వచ్చారు. అందులో ఒకడు "కోన్ హై ఆప్?" అని గద్దించాడు. మరొకడు "బామ్మన్ హై, సాలా" అన్నాడు. "మారో సాలేకు" తన నెత్తిమీద బలంగా రెండుదెబ్బలు పడటం మాత్రమే తెలుసు చంద్రశేఖరానికి.

## 4

చంద్రశేఖరం కిందపడ్డాడు. సైకిల్ అతనిపైన పడింది. అదీ ఒకందుకు మేలే అయింది. ఆ తరువాత పడిన దెబ్బలన్నింటినీ సైకిలే భరించింది. అప్పుడు మరో సందులోంచి నలుగురైదుగురు పరిగెత్తుకువచ్చేరు అక్కడికి. "మారో, మారో" అని అరుచుకుంటూ వచ్చేరు. వాళ్ళని చూసిన వెంటనే చంద్రశేఖరాన్ని అటకాయించి కొట్టిన వాళ్ళు పారిపోయేరు. వాళ్ళని తరుముకుంటూ వెళ్ళారు ఆ నలుగురైదుగురు.

చంద్రశేఖరం లేచి నిలబడ్డాడు. అక్కడికి యాభై గజాల దూరంలోనే వుంది సికిందరాబాదులో ప్రతి దినమూ జరిగే మోండా సంతబజారు.

అయినా చంద్రశేఖరం దెబ్బలు తిన్న ప్రదేశంలో ఆ సమయంలో జనసంచారమన్నదే లేదు. సైకిల్‌ని నెట్టుకుంటూ మోండావేపుగా నడిచేడు చంద్రశేఖర్. తనని కొట్టిన వాళ్ళు తమ ఆయుధాలని అంత బలంగా ప్రయోగించినా స్వల్పమైన గాయాలతో తను ఎలా తప్పించుకున్నాడా అని అతనికే ఆశ్చర్యంగా వుంది. కొట్టాలని ప్రయత్నించారేగాని తనని చంపాలనే వుద్దేశ్యం వాళ్ళకి వున్నట్టులేదు.

మోండాలో అంతకు కొన్ని నెలల క్రితందాకా వున్న గుంపు ఇప్పుడు లేదు. మునుపు ఎక్కడా అంగుళం చోటు కూడా వదలకుండా కిందా మీదా అంగళ్ళు పరిచేవారు. ఇప్పుడు అంగళ్ళు అంత దట్టంగా ఆక్రమించుకున్నట్టు లేదు. ఎత్తుగా వున్న మైదానమంతా చాలావరకు కాయగూరలమ్మే అంగళ్ళు – ఉల్లిపాయలు, వంకాయలు, మిరపకాయలు, చిక్కుడుకాయలు. వాటికి దిగువగా ఆకుకూరల అంగళ్ళు. రేకుతో చేసిన నూనెదీపాలు పొగలు చిమ్ముతూ వెలుగుతున్నాయి. ఆ వెలుగులో రకరకాల ఆకుకూరలు పోగులు పెట్టి అమ్ముతున్నారు. రెండో ప్రపంచ యుద్ధం జరిగే రోజుల్లో బియ్యం దొరికేవి కాదు. అప్పుడు పెసరపప్పుతో కలిపి వండిన ఈ ఆకుకూరల్ని జొన్నరొట్టెల్లోకి నంజాకుని తినేవారు. రోజూ ఈ ఆకుకూరల్ని తినలేక వయసు ముదిరినవాళ్ళు ఇబ్బంది పడేవారు. పసివాళ్ళు ఏది తిన్నా జీర్ణంచేసుకోగలరు. ఆ రోజుల్లో ఆ ఆకుకూరలు తప్ప తక్కిన కాయగూరలు దొరకటం కష్టంగా వుండేది. పగలు పదకొండు నించీ మిలటరీ లారీలు ఆ ప్రదేశంలో దారికడ్డంగా నిలిచేవి. మిలిటరీ కాంట్రాక్టర్లు కంటబడిన కాయగూరలన్నింటినీ లారీల్లో వేసుకుని వెళ్ళిపోయేవారు. ధర ఎంత అయినా వాళ్ళకి లెక్కలేదు.మూటలకి మూటలు కాయగూరల్ని కొనుక్కుని వెళ్ళేవారు. అట్టి పరిస్థితుల్లో కూడా దోసిలి నిండిపోయేటంత పెద్ద పెద్ద నాగపురి వంకాయలు అణాకి రెండుసేర్లు దొరికేవి. రూపాయికి నలభై సేర్లు. బస్తా వంకాయలు కొని కూలివాళ్ళచేత గంపలకెత్తించి ఇళ్ళకి చేర్చేవారు. రోజంతా కూర్చుని ఓపిగ్గా వాటిని ముక్కలు ముక్కలుగా కోసి వారాల తరబడి ఎండలో ఎండబెట్టి వరుగులు తయారుచేసేవాళ్ళు. అలా తయారైన వరుగుల్ని పెద్ద పెద్ద బానల్లో భద్రపరిచేవారు. అటువంటిది ఈ మధ్య అటువంటి వంకాయలే కళ్లబడటంలేదు. బయటి నుంచి హైదరాబాదు సంస్థానానికి సరుకులు రావటం తగ్గిపోయింది. వాటికి బదులు ఇంకేవో వచ్చి దిగుతున్నాయి.

## కాందిశీకులు

మోండా మీదుగా సైకిల్ నెట్టుకుంటూ పోతున్నాడు చంద్రశేఖర్. సంజె చీకట్లు దట్టంగా ముసురుకుంటోన్న ఆ వేళప్పుడు ఆ ప్రదేశం చిత్రంగా కనిపిస్తోంది. పగటి వేళల్లో సందడిగా కనిపించే మోండా ఇప్పుడు బిక్కుబిక్కు మంటున్నట్టుగా వుంది. చిన్న చిన్న అంగళ్ళన్నీ తొందరగా కట్టేశారు. ఏవో కొన్ని అంగళ్ళుమాత్రమే మరి కాసేపు తెరిచి వుంచుతారు. ఎర్రగడ్డలు, వెల్లుల్లిపాయలు, ఎండు మిరప మొదలైన చిల్లర సామాన్ల అంగళ్ళు అవి. నూనెదీపాల వెలుగులో 'ఎనిమిది, ఎనిమిదిన్నర దాకా వ్యాపారం సాగుతుంది. ఆ తరువాత అంగళ్ళు కట్టేసి వెళ్ళిపోతారు అంతా. ఇంటికి వెళతారా? వాళ్ళ ఇళ్ళు ఎలా ఉంటాయో? ఎక్కడ వుంటాయో? కాయగూరలవాళ్ళు మిగిలిపోయిన కాయగూరల్ని బుట్టలోవేసి వాటిమీద మరో బుట్టని బోర్లించి వాటి మీద గుడ్డపరిచి వాటి పక్కనే పడుకుని నిద్రపోయేవారు. మోండా మిట్ట ప్రదేశం చిన్న చిన్న తుప్పలతో నిండి వుంటుంది.

చంద్రశేఖర్ సైకిల్‌ని నెట్టుకుంటూ పోతున్నాడు. ఒక్కొక్క అడుగే వేస్తుంటే క్రికెట్ బూట్లు సర్రుమని సర్రుమని చప్పుడు చేస్తున్నాయి. మోండాకి కాంక్రీట్ రోడ్డు వేసి వుంది. కాని ఎద్దుబళ్ళు చేతిబళ్ళు తరచుగా వెళ్ళడం చేత అక్కడక్కడ గతుకులు పడి వుంది. ఒక గతుకులో కాలుపడి బూటుకి బురద అంటుకుంది.

చంద్రశేఖర్ నిదానంగా నడుస్తున్నాడు. దెబ్బలు తిన్నా ఎందుకో భయం అనిపించటంలేదు. తనని కొట్టినవాళ్ళ ముఖం కూడా సరిగ్గా చూడలేదు అతను. కాని వాళ్ళు ఇతణ్ణి చూశారు. వాళ్ళు రెఫ్యూజీలు కావడానికి వీల్లేదు. సికిందరాబాదుకి వచ్చి చేరిన రెఫ్యూజీలంతా ఇంకా ఫర్లాంగు దాటి స్టేషన్ రోడ్డులో తడికలతోనూ, రేకులతోనూ నిర్మించుకున్న చిన్న చిన్న గుడారాల్లో నివసిస్తున్నారు. పురుషుల కన్నా స్త్రీలు రెట్టింపువున్నారు. బాగా పండిపోయిన వృద్ధులు మొదలుకుని పసిపిల్లలదాకా అన్నిరకాల వయసుగల వాళ్ళున్నారు. సంఖ్య చెప్పనలవి కాదు. ఇంత చిన్న వూళ్ళో ఇంత ఇరుకైన ప్రదేశంలో ఇంతమంది జనం నిండిపోయారు. ఈ జీవితమే మేలనుకుని తరలివచ్చిన వీరికి తమ సొంత వూళ్ళో జీవితం ఇంకెంత దుర్భరంగా అనిపించివుంటుందో! కాని అది వాళ్ళు పుట్టి పెరిగి, అలవాటు పడిన ప్రదేశం. భిక్షగాడికైనా సరే సొంత ప్రదేశం వదిలి కొత్తచోటికి వెళితే ఇబ్బందిగానే

వుంటుంది. ఏం నమ్మకుని ఈ కాందిశీకులు ఇక్కడికి వచ్చి చేరినట్లు? ఏ నమ్మకాలని వదులుకొని సొంతదేశం వదలి ఈ పరాయి దేశానికి వలసవచ్చారు? ఈవిధంగానే కదా లక్షల కొలది కాందిశీకులు అక్కడ ఉత్తరం నించి వలస వెళుతున్నారు. దేశ విభజనే కదా ఇన్ని అనర్థాలకి కారణం. గ్రామాలకి గ్రామాలు ధ్వంసం అయాయి. వందల కొద్దీ స్త్రీలు చెరచబడ్డారు. అపహరించబడ్డారు. అన్ని వయస్సులకి చెందిన జనం అమానుషంగా హత్య గావింపబడినారు. తరిమి తరిమికొట్టబడినారు. ఇళ్ళు, ఆస్తులు వదులుకుని దిక్కులేని వాళ్ళలా పారిపోవాల్సి వచ్చింది. అలా అనాథల్లా వెళ్ళేవాళ్ళని కూడా ప్రాణాలతో వదలిపెట్టటంలేదు. కాందిశీకులని ఎక్కించుకుని వెళ్ళే రైళ్ళని మార్గమధ్యంలోనే ఆపుచేసి ప్రయాణీకుల్ని దోచుకుంటున్నారు. స్త్రీల మానాలని, ప్రాణాలని హరిస్తున్నారు. ప్రాణాలకి తెగించి ఆత్మీయుల్ని కూడా వదిలేసి గుంపులు గుంపులుగా రైలు పట్టాల మీద జనం పిచ్చివాళ్ళలా పరుగెడుతున్నారు. రైలుపెట్టెల టాపుల మీద కూర్చుని ప్రయాణం చేస్తున్నారు. రైలుపెట్టెకీ రైలుపెట్టెకీ మధ్య వుండే స్థలంలో కూడా వేలాడుతూ ప్రాణాలకి తెగించి ప్రయాణంచేస్తున్నారు. రైళ్ళు దొరకని దురదృష్టవంతులు కాలి నడకనే బయటి వూళ్ళకి ప్రయాణ మవుతున్నారు. మార్గమధ్యంలో అటకాయించబడి దోచుకోబడుతున్నారు. తమ కళ్ళ ముందే తమ భార్యలు, బిడ్డలు, అక్కలు, చెల్లెళ్ళు చెరచబడుతూ వుంటే నిస్సహాయులై పిచ్చి చూపులు చూస్తున్నారు. ఇవన్నీ పత్రికల్లోను, రేడియోలోను వింటున్న సమాచారం.

ఇక్కడ వందల సంఖ్యల్లో వచ్చి చేరిన ముస్లింల వలెనే అక్కడ ఢిల్లీలో వేలకొలది, లక్షలకొలది హిందువులు అనాథలుగా నిండిపోతున్నారు. సిక్కులు కూడా. మత విద్వేషంతో దేశమంతా అల్లకల్లోలమైపోతున్నది. మతం పేరుతో మానవత్వాన్ని మరిచి పోయి మనుషులు అమానుషులై ఒకరినొకరు చంపుకుంటూ మృగాల కంటె హీనంగా, నీచంగా ప్రవర్తిస్తున్నారు. మతకలహాల మంటలు చుట్టుముట్టి దేశమంతా కాలిపోతూ వుంటే ఈ మంటలకి దూరంగా కూర్చుని తాపీగా "రఘుపతి రాఘవ రాజారాం, ఈశ్వర అల్లా తేరేనామ్" అంటూ భజన చేస్తున్నాడట ఒక మహాత్ముడు. అయితే ఇంతవరకూ ఆ మనిషిని చూట్టం పడలేదు. ఆయన ఈ హైదరాబాదు సంస్థానానికి రాడెందుకని?

చంద్రశేఖరానికి అడ్డంగా మూడు ఆవులు నిలబడి వున్నాయి. ఎవరివో ఇవి? మోండాలో సాధారణంగా ఆవులు, ఆవుదూడలు మాత్రమే తిరుగుతూ కనిపిస్తాయ్. మరో ప్రదేశంలో అయితే ఇలా వీధుల్లో తిరిగే పశువుల్ని పోలీసుస్టేషన్‌కి

తోలుకెళ్ళి కట్టేసేవారు. అయితే ఈ మోండాలో డజన్లకొద్దీ విహరించే వీటిని ఎవరూ ఇబ్బంది పెట్టరు. ఈ పశువులు మోండాలో ఒక్కొక్క అంగడి ముందు నిలబడి అంగడివాడు ఏమాత్రం ఏమరుపాటున వున్నా అదాట్టున నోటి కందినవన్ని బంగాళాదుంపలో, ఆకు కూరల కట్టలో, బీన్సో, బీరకాయలో, అరటిపళ్ళో అందుకుని వెళ్ళిపోయేవి. అంగడివాళ్ళ అరుపుల్నిగాని, దెబ్బల్నిగాని లక్ష్యపెట్టేవికావు. కానీకి అర్ధణాకి అంగడివాడు బేరం చేస్తూ వుంటే నాలుగణాలు, ఎనిమిదణాలు విలువగల కాయగూరల్ని క్షణంలో ఇవి నోటికి చిక్కించుకునేవి. ఇలా వీళ్ళ తిండి తిని ఇంకెవరికో పాలిచ్చేవి ఈ పశువులు.

చంద్రశేఖరం ఒక చేత్తో సైకిల్ పట్టుకుని మరో చేత్తో ఆవు నుదుటి మీద మృదువుగా రాశాడు. ఆ ఆవు మెడ ముందుకి చాపింది. అలాగే అక్కడ కూడా చేత్తో దువ్వమన్నట్టుగా. అది చూసి తక్కిన ఆవులు కూడా మెడలు చాచి నిలబడ్డాయి. తమకి కూడా ఆ స్పర్శాసుఖం కావాలి అన్నట్టుగా. ఆవుల మెడలు దువ్వి దువ్వి చంద్రశేఖరంకి వేళ్ళు నెప్పెడుతున్నాయి. గోళ్ళు మంటలు పుడుతున్నాయి. అయినా ఆవులు అతణ్ణి వదలటంలేదు. వాటి అమాయకత్వం, అవి కనబరిచే ఆప్యాయత చూసి చంద్రశేఖరం కరిగిపోయాడు. అంతకుముందొకసారి తను ఇంటి గేదెను బాదిన సంగతి గుర్తొచ్చి బాధ కలిగింది అతనికి. గేదెల్ని ఇంత ముద్దు చేయడానికిలేదు. గేదెల ప్రవర్తన గోవులంత నాజూగ్గా వుండదు. చాలా మొరటుగాను, ఒక్కొసారి అసహ్యం కలిగించే విధంగానూ నడుచుకుంటాయి ఈ బర్రెలు. ఇప్పుడు ఈ గోవులు - ఎవరికి చెందినవో - అయినా ఎంతో కాలం నించి మచ్చిక అయినట్టుగా తన చెంత తలలు వంచి నిలుచుని మూపులు గోకించుకుంటున్నాయి.

"వెళ్ళండి, వెళ్ళండి" అని వాటిని అదిలిస్తూ సైకిల్ ని ముందుకి నెట్టాడు చంద్రశేఖరం. ఇక తప్పదన్నట్టుగా అడ్డం తొలగి దారిచ్చాయి ఆవులు. సైకిల్ హేండిల్ వీపుకి తగిలి తల విదిలించింది ఒక ఆవు. మోండా చుట్టూ వున్న గిడ్డంగులు అన్నీ మూసివున్నా ఓ మూల ఓ కొట్టు మాత్రం తెరిచి వుంది. నూనె అంగడి అది. ముందు వరండా. దాని వెనుక గానుగ, అంగడి వాళ్ళుండే ఇల్లు వుంది. ఈ అంగట్లో అయితే నూనె శేర్లలెఖ్ఖన గాని, టోకుగా కాని కొనవచ్చు. ఆ పరిసరాల్లో ఇలా చిల్లరగాను, టోకుగాను నూనెలమ్మే అంగళ్ళు వేరేలేవు. గల్లా పెట్టె దగ్గర ఓ చిన్న కుర్రాడు కూర్చుని వున్నాడు. చంద్రశేఖరం వాడి దగ్గరకెళ్ళి అడిగాడు.

"మీ అమ్మ ఎక్కడ?"

"లోపలుంది"

"కాస్త పిలుస్తావూ?"

ఆ పిల్లాడు లోపలికి వెళ్ళాడు. ఇల్లంతా చీకటిగా వుంది. ఆ ఇల్లేకాదు. ఆ ప్రాంతంలో ఇళ్ళన్నీ చీకటిగానే వున్నాయి. ఎవరూ దీపాలు వెలిగించినట్టు లేరు. కాస్సేపటికి ఓ లావుపాటి రాజస్థానీ స్త్రీ వచ్చింది లోపల్నుంచి. ఆ మసక వెలుతురులో కూడా ఆమె చీరకొంగుకున్న నూనె మరకలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"దీపాలు పెట్టేవేళ ఇప్పుడొస్తే ఎలా?" అన్నది ఆమె.

"నూనె కోసరం రాలేదండీ నేను. నా బూట్లు తెగిపోయినయ్. ఇక్కడ వదిలేసి రేపొచ్చి తీసికెళతాను" అన్నాడు. ఆమెకి అర్థంకాలేదు. చంద్రశేఖరం తన బూటు కాలిని విదిలించి చూపేడు. అప్పటికీ ఆమెకి అర్థమైనట్టులేదు. అయినా "సరే" అన్నది.

సైకిల్‌ని వాకిట్లో నిలబెట్టి మెట్లెక్కి అంగట్లోకి వెళ్ళాడు బూట్లు విప్పి ఓ మూలగా పెట్టాడు.

"కరుస్తున్నాయా?" అడిగింది.

"లేదు కానీ ఇవి వేసుకుని వేగంగా నడవలేకపోతున్నాను"

"అసలు ఈ చీకట్లో మోండాకి ఎందుకు రావాలి? నాన్నగారు రాలేదా నీతో?"

"కాలేజీకి వెళ్ళాను. ఆలశ్యమైంది"

"త్వరగా ఇంటి కెళ్ళు. ఇక్కడంతా బద్మాష్‌లున్నారు. ఈ మాటలంటూనే ఆమెకేదో అనుమానం తోచింది. "నిన్నెవరైనా కొట్టారా?" అడిగింది.

తలెత్తి ఆమెకేసి చూసేడు. "అవును" ఆమె భయంతో కెవ్వున అరిచింది. ఆ కేకకి లోపల్నుంచి ఒకతను పరిగెట్టుకుని వచ్చేడు.

"ఊరుకో అమ్మా. అరవకు" అన్నాడు అతను.

"అయ్యో. ఎక్కడ కొట్టార్రా తండ్రీ. దెబ్బలు బలంగా తగిలాయా?" అంటూ చంద్రశేఖరాన్ని పట్టుకుని వొళ్ళంతా తడుముతూ అడిగింది.

"వీపు మీద రెండు దెబ్బలు పడ్డాయి. అంతలో ఇంకెవరో పరుగెత్తుకొచ్చేరు అటుకేసి. వాళ్ళని చూస్తూనే నన్ను కొట్టిన వాళ్ళు పారిపోయేరు"

"ఎవరాళ్ళు?"

"ఆర్యసమాజ్ వాళ్ళు అయి వుంటారు" అన్నాడు పక్కనే వున్న తను లొణక్కుండా. ఇప్పుడామె దృష్టి చంద్రశేఖరం మీంచి పక్కనే వున్న తన పెద్ద కొడుకు మీదికి మళ్ళింది. "లోపలికి పో. ముందు లోపలికెళ్ళు నువ్వు" అంది

భయంగా. "నువ్వెండమ్మా" అని చంద్రశేఖరంకేసి చూసి "ఎక్కడ అటకాయించారు నిన్ను?" అడిగాడు.

"హైస్కూల్ దగ్గర"

"వాళ్ళు తెలుసా నీకు?"

"తెలీదు"

"నువ్వెళ్ళరా లోపలికి. చెప్తుంటే కదలవేమి? అంటూ పెద్దగా అరిచిందామె. చంద్రశేఖరంతో. "వెంటనే నువ్విక్కణ్నుంచి వెళ్ళిపో నాయనా. అనవసరంగా ఇక్కడికి గొడవలు తెచ్చిపెట్టకు. వెంటనే కదులు" అని చెప్పింది. ఆదరాబాదరాగా బయటపెట్టి వున్న నూనె డబ్బాలని లోపలికి జరిపింది.

చేసేదిలేక తన క్రికెట్ బూట్స్ని చేర్చి కట్టి సైకిల్‌కి తగిలించాడు చంద్రశేఖరం. ఆ కొట్లో ఎంతో కాలంగా అతని తండ్రి నూనెకొంటున్నాడు. మధ్యలో కొన్నాళ్ళు రైల్వేరేషన్ షాపులో నూనె కూడా సరఫరా చేశారు. అయితే రేషన్ షాపులో శెనగనూనె మాత్రమే దొరికేది. నువ్వుల నూనె కావాలంటే వేరే అంగళ్ళకు వెళ్ళాల్సి వచ్చేది. ఈ రాజస్థానీ అంగట్లో నెలకి ఒకటి రెండు శేర్లు నువ్వులనూనె కొనాల్సి వచ్చేది. ఈమాత్రం దానికి కూడా పక్కనే ఓపిగ్గా కూర్చుని అప్పటికప్పుడు గానుగ ఆడించిన నూనె కొని తెచ్చేవాడు. తండ్రితోబాటు చంద్రశేఖరం, అతని తమ్ముడు అంతసేపూ అక్కడే కూలబడేవారు. రాజస్థానీ స్త్రీ వాళ్ళిద్దరినీ గారాబంగా పలకరించేది. ఆమె భర్త పోయిన నాటి నుంచీ ఒక్క మనిషి గానుగాడించి, నూనె కొట్టు పెట్టుకుని నెట్టుకొస్తున్నది. కొడుకు పెరిగి పెద్దవాడై ఇప్పుడు ఆర్యసమాజ్ జరిపే కర్రసాముకి వెళ్ళి వస్తున్నాడు. అతని మీద, ఆ నూనె దుకాణం మీద చాన్నాళ్ళయి ఎవరో కన్ను వేసి వున్నారు. అయితే ఇంతదాకా ఏ దుస్సంఘటనా జరగలేదు.

బూట్స్ లేకుండా నడవడం హాయిగా వుంది. కాందిశీకులు నిండివున్న స్టేషన్ రోడ్డు మీదుగా కాకుండా చుట్టు దారిగుండా సైకిల్ నడిపించుకుంటూ వెళుతున్నాడు చంద్రశేఖరం. ఎస్.పి.జి. స్కూల్ ప్లేగ్రౌండు, అక్కడే ఓ మూలగా వుండే సెంట్ థామస్ చర్చి అతనితోబాటే నడుస్తున్నట్టుగా వుంది. సెంట్ థామస్ చర్చి స్కూల్‌కి ఎస్.పి.జి.స్కూల్ అనే పేరెలా వచ్చిందో అర్థంకాలేదు చంద్రశేఖరానికి. ఒకప్పుడు ఆ మైదానం చుట్టూ ప్రహరీగోడ వుండేదికాదు. మైదానానికి అడ్డంగా పరుగెత్తి అవతలివేపుకి చేరుకోవడానికి వీలుండేది. ఇప్పుడు ఎత్తయిన ప్రహరీగోడతోబాటు గేటుమూసి తాళం వేస్తున్నారు.

మనోహర్ టాకీసు రెజిమెంటల్ బజార్ పడమటి హద్దు. మేడమీద

సినిమాహాలు. కింద ఏవో అంగళ్ళు, ఇళ్ళు, ఎన్నో అద్దెకున్న కుటుంబాలు. పైన సినిమా నడుస్తోంది. మరి కాసేపటికి ఇంటర్వెల్ అవుతుంది. సగంమంది అవుట్ పాస్‌లు తీసుకుని కిందికి దిగి టీ తాగుతారు. మరి కొందరు ఎదురుగా వున్న గోవర్ధన్ బంకులో లస్సి, బీడీకొనుక్కుంటారు. ఈ పరిసరాలింకా మారలేదు. ఈ ప్రాంతంలోని అంగళ్ళన్నీ పగలంతా కునుకు తీసి రాత్రుళ్ళు మేలుకుని హుషారు పుంజుకుంటాయి. దర్జీషాపులు కూడా రాత్రిళ్ళే పనిచేయటం ప్రారంభిస్తాయి. మనోహర్ టాకీసు ప్రాంతంలో అయిదారుమంది అక్కడక్కడా గుంపులు కూడి సందడిగా మాట్లాడుతూ వుండటం కనిపిస్తుంది. ఇప్పుడు కూడా ఆ ప్రాంతాల్లో ఎక్కడో హరిగోపాల్ జట్టు వుండి వుంటుంది. హరిగోపాల్ ఇల్లు ఆ సమీపంలోనే. ఎనిమిది ఎనిమిదిన్నర దాకా కూడా స్నేహితులతో గడిపి ఇంటికెళ్ళగలడు అతను. అందరికీ అలా వీలవుతుందా? లాన్సర్ బారక్సుకి ఇంకా దాదాపు మైలు దూరం నడవాలి. హరిగోపాల్ కంట్లో పడకూడదు.

తారురోడ్డు మించి చీలిన మట్టిరోడ్డు మీదుగా నడుస్తున్నాడు చంద్రశేఖరం. ఈ రోడ్డు మీద వీధి దీపాలు చాలా తక్కువ. అయినా రోడ్డు నానుకుని చాలా ఇళ్ళు. కొన్ని ఇళ్ళలో కరెంటు దీపాలున్నాయ్. చాలా ఇళ్ళలో హరికేన్ లాంతర్లు మాత్రమే. సెయింట్ ఫ్రాన్సిస్ కాన్వెంట్ గర్ల్స్ హాస్టల్లోంచి ఆడపిల్లల నవ్వులు కేరింతలు అదే పనిగా వినిపిస్తుంటాయి. ఆ అమ్మాయిలంతా పచ్చరంగు లంగాలు, తెల్లబ్లౌజులు తొడుక్కుని ఎప్పుడూ వాగుతూ కనిపిస్తారు. హాస్టల్ పక్కనే సెయింట్ మేరీస్ బోర్డింగు. అది కూడా అనాథ బాలికలదే. మగపిల్లలకి స్కూలు, బోర్డింగ్ రెండూ ఒక కాంపౌండ్ లోనే. అనాథపిల్లలే అయినా ఒక్కొక్కడూ పరమ గడుగ్గాయి. పక్కనే ఆడపిల్లలబడి. గోడమించి చూస్తే చాలు బిలబిలమంటూ కనబడే అమ్మాయిలు. ఆ మగపిల్లలు గడుగ్గాయిలుగా గాక మరెలా వుంటారు. ఆడపిల్లల పట్ల ఏదో అర్థం తెలియని ఆకర్షణ ఈ ప్రాయంలోనే ఏర్పడుతుంది కుర్రాళ్ళకి. తనూ ఈ రకమైన ఆకర్షణకి గురి అయ్యాడు. అలా జరగడానికి ముందు తనకి ఏ చిక్కులూ వుండేవికాదు.

చంద్రశేఖరం కుసిని మురికి వాడదాటి నడుస్తున్నాడు. చిన్నప్పుడు ఆ పేరు అదో రకంగా ధ్వనించేది అతనికి. తెలుగు, ఉర్దూ భాషలు మాత్రమే రాజ్యంచేసే ఆ ఊళ్ళో ఈ ప్రాంతంలో మాత్రమే అంతా తమిళులే నివసించేవారు. అయితే వాళ్ళది అదోరకం తమిళం. అది చంద్రశేఖరానికి ఏమాత్రం బోధపడేదికాదు. ఆ వాడలో మగాళ్ళంతా తాము బట్లర్లమని చెప్పుకునేవారు. ఒకరిద్దరు మాత్రం కారుడ్రైవర్లు. ఇంగ్లీషు ఎక్కువగా మాట్లాడేవారుకాదు. అయిదారుగురు

చేరిపేకాడుకునేటప్పుడు సైతం చాలా నెమ్మదిగా మాత్రమే మాట్లాడుకొనేవారు. వాళ్ళు పనిచేసే దొరల ఇళ్ళలో క్రమశిక్షణ అటువంటిది. అయితే స్త్రీలు మాత్రం ఇందుకు చుక్కెదురే. గొంతులు చించుకుని మాట్లాడేవారు. తగువులాడుకునేవాళ్ళు. గంటల తరబడి జరిగేది వాళ్ళ వాగ్యుద్ధం. ఇంత రభస జరుగుతున్నా తమకేమీ పట్టనట్టు దగ్గర్లోనే బీడీతాగుతూ తాపీగా కూర్చునేవారు పురుషులు. ఒక్కోసారి అలాగే నిద్రకూడా పోయేవాళ్ళు. అలా ఒక నిద్రపోయి లేచినా ఒక్కోసారి స్త్రీల వాగ్యుద్ధం సాగుతూనే వుంటుంది. అటువంటి సందర్భాల్లో ఆ పురుష పుంగవులు ఒకటికి రెండుసార్లు ఆవులించి వూరుకునేవారు. ఆ ప్రదేశం మురికి, బురద, ఉల్లిపాయల పొక్కులు, కోళ్ళ ఎముకలు, కుక్కల్ని, పందుల్ని కాలుస్తున్న కంపు, జగడాలు, వినరాని బూతులు, శాపనార్థాలు వగైరాలతో నిండి వుంటుంది. ఇటువంటి మురికివాడలో కూడా చంద్రశేఖరం మనసుకి ఆహ్లాదం కలిగించే నలుగురు అమ్మాయిలున్నారు. వాళ్ళలో ఒకమ్మాయి పేరు పుష్ప అని తెలుసుకోగలిగాడు.

కీస్ హైస్కూలు దాటేడు. దగ్గర దగ్గరగా ఆ చుట్టుపక్కలంతా ఎన్నో స్కూళ్ళు. సికింద్రాబాదులోని గర్ల్స్ హైస్కూళ్ళలో కెల్లా ఈ కీస్ హైస్కూలే పెద్దది, పేరున్నది కూడా. ఏటేటా టిక్కెట్లమ్మి డ్రామాలు వేసేవారు ఈ స్కూల్లో. ఒక్క నాటకం మాత్రమేకాదు. ఒక తమిళ నాటకం, ఒక తెలుగునాటకం, రెండు గ్రూపు డాన్సులు, రెండు పాటలు, హెడ్ మిస్ట్రెస్‌గారి ఉపన్యాసం, ముఖ్యఅతిథిగా విచ్చేసిన వారి సుదీర్ఘోపన్యాసం వగైరాలన్నీ వుంటాయి. ప్రతి సంవత్సరం ఈ ప్రోగ్రాముకి హాజరయ్యేవాడు చంద్రశేఖరం. అతని అక్కచెల్లెళ్ళలో ఎవరో ఒకరు ఆ బళ్ళో చదువుతూ వుండేవారు. ఆ ఆడపిల్లల స్కూల్‌కి వెళ్ళినప్పుడు అంతకుముందెన్నడూ కలగని ఏదో ఒక అనుభూతి ఇటీవల అతనికి కలుగుతూ వుంది. ఏదో భయం, బిడియం, జంకు, సిగ్గు, ఏదో మధురభావన, అవ్యక్తమైన ఊహాగానం, దొంగచూపులు, ఏదో ఆరాటం, అతణ్ని ఉక్కిరిబిక్కిరి చేసేవి. ఆ బోర్డింగ్ స్కూలు అబ్బాయిల్లా తయారయ్యాడు ఒక రకంగా.

ముందెన్నడూ కలగని కోరికలేవో అతనిలో మొలకలు వేయసాగాయి. ఆ ప్రాయంలో ఆడపిల్లల పట్ల అబ్బాయిలకి కలిగే కోరికలే అవి. ఆ కోరికలకో ఆకారం వుండదు. అర్థం వుండదు. స్త్రీల విషయంలో అవ్యక్తంగా కలిగే ఈ కోరికలు ఒక ప్రత్యేకమైన స్త్రీకి సంబంధించినవి కావు. కంటికి అమ్మాయిలందరూ అందంగా, ఆకర్షణీయంగానే కనబడేవారు. అలా అతణ్ణి కలవరపరచిన

అమ్మాయిలెందరో వున్నారు. పక్కింటి ప్యారీబేగం మొదలుకుని కుసేని మురికివాడలో నివసించే పుష్పా వరకు ఎందరో అమ్మాయిలు. వీళ్ళంతా పేరు తెలిసిన పాపలు. పేర్లు తెలీని అమ్మాయిలెందరో వున్నారు. నాజీర్ అలీఖాన్ గాడి చెల్లెలి పేరైనా తెలీదు తనకి. ఆ అమ్మాయి కూడా అందంగా వుంటుంది. అసలీరోజు క్రికెట్ ఆడటానికి వెళ్ళటం కూడా ఆమెని చూడటానికేనా?

బూట్సు లేని కాలితో నేలని బలంగా తన్నేడు చంద్రశేఖరం. సైకిల్ ని తోసుకువెళుతూ ఇలా కాలు విదుల్చుకోవడం మంచిదికాదు. ఒకసారి బొటనవేలు చిట్లి రక్తం కూడా కారింది. నెత్తురుని చూస్తే ఏదో తృప్తి. ఇదో చిత్రమైన మనస్తత్వం ఇటీవల తనలో కలుగుతున్నది. హింసలో ఏదో ఆనందం కాబోలు మనిషికి. ఈ రోజు గేదెని బాదినప్పుడు కూడా ఈ అనుభూతి కలిగింది అతనికి. కాని అలా బాదుతున్నప్పుడు అది గ్రహింపుకి రాదు. ఆ తరువాతే తెలుస్తుంది. ఆ బాధ తనకి అనుభవమైనప్పుడు ఆ అనుభూతి తెలియవస్తుంది. 'బాధే సౌఖ్యమనే భావన' అంటే ఇదేనేమో. నరసింహారావు వలె మంచి చెడ్డల విచక్షణాజ్ఞానం తనకింకా రాలేదు. ఇది తెలీకుండా ప్రవర్తిస్తున్నప్పుడు నరసింహారావులాంటి వ్యక్తులు ఎదురైతే మనసు ఆరాటానికి లోనవుతుంది. ఇలా ప్రవర్తించి వుండకూడదు అనే అవగాహన కలుగుతుంది. అది కూడా వెంటనే కాదు. "వెళ్ళు-వెళ్ళు. అనవసరంగా ఇక్కడికి గొడవలు తెచ్చి పెట్టకు" అని ఒకరి చేత అనిపించుకున్న తరువాత గాని ఈ అవగాహన రాదు.

అయితే ఆమెని నిందించడం కూడా న్యాయంకాదు. ఊళ్ళో పరిస్థితి అలా వుంది. ఎంతో ప్రశాంతంగా వుండే మోండా ప్రాంతంలో కూడా ఏ క్షణాన ఏం జరుగుతుందోనని ప్రజలు భయపడే పరిస్థితి వచ్చి పడింది. దేశంలో పలు ప్రాంతాల్లో భయంకరమైన అల్లర్లు జరిగాయి. ఇంకా జరుగుతూనే వున్నాయి. ఒకప్పుడు ఆ ప్రాంతాలన్నీ కూడా మోండావలె సురక్షితమైన ప్రాంతాలే అయి వుంటాయి. ఎన్నో ఏళ్ళు అక్కడి ప్రజలు ప్రశాంతంగానే జీవించి వుంటారు. అయితే ఆ ప్రశాంత వాతావరణం ఒక్కసారిగా పటాపంచలయింది. సైతాన్ ఆవహించినట్లుగా ఊహించనలవి కాని ఘోరకృత్యాలు, దారుణ హింసాకాండలు ఆ ప్రాంతాల్లో విలయతాండవం చేశాయి. ఇంకా చేస్తున్నాయి. పుష్పా కనిపించదా అనే ఆశతో ఈ ఇరుకుసందు గుండా చీకట్లో సైకిల్ ని నెట్టుకుంటూ నడుస్తున్నాడు. పేరు కూడా తెలియని నవాబుల వంశానికి చెందిన అమ్మాయి గురించి ఊహించుకుంటూ వాళ్ళ అన్న నిర్వహించే క్రికెట్ ప్రాక్టీసుకి హాజరవుతున్నాడు.

లేదు...లేదు...లేదు...లేదు... అనుకుంటూ కసిగా కాలితో నేలని తన్నేడు

చంద్రశేఖరం. హేండిల్ బార్ మీద పిడికిలితో గుద్దేడు. కాలికి తప్పకుండా దెబ్బ తగిలి వుంటుంది. గాయమైతే అది మానేదాకా క్రికెట్ బూట్సు వేసుకోవడానికి వీలుకాదు. బూట్సు లేకుండా నాజీర్ అలీఖాన్ పిలిచినా క్రికెట్ ప్రాక్టీసుకి వెళ్ళడానికి సాధ్యంకాదు. నాలుగు రోజులపాటు విశ్రాంతి. మనసుని కలవరపరిచే అర్థంపర్థంలేని ఊహల్నించి కోరికల్నించి విశ్రాంతి.

లాన్సర్ బారక్సు కాంపౌండులో కూడా సైకిల్ని నడిపించుకునే వెళుతున్నాడు చంద్రశేఖరం. ఆ ప్రదేశంలో అవసరం లేకపోయినా, రెండుమైళ్ళు సైకిల్ని నడిపించుకుని వచ్చి, ఇప్పుడు కొన్ని గజాల దూరం కోసరం సైకిలెక్కి వెళ్ళడం ఎందుకనుకున్నాడు. లాన్సర్ బారక్సులోని అందరిళ్ళలోను దీపాలు వెలుగుతున్నాయి. పన్నెండు... పదకొండు... పది... తొమ్మిది. లాగు మాత్రమే తొడుక్కుని ఇంటి ముందు గేట్లో నిలబడి వున్నాడు జనార్ధన్. ఎనిమిది...ఏడు...మన్నాస్ ఇల్లు. మారిస్-బెటిన్స్-జూలి-లారా-ఎక్కడో చూస్తూ ఓ మూలగా కూలబడి వుంటుంది జూలీ. పాత గ్రామఫోను రికార్డు మీద ఏదో అరిగిపోయిన పాత ఇంగ్లీషు పాట వింటూ తన్మయత్వంలో తేలిపోతూ నేలమీద అలవోకగా పడుకుని వుంటుంది లారా. మిసెస్ మన్నాస్ నిద్రపోతూ వుంటుంది. రమ్ము సేవిస్తూ వుంటాడు మిస్టర్ మన్నాస్. మూడు...రెండు...ఖాసిం ఇల్లు. రేడియోలోంచి ఏదో తురకపాట వినబడుతోంది. హైదరాబాదు కేంద్రం నించే అయి వుంటుంది. ఇంకో అరగంటలో శ్రోతలు కోరిన ప్రోగ్రాం ప్రారంభమవుతుంది. మన ఇంట్లో వినడానికి కుదరదు. ఎంత గర గర శబ్దంతో వచ్చినా మద్రాసు, తిరుచినాపల్లి స్టేషన్లు తప్ప మరేదీ వినరు ఇంట్లో.

ఇంకా నాన్న ఇంటికి వచ్చినట్టులేదు. వరండాలోనే ఎదురైంది అమ్మ. "ఏరా ఇంతాలశ్యం?" అడిగింది.

"లేటైంది" అన్నాడు చంద్రశేఖరం. ఏం సమాధానం అది? "ఎందుకురా ఆలశ్యం అని అడుగుతుంటే ఏమిటా సమాధానం?"

బదులు చెప్పకుండా సైకిల్ని గోడకానించి లోపలికి వెళ్ళాడు. మెట్లుదిగి పెరట్లోకి నడిచి కొయ్యకి కట్టివున్న గేదెని సమీపించాడు. ఆ చీకట్లో కూడా చంద్రశేఖరాన్ని గుర్తుపట్టింది అది. తలని అటూ ఇటూ ఊపింది. అటూ ఇటూ కదలటంతో మెడకి చుట్టుకుపోయిన పలుపుతాడుని వదులు చేశాడు చంద్రశేఖరం. దాని మెడని రెండు చేతులతో కావలించుకుని ప్రేమగా నిమిరాడు. కృతజ్ఞతగా

పేడ మరకల తోకతో అతణ్ణి తాటించింది అది. తిరిగి ఇంట్లోకి వచ్చాడు చంద్రశేఖరం. ఈసారి దీపం వెలుతురులో స్పష్టంగా కొడుకుని చూసింది తల్లి.

"నెత్తిమీద ఆ బొప్పి ఏమిటిరా?" అడిగింది.

"క్రికెట్ ఆటలో తగిలింది లే" అన్నాడు.

## 5

నాన్నకి అర్బత్ నాట్ బ్యాంకి దివాలా తీసి డబ్బు పోయింది అనుకుంటూ వుండేవాణ్ణి. కాని అది అర్బత్ నాట్ బాంకి కాదు. కొయిలాన్ బాంకి. మా తాతగారికి మాత్రమే అర్బత్ నాట్ బ్యాంకిలో డబ్బు వుండేది. డబ్బు పోయింది అతనికే. కొయిలాన్ బ్యాంకి దివాలా తీయడానికి చాలాకాలం ముందే అర్బత్ నాట్ బ్యాంకి దివాలా తీసింది. తాతకి ఎంత డబ్బుపోయిందో ఏమో. ఎనభై రూపాయలు పోయి వుంటుంది. బ్యాంకులు దివాలాతీసి డబ్బు పోవటం అనేది మా వంశంలోనే వుంది కాబోలు.

కొయిలాన్ బాంకి దివాలా తీయడానికి కారణం సర్ సి.పి. రామస్వామి అయ్యరే అనేవారు. చాలారోజుల తర్వాత ఎవరో చెప్పగా విన్న వివరాలే ఇవి. సర్ సి.పి.రామస్వామి అయ్యర్ ఫొటోలు కొన్ని చూసి వున్నాను. అవన్నీ ప్రొఫైల్‌గా తీసిన ఫొటోలే. తలపాగా చుట్టుకుని వుండేవారు ఆయన. సరిగ్గా ఇలాంటి తలపాగాలున్న మనుషుల బొమ్మల్ని చాలా సార్లు రైల్వే స్టేషన్ పాకీ దొడ్ల మీద కూడా చూశాను. ఆ బొమ్మ కింద 'పురుషులు' అని రాసి వుండేది. మరోవేపున స్త్రీ బొమ్మ వేసి దాని కింద 'స్త్రీలు' అని రాసి వుండేది. ఆ రోజుల్లో పురుషత్వాన్ని చిత్రించడానికి సర్.సి.పి.రామస్వామి ముఖాన్నే ఎన్నుకునేవారు కాబోలు.

నాన్న ఆ రోజుల్లో సికిందరాబాదులోని తమిళుల్లాగే దుస్తులు ధరించి బైటకి వెళ్ళేవాడు. చొక్కాని లోపలికి తోసి, సైకిల్ కట్టు పంచె, దాని మీద కోటు తొడిగేవాడు. టోపీ పెట్టుకుంటే ఆఫీసుకి వెళ్తున్నాడని, లేకుంటే వేరే పనిమీద పోతున్నాడని అర్థం. నాకు బాగా ఊహ తెలిసినప్పట్నించి ఎన్నోసార్లు నాన్నతో వెళ్ళివున్నాను.

చెవులకి నూనె దిగిన ఎర్రరాళ్ళ కమ్మలతోను, నెత్తికి పిలకజుట్టుతోను మార్కెట్టుకి బయలుదేరేవాడు నాన్న. మేము లాన్సర్ బారక్సుకి మారినప్పట్నించి కాయగూరలు కావాలన్నా, కర్పూరం కొనాలన్నా రెండు మైళ్ళు నడిచి మార్కెట్టుకి వెళ్లాల్సిందే. వారులు చెడ్డీ, డబుల్ బ్రెస్ట్ కోటు తొడుక్కుని నాన్నతో కూడా

బై లుదేరేవాడిని. మూడో తరగతో, నాలుగో తరగతో చదువుతున్నప్పుడు కుట్టించిన కోటు అది. 'ఎదిగే పిల్లడివి కదా' అని ఎంతో వొదులుగా కుట్టించిన ఆ కోటుని తొమ్మిదో తరగతి కొచ్చేదాకా కూడా ఉపయోగించాను. అలా అని ఆ కోటంటే నా కిష్టమని కాదు. అది వేసుకోకుంటే నాన్న తనతో తీసికెళ్ళేవాడుకాదు నన్ను.

పది అడుగులు నడిచామో లేదో పొడవాటి చుట్టతో గుప్పుగుప్పుమనిపొగ వదులుతూ తన ఇంటి ముందు క్రోటన్సుకి నీళ్ళు పోస్తూ ప్రత్యక్షమయ్యే వాడు జాఫర్ అలీ.

"ఏం మాస్టర్ విశేషాలు." అంటూ అక్కడ నిలబడిపోయేవాడు నాన్న.

మా ఇంట్లో గేదెలొచ్చి చేరిన తర్వాత వాటికి క్రోటన్స్ మొక్కలంటే చాలా యిష్టమని మాకు తెలిసింది. ఆ క్రోటన్స్‌లు జాఫర్ అలీ వాళ్ళ ఇంటి కాంపౌండులో చాలా వున్నాయి. అంచేత అతనితో మాకు మాటా మంతీ లేకుండా పోయింది. జాఫర్ అలీతో కనీసం రోజుకు అర్థ గంటసేపైనా మాట్లాడేవాడు మా నాన్న. అంతలో పక్కింట్లోంచి మిస్టర్ మన్నాస్ తొంగి చూసేవాడు. అతణ్ణి 'వాట్ మిస్టర్' అనే పలకరింపుతో ప్రారంభించి మరో అర్థగంట బాతాఖానీ వేసుకునేవాడు నాన్న. మిగతా వేళల్లో అయితే తిన్నగా వాళ్ళింట్లో జొరబడి ఎవరినో ఒకరిని తిడుతూ ఉల్లిపాయలు తరిగే మిసెస్ మన్నాస్‌కి ఆ పనిలో సహాయపడే నేను నాన్న పక్కనుండగా మాత్రం గుమ్మంలోనే నిలబడిపోయి నాన్న, మన్నాస్‌లు ఇంగ్లీషులో మాట్లాడటం వింటూవుండే వాణ్ణి. మన్నాస్ పెద్దమ్మాయిల కళ్ళబడకుండా అసలు వాళ్ళ వునికినే గమనించనట్లుగా ప్రవర్తించేవాణ్ణి. మరి కొంచెం దూరం నడిస్తే కేశవరావు గారిల్లు, 'ఏం బాబూ!' అంటూ ఆయనగారితో ఓ అరగంట. అతణ్ణి ఒదుల్చుకుని నడిస్తే మధ్యలో మాసిలామణి తగిలి 'ఏంగురూ?' అంటే అక్కడో పావుగంట. మార్కెట్‌కి వెళ్ళేటప్పుడు మాత్రం పెద్ద వీధుల్ని తప్పించుకుని చిన్న సందుల గుండా నడిచేవాడు నాన్న. ఒక్కో సందు మలుపులోనూ ఒక్కో ఇంటికేసి చూస్తూ 'ప్లేగు' 'ముంచుకొచ్చినప్పుడు ఈ ఇంట్లో అద్దెకుండే వాళ్ళం. వరదలు వచ్చినప్పుడు యిదిగో ఈ పెంకుటింట్లో వున్నాం' అంటూ చెప్పుకొచ్చేవాడు. ఆ ఇంటి వాకిట ఏ ముసలిదైనా నిలుచుని వుంటే ఆమెతో ఓ అరగంట. ఈ ఇళ్ళన్నీ దర్శించుకోవటం కోసమనే నాన్న ఈ సందులగుండా వెళుతున్నాడనిపించేది నాకు. మొహంజొదారో నాగరికతని అక్కడి తవ్వకాల్లో బయటపడిన నీటి పారుదల కాలవలు చిత్రించినట్లుగా సికిందరాబాదు నాగరికత అంతా గల్లీలనబడే ఈ సందు గొందుల్లో నిక్షిప్తమై

వున్నట్టుగా అనిపించేది నాకు.

ఈ సందుల మొగదల్లో నడుమెత్తుకు రాతి స్తంభాలు నాటి వుంటాయ్. వాటి అర్థం ఆ దారిలో వాహనాలేవీ రావటానికి వీల్లేదని. ఆ స్తంభాలు లేకపోయినా ఆ ఇరుకు సందుల్లో బళ్ళు వెళ్ళే వీల్లేదు, సైకిళ్ళు, మరీ చిన్న బండ్లు తప్ప. ఆ సందులకి అడ్డదిడ్డంగా మురుగు కాల్వలు దర్శనమిస్తూ వుంటాయ్. ఎప్పుడైనా ఒకటి రెండు టాంగాలు కొన్ని సందుల్లో - అంటే స్తంభాలు లేని సందుల్లో కనపడుతుంటాయి.

టాంగా అనేది మా వూరి గుర్రపు బండికి పేరు. దీని ప్రత్యేకత ఏమిటంటే ఇందులో కూర్చునేవాళ్ళు ఎంచక్కా కాళ్ళు వేళ్ళాడేసుకోవచ్చు. టాంగావాలాని తప్పించి కనీసం ఆరుగురైనా వెళ్ళాలనుకున్నప్పుడు మాత్రమే టాంగాని పిలుస్తారు. వెనక ఇద్దరు, ముందు ఇద్దరు కాళ్ళు వేళ్ళాడ దీసుకుని కూర్చుంటే మధ్యలో ఇరుక్కుని ఇద్దరు కూర్చుంటారు. మా ఇంట్లో టాంగా ఎక్కితే నాకీ ఇరుకు చోటు మాత్రమే మిగులుతుంది. ఈ టాంగాని పిలవాలన్నా మా ఇంటినించి మైలు పైగా నడిచి రైలు స్టేషన్ దగ్గరికి చేరుకోవాలి. కాదంటే మరోదిక్కున సందులూ గొందులూ నడచి మనోహర్ టాకీసు నించి పిలుచుకుని రావాలి. ఈ టాంగాలని పిలుచుకు రావటానికి పెద్దవాళ్ళెవ్వరూ కదలరు. మరీ చిన్న పిల్లల్ని నమ్మి ఏ టాంగావాడూ బండి కట్టడు. అంచేత ఈ పనికూడా నా నెత్తినే పడేది. సణుగుతూనే బయలుదేరేవాడిని. దారిలో మర్రి ఊడలు పట్టుకుని 'అ... ఆ... అఆ' అని వూగుతూ కనిపించేవాడు మారిస్. చాలా ఏళ్ళ తరువాత లాన్సర్ బారక్సు వదిలివెళ్ళేటప్పుడు ఎందరో ఎన్నో కారణాలకు బాధపడితే నేను మాత్రం ఆ మర్రి నీడని వదిలిపోతున్నందుకు చాలా ఏడ్చాను లోలోపల. జాట్ బందర్ ఆటల్లో ఈ తురక పిల్లలు, ఈ యాంగ్లో ఇండియన్ పిల్లలూ నన్నెంతగానో ఏడ్పించేవారు. ఎన్ని తడవలు వాళ్ళు విసిరేసిన కొమ్మని తేవడానికి ఈ గోడలు దూకి కాళ్ళు గీరుకుపోలేదు నాకు. అయినా ఈ మర్రి చెట్టుని ఈ జ్ఞాపకాలని వదులు కోవాలంటే బాధగానే ఉన్నది. టాంగా కోసరం వెళ్ళేటప్పుడు సైతం ఒకసారి మర్రి వూడలు పట్టుకుని వూగి గోడమీదికి గెంతి కిందికి దిగిగాని వెళ్ళేవాణ్ణి కాదు. ఎంతగా నన్ను ఏడిపిస్తున్నా నాకు ఆటలమీద వుండే ఉత్సాహం చూసి మారిస్, తక్కినవాళ్ళు ముక్కుమీద వేలేసుకునేవారు. లాన్సర్ బారక్సు అంటేనే ముఖం చిట్లించుకునే వాళ్ళు టాంగావాలాలు. కొందరైతే అసలు సమాధానం కూడా చెప్పకుండా ముఖం తిప్పుకునేవారు. ఒకడు మాత్రం "ఎక్కడికెళ్ళాలి? బాడుగ ఎంతిస్తారు?" అనడిగేవాడు. నాకు తెలిసిన అవకతవక ఉర్దూలో "నీ

వెంతకి వస్తావు?" అనేవాణ్ణి. వాడెంత చెప్పినా 'సరే రా' అని పిలుచుకువెళ్ళేవాడిని. ఇల్లు చేరుకోగానే ఎక్కడో ఓ చోట గప్‌చిప్‌గా దాక్కునే వాడిని. ఎందుకంటే మా వాళ్ళు టాంగావాణ్ణి బాడుగెంత అని అడుగుతారు. వాడు ఎనిమిదణాలంటే రెండణాలకి రమ్మంటారు. వాడు 'నన్ను పిలుచుకొచ్చిన అబ్బాయి ఎక్కడ?' అంటాడు. వాళ్ళు పోనీ మరో అర్ధణా ఇస్తాం బండి కట్టమంటారు. వాడు మళ్ళీ అబ్బాయి ఏడీ అంటాడు. ఎంతో వాగ్యుద్ధం జరిగేక మూడణాలకి ఒప్పుకుంటాడు. లేకుంటే నన్నూ, ఇంటిల్లిపాదిని తిట్టుకుంటూ తిరిగి వెళతాడు. మా వాళ్ళేమో బేరమాడే పెత్తనం నీకెవడిచ్చాడోయ్ అని నామీదికొస్తారు. టాంగా పిలుచుకు రావటంలోని ఇబ్బందులు వీళ్ళకెట్టా తెలుస్తాయ్? అసలు మైలు దూరాన్నించి టాంగా పిలుచుకు రావటం ఎందుకంటే మూడు మైళ్ళ దూరాన వున్న టెంటులో అదే తమిళ సినిమా చూసి రావటానికి. సికిందరాబాదులో సుమారుగా వుండే సినిమా హాల్సులో ఏడాదికి ఒకసారో రెండుసార్లో అరవ సినిమాలు వేస్తారు. తెలుగు సినిమాలు మాత్రం నెలల తరబడి ఆడుతుంటారు. ఉర్దూ, హిందీ సినిమాలైతే ముందుగా హైదరాబాదులో విడుదలై ఆ తర్వాత సికింద్రాబాదులో రెండేసి నెలలు ఆడి పోతుంటాయి. తమిళ సినిమాలైతే వారం రోజులు. రెండు వారాలు ఆడిన సినిమాలు నాకు తెలిసినంతవరకు రెండే రెండు. ఒకటి మంగమ్మ శపథం. రెండోది శ్రీవళ్ళి. మంగమ్మలో వసుంధర, శ్రీవళ్ళిలో రుక్మిణి. బాగా వయసు మళ్ళిన వాళ్ళు కూడా ఈ ఇద్దరిని గురించి లేనిపోనివి చెప్పుకుని ఆనందించేవాళ్ళు ఆరోజుల్లో. టెంటులో అయితే ఎప్పుడూ అరవ సినిమాలే వేసేవాళ్ళు. ఏదో సంపాదిద్దామనే ఆశతో సికిందరాబాదులో టెంటు కట్టి ఏడాదికి అరవై డెభ్భై అరవ సినిమాలు ఆడేవాళ్ళు. రెండు టిక్కెట్లమ్మితే ఇరవై మందిని ఉచితంగా లోపలికి వెళ్ళనివ్వడం జరిగేది పాపం హాలువాడికి. సర్కారు వుద్యోగులు ఈ ఫ్రీ పాసులకి కారణంగా వుండేవాళ్ళు. డబ్బులివ్వకుండా సినిమా చూట్టం కాకుండా పైగా తాము, తమ కుటుంబం రాకుండా సినిమా మొదలెట్ట కూడదనే జబర్దస్తీ ఒకటి. మొదటి ఆట మొదలయ్యే సరికి ఏడు దాటేది. ఇరవై రీళ్ళ సినిమాని పద్దెనిమిది రీళ్ళతో సరిపెట్టి ఆట పూర్తయిందనిపించేవారు. మొదటి ఆటగాని రెండో ఆటగాని వెళ్ళేటప్పుడు టాంగాలో వెళ్ళినా తిరిగి రాక మాత్రం నడకే. ఊరంతా నిద్రపోతున్న ఆ నిశిరాత్రి వేళల్లో సికిందరాబాదు వీధులు గుండా నిశాచరుల్లా నడుస్తూ ఊరకుక్కల మొరుగుల్ని తప్పించుకుంటూ చుట్టు పక్కల నిద్రించే వాళ్ళకి నిద్రాభంగం కలుగజేస్తూ మూడు మైళ్ళు నడిచి ఇల్లు చేరుకునేవారం. మధ్య మధ్యలో ఫిలిం తెగి సినిమాకి అంతరాయం కలగడం చాలా సాధారణం ఆ

టెంటులో. ఒకసారి ఫిలిం తెగిపోయి, బొమ్మ తల్లకిందులై కాలిపోవడం కూడా జరిగింది. అంతా పాలోమంటూ హాలు బయటికి పరిగెత్తాము. అరగంట తర్వాత మళ్ళీ సినిమా ప్రారంభమైంది. కాలిపోగా మిగిలిన సినిమాని చూసేము. అది మాడరన్ థియేటర్స్ వారి సుభద్ర సినిమా అని జ్ఞాపకం. ఆ రోజుల్లోనే పది లక్షలు ఖర్చు పెట్టి తీసిన భారీ చిత్రంగా ప్రకటించేరు ఆ సినిమాని. యుద్ధం జరిగే రోజుల్లో సినిమాల నిడివి బాగా తగ్గించింది ప్రభుత్వం. ఆ నిడివి తగ్గించిన సినిమా కూడా కాలిపోయిన భాగం పోగా చాలా తక్కువ భాగం మాత్రమే చూడగలిగేము.

ఇప్పుడు తలుచుకుంటే ఆశ్చర్యంగా ఉంది. ఎవరి తోడూ లేకుండా పది పదకొండు గంటలప్పుడు ఆ మైదానాలు, చీకటి సందులు దాటి, ఏ ఆపదకి లోనుగాకుండా ఎలా ఇంటికి చేరగలిగే వాళ్ళమా అని. పెద్ద మొనగత్తెలా మా అక్క మా అందరికంటె ముందు నడిచేది వేగంగా. దానికి వెనగ్గా ఫర్లాంగు దూరాన నేను, మా నాన్న. మాకు వెనక ఫర్లాంగు ఎడంగా తక్కిన అక్క చెల్లెళ్ళు మా తమ్ముడు. వాళ్ళకి ఇంకా వెనక మెల్లిగా నడుస్తూ ఒంటరిగా మా అమ్మ. తిన్నగా వుండే రోడ్డయితే అందరం అందరికీ కనిపించే వీలైనా వుండేది. అయితే సికిందరాబాదులోని ఏ రోడ్డు చూసినా యాభై గజాలు దాటి తిన్నగా వుండదు. ఒకసారి ఒక బ్రిటిష్ ప్రతినిధి ఉత్తర్వు చేయగా కింగ్సు వే అనే ఓ పొడవాటి రహదారి వేయాలనే ప్రయత్నం జరిగింది. తీరా ఆ రహదారి పూర్తయ్యేసరికి రెండు మైళ్ళలోపల పన్నెండు మలుపులు. రోడ్డు తిన్నగా వేసి వుంటే కొందరి ఇళ్ళ ముందరి భాగం కొట్టి వెయ్యటం జరిగి వుండేది. అల్లా నష్టపోవాల్సిన గృహ యజమానులు బ్రిటిష్ వాళ్ళని మించిపోయారు. ఒక మలుపుకి పదివేల రూపాయల చొప్పున బ్రిటిష్ ఇంజనీర్లకి సమర్పించుకున్నారు ఆ రోజుల్లోనే. ఇలాంటి మలుపులు, ఇరుకు సందులు దాటుతున్నప్పుడు వెనక వచ్చేవాళ్ళు కనిపించే అవకాశం గాని, ముందు నడిచేవాళ్ళు కనిపించే అవకాశం గాని వుండదు. ఎలాగైతేనేం పదకొండు గంటల నిశిరాత్రి ఈ సందుల్లోంచి నడిచి ఇంటికి చేరేవారం. ఒక్కో మలుపు తిరుగుతున్నప్పుడు 'నాన్నా ఈ సందు చాలా పొడుగు నాన్నా' అనే వాడిని. 'సరే. దీన్ని కొంచెం చిన్నది చెయ్యమందాంలే' అనేవాడు మా నాన్న. ఇంకో మలుపులో 'ఇది చాలా దూరం నాన్నా' అంటే దీన్ని కూడా తగ్గించమని చెపుదాంలే' అనేవాడు. ఒక్కో సందునీ కొంచెం కొంచెం సరికి పారెయ్యాలని తీర్మానించుకుంటూ ముందుకి సాగిపోయేవారం. వీధుల గురించిన చర్చ అయిపోయేక వెనకబడిపోయి మాతోబాటు నడవలేని అమ్మని, అక్క చెల్లెళ్ళనీ 'వీళ్ళకి బుద్ధేమైనా వుందా? చీకట్లో తగుదుమమ్మా అని సినిమాకి బైలుదేరింది

చాలక మొనగత్తెల్లా ఎలా పెళ్ళి నడకలు నడుస్తున్నారో చూడు' అంటూ శాపనార్థాలు ప్రారంభించేవాడునాన్న. ఆ మాటలకి సమాధానం అవసరం లేదని తెలుసు గనుక నేను మౌనంగా వుండిపోయేవాణ్ణి. చాలా రోజుల తర్వాత రజాకార్ల అల్లర్లతో ఊరు నిండిపోయిన కాలంలో కూడా సికిందరాబాదు సందుల్లో మా ఈ ఊరేగింపు మాత్రం నిరాఘాటంగానే సాగేది. ఒకసారి దారిలో కొందరు దుండగీళ్ళు నన్ను అడ్డగించి నాలుగు తన్నేరు. అంతకుముందు రోజు కూడా మా ఈ నిశిరాత్రి యాత్ర నిరాఘాటంగానే సాగింది. అయితే అప్పుడు మేం వెళ్ళింది అరవ సినిమాకి కాదు. 'గొల్లభామ' అనే తెలుగు సినిమాకి. ఈ చిత్రంలోనే మొదటిసారిగా అంజలీదేవి నటించి నాట్యమాడి తెలుగు దేశాన్ని ఆ తరువాత తమిళ దేశాన్ని ఒక ఊపు వూపేసింది.

పారమౌంట్ టాకీసులో ఆరునెలలకి పైగా ఆడింది 'గొల్లభామ'. 'పారమౌంటు' టెంటు కాదు. పక్కా సినిమా హాలు. మేము టిక్కెట్టు కొని సినిమా చూసిన సందర్భాలు చాలు తక్కువనే చెప్పాలి. ఎవరు తెలిసినా తెలీకపోయినా వరండాలో మేమంతా అర్ధ గంటసేపు ఓ మూలగా నిలబడి వుండేవాళ్ళం. మా నాన్న మేనేజర్ గదిలోకి వెళ్ళి అరగంట సేపు మాట్లాడేవాడు. చివరికి మేనేజర్ దిగివచ్చి మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి పై తరగతిలో కూర్చోబెట్టేవాడు. చాలా సందర్భాల్లో అక్కడ కుర్చీలవీ నిండిపోయి వుండేవి. అప్పుడు మా కోసరం ప్రత్యేకంగా వేరే కుర్చీలు తెప్పించి వేసేవాడు. మేము ఏ సినిమానీ ప్రారంభం నుంచి చూసిన పాపాన పోలేదు.

ఈ పాస్ సౌకర్యం మాకు లభించడానికి కారణం నాన్నగారు చేసే రైల్వే ఉద్యోగమే. రైల్లో కూడా మాకంతా ఫ్రీ పాస్‌లే. ఎప్పుడైనా టిక్కెట్టు కొన్నా రైలు ఛార్జీలో మూడో వంతు మాత్రమే. దాన్ని పి.టి.ఓ. అంటారు. ఈ ఫ్రీ పాసుల్ని సద్వినియోగం చేయడం కోసరమని ఏడాదికోసారి వెయ్యి మైళ్ళ యాత్ర చేసి వచ్చేవాళ్ళం. పాసులో ఏ వూరునుంచి ఏ వూరిదాకా అని రాయటంతోబాటు ఏయే మార్గాలగుండా వెళ్ళాలి అని రాయడానికి ఓ అంగుళం మేర స్థలం ఖాళీగా ఉంచేవారు. అయితే మా యాత్రకి సంబంధించినంతవరకు ఆ స్థలం సరిపోయేదికాదు. పాసు కాయితం పై భాగంలోను, కింది భాగంలోను పక్క బార్డరులోను ఎక్కడ ఖాళీ వుంటే అక్కడంతా మేము దిగాల్సిన ఊళ్ల పేర్లు ఆ రూటు సూచించేవాళ్ళం. రెణ్ణెల్ల వ్యవధిలో ఇరవై వూళ్ళు తిరిగి, ఒళ్ళు హూనమై బ్రతుకు జీవుడా అనుకుంటూ ఇంటికి చేరుకునేవారం. నాకు బాగా చిన్నప్పుడోసారి దొంగలు మా ఇంటి తాళాలు బద్దలుకొట్టి దొరికిన సామాన్లని పట్టుకుపోవడం

మాత్రం బాగా గుర్తు వుంది. మేం ఊరికి బయలుదేరాలంటే మా గేదె మాకో పెద్ద సమస్యగా తయారయ్యేది. నెలరోజులు ముందునుంచే ఈ గేదెని ఎవరింట్లో అప్పగించి వెళ్ళాలా అన్న ప్రశ్న ఉదయించేది. పాల వ్యాపారం చేసుకునే ఆళ్ళ దగ్గర విడిచిపెడదామంటే దానికి తిండి పెట్టకుండా మాడ్చి చంపుతారేమో అన్న భయం. ఓసారి మా ఇంటి ఆవుకి ఈ గతి పట్టింది కూడాను. మాలా ఆవున్న ఇంట్లో వదిలివెళ్ళదామంటే వాళ్ళకి రెండు పశువులని గమనించు కోవడం, చాకిరీ ఎక్కువవుతుందని ఒప్పుకునేవారు కాదు. అంచేత ఊరికి దూరంగా ఏదైనా ఒక చిన్న గ్రామంలో డబ్బిచ్చి గేదెని వదిలి రావాల్సి వచ్చేది. ఈ ఏర్పాటు కోసం మేము మాట్లాడిన మనిషి మేం ఊరికి బయలుదేరే సమయానికి వచ్చేవాడు. కొంచెం ముందుగా రాకూడదా అంటే ఏకంగా వారం రోజులకి ముందే వూడిపడి గేదెని తోలుకెళ్ళిపోయేవాడు.

ఒకసారి ఏం జరిగిందంటే ఆఖరి క్షణందాకా వాడికోసరం ఎదురు చూసి రైలుని వదులుకోవడం జరిగింది కూడా. అంచేత చాలా సార్లు నేను నాన్న-ఇద్దరం కలిసి మా గేదెని తోలుకెళ్ళి ఎన్నో మైళ్ళు దూరం నడిచి కట్ కేచర్ అవే కుగ్రామంలో వదిలి వచ్చేవాళ్ళం. నాన్న చేతిలో వాకింగ్ స్టిక్ వుండేది. నేను ఒక చేత చిన్న కర్ర, మరోచేత్తో గొడుగు పట్టుకుని నడిచేవాడిని. మేం వెళ్ళే దారి పొడువునా ఏం బాబూ? ఏందొరా? దండాలు బాబయ్యా ఏం బావా? ఇలాంటి సంబోధనలకు తక్కువ లేదు. మా గేదె ఆ మైదానంలో నడుస్తూ స్వైర విహారం చేసేది. పది గుడిసెలకి పైబడని ఆ కుగ్రామం చేరుకుని వాణ్ణి వెతికి పట్టుకుని మా గేదెని వాడికి అప్పగించే సరికి తాతలు దిగివచ్చేవారు. అర్ధరోజు గడిచిపోయేది. తిరిగొచ్చేటప్పుడు మాత్రం రైల్లో వచ్చేవాళ్ళం.

రైల్వే పాసులకి సినిమాహాలు వాళ్ళు ఇచ్చే మర్యాదని నిజాం కస్టమ్స్ అధికారులు ఏమాత్రం లక్ష్యపెట్టేవారు కాదు. సికింద్రాబాదు రైల్వేస్టేషన్ లోంచి బయటికి వస్తూనే ఒక పాత భవంతి కనబడుతుంది. ఆ భవనంలోనే కస్టమ్స్ చాకింగ్ ఆఫీసు. మేము ఆరుమందిమి. మాతో బాటు ఆరేడు సూట్‌కేసులతో నిండిన టాంగా నేరుగా ఆ ఆఫీసు ముందుకొచ్చి నిలిచేది. నెలల తరబడి వూళ్ళు తిరిగి అలసిపోయి వున్న మాకు ఆ సుంక అధికారి ముందు పది హేను నిమిషాలు నిలబడాలంటే కళ్ళు బైర్లు కమ్మినట్టుండేది. అసహనంతో అల్లల్లాడిపోయినంత పని చేసేవారం. ఇంకా ఫ్యూడల్ పద్ధతుల్ని పట్టుకొని వేల్లాడే నిజాం పరిపాలనలో సైతం ఆరోజుల్లో కస్టమ్స్ ఆఫీసర్‌గా ఒక స్త్రీని నియమించడం చిత్రంగా అనిపించింది నాకు. ఎన్ని తడవలు మేం యాత్రలకి వెళ్ళి వచ్చినా ప్రతిసారీ మా

పెట్టెల్ని బట్టల్ని ఓపిగ్గా తెరచి పరిశీలించేది ఆమె. ఆమె ఏరిఏరి తీసిన పళ్ళు ఫలహారాలు, మిఠాయి ప్యాకెట్లు నిజాం సంస్థానంలో కొన్నవేనని బుకాయించే వాళ్ళం మేము. జనాబ్ జిన్నా సోదరి ఫాతిమా పోలికలుండే ఆ ఆఫీసరమ్మ మాకేసి అపనమ్మకంతో చూసేది. ఆఖరికి ఏదో గొణుక్కుంటూ మేం అతి ప్రియంగా తెచ్చుకున్న అరటిపళ్ళ గెలని, ఓ బుట్ట బంగినిపల్లి మామిడిపళ్ళనీ ప్రక్కకి తీసి పెట్టి ఇక మీరు వెళ్ళొచ్చు అన్నట్టుగా చూసేది. ఆ ఆఫీసులో ఎవరూ సుంకం చెల్లించగా మేం చూసిన పాపాన పోలేదు. ఆ ఆఫీసరమ్మకూడా స్థిరంగా ఆ ఆఫీసులోనే సర్వీసునంతా గడిపేసింది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి, ఏడాదిపాటు నైజాముతో తగాదా పడి భారత సైన్యం హైదరాబాదులో చొరబడిన చాలా కాలం తర్వాత వరకూ అదే స్థానంలో వుండటం నాకు బాగా గుర్తుంది. ఎంతో ఆశపడి తెచ్చుకున్న పళ్ళని ఫలహారాలని ప్రయాణీకులకి దక్కకుండా తన విధిని సక్రమంగా నిర్వహిస్తూనే వుంది.

ఎంతో అభిమానంతో సంచరించే నాన్నగారు, గువ్వలా ముడుచుకు పోయి దీనంగా కనిపించే ప్రదేశాలేవేనా వున్నాయంటే అవి ఈ కస్టమ్స్ ఆఫీసు, ఇలాంటి మరికొన్ని నిజాం ప్రభుత్వ కార్యాలయాలు మాత్రమేనని చెప్పవచ్చు. ఈ ఆఫీసుల్లో ఉర్దూ తప్ప మరే భాషా పని చెయ్యదు. ఏ వుద్యోగీ ఫలానా టైముకి ఆఫీసులో వుంటాడని చెప్పటానికి వీల్లేదు. మాది మొగలాయి దర్బార్ అని వాళ్ళు తమని గురించి తామే గొప్పలు చెప్పుకునే వాళ్ళు. అర్థం ఏదైనా అనుకున్న సమయానికి అనుకున్న పనులు అక్కడ జరగవన్న సంగతి మాత్రం అందరికీ తెలుసు. నిజాం ప్రభుత్వ కార్యాలయాల్లో నూటికి ఎనభై మంది ముస్లింలుండే వారు. తక్కిన వాళ్ళు ముల్కీలు, హైదరాబాద్ సంస్థాన వాసులనే ముల్కీలని వ్యవహరించేవారు. రైల్వే ఆఫీసుల్లో మాత్రం ముస్లింల సంఖ్య చాలా తక్కువే. ఆఫీసు పనులు ఇంగ్లీషు భాషలో జరిగేవి. రైల్వేలో పని చేసేవాళ్ళంతా దేశం నలుమూలలనుంచీ బతుకు తెరువు వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చి చేరిన బాపతే. ఆ రోజుల్లో నిజాం రైల్వే తమిళులకి, తక్కిన దక్షిణాది భాషల వారికి కల్పించి నన్ని వుద్యోగాలు మరే సంస్థా కల్పించి వుండదు. ఈ రైల్వే వుద్యోగులకి నిజాం ప్రభుత్వం ఆఫీసుల్లో పనిచేసే వాళ్ళంటే ఒక రకమైన తేలిక భావం వుండేది. అయితే నిజాం వుద్యోగులకి వాళ్ళ పరపతి వాళ్ళకుండేది. ఈ ఆఫీసుల్లో ఏ పని కావాలన్నా ఉర్దూ తెలిసిన వాళ్ళచేత అర్జీలు, దరఖాస్తులు రాయించుకోవాలి. ఆఖరికి అంకెలు కూడా ఉర్దూలోనే వుండాలి. నిజాం కోర్టు ఫీజు స్టాంపులు కొని ధరఖాస్తుల మీద అతికించి పదకొండు నించి రెండు

గంటలదాకా ఆ ఆఫీసుల ముందు పడిగాపులుపడి వారు చెప్పింది వీరికి అర్థంగాక వీళ్ళ దక్షిణాది మాటలు వాళ్ళ తలకెక్కక డీలా పడిపోయి మొఖాలు వేళ్ళాడేసుకొని తిరిగి రావటం జరిగేది. రైల్వే వుద్యోగి అంటేనే చాలు. అతగాడెవడో పరాయి దేశంనుంచి వచ్చి తమ సొమ్మంతా కొల్లగొట్టుకు పోయే వాడు అన్నట్టుగా చూసేవాళ్ళు. మా నాన్న గారికి నిజాం ఆఫీసులో మరపురాని చేదు అనుభవాలు ఎన్నో ఎదురై వుండాలి. పెద్దపులి ఎదురై గాండ్రించినా సరే నేనొక రైల్వే వుద్యోగిని అనే వాడు నాన్న టకీమని. ఇటువంటి మనిషిని మొగలాయి దర్బార్ మనుషు లెలా సహించగలరు?

## 6

డ్రీమ్‌లాండ్ సినిమా థియేటర్ ముందు ఒకటే జనం. టిక్కెట్లివ్వడం ప్రారంభమయ్యేదాకా బుద్ధిగా లైనులో నిలబడ్డ జనం కౌంటర్ తలుపులు తెరుచుకోగానే చెల్లాచెదురై ఒకర్నొకరు నెట్టుకోవటం ప్రారంభించారు. మారిస్ వుండి వుంటే అందరినీ నెట్టేసి కౌంటర్ దగ్గరికి చేరుకుని ఎవరి భుజాల మీదుగానో నడుచుకుంటూ వెళ్ళి టిక్కెట్లు సంపాదించేవాడు. టిక్కెట్టు తీసుకోకుండానే హాలులోపలికి నడిచాడు చంద్రశేఖరం. అదృష్టం బావుంది ఎవరూ అడ్డగించలేదు. అతని కోసమే అన్నట్లుగా సినిమా మొదలైంది. ఆ సినిమా పేరు 'బేతింగ్ బ్యూటీ' అయిదడుగుల తొమ్మిదంగుళాల ఎత్తుండే ఈ స్తర్ విలియమ్స్ తన నగ్న సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ జలకాలాడి గట్టుమీది కొచ్చి వొయ్యారంగా దుస్తులు ధరించి చిరునవ్వుతో కవ్విస్తూ తెరమీంచి దిగి నేరుగా చంద్రశేఖరం దగ్గరికొచ్చి ఎదురుగా నుంచుంది. ఆమె పై వరుసలో రెండు పళ్ళు కొంచెం ఎత్తుగా వుండటం గమనించాడు చంద్రశేఖరం. ఆమె అతణ్ణి ఏదో అడుగుతున్నట్టుంది ప్రేమగా. "నీ భాష నాకర్థం కావటంలేదు" అన్నాడు. "నీకు నేను నచ్చానా?" అడిగింది ఆమె ఈసారి స్పష్టంగా.

వెంటనే ఇంగ్లీషులో ఏమని సమాధానమివ్వాలో స్ఫురించలేదు చంద్రశేఖరానికి. ఆమె చిన్నగా నవ్వింది. అతని చేతిని అందిపుచ్చుకుని వెండి తెరమీదికి నడిపించుకు వెళ్ళింది. స్విమ్మింగ్‌పూల్‌లోకి తోసింది. చలితోను భయంతోను అతనికి శరీరమంతా వొణకసాగింది. ఉలిక్కిపడి కళ్లు తెరచి పడకమీద లేచి కూర్చున్నాడు చంద్రశేఖరం. అయినా ఒణుకు తగ్గలేదు. సిగ్గుతోపాటు భయంకూడా వేసింది. ఇటీవల కొంతకాలంగా ఇటువంటి కలలొస్తున్నాయి తనకి. ఈ పాడు కలలు రాకుండా నివారించడం ఎలాగో

తెలీటంలేదు. ఎవరితో వెళ్ళి చెప్పుకుంటాడు.

చంద్రశేఖరం లేచి నిలుచున్నాడు. ఆ చీకట్లో ఇంట్లోపలి భాగమంతా మసకమసగ్గా కనిపిస్తుంది. వాకిలి తలుపు దగ్గరికి నడిచాడు. ఇంటి ఎత్తుకు తగ్గట్టు తలుపులు కూడా బాగా ఎత్తుగా ఉన్నాయి. పై గడియే రెండడుగుల పొడవుంది. దాన్ని కిందికి లాగి తలుపులు తెరవాలంటే ఎంతో బలం కావాలి. ఏమైనాసరే ఆ క్షణంలో తలుపులు తెరుచుకుని బయటికి వెళ్ళాలనిపించింది. చంద్రశేఖరానికి.

చెల్లాచెదరుగా వున్న మబ్బుల మధ్యలోంచి జారిపడే వెన్నెల నేలమీద వస్తువుల ఆకారాన్ని మాత్రమే కనిపించేటట్టు చేస్తున్నది. ఆ మసకవెన్నెల పలచని మంచునికూడా రంగరించుకొని వుంది. లాన్సర్ బారక్సు పరిసర ప్రాంతాలు గాఢ నిద్రలో మునిగి వున్నాయి. దూరాన ఎక్కడ్నుంచో ఒక సలు సిసలైన తురకపాట వినిపిస్తోంది. ఏదో ముస్లిం హోటల్లోనుంచి కాబోలు. జోరా బేగమో అమీర్‌బాయ్ కర్నాటకి యో గొంతు చించుకుని అరుస్తోంది.

చంద్రశేఖరానికి శరీరంలోని ఒక్కో భాగమూ నొప్పిపెడుతున్నట్టుగా వుంది. తొడమీద మూడుసార్లు విసురుగా క్రికెట్ బంతి వచ్చి తగిలింది. అప్పటికీ మోకాళ్ళకి పట్టీలు కట్టుకున్నాడు కూడా. అయినా కాళ్ళమీద కొంతభాగం బయటికి కనిపిస్తూనే వుంటుంది. ఆ చోట్లంతా దెబ్బలే. ఇది చాలక ఆ రజాకార్లు కొట్టిన దెబ్బలు వేరే. అసలు వాళ్ళు రజాకార్లే అని నమ్మకమేమిటి? ఆదెబ్బలు కూడా ఆ తోలు పట్టామీదనే పడ్డాయి. ఆ దెబ్బల బారినుంచి అంత సులభంగా తప్పించుకుని ఎలా బయటపడ్డానా అని ఆశ్చర్యంగా వుంది ఇప్పుడు ఆలోచిస్తుంటే. పెద్దగాయాలేం తగలకపోయినా లోపలే నెప్పెడుతున్నది. నడిచి నడిచి కాళ్ళు కూడా పీకుతున్నాయి. మూడు నాలుగు గంటల్లో ఎదురు గాలికి వేగంగా పదిహేను మైళ్ళు సైకిల్ తొక్కుకుంటూ వచ్చేడు. పైగా చివరి మూడు మైళ్ళ సైకిల్ దిగి నడిపించుకుంటూ వచ్చేడు. సైకిల్ దీపం లేని కారణంగా, పన్నెండు రూపాయలిచ్చి చెట్టు కింద చెప్పులు కుట్టేవాడి చేత చేయించుకున్న ఈ క్రికెట్ బూట్లు ఆడేందుకు తప్ప మరిదేనికీ పనికి రావు. పంది బరువున్న ఆ బూటుని తొడుక్కొని అరమైలు నడిచినా చాలు కాళ్ళు పీక్కుపోతాయి. ఈ రోజు చాలా దూరం నడిచాడు. అందుకే ఈ నొప్పులు. ప్రక్క ఎముకల్లోకూడా నొప్పిగా వుంది. ఎందుచేతో? గేదె కుమ్మటం వల్ల కావొచ్చు.

ఒకపక్క వొళ్ళు నొప్పులు. మరో వైపు చీకాకు కలిగించే ఆలోచనలు. తొడమీద గట్టిగా రుద్దుకున్నాడు చంద్రశేఖరం. కాసేపు ఓ చెట్టుకింద కూర్చుని

విశ్రాంతి తీసుకున్నాడు. కొంచెం హాయిగా వున్నట్టనిపించింది. మళ్ళీ ఆకలి గుర్తువచ్చింది. మనసంతా ఎలాగో అయిపోయింది. నాజీర్ ఆలీఖాన్, సైకిల్ స్టాండు కాపలా ముసలాడు. టాంక్ బండ్ మించి వీచే ఎదురుగాలి, నరసింహారావు కాలిబాటమీద వంటలువండుకునే రెఫ్యూజీలు పోలీసాఫీసర్ ఇంట్లో వుండే ఆ లావుపాటి అమ్మాయి, ఆమె మెడమీద చేతులమీద స్పష్టంగా కనిపించే పచ్చటి నరాల చారలు.

ఆమసక వెన్నెల వెలుగుకి అలవాటు పడిన అతని కళ్ళు ఇప్పుడు చుట్టూవున్న పరిసరాలని స్పష్టంగా గమనించ గలుగుతున్నాయి. ఎదురుగా తల విరియ బోసుకుని ఓ రావి చెట్టు. దాని వెనుక బారక్సు కాంపౌండు గోడ. దాని వెనకాతల రోడ్డు. ఈ వేపుగా ఒక దాన్ని ఆనుకుని ఒకటి వరుసగా ఇళ్లు. సమతలమైన మైదానం. ఊడలు దిగిన మర్రిచెట్టు. నాలుగు వీధుల కూడలి నించి వీటన్నిటినీ వేరుచేస్తూ కాంపౌండు గోడలు. రోడ్డు. వీధి దీపాలు, కొన్ని బంగళాలు. ఇటువేపు మరికొన్ని బంగళాలు. దూరాన్నించి వినవచ్చే తురకపాట. మళ్ళీ మళ్ళీ విన్న పాటలు. పక్కింటి ఖాసిం రేడియోలో ఈ పాట ఎన్నోసార్లు వినిపించిందే. ప్యారీబేగం ఈ సమయంలో హాయిగా నిద్రపోతూ వుంటుంది.

తన ప్రాణానికి ఈ ప్యారీబేగం ఒకటి. ఇంతకాలమూ ఇదో గుండు పిల్ల అనే భావన తప్పవేరే ఆలోచన వుండేదికాదు. ఇప్పుడు అంతటితో ఆగడం లేదు. ఒకసారి చూస్తే మళ్ళీ చూడాలనిపిస్తోంది. ఎంతో అందంగా కూడా అవుపిస్తోంది ఆ అమ్మాయి, ఇప్పుడు. ఆమె కూడా తనని ఎంతో ఆశగా చూస్తున్నట్టు అనిపిస్తోంది. మునుపటిలా ముఖం తిప్పుకోవటం లేదు.

పక్కింట్లో వుంటున్నది ప్యారీబేగం వాళ్లు మాత్రమే కాదు. కొంతకాలంగా ఆ ఇంట్లో రెండు మూడు కొత్త కుటుంబాలు వచ్చి చేరాయి. శెలవులకి చుట్టపు చూపుగా వచ్చిన వారివలె అనిపించటం లేదు వాళ్లని చూస్తే. షోలాపూర్ నించి వచ్చారన్న సంగతి మాత్రం తెలిసింది. ఈ ఖాసిం ఇల్లే లేకుంటే వీళ్లు కూడా తక్కిన వారివలె స్టేషన్ రోడ్డు వారగా తడికలు, రేకుల గుడారాలలో వుండి పోవలసిందే. వీళ్ళుకూడా ముస్లింలే. నాసిర్ ఆలీఖాన్ కూడా ముస్లిమే. అయినా వీళ్ళ జీవన స్థితుల్లో ఎంత తేడా!

నాసిర్ ఆలీఖాన్‌తో సరిగ్గా చెప్పిరానందుకు బాధగా అనిపించింది చంద్రశేఖరానికి. ఇకమీదట తనని క్రికెట్ ప్రాక్టీసుకు పిలుచుకుని వెళ్ళడేమో అతను. కోపం వచ్చి వుండదా తన మీద? తనే పిలవకపోయినా వెళ్ళాలి. ఈ రోజు

ఇంత జరిగినతర్వాత మళ్ళీ అక్కడికి వెళ్ళడమా? చంద్రశేఖరానికి ఏడుపొస్తున్నట్టని పించింది. అయినా మనసారా ఏడవలేకపోయాడు. ఎందుకో ఈ మధ్య మనసులో అర్థంకాని అలజడి, మనస్సు విప్పి ఎవరితోనూ చెప్పుకోలేకపోతున్నాడు. మనసారా నవ్వి ఎన్నాళ్ళయిందో? కరువుదీరా ఏడుద్దామన్నా అదీ వీలు కావటంలేదు. పాత స్నేహితులు చాలామంది విడిపోయారు. ఇంటికి దగ్గర్లోనే వుండే ఎంతో కాలంగా పరిచయమైన మారిస్ పెరిన్స్‌లతో మాట్లాడి కూడా చాలారోజులయింది. కొత్త నేస్తాలతో రెండుమూడు నిమిషాలకి మించి సంభాషణ కొనసాగించడం కష్టంగా వుంది.

వాకిలి తలుపుకి బయటినుంచి గొళ్ళెం పెట్టాడు చంద్రశేఖరం. ఇంటి కాంపౌండ్‌గేటు కూడా మూశాడు. ఎదురుగా వున్న రావిచెట్టు కేసి నడిచేడు. చెట్టుమీంచి నేలరాలిన చిరుకొమ్మలు, ఫుల్లలు అతని పాదాలకింద నలిగాయి. ఇంతకు ముందు అటువంటి కొమ్మల్ని, రెమ్మల్ని ఎన్నోసార్లు ఏరి కట్టలు కట్టి తరుచుగా తమ ఇంటికి వచ్చే శాస్త్రులుగారికి ఇచ్చి వున్నాడు. ఒకసారి శాస్త్రులు ఒక జోస్యుణ్ణి కూడా వెంటబెట్టుకు వచ్చాడు. చంద్రశేఖరం జాతకాన్ని పరిశీలించాడు. ఆ జోస్యుడు. అందరిలా ఈ "జాతకం అమోఘం, అపూర్వం" అంటూ కోతలు కొయ్యలేదు అతను. అందరి జాతకాలు పరిశీలించేడు. పెదవి విరిచి ముఖం చిట్లించి ఆ తరువాతే పెదవి కదిపేడు. 'శనీశ్వరుడు' అని పేరు పెట్టింది అమ్మ అతనికి. చీకట్లో వస్తే అతను కనిపించడం కష్టం. అంత నల్లగా వుంటాడు. శనీశ్వరుడు కూడా నలుపే నన్నమాట. నాకు ఏడేళ్ల శని వుందట. అంటే ఏడేళ్ళపాటు ఆ శనిదేవుడు నాతోనే ఉంటాడన్నమాట. అయితే ఇపుడు కూడా నాతోనే వుండాలిమరి. ఎక్కడ అయితే.

చంద్రశేఖరం చుట్టూ కలియజూశాడు. తమ ఇల్లు, దాన్ని అనుకున్న ఇళ్ళు కుంభకర్ణుళ్ళవలె పడుకుని గుర్రుకొడుతున్నట్టుగా అనిపించేయి. తను నిలబడ్డ చోటునించి వెనుక వరుసలోని ఇళ్ళు కనబట్టంలేదు. అయితే వాటి వెనకాతల చర్చి గోపురం మాత్రం నిటారుగా నిలబడి కనిపిస్తున్నది. ఆ సాయంత్రమే గేదెని వెతుక్కుంటూ అక్కడికి వెళ్ళి వచ్చాడు తను.

కుడివేపుగా చాలా దూరానికి మిట్టపల్లాలుగా పరుచుకున్న నేల. విసిరేసినట్టుగా రెండు మూడు కట్టడాలు. క్రైస్తవుల స్మశానం. ఆ స్మశానవాటికలో నూరేళ్ళు నిండిన క్రైస్తవ ప్రేతాలు ఎన్ని తిరుగాడుతున్నాయో? పగటిపూటే భయమేస్తుంది ఆ ప్రదేశం తనకి. అరమైలు దూరాన వున్న ఆ సమాధులపైకి ఈ వేళప్పుడు తన

దృష్టిపోవటమేమిటి? శనీశ్వరుడు తనతో నడుస్తూ తనని నడిపించటం లేదు కదా?

ఇటుపక్క భూతంలా ఊడల మర్రి. ఇంత దూరం నించి చూస్తుంటే దాని పూర్తి ఆకారం కనిపిస్తున్నది. ఇంత బ్రహ్మాండమైన వృక్షమా్ఇది? ఎంతో చిన్నదిగా కనిపించేది తన కళ్ళకి. ఆ కొమ్మలకి ఎర్రెర్రగా కాసేపండ్లు ఇపుడు కనిపించటం లేదు. అవి పండి కింద రాలి పగులుతున్నాయా లేక కాకుల చేత కొరక బడి కిందపడి పొట్టపగల గొట్టు కుంటున్నాయా? ఏది ఏమైనా ఇప్పుడా వటవృక్షం ఈ మసక వెన్నెల బూడిదరంగు కాంతిలో చిత్రంగా తల విరబోసుకుని దర్శనమిస్తున్నది. ఎంత నిశ్చలంగా వున్నది! నిశ్శబ్దంగా ఆ వృక్షంలో ఫోటోసింథసిస్ జరుగుతోంది ఇప్పుడు. ప్రాణవాయువుని బహిర్గతం చేస్తూ నించుని వున్నది.

సరసరమని ఏదో చప్పుడు. రెండు బారల సర్పం ఒకటి చంద్రశేఖరాన్ని దాటుకుని వెళ్ళింది. అయస్కాంతంలా అతని దృష్టినాకర్షించి మెరుపులా జారి వెళ్ళింది. కొంతదూరం అలా వెళ్ళి చీకట్లో కలిసిపోయింది అది.

తనకు కలలోఎన్నోసార్లు ఇలా పాములు కనిపించేవి. ఇప్పుడు నిజంగానే కనిపిస్తున్నాయి తనకి. ఈ ఇంటికొచ్చి ఎనిమిదేళ్ళు కావస్తున్నది. ఇంతకాలం ఒక్క మన్ను పాముకూడా కనబడలేదు తనకి. అయితే ఈ మూణ్ణెల్లలో మూడు పాములు కనిపించాయి. నాగు పాముకటి. నాగుపాము. నాగరత్నం.

నాగరత్నం ఈ అమ్మాయిని కూడా ఒకసారిచూస్తే రెండో సారి చూడకుండా వుండలేక పోతున్నాడు. తను చేస్తున్నది తప్పనే భావన ఒకవైపు కలుగుతూనే వుంది. నాగరత్నం వయసులో తనకంటే కొన్నేళ్ళు పెద్దది. ఈ ఆకర్షణలకి వయసుతో నిమిత్తం వున్నదా అసలు తనని ఆకర్షించిన అమ్మాయిలలో కెల్లా నాగరత్నం మాత్రమే ఆ ఆకర్షణకి స్పందించింది. తను ఆమెకేసి చూసినప్పుడు ఆమె కనుకొలుకుల చివర తళుక్కుమనే ఆ నవ్వులో "అరే పోవోయ్! అరటెక్కెట్ గాడా" అనే భావం కదలటం లేదని చెప్పగలమా? ఆమెను గురించి నలుగురూ నాలుగు రకాలుగా అనుకునేవారు. అయితే వీళ్ళందరిలోకీ రంగరామానుజం చాలా చెప్పాడు ఆమెని గురించి. అంతమాత్రాన ఆమెపట్ల అతనికి అక్కసో, ద్వేషమో అని కాదు. ఎంచేతో ఆమె వాణ్ణి ఎక్కువ లక్ష్యం చేసేది కాదు. ఈ ఉదాసీనతకి ప్రత్యేకించి కారణాలంటూ వుండవచ్చు. లేకనూ పోవచ్చు. ఆమెని ఆకర్షించటానికి అతను చేసిన ప్రయత్నాలు శృతిమించి వుండవచ్చు. ఎంతమందో ఇలాంటి కోతి పనులు, కోణంగి పనులు చేస్తూనే వుంటారు

అమ్మాయిల విషయంలో. రంగరామానుజం గారు నాగరత్నం మైకంలో పడిన సంగతి మాత్రం తనకి ఖచ్చితంగా తెలుసు. సికింద్రాబాదులోని సగం మంది కుర్రాళ్ళు ఆ అమ్మాయి మైకంలో పడి కొట్టుకున్నవాళ్ళే. ఆమెని గురించి ఏదో ఒకటి చెప్పకపోతే తోచదు వాడికి. ఆమెతో వాడికి నేరుగా పరిచయం లేదు. ఒకరి మంచిచెడ్డలు తెలియాలంటే వాళ్ళతో దగ్గరి పరిచయం అవసరం. అలా లేనప్పుడు వాళ్ళని గురించి మనం చెప్పేవి, భావించుకునేవి అపోహలు మాత్రమే అయ్యే అవకాశం ఉంది. నాగరత్నం విషయంలో ప్రచారమైన పుకార్లనీ, కథల్నీ రంగరామానుజం తన మనసులోనే మథించి చూసుకునేవాడు ముందుగా. అందుచేతనే తక్కిన వారికంటే ఆమెని గురించిన కొన్ని నిర్ణయాలకి రాగలిగేడు అతను. ఇప్పుడెక్కడున్నాడో కూడా తెలీదు. సరిగ్గా అడ్రస్సైనా ఇవ్వకుండా వూరికి వెళ్ళిపోయాడు. వెళ్ళినవాడు ఒక్క ఉత్తరం ముక్కయినా రాశాడా?

చంద్రశేఖరానికి మనసులో ఏదో దిగులుగా ఉన్నట్టనిపించింది. రంగరామానుజం తనతో అంత స్నేహంగా వుండటానికి నాగరత్నం కారణమై వుంటుంది. అయితే పూర్తిగా అదే కారణం అని అనడం కూడా న్యాయం కాదేమో. ఇద్దరూ ఎంతో కాలం ఒకటిగా వూరంతా తిరిగి వున్నారు. ఎన్నెన్నో విషయాలు చర్చించుకుని వున్నారు. క్రికెట్ ఆటలోకి తనని లాక్కు వచ్చింది రంగరామానుజమే. అతను వున్నంతవరకూ ఆటవచ్చేదే కాదు. బాటు పట్టుకుంటే నాలుగు బంతులకే అవుటయిపోయేవాడు. బౌలింగ్ వేస్తే బంతి తన ఇష్టమైన దిక్కుకి దూసుకుని పోయేది. ఇవన్నీ సరే. ఆఖరికి ఫీల్డింగు కూడా ఇంత అధ్వాన్నంగా వుండేలా ఏమిటి? చంద్రశేఖరం బంతిని పట్టుకోగలడని ఎవరూ అనుకునే వారుకూడా కాదు. అతని ప్రతాపం అందరూ ఎరిగిందే అయితే రంగరామానుజం వూరికి వెళ్ళిన తరువాత చంద్రశేఖరం ఆటలో పెద్ద మార్పే వచ్చింది. ఎంతో ఓపిగ్గా ప్రేమగా అతను తనకు నేర్పించినవన్నీ అతనుండగా అక్కరకు రాకపోయినాయ్. కాని రంగరామానుజం వూరికి వెళ్ళిన తరువాత ఆ మెళకువలన్నీ ఒక్కొక్కటీ గుర్తు రాసాగినాయ్ చంద్రశేఖరానికి. ఇప్పుడు ఎగిరి వచ్చే బంతి కంటికి స్పష్టంగా కనిపిస్తున్నది. దాంతో ప్రేమగా మాట్లాడగలదు అన్నట్టుగా అనిపిస్తున్నది. దాన్ని కసిరి భయపెట్టాలని వున్నది. లాన్సర్ బారక్సు వెనుక వరుసలో వుండే కృష్ణస్వామి వాళ్ల తమ్ముడు గోకు అనేవాడు చంద్రశేఖరం బ్యాటింగు ప్రారంభించగానే ఎగతాళిగా ఏదో వాగేవాడు. అయితే వాడిప్పుడు చంద్రశేఖరం ఆటని చూసి దిమ్మయిపోయాడు. వాళ్ల క్రికెట్ జట్టుకు చంద్రశేఖరం

క్యాప్టన్‌గా ఎన్నికయ్యాడు కూడాను. ఇది ఎంతమందికి ఇష్టమో కాదో తెలియదుగానిచంద్రశేఖరాన్ని తప్పిస్తే ఆ స్థానానికి అర్హత గలవాళ్లు వేరే ఎవరున్నారని ప్రశ్నిస్తే మటుకు వాళ్ళు ఎవరూ సమాధానం చెప్పలేరు. ఈ మూణ్ణెల్లలో ఏడెనిమిది మ్యాచ్‌లు ఆడారు. అందులో అయిదు గెలిచారు. రెండు డ్రా. చంద్రశేఖరం ఒక్కడే మొత్తం మూడువందల ఇరవై పరుగులు తీశాడు. ఒకసారి మాత్రం ముప్ఫై పరుగులు మించలేకపోయాడు. తక్కినవన్నీ నలభై. యాభై. ఓసారి డెభ్భై ఎనిమిది దాకా వెళ్లింది. ఇదంతా చూసి ఆనందించడానికి రంగరామానుజం లేడుకదా. అతనుంటే కేప్టన్‌గా వుండును. అతని సారధ్యంలో ఆడి ఇన్ని పరుగులు తీసివుంటే తన కెంత గర్వంగా వుండేదో. అందరికంటే ముందు వాళ్ల కుటుంబంకు సికింద్రాబాదుని వదిలి వెళ్ళింది. ఒకవేళ వాళ్ళు వెళ్ళింది రజాకార్లకు భయపడి కాదేమో. వాళ్ళ నాన్నకి వేరే వూరికి ట్రాన్స్‌ఫర్ అయిందేమో. ఏమైతేనేం రంగరామానుజం వెళ్లిపోయాడు. ఇప్పుడు తురకపాలకూడా ఆగిపోయింది. అంతటా నిశ్శబ్దం. కోడి కూడా కుయ్యటం లేదు.

నుంచున్న చోటునుంచే చుట్టూ కలయజూశాడు చంద్రశేఖరం. ఆ స్థలం ఎంతో విస్తరించివున్నట్టుగా తోచింది. ఇల్లు చాలా దూరాన వున్నట్టుగా అనిపించింది. విశాల దృష్టితో చూస్తే మాత్రం అన్నీ ఏదో పద్ధతిలో ఒక క్రమంగా వున్నట్టనిపిస్తున్నాయి. ఈ ప్రపంచం అంతా తన కాళ్లకింది నుంచి జారి అంతటా సమంగా వ్యాపిస్తున్నట్టుగా వుంది. ఒక స్థిరమైన పదార్థంలా కాకుండా ఒకపెద్ద బెలూన్ మీద గీసిన చిత్రంలా బెలూన్‌తో బాటు పెద్దదవుతూనో కుంచించుకు పోతూనో వున్నట్టుగా భావన. వేగంగా వీచిన సుడిగాలికి ఒక రాక్షస నీటి బుడగ అల్లల్లాడి పగిలిపోయినట్టుగా, తను వామనావతారంలో వలె ఆకాశమంతెత్తుకి ఎదిగిపోతున్నట్టుగా వున్నది. చేయిచాపితే నక్షత్రాలు అందుకోవచ్చు. "ఒద్దు...అలా చెయ్యకూడదు" అని అనుకుంటూ వుండగానే అంతా మళ్ళీ యధాస్థితికి వచ్చేసింది. అదే ఇల్లు. . . అవే చెట్లు. . . .అదే చర్చి . . . అదే వల్లకాడు. .. ఆ దృశ్యం చూస్తుంటే ఇంగ్లండులోని ఏదో పల్లెటూరుని చిత్రంగా గీసి తగిలించి నట్టుగా వుంది. గ్రామీణ దృశ్యం అంటేనే విశాలమైన మైదానంలో విసిరేసినట్టుగా అక్కడక్కడా రెండు మూడు పెద్ద ఇళ్ళు, పొలాలు, గుడిసెలు, దూరంగా కొండలు, ఒక కుక్కో ఆవో దూరాన తిరుగుతూ మనిషి మాత్రం ఆ పరిసరాల్లో ఎక్కడా కనిపించకూడదు. ఈ క్షణంలో లాన్సర్ బారక్సునీ, అందులో తననీ కలిపి బొమ్మగీస్తే అది గ్రామీణ దృశ్యం అనిపించుకోకపోవచ్చు.

మర్రిచెట్టు కేసి నడిచాడు చంద్రశేఖరం. ఇంట్లో అయితే అంతమంది వున్నా చీకట్లో ఒంటరిగా బాత్‌రూంకి పోవాలన్నా ఏదో భయంగా వుంటుంది. అయితే ఈ నిశీధిలో ఆరుబయట నడిచి వెళుతుంటే ఏమీ భయం అనిపించటం లేదు. భయాన్ని మించిన భావన ఏదో అతణ్ణి అలా నడిపిస్తున్నది. అసలు భయం ఎందుకు? ప్రాణం పోతుందనా? అసలు ప్రాణం అంటే ఏమిటి? ఇది తెలుసుకుంటే గదా అది పోవటం గురించి భయపడాలి, బాధపడాలి. ఏదో భయం లాంటిది అతనికి కలగక పోలేదు. అల్పవిషయాలనుగురించిన భయంకాదు అది. పెద్ద, స్థిరమైన, సత్యమైన కారణాల కోసం భయం వేసింది. ఆ భయం అవగతం కావడానికి తన కేసి చూసే అమ్మాయిలంతా తనమీద పడి రక్కుతున్నట్టుగా అనిపించడానికి సంబంధంవుంది. అతనిలో మరో ప్రాణమో, ఆత్మో, ప్రేతాత్మో దూరేసినట్టుగా అనిపించింది. అదే అతణ్ణి భయపడేలా చేస్తున్నది. కలలు తెప్పిస్తున్నది. ఈ అర్థరాత్రి వూరంతా సద్దుమణిగి వున్న వేళ చీకట్లో చెట్ల వేపుకి నడిపిస్తున్నది. రావిచెట్టు సంగతేమోగాని మర్రిచెట్టుతో మాత్రం అతని స్మృతులెన్నో పెనవేసుకున్నాయి. ఎన్నో గంటలు ఆ వూడల నీడన తను ఆడుకుని వున్నాడు. సుఖదుఃఖాలు అనుభవించాడు. అదితనకి నీడనిచ్చిన ఇల్లు లాంటిది. ఓదార్చి సేదదీర్చిన తల్లిలాంటిది. ఇంట్లో అయితే ఏదో, ఎవరితోనో మాట్లాడుతూ వుండాలి. ఏదో ఒక పని చేస్తూ వుండాలి. అలా అయితే ఇంటితోనూ ఇంట్లోని మనుషులతోనూ సంబంధం వుంటుంది. అయితే ఈ మర్రిచెట్టు విషయంలో అటువంటి నిబంధనలేవీలేవు. ఇంతమాత్రంచేత ఈ మర్రి తనని రక్షించగలదని ఎలా అనుకోవటం. నేనెలాచెడి నాశనమైతే మాత్రం దీని కేమిటీ బాధ?... హటాత్తుగా ఆలోచనల అలలు ఆగిపోయినట్లయింది. మర్రిచెట్టు నీడలో ఏదో ఆకారం లీలగా కదిలింది. ముందుకి వెళ్లడమా వద్దా అని కొద్ది క్షణాలు తటపటాయించాడు చంద్రశేఖరం. ఆ ఆకారం తన రెండు చేతులతోటీ ముఖాన్ని కప్పుకుని నిలబడి వుంది. అతనికిప్పుడామె స్పష్టంగా కనిపించింది. చెట్టుకేసి అడుగులు వేశాడు. ఆమె అతణ్ణి గమనించినట్టులేదు. చప్పుడు చెయ్యకుండా ఆమెని సమీపించాడు.

"జూలీ"

ఆమె ఉలికిపడి అతనికేసి చూసింది. "చందూ" అంది. ఆ కంఠంలో ఆశ్చర్యం, ఏదో ఆవేదన. "వాట్ యు డూయింగ్ హియర్ మేన్?" అడిగింది.

కళ్ళుతుడుచుకునే ప్రయత్నం చేసింది. ముఖం మీంచి పూర్తిగా చేతులు తీసేసింది. చంద్రశేఖరం విస్తుపోయాడు. ఆమె జూలీ కాదు. మన్నాస్ రెండో కూతురు లారా! జూలీతో అతని కేర్పడిన ఆంతరంగిక అనుబంధం లారా పట్ల లేదు. ఇలా ఒంటరిగా కూర్చుని దుఃఖించే ఆడపిల్లగా మాత్రం అతడామెని వూహించలేదు. అయితే అక్కలాగే ఈ పిల్ల లారా కూడా ఇప్పుడు దుఃఖిస్తున్నది. ఆకారంలో కూడా ఈ క్షణాన తన అక్కనే పోలి వున్నది.

"ఏం జరిగింది"

"అబ్బే . . . ఏం లేదు. . ." తడబడుతూ తనని తాను సంబాళించుకునే ప్రయత్నం చేసింది.

"నేను చేయగలిగిన సహాయ మేదైన వుంటే చెప్పు. చేస్తాను"

"నన్నిలా చూసినట్టు ఎవరితోనూ చెప్పవద్దు. అదిచాలు.

ఒక్క క్షణం సందేహించి అన్నాడు" ఇంకా ఇక్కడ ఎవరైనా వున్నారా"

లేరన్నట్టుగా తలాడించింది లారా. మెల్లిగా కదిలి ఇంటికి వెళ్ళడానికి ఉద్యుక్తురాలయింది. "లారా" మెల్లిగా పిలిచి, రెండడుగులు ముందుకి వేసి ఆమె చేతిని అంది పుచ్చుకున్నాడు చంద్రశేఖరం. ఆమె నిలిచి వెనక్కి తిరిగి అతనికేసి చూసింది. ఆ నీడల మసక వెలుగులో ఒకరి ముఖం ఒకరికి స్పష్టంగా కనబట్టం లేదు.

"చందూ" అంది లారా. ఆమెకి దుఃఖం పొంగుకుని వచ్చింది. అతని మీద వాలి వాటేసుకుని, వెక్కివెక్కి ఏడ్చింది. ఆమె వీపు నిమురుతూ ఒక చేత్తో ఆమె కన్నీటిని తుడిచాడు చంద్రశేఖరం. ఇలాగే ఆమె అక్క విషయంలో కూడా జరిగింది అతనికి. అయితే ఆ నాడు జూలీ దుఃఖానికి కారణం అతనికి తెలుసు. ఆమెని పెళ్ళాడి తనతో ఇంగ్లండుకి తీసికెళతానని ఆశలు రేపిన ఆ బ్రిటిష్ సైనికుడు పత్తా లేకుండా పారిపోయాడు. అతని కబురు కోసం ఎదురుచూసి చూసి తను మోసపోయిందన్న నిజాన్ని మెల్లిగా గ్రహించి, నిస్సహాయురాలై, ఆ బాధనంతా చంద్రశేఖరం ముందు వెళ్ళబోసుకుని దుఃఖించింది జూలీ. జూలీ చిన్నపిల్లేంకాదు. కాని పాపం లారా! ఇంత లేతప్రాయంలోనే ఈ బంధాల్లో చిక్కుకోవాలా? తన వుద్దేశంలో లారా ఏ నాడూ ఒక మామూలు ఆడపిల్లలా ప్రవర్తించింది లేదు. మరి ఇప్పుడు ఈ నడిరేయి, వూడల నీడన బేలగా

దుఃఖిస్తున్నది!

ఏడ్పునాపి చంద్రశేఖరం ముఖంలోకి సూటిగా చూసింది లారా. ఆమె కళ్ళు మెరుస్తున్నాయేగాని, ఆ చీకటిలో ఆ కళ్ళలో ఏ భావాలు, బాధలు కదలాడుతున్నాయో కనిపించటంలేదు. ఆమె బుగ్గల మీద కన్నీటి చారికలు తడిగా వెచ్చగా తగిలాయి చేతికి. అలా కొద్ది క్షణాలు అతణ్ణే చూస్తూ నిలబడింది లారా. అతని చేతుల్లోంచి తనని విడిపించుకుంది. ఆమె ఇంట్లోకి వెళ్ళిన తరువాత నలిగిన షర్టుని సరిచేసుకున్నాడు. చవుకబారు పౌడరు వాసనని అతని మీదికి చిమ్మి వెళ్ళింది లారా.

లారా వెళ్ళిన తరువాత చెట్టుకింద ఒంటరిగా నిలుచోవటం ఏదోగా అనిపించింది అతనికి. ఈసారి అతనికి నిజంగానే భయమేసింది. లాన్సర్ బారక్సులోని మనుషులకి వాస్తవ ప్రపంచంతో సంబంధం వున్నట్టు లేదు. ఉంటే ఒకడు క్రికెట్ ఆలోచనతోనూ, ఒకామె తనని విడిచిపోయిన వాని గురించిన వేదనతోనూ అర్ధరాత్రిపూట అక్కడికి రారు. ఇద్దరూ ఒకే సమయంలో ఆ చెట్టుకిందికి చేరుకోవటం చిత్రంగానే వుంది. ఈ సంగతి ఎవరికైనా తెలిసినా, ఎవరైనా చూసినా లేనిపోని కథలు అల్లుతారు. ఊళ్ళో చాలామంది మంచి నిద్రలో వున్నారు. కొందరు నిద్రపట్టక పొర్లుతూ వుంటారు. భయం గిలి ఊరంతా కొంచెం కొంచెం ఖాళీ అవుతున్నది. స్త్రీలని పసిపిల్లల్ని హైద్రాబాదు సంస్థానంలోంచి దూరంగా వేరే వూళ్ళకి పంపేస్తున్నారు. ఇలా ఎంతకాలమని వేరేవూళ్లో వుంచగలరు. తమ ఇంట్లోనే అలా జరగాల్సి వుంటే ఎవరెవర్ని తరలించాల్సివుంటుంది? ఎక్కడికి తరలించాలి? అలా పంపగా మిగిలిన వాళ్ళని రజాకార్లు తన్ని పచ్చడి చేసి చంపినా ఫరవాలేదా? ఈ రజాకార్లు మాత్రం ఇంకా ఎంత కాలం ఇలా కత్తులూ కటార్లు తీసుకుని వూరిమీద తిరుగుతుంటారు? సికిందరాబాదు ప్లాట్‌ఫారాలు శాశ్వతంగా రెఫ్యూజీ కేంద్రాలుగా మారిపోవలసిందేనా?

ఆ రాత్రి నిద్రలేచిన తరువాత మనస్సు తేలికగా తేటపడినట్టుగా అనిపించింది చంద్రశేఖరానికి అయితే అతనిలో లేచిన ప్రశ్నలకి, సమస్యలకి సమాధానాలు పరిష్కారాలు మాత్రం అంత సులభంగా దొరికేలా లేవు. మళ్లీ ఎవరైనా తన నెత్తిమీద బలంగా రెండు వేసినా బావుణ్ను అన్నట్టుగా కూడా అనిపించింది. ఆ వెంటనే మళ్ళీ నిద్రమైకం కమ్మేసింది అతణ్ణి.

## రెండవ భాగం

కొన్ని రోజులుగా రాత్రిపూట మాత్రం వర్షం పడుతున్నది. బాగా ఎండ పడిన తరువాత మాత్రమే రాత్రి వర్షం పడిన ఛాయలు కనబడుతున్నాయ్. ఈ వూళ్ళో వర్షం తీరే ఇంత. కొద్దిగా మాత్రమే కురుస్తుంది. మొన్నరాత్రి వర్షం కురిసిన సంగతి నిన్న వుదయం బూట్సు వేసుకుంటున్నప్పుడు తెలిసింది. వరండాల్లో జల్లు కొట్టేచోట ఇలా చెప్పులు, బూట్సు వదిలి పెట్టకూడదని ప్రతీసారీ అనుకుంటూనే వున్నాడు. అయినా ఎప్పటికప్పుడు మరచిపోవడం జరుగుతూనే వుంది.రాత్రి కురిసిన వానజల్లుకు అవి తొప్ప తడిసిపోయినయ్.

బూట్సు వేసుకున్న తరువాత నిక్కరు తొడుక్కున్నాడు చంద్రశేఖరం. ఖాసిం, వెంకట్రావు, జాఫర్ ఆలీ, మన్సూర్ ఇలా లాన్సర్ బారక్సులో తనకి తెలిసిన వాళ్ళంతా కూడా ఇలా బూట్సు వేసుకున్న తరువాతే నిజారు తొడుక్కుంటారు. ఇలా చేయడం వల్ల వంగి బూట్సు నాడాని బిగించేటప్పుడు నిజారు మడతలు నలిగే అవకాశం వుండదు. ఎంత నేర్పుగా క్లిప్స్ వేసుకున్నా నిక్కరు ధరించి అరగంట సైకిల్ మీద వెడుతుంటే ఎదురు గాలికి మోకాళ్ళ దగ్గర బెలూన్‌లా వుబ్బుతుంది. నిక్కరు మడత నేరుగా నడుంమీంచి మోకాళ్ళ దగ్గర కొంచెం మలుపు తిరిగి మళ్ళీ కిందికి దిగుతుంది. ఈ రోజు సైకిల్ లేదు. ఈ వారంలో మూడుసార్లు ఈ సైకిల్‌వల్ల ఎన్నో ఇబ్బందులు పడాల్సి వచ్చింది. ఊళ్ళో పరిస్థితి కొంచెం మెరుగయ్యేదాకా సైకిల్ తీసికెళ్ళద్దని అమ్మా నాన్న చెప్పారు కూడాను. నిజమే ననిపిస్తున్నది.

పుస్తకాలు తీసుకుని బైలుదేరాడు. ఎండ చురుగ్గా వుంది. బూట్సు తొందర్లోనే వూడిపోతాయి. వరుసగా వున్న పన్నెండు ఇళ్ళలోను ఎవరూ వాకిలి ముందు నిలబడి కనిపించటంలేదు. అయితే ఇలా ఎంత సేపో వుండదు. బళ్ళకి వెళ్ళేవాళ్ళు, ఆఫీసులకి బైలుదేరేవాళ్ళు, వీళ్ళకి టాటాలు చెప్పేవాళ్ళు బిలబిలమంటూ క్షణంలోవచ్చి నిలబడతారు. అప్పుడు తనకి తిన్నగా తప్పించుకు వెళ్ళడం కుదరదు. వాళ్ళకేసి చూసి, చిన్నగా నవ్వి వాళ్ళు అడిగే దానికి తోచిన

సమాధానం చెప్పిగాని ముందుకి కదలడం జరగదు. ఇంత ప్రయాసపడినా ఆ సమాధానం తలతిక్కగానే వుంటుంది వినేవాళ్ళకి.

చంద్రశేఖరం నడక వేగం హెచ్చించాడు. మన్సూస్ ఇంట్లోంచి పెద్దగా అరుపులు వినిపిస్తున్నాయి. టెరిస్సు, వాళ్ళమ్మ పోట్లాడుకుంటున్నట్టుంది. వాళ్ళ పక్కనే లారా కూడా నిలుచుని వుంది. చంద్రశేఖర్ మరింత వేగంగా నడిచాడు. హైరోడ్డుమీది కొచ్చాడు. ఆ విశాలమైన రోడ్డు అతని కేదో రక్షణ కల్పిస్తున్నట్టుగా కనిపించింది. హాయిగా వూపిరి పీల్చుకున్నాడు. రైల్వే స్టేషన్ కేసి నడిచాడు. అక్కణ్ణుంచే కాలేజీకి బస్సు ఎక్కాలి.

సికింద్రాబాదు స్టేషన్ ముందు గులకరాళ్ల గుట్టలు పడి వున్నాయి. జన సంచారం ఎక్కువగా లేదు. ఓ వారగా ఏదో నెంబరు బస్సు దడదడ వొణుకుతూ నిలబడి వుంది. ఉదయం స్టార్ట్ చేసిన ఇంజన్ని రాత్రికి గాని ఆపరు కాబోలు ఈ బస్సు డ్రైవర్లు. ఆ ప్రదేశమంతా డీసెల్ వాసనతో నిండి వుంది. చంద్రశేఖర్ బస్సుని సమీపించాడు. జనంతో కిటకిటలాడి పోతున్నది. కదిలిన తరువాత ఎక్కేందుకని మరో పది, పదిహేను మంది దాకా ఫుట్‌బోర్డుని ఆనుకుని నిలబడి వున్నారు. బస్సులోకి తొంగి చూసి కొంత నిరుత్సాహం చెందాడు చంద్రశేఖర్. నాగరత్నం వచ్చినట్టులేదు.

డ్రైవరూ, కండక్టరూ కలిసే వచ్చారు. సణుగుతూ కదిలింది బస్సు. ఫుట్‌బోర్డు దగ్గర పదిహేనుమంది వేళ్ళాడుతూ నిలబట్టం చేత ఆ బరువుకి వాలి వంకరటింకర్లుగా వెళుతోంది బస్.

మనోహర్ టాకీస్ ముందాగింది బస్సు. ఎక్కేవాళ్ళు ఎక్కేరు. కొందరు దిగేరు. మళ్ళీ కదిలి క్లాక్ టవర్ దగ్గర ఆగింది. మినర్వా టాకీసు దగ్గర నిలిచింది. రాంగోపాల్ శిలావిగ్రహం ముందాగింది. జేమ్సు స్ట్రీట్, పోలీస్‌స్టేషన్, రాణిగంజ్, మరో మైలుదూరం దాకా ఇక ఎక్కడా ఆగాల్సిన పని లేదనే వుత్సాహంతో టాంక్‌బండ్ మీదికి సాగింది బస్సు. హుసేన్‌సాగర్‌ని చూడాలనుకున్నాడు చంద్రశేఖరం. కాని అతను నిలబడిన చోటునించి వీలు కాలేదు. కాని ఏటిమించి వీచేగాలి మాత్రం శరీరానికి హాయిగా తగిలింది. పక్షపాతం లేకుండా అందరినీ స్పర్శించింది ఏటిగాలి. నిజాం నవాబుగారి మంత్రి మారినప్పుడల్లా ఈ ఏటి గట్టు స్వరూపం కూడా మార్పుకి లోనవుతూ వుంది. హైదరాబాదుకి వచ్చిన వెంటనే వారి దృష్టి నాకర్షించేది మైలు పొడవున్న ఈ ఏటిగట్టు మాత్రమే. దీన్ని ఇంకా

అందంగా తీర్చిదిద్దాలనిపించేది వాళ్ళకి. గట్టు పొడవూనా వున్న రాతి గోడ. దాన్ని పడగొట్టి ఇనప ఫెన్సింగు వేయడం. అక్కడక్కడా ఎత్తుగా కట్టిన బాల్కనీలలో మార్పులు, చేర్పులు. అవి అంత ఎత్తుంటే కూడదు. రోడ్డుకి సమతలంగా వుండనియ్ మళ్ళీ పడగొట్టించు. ఈ పనికి పూనుకున్నది మీర్జా ఇస్మాయిల్ అనే మంత్రి పుంగవుడు. ఈ సంస్థానంలోని నగరాలని మరింత అందంగా తీర్చిదిద్దాలనే పట్టుదల అతనికి. మైసూరు చాలా అందంగా వుంటుందిట. అయితే హైద్రాబాదుకి మెరుగులు దిద్దే లోపలే అతని పదవి కాస్తా వూడింది. అతని స్థానంలో చట్టారి నవాబు. ఆవు కొమ్ముల్లాంటి పెద్ద పెద్ద మీసాలు ఈ నవాబుకి. ఈ మీసాల్లో సగభాగాన్ని ఖాసిం రజ్వీ మనుషులు పీకేశారు. పాపం. ఎంత నెప్పెట్టి వుంటుందో నవాబుకి. ఈ నవాబు కూడా మారిపోయి ప్రస్తుతం లెయిక్ అలీ ముఖ్యమంత్రిగా వున్నాడు. ఢిల్లీలో మౌంట్ బాటన్... సర్దార్ పటేల్... భారత స్వాతంత్ర్యం... భోపాల్ జూనకట్... ఢిల్లీలో ఎర్రకోట బురుజుల మీద త్రివర్ణ పతాక... డి.కె.పట్టమ్మాళ్ గానం ఆడువోకు పళ్ళ పాడవోకు... ఇక్కడేమో జాయిన్ ఇండియన్ యూనియన్ ఇండియాలో చేరిపో. సుల్తాన్ బజార్ ప్రాంతంలో వేకువ జామున ఎవరో స్వాతంత్ర్య జెండా ఎగరేసి వెళ్ళారు. పోలీసులకి వచ్చి పడింది చిక్కు. ఏం చెయ్యాలి? దింపండి జెండాని. రజాకార్లు... రెఫ్యూజీలు... అజాద్ హైదరాబాద్ రహేంగే లాల్ ఖిలా పర్ ఛలేంగే... ఢిల్లీ ఛలో... రక్తంతో సంతకాలు పెట్టండి అంటాడు నరసింహారావు... హమ్మయ్య హుసేన్ సాగర్ దాటింది. బస్సు మరో అయిదు నిముషాల్లో కాలేజీకి చేరుకోవచ్చు.

బస్ ఫతేపూర్ మైదానం ముందు ఆగింది. చంద్రశేఖరంతో బాటు మరి ఇరవై మంది దాకా దిగారు. బస్ బైలు దేరింది. గేటుదగ్గరే నిలబడి కనిపించాడు నిజాం కాలేజీ ప్రిన్సిపాల్. తన గదిలో అయితే అపరభీముళ్ళా దర్శనమిచ్చే అతను ఆ క్షణంలో గేటు బయట ఎండలో నించుని దీనంగా కనిపిస్తున్నాడు. గేటు బయట, కాంపౌండు గోడలవార గుంపులు గుంపులుగా నిలబడే విద్యార్థుల్ని "అంతా లోపలికి వెళ్ళండి. ఇక్కడ చేరొద్దు" అని గదమాయిస్తున్నట్టుగా బతిమాలుకుంటున్నాడు. అతనికి తోడుగా పక్కనే సైకిలుస్టాండు ముసలతను నుంచున్నాడు. రెండణాలిస్తే చాలు గేటు తెరిచి వెళ్ళండి సాబ్ అంటాడు ఆ ముసలాడు. హైదరాబాద్ రెండణాల నాణెం ఈ విషయంలో బాగా పనికొస్తుంది. అరంగుళం వెడల్పు కూడా లేని తేలికైన చిన్న నాణెం అది.

గేటుకి దూరంగా సంకోచిస్తూ నిలబడ్డాడు చంద్రశేఖరం. ఆ మూడు రోడ్ల కూడలిలోంచి సాగి నాంపల్లి వేపుకి వెళ్ళే రోడ్డు మీద కూడా జనసంచారం ఎక్కువగా లేదు. ఆ కూడలి కెదురుగా ఒక పెద్ద రావిచెట్టు. తిరిగి ఇంటికి వెళ్ళడానికి బస్సెక్కాలంటే ఆ చెట్టు కిందే నిలబడాలి. విశాలమైన సిమెంటు రోడ్డు, శతాబ్దాలపాటు స్థిరంగా నిలిచి వుండే భవనాల కెదురుగా ఆ పెద్ద వృక్షం. అడ్డంగా వుండే ఆ చెట్టుని కొట్టెయ్యమని ఏ మంత్రి చెప్పినట్టులేదు. ఇప్పుడా చెట్టు కింద ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్, ఇద్దరు పోలీసులు నించుని వున్నారు. తొమ్మిదీ యాభై అయిదుకి కాలేజీ బెల్ మోగింది. ప్రిన్స్‌పాల్ లోపలికి వెళ్ళిపోయాడు. బయట చంద్రశేఖరంతో బాటు ఏడెనిమిది మంది రోడ్డు కావల చెట్టుకింద నుంచుని వాళ్ళని గమనిస్తున్నాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్. ఎదురెదురుగా రెండు బస్సులు వచ్చి ఆగేయి. మళ్ళీ ఆ ప్రదేశంలో గుంపు చేరింది. ఇదంతా ఆశ్చర్యంగా వుంది చంద్రశేఖరానికి. వీళ్ళంతా ఇంత సేపూ ఎక్కడ పొంచి వున్నారో! పైజమా మీద తెల్ల లాల్చీ ధరించిన ఇద్దరు మైదానం కాంపౌండు గోడదూకి రోడ్డుమీదికొచ్చారు. కాలేజీ గేటు దగ్గరికొస్తూ చెరో గాంధీ టోపీని ధరించారు. "వందేమాతరం" అని నినాదాలు చేశారు. నిజానికి పది అడుగుల దూరం కూడా వినిపించి వుండదు వాళ్ళ గొంతు. అయినా చెట్టుకింది పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఉలిక్కిపడ్డాడు. గాంధీ టోపీ యువకులు "హిందుస్థాన్ జిందాబాద్ పోలీసు జులుం ముర్దాబాద్" అని అరుచుకుంటూ రోడ్డువార పోగైన గుంపుకేసి నడిచారు. ఇప్పుడు వాళ్ళ కంఠంలో జోరు హెచ్చింది. పోలీసులకి ఏవో వుత్తర్వులు జారీ చేశాడు ఇన్‌స్పెక్టర్. ముగ్గురూ రోడ్డుదాటి గేటుకేసి వస్తున్నారు. అప్పుడే ఒకదాని వెంబడి ఒకటి వరుసగా మూడు మోటారు సైకిళ్ళు రోడ్డు మీంచి దూసుకువెళ్ళాయి. పోలీసులు ఆగవలసి వచ్చింది. అంతలో ఆ గాంధీ టోపీ యువకులు గుంపుని చేరుకున్నారు. "వుయ్‌వాంట్" అని పిడికిళ్ళు బిగించి అరిచారు. అంతా ముక్తకంఠంతో "మొర్జర్" అంటూ వంత పలికేరు. వాళ్ళలో చంద్రశేఖరం కూడా ఒకడు.

"వుయ్‌వాంట్"

"మొర్జర్"

"పోలీసు జులుం..."

"ముర్దాబాద్"

రోడ్డుదాటి ఇన్‌స్పెక్టరూ పోలీసులు దబదబమంటూ పరిగెట్టుకొచ్చారు. గుంపు తిన్నగా పల్చబడనారంభించింది. ఇన్‌స్పెక్టర్ గాంధీ టోపీలని సమీపించే సరికి బాగా చెదిరిపోయింది. గాంధీ టోపీలకేసి పరికించాడు చంద్రశేఖరం. వాళ్ళ ముఖాల్లో భీతి కనిపించకపోలేదు. ఇన్‌స్పెక్టర్ ముఖంలో కలవరపాటు గోచరించింది. గాంధీ టోపీల చేతులు పట్టుకున్నాడు. ఇన్‌స్పెక్టరు. "ఊహూ... ఊహూ..."అన్నాడు వారిస్తున్న ధోరణిలో. ఏదో అర్థమైనట్టు గాంధీ టోపీలు మౌనం వహించాయి. కానిస్టేబిళ్ళ కేసి కోపంగా చూసి ఏదో అన్నాడు ఇన్‌స్పెక్టర్. వాళ్లలో పోలీసు హడావిడిగా ఎక్కడికో దౌడు తీశాడు. రోడ్డు కావల కొంచెం ఎడంగా చేరిన గుంపుకేసి చూసి "డిస్పర్స్ ప్లీజ్" అంటున్నాడు ఇన్స్పెక్టర్. అంతకుముందే అది గ్రహించినట్టు గుంపు మెల్లిమెల్లిగా జారుకోసాగింది. గాంధీ టోపీలకేసి పోలీసులకేసి కుతూహలంతో చూస్తున్నారు కొంతమంది.

ఆ గాంధీ టోపీ యువకులు నిజాం కాలేజీ విద్యార్థులు మాత్రంకాదు. వారిలో ఒకతను మాటిమాటికీ రుమాలుతో ముఖం తుడుచుకుంటున్నాడు. ఒక లక్ష్యం లేకుండా రోడ్డుమీద ఆ ఎండలో ఇబ్బందిగా నిలుచున్నట్టుగా వుంది వాళ్ళతీరు. పోలీసుల పరిస్థితి కూడా అట్టాగే వుంది. ఇన్‌స్పెక్టర్ పురమాయించిన పోలీస్‌కానిస్టేబిల్ ఒక సైకిల్ రిక్షాని వెంట బెట్టుకొచ్చాడు. ఆ ఇద్దరు గాంధీ టోపీవాళ్లని అందులోకి ఎక్కించాడు ఇన్‌స్పెక్టర్. ఇంతలో ఎక్కడి నుంచో ఇన్‌స్పెక్టర్ కోసం ఒక సైకిల్ పట్టుకొచ్చాడు పోలీసు. ఇన్‌స్పెక్టర్ దేనేమో అది. సైకిలెక్కి బయలుదేరాడు ఇన్‌స్పెక్టరు. సైకిల్ రిక్షా కదిలింది అతని వెనకే. ఆ ఇద్దరు పోలీసులు కూడా తమ తమ సైకిళ్ళెక్కి రిక్షాని వెన్నంటారు. ఇన్‌స్పెక్టర్ వెనక్కి తిరిగి గాంధీ టోపీ కేసి చూసి 'నికాల్ దో' అన్నాడు. కిక్కురుమనకుండా టోపీలు తీసేశారు ఆ ఇద్దరూ.

చంద్రశేఖరానికి ఇదంతా ఏదో మగత నిద్రలోని స్వప్నంలా తోచింది. ప్రారంభ శూరత్వంతో ఏదో సాధించాలని బయలుదేరి అంతటితోనే ఆగిపోయి పరుగులేసినట్టుగా అనిపిస్తుంది. సత్యాగ్రహులు, పోలీసులు అంతా ఏదో అయోమయంలో పడి కొట్టుకుంటున్నట్టుగా అనిపించింది.

మొదటి పీరియడు అయిపోయింది. గ్యాలరీ ఉండే రెండు హాల్సులో మాత్రమే సైన్స్ తరగతులు జరుగుతాయి. వీటికి ఒకటే ద్వారం. లెక్చరర్ టేబుల్‌కి తిన్నగా వుంటుంది ప్రవేశద్వారం. ఇంగ్లీషు తరగతులు నిర్వహించబడే

సాలార్ జంగ్ హాలుకి మాత్రం ఏడెనిమిది ద్వారాలు ముందు, వెనక పక్కవైపుల, అటెండన్స్ పోయినా పాఠమైనా వినవచ్చు అనిపించింది. మొదటి పీరియడే ఇంగ్లీషు క్లాసైతే ఎంత బావుండును. అందులోనూ ఈ రోజు కాలేజి బయట జరిగినట్టు రోజూ జరిగేటట్టుంటే ఏడెనిమిది రోజుల్నుంచి ఏదో ఒకటి జరుగుతూనే వుంది. రోజూ కాకపోయినా ఒక్కోసారి వీటిలో తను కూడా తల దూర్చాల్సి రావటం జరుగుతుంది. ఆ రోజు "వెళ్ళు. వెళ్ళి గేటు దగ్గర జరుగుతున్న తమాషా చూడు" అంటూ తరిమాడు హరిగోపాల్. "నువ్వు రా నాతో" అంటే "నేను చూడటం అయింది. నువ్వెళ్ళు" అన్నాడు వాడు. నిలబడనివ్వలేదు. తరిమేడు దాదాపు. గేటు దగ్గరికెళ్ళి నుంచున్నాడు చంద్రశేఖర్. అక్కడ నలుగురమ్మాయిలు నిల్చొని వున్నారు. మామూలు అమ్మాయిలు కాదు నారీ రత్నాలు. రోడ్డుదాటి ఎవరు గేటుని సమీపించినా వెంటనే వాళ్ళ దగ్గరికి నడిచి ఏదో అంటున్నారు. చంద్రశేఖరానికి సరిగ్గా వినిపించటంలేదు. చెవిన బడిన రెండు మూడు మాటలు ఏ భాషకి చెందినవో కూడా అర్థమవలేదు. చంద్రశేఖరం గేటు దాటి బయటికొచ్చి కాసేపు నించున్నాడు. తిరిగి లోపలికి రాబోయే సరికి ఇద్దరమ్మాయిలు అతణ్ణే సమీపించి అతని చేతికేదో ఇవ్వబోయేరు. అసంకల్పితంగా చేయిచాపాడు చంద్రశేఖరం. రెండు రంగు గాజుల్ని అతని చేతిలో పెట్టి పకపకనవ్వేరు అమ్మాయిలు. పక్కనే నిలబడ్డ మరికొందరు నారీమణులు వంత పాడేరు. అప్పుడర్థమైంది చంద్రశేఖరానికి. తను కాలేజీకి వెళుతున్నందుకు వాళ్ళంతా తనని ఎగతాళి చేస్తున్నారని. హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో చేర నిరాకరిస్తున్నది. స్వామి రామానంద తీర్థ జైల్లో వున్నాడు. ఖాసిం రజ్వీ గూండాలు వూరంతా ధ్వంసం చేస్తూ తిరుగుతున్నారు. ఈ గూండాలకి నిజాం సైన్యాలకి విమానాల ద్వారా రహస్యంగా విదేశాల నుంచి ఆయుధాలు సరఫరా అవుతున్నాయి. ఇంత దారుణం జరుగుతుంటే పాపం ఆ అబ్బాయికి కాలేజీ ముఖ్యమైంది. బోడి కాలేజి.

ఆ గాజుల్ని ఏంచేయాలో తోచలేదు చంద్రశేఖరానికి. విసిరి పారేస్తే ఆ అమ్మాయిలని అవమానించినట్టవుతుంది. జేబులో వేసుకుందామా అంటే అవమానాన్ని అంగీకరించినట్టవుతుంది. ఆ గాజుల్ని వాళ్ళకే తిరిగి ఇవ్వబోయాడు. మళ్ళీ నవ్వులు. అతను తటాలున ఒక పిల్ల చేతిలో బలవంతంగా ఆ గాజుల్ని కుక్కేసి లోపలికి దౌడుతీశాడు. క్లాసుకి వెళ్ళకుండా దూరంగా నిలబడి ఆ

అమ్మాయిల్ని గమనించాడు. డాబుగా దర్జాగా వచ్చే బడాబాబుల్ని వాళ్ళ అడ్డగించటంలేదు. గాజులు చూపటం లేదు. అలాగే కార్లలో వచ్చేవారిని కూడా వాళ్ళేమీ చెయ్యటంలేదు. తలలు మాసిన వాళ్ళకీ నోట్లో నాలుక లేని వారికి మాత్రమే ఈ సత్యాగ్రహాలూ, కాలేజీ బంద్ లు అనిపించింది చంద్రశేఖరానికి. ఈ వర్గం మనుషులు మాత్రమైనా తమకున్న కొద్దిపాటి రక్షణని, సౌకర్యాలని త్యాగం చెయ్యాల్సింది! అలా చెయ్యకపోతే వాళ్ళని అవమానించవచ్చు, అపహాస్యం పాలు చేయవచ్చు, బలవంతం చేయవచ్చు. ఇదేమి న్యాయం?

మొదటి పీరియడ్ ముగియగానే కొంచెం నెమ్మదించినట్లయింది మనసుకి! తన తరగతి మిత్రులతో కలిసి క్లాసు రూం కేసి నడిచాడు చంద్రశేఖరం.

## 2

మూడు నాలుగు వేలకి మించని తమిళులు మాత్రమే నివసించే ఆ వూళ్ళో ఆ రోజు నేనొక గాయకుణ్ణిగా పరిచయమైన ఉదంతం గురించి చెప్పుకోవలసి వుంది. ఎక్కాలు, లెక్కలు గిల్లీకోడు, కోతికొమ్మచ్చి, బొంగరాలాట, గాలిపటాలు – వీటితోపాటుగా సంగీత సాధన కూడా నా ప్రమేయం లేదంటూ జరిగిందని చెప్పొచ్చు. మా అక్క చెల్లెళ్ళకి అంట్లు తోమటంతోపాటు గాత్ర సంగీతం కూడా నేర్పించటం మంచిదని మా అమ్మ అభిప్రాయం. అందుకని ఆళ్వార్ అనే సంగీతం మేష్టారుని నియమించింది అమ్మ. ఆయన్ని చూస్తే అరవై డెబ్బై వుంటుందనిపిస్తుంది. పొడవాటి పిలకజుత్తు కూడా వుండేది అతనికి. ఓ పెద్ద చేతి సంచీతో ఉదయం ఏడు ఎనిమిది గంటలలోపలే మా ఇంటికి చేరుకునేవాడు ఆయన. స్వయంగా తనే చాప పరచుకుని వుస్సురంటూ కూలబడేవాడు. పదిహేను నిమిషాలు గడిచేసరికి మా పెద్దక్క హార్మోనియం పెట్టె తెచ్చి అతని ముందుంచి వెళ్ళేది. మరో పావుగంటకి మా చిన్నక్క చెంబుతో మంచినీళ్ళు తెచ్చిపెట్టి వెళ్ళేది. మరో పావు గంటకి మా అమ్మ ఒక లోటాలో కాఫీ కలిపి తెచ్చిచ్చేది. ఆయనగారు కాఫీ సేవించి తీరిగ్గా తాంబూలం వేసుకుని ఆ తరువాత పాట ప్రారంభించేవాడు. మా ఇద్దరు అక్కలూ సరిగమలు ప్రారంభించి ముగించే లోపున రెండు మూడుసార్లు వాళ్ళని మధ్యలో ఆపి ఇద్దరినీ ఒకే శృతిలో పాడమని చెప్పి అలా వాళ్ళ చేత పాడించే సరికి పాపం ఆయనకి తల ప్రాణం తోకకి వచ్చేది. ఇద్దరికీ శృతి కలిపి సరిమాగరి సరిగరిస పలికేసరికి మా పెద్దక్కయ్యకి పుసుక్కున

నవ్వు పెళ్ళగిలి వచ్చేది. కారణం లేకుండా మాటిమాటికి కసుక్కుమని నవ్వేదాన్ని చూసి చిన్నక్కకి కూడా అది సోకేది. ఇట్లా అకారణంగా నవ్వే ఆ ఇద్దరినీ చూసి ఆళ్వారుగారికి వొళ్ళుమండేది. అప్పుడు వంటింట్లోంచి అమ్మ వచ్చి మా అక్కల్ని వీపుమీద చెరోటి అంటించేది. అప్పటిగ్గాని సద్దుమణిగేది కాదు ఈ భాగోతం. తొమ్మిదిన్నరకి సాధన ఆపుచేసి హడావిడిగా అన్నం గతికేసి బళ్ళకి బయలుదేరేవాళ్ళం మేము. అప్పుడు తీరిగ్గా లేచి మరో శిష్యురాలింటికి తయారయ్యేవాడు ఆళ్వారు. ఆ ఇల్లు రెండు మూడు మైళ్ళ దూరంలో వుండేది. అతనెప్పుడు తన యింటికి వెళతాడు. ఎప్పుడు భోంచేస్తాడు? ఎప్పుడు నిద్రపోతాడు ఇంటి పనులెప్పుడు చూసుకుంటాడు అని ఎవరికీ అంతుబట్టేదికాదు. ఎప్పుడూ ఏదో ఒక ఇంట సరిగమలు చెపుతూనే వుంటాడతను. మాయామాళవగేళ రాగానికి ఒక అధి దేవతంటూ వున్నట్టయితే అతని నిరంతర సాధనకి ఆరాధన అతనికి జన్మరాహిత్యం తప్పకుండా ప్రసాదిస్తుందనటంలో సందేహంలేదు. ఈ జన్మలో ఎంత కష్టపడి సంగీతం నేర్పించినా ఇంటికి మూడు రూపాయలకి మించి ముట్టదు. నవరాత్రులు తప్పిస్తే మరెప్పుడూ మా అక్కలిద్దరూ తాము నేర్చుకున్న కీర్తనల్ని పాడగా నేను వినలేదు. అయితే నేను మాత్రం పాడేవాడిని. మా తమ్ముడు, చెల్లెళ్ళు పాడేవాళ్ళు. ఆఖరికి మా నాన్నగారు సైతం ఎప్పుడైనా ఒకసారి సరిమాగరి గొణగడం నాకు తెలుసు. అంతవరకూ ఆ వూళ్ళో మరో సంగీతం మాష్టారు లేకపోవడంచేత ఆళ్వారుదే పై చెయ్యిగా వుంటూ వచ్చింది. అయితే హటాత్తుగా ఒకరోజు అతని ఏకచ్ఛత్రాధిపత్యానికి భంగం కలిగింది. సరిగా అంగవస్త్రం గిరదా క్రాపుతో సుందరభాగవతార్ అనే ఒకతను వూడిపడ్డాడు సికిందరాబాదు నుంచి. ఆళ్వారు శాస్త్రోక్తంగా సరిగమ పదనిసల దగ్గర ప్రారంభించి నెలల తరబడి వాటినే పాడిస్తూ బాగా సాధన చేయించేవాడు. కాని ఈ సుందర భాగవతారు ఎత్తుగడలోనే పాటలతో మొదలెట్టేవాడు. ఎప్పుడూ సరిగమలు వినివిని విసిగిపోయి వున్నవారికి చక్కని చరణాలతో పాటలు వినడం ఎంతో హాయిని కలిగించేది. అక్కడికి వచ్చి చేరి నెలతిరిగేసరికి షుమారు ఇరవై ఇళ్ళలో సంగీతం మేష్టారుగా కుదురుకున్నాడు సుందర భాగవతార్.

సుందర భాగవతార్ రోజూ వచ్చేవాడు కాదు. వారానికి ఏ రెండు మూడు రోజులు మాత్రమే అతను వచ్చేది. ఐదు రూపాయలకి తక్కువ ఫీజు అంగీకరించేవాడు కాదు. మా ఇంట్లో పదిహేను రూపాయల దగ్గర ప్రారంభించి

చివరికి ఏడు రూపాయలకి బేరం కుదుర్చుకున్నారు. అతని కళ్ళు విశాలంగానూ ఎప్పుడూ జేవురించినట్టుగానూ వుండేవి. రావటం రావటం కొంచెం తూలుతూ వచ్చేవాడు. కూర్చోడానికి దుప్పటిగాని చాపగాని పరిస్తే దాన్ని ఒకసారి బాగా విదిలించిగాని కూర్చునేవాడు కాదు. హార్మోనియం వాయిస్తూ అతను మీటలు నొక్కేటప్పుడు సంగీతంతో బాటు ఆ చెక్క మీటల కరకర చప్పుళ్ళు కూడా కలిసి వినిపించేవి. ఎంతో ఆత్మవిశ్వాసం వుండేది మనిషిలో. మా ప్రాంతంలోని తమిళుల కళాభిరుచిని మేల్కొలిపిన ఘనత అతనిదేనని చెప్పుకోవాలి. అలా మేల్కొలిపి వూరుకోకుండా ఆ కళని అతల పాతాళ లోకాలకి నెట్టివేసిన ఘనత కూడా అతనిదే. ఈ చివరి ప్రశంస మాత్రం మాదికాదు. ఆళ్వారుగారిది. "ఏమిటి నా మొహం? అసలు వీడు నేర్పిస్తున్నది సంగీతమేనా అని? చక్కని కీర్తనల్ని అపభ్రంశం చేసి పల్లె పదాలవలె పాడిస్తాడేమిటి, పిల్లలచేత. ఒక క్రమము పద్ధతి వుండక్కర్లా? రోడ్డు మీద పొయ్యేదాన్ని నిలబెట్టి ఇలా పాడవే అని నాలుగుసార్లు పాడిస్తే చాలు అది కూడా పాడేస్తుంది. అది సంగీతమవుతుందా? ఆ తల్లి సంగీత సరస్వతి కంటనీళ్ళు రాలవూ? ఇలా సంగీతాన్ని ఖూనీ చేస్తే అంటూ తన అక్కసుని వెళ్ళబోసుకునేవాడు ఆళ్వార్.

ఆళ్వార్‌ని నిలిపేసి సుందర భాగవతార్‌ని నియమించిన రెండు నెలల్లోనే మా ఇంట్లో అంతా "శ్రీరామ పాదమా నీకృపజాలినే" అంటూ పాడుకోవడం ప్రారంభించాము. రాక్షస బలంతో ఒక చేత్తో హార్మోనియంని కదిలిస్తూ మరోచేత్తో స్వరపు చెక్కమీటల్ని అదుముతూ ప-ద-ని-ద-మా-పా-ద-కూ-నీ-కృ-ప అంటూ త్వరితగతిని బిగ్గరగా అతను అరుస్తూ, మా ఇద్దరు అక్కలు గొంతులు చించుకుని అతణ్ణే అనుసరిస్తూ సాధన చేస్తుంటే చూచినవాళ్ళకి వెంటనే అక్కడ జరుగుతున్నదేమిటోనని అర్థంగాక గాభరపడిపోయేవాళ్ళు. సుమారు ఆ 60 నెలలపాటు అత్యంత వైభవంగా మా ప్రాంతంలో సంగీత సామ్రాజ్యాన్ని ఏలిన సుందరభాగవతార్ ఒక రోజు పత్తాలేకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు. పాలవాడు, చిల్లరకొట్టు మనిషి, ఇంటి యజమాని – వీళ్ళందరికీ పంగనామాలు పెట్టి మరీ వెళ్ళాడని తెలిసింది. అతను తిరిగి వస్తాడని చాలా రోజులదాకా ఎదురుచూసి విసిగిపోయి మళ్ళీ ఆళ్వారుగారినే సంగీతం మేష్టరుగా పెట్టుకోవలసి వచ్చింది చాలా మందికి. అంచేత అతనికి మేలు జరిగింది. ఆళ్వారుగారి ఫీజు కొంచెం పెరిగింది. మునుపులా ఆయన ఇప్పుడు గంటల తరబడి ఒక ఇంట్లో

కామకూర్చోవటం లేదు. వారానికి మూడుసార్లకంటే ఎక్కువగా ఇంటికి రావటంలేదు. దీని ఫలితంగా మా పేటలోని సంగీత సాధన రెంటికీ చెడ్డ రేవడిలా తయారైంది. అటు సుందరభాగవతార్ పద్ధతి కాకుండాను, ఇటు ఆళ్వార్ పద్ధతి గాకుండానూ ఇంకేకో విధంగా తయారైంది. ఈ సంగీతాన్ని చూసే "చందూ బాగానే పాడతాడే" అనే ముద్ర నాకెలాగో పడిపోయింది. అసలు బాగా పాడటమంటే ఏమిటో, పాట చెడగొట్టడమంటే ఏమిటో కూడా తెలీని వయసు నాకు. అంచేత కాబోలు నేను నిజంగానే బాగా పాడగలనేమోననే అభిప్రాయం కూడా నాకు కలిగినట్టుంది. ఆ రోజుల్లో బిలోకో రేడియోలో గరగర శబ్దంతో రాత్రిపూట మాత్రమే వినిపించే మద్రాసు కార్యక్రమంలోని సంగీత పాటల రాగాల్ని నేను పాడి సాధన చేసేవాణ్ణి. అయితే అందులోని సాహిత్యం మాత్రం గుర్తుంచుకోవటం కష్టంగా వుండేది. అందునా పదాలని విరిచి, సాగదీసి వంకర్లు తిప్పి మరీ పాడేవారు ఆ సంగీత విద్వాంసులు. ముసిరి సుబ్రహ్మణ్య అయనర్ అనే అతను కాంగ్రెసు ప్రచార గీతాన్ని పాడి గ్రామఫోన్ రికార్డు కూడా ఇచ్చి వున్నాడు. దాన్ని తప్పుల తడకగా చాలాకాలం పాడుతూ వచ్చాను. మా స్కూల్లో సాధారణంగా తెలుగు ఉర్దూ బాగా తెలిసినవారినే హెడ్మాస్టర్లుగా వేసేవారు. అటువంటిది ఆ ఏడు హఠాత్తుగా తమిళదేశం నుంచి వచ్చిన ఒకరిని హెడ్మాష్టరుగా నియమించారు. అసలు చూడబోతే మా స్కూల్ ని స్థాపించింది ఒక తమిళ కుటుంబం వాళ్ళేనట. కాని రెండు మూడు తరాలుగా నిజాం సంస్థానంలో స్థిరపడినందుచేత ఆ కుటుంబం ఉర్దూ తెలుగు కలగాపులగంగా మాట్లాడేటట్లు తయారై కూర్చుంది. మా బడి ప్రేయర్ హాల్లో బడి సంస్థాపకులు, రాజ పోషకులు వగైరాల పెద్ద పెద్ద ఫొటోలు గోడలకి తగిలించి వుండేవి. మారి మారి సోమసుందర మొదలియారు, హనుమంతరావు, ఇలాంటి పేర్లు కనిపించేవి వాటిమీద. ఆ పేర్లకు ముందు దివాన్ బహదూర్, రావ్ బహదూర్, రావ్ సాహిబ్ అనే బిరుదులు తప్పనిసరిగా వుండి తీరాల్సిందే. వాళ్ళకి పెద్ద పెద్ద సరిగ టోపీలు గాని, తలపాగాలు గాని వుండటం కూడా తప్పనిసరి. పెద్ద పెద్ద మీసాలు, విభూతి, గంధం, కుంకుంబొట్టు, చేతి గడియారపు గొలుసు ఈ అలంకరణలతో గంభీరంగా కనిపించేవారు. గుఱ్ఱంమీద కూర్చున్నట్టుగా ఒక చిత్రం. ఒకాయనికి మాత్రం ప్రత్యేకించి 'సర్' బిరుదు. ఈయనగారి నడుముకి కత్తి వేలాడుతూ కనిపిస్తుంది. నాకీ ఫొటో అంటే ఎంచేతో ఒకరకమైన భక్తి, భయమూ ఏర్పడ్డాయి. దాని ముందు నిమిషాల తరబడి నిలబడి

ఏవో ఆలోచనల్లో పడిపోయేవాణ్ణి.

మా బడిని స్థాపించింది తమిళులే అయినా వెయ్యిమంది విద్యార్థుల్లో అరవవాళ్ళు వందకిమించరు. ఆ వందమందినీ పిలిపించి ఒక్కొక్కరిని పరిచయం చేసుకున్నాడు మా కొత్త హెడ్మాస్టరు. మా బళ్ళో హెడ్మాస్టర్ని కూడా ప్రిన్సిపాల్ అనే పిలుస్తారు.

మా కొత్త ప్రిన్సిపాలు కొత్త కొత్త పద్ధతుల్ని ప్రవేశపెట్టాడు. బడిగంట మూడోసారి మోగిన వెంటనే మైన్‌గేటు మూసివేయించేవాడు. బడి వదలడానికి అయిదు నిమిషాలకి ముందు మాత్రమే మళ్ళీ ఆ గేటు తెరిపించేవాడు. వారానికోసారి ప్రార్థన సమయంలో ఒక్కో మేష్టారు వుపన్యాసమిచ్చేట్టు ఏర్పాటు చేశాడు. ఒక్కోవారం ఒక్కో తరగతి జనగణమణ పాడాలి. ఇవన్నీ ఒక ఎత్తు, మా బళ్ళో 'తమిళ్ మంద్రం' (సాహితీ సమితి) ఏర్పరచటం ఒక ఎత్తు. ఈ సమితి సమావేశాలకి భాషాభేదాలు లేకుండా విద్యార్థులంతా హాజరుకావాలని ఉత్తర్వులు జారీచేశాడు. మా ప్రథమ సాహితీ సమావేశం మధ్యాహ్నం మూడుగంటలకి ప్రారంభమైంది. అంటే ఆ రోజు ఆఖరు పీరియడు లేదన్నమాట. మా తరగతి విద్యార్థులతో కలిసి ఆ పెద్దహాల్లో నేలమీద పరిచిన తివాచీమీద కూర్చున్నాను. అంతా ఇరుక్కుని కూర్చోవలసి వచ్చింది. ఆ హాలు మొత్తానికి ఒకటే ఫాను. అది కూడా స్టేజికి పైన వుంది. అయితే ఆ వయసులో వుక్కపోయడమన్నది మాకో పెద్ద సమస్యేంకాదు.

ప్రిన్సిపాల్ గారొచ్చేసరికి నాలుగైంది. అతని పక్కనే స్కూలు కమిటీ సెక్రటరీ, ప్రెసిడెంటు, ఒకాయనకి సరిగ టోపీ అయితే ఇంకో అతనికి సరిగ తలపాగా. ప్రిన్సిపాల్ గారికి మాత్రం ఇవేమీ లేవు. చక్కని క్రాపు అతనిది.

సరిగ తలపాగాల వారికి స్వాగతం పలుకుతూ ప్రారంభోపన్యాసం చేశాడు ప్రిన్సిపాలు. ఆ ఊళ్ళో అంత మంచి తమిళం మేం విన్నదే లేదు. మా తమిళ పండితులు కూడా అంత మంచి భాష మాట్లాడగా మేం చూళ్ళేదు. 'జల్ది రావోయ్' అనే అంటారు. 'నీతో బలే బేజారుగా వుందోయ్' అంటూ విసుక్కుంటారు. 'ముండా కొడుకా' అని కసురుకుంటారు. మొదటి తారీఖున 'జీతం' తీసుకుంటారు.

బడి సంస్థాపకులు, పోషకులు కార్యవర్గ కమిటీ ప్రెసిడెంటు, సెక్రటరీ వగైరాలందరినీ పేరుపేరునా ప్రశంసించి, ధన్యవాదాలర్పించేరు ప్రిన్సిపాల్ గారు. 'ఇప్పుడు ప్రార్థన' అనేసి నాకేసి చూసి 'చంద్రశేఖరం' అని పిలిచాడు. నేల మీద

కూర్చున్న విద్యార్థులు, గోడవారగా నిలుచుని వున్న అయ్యవార్లు, వేదికమీద ఆసీనులై వున్న పెద్ద మనుషులు అంతా కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా వుండిపోయారు.

'చంద్రశేఖరం' మళ్ళీ పిలిచారు ప్రిన్సిపాల్. నాకే సందేహం కలిగింది నన్నేనా పిలిచేది అని. దిక్కులు చూస్తూ కూర్చున్నాను. అలాగే చాలామంది తలలు పక్కకి తిరిగి చూసేయి. ఓ పక్కగా నించూని వున్న తమిళ పండిట్ నాకేసి చూసి 'నిన్నేనోయ్ చంద్రశేఖరం' అన్నాడు పెద్దగా. నేను మళ్ళీ దిక్కులు చూశాను. నా పక్కనే కూర్చున్న మా తరగతి విద్యార్థులు నా డొక్కలో గిచ్చారు. తమిళ పండిట్ హడావిడిగా నన్ను సమీపించి 'లేచి వెళ్ళి పాడవోయ్' అన్నాడు. నేను బెరుకు బెరుగ్గా లేచి నించున్నాను. 'త్వరగా వెళ్ళు' అంటూ ముందుకి తోశాడు తమిళ పండిట్. నేను స్టేజి వైపుకి కదిలాను. సుదీర్ఘ పయనంలా అనిపించింది.

ఆ రోజు నేను తొడుక్కున్న చొక్కా చాలా చిన్నది. నడుందాకా మాత్రమే వచ్చింది. చొక్కా కింద వదులుగా వున్న నిక్కరు, దాన్ని లాగి కట్టిన తీరు అందరికీ కనిపించేలా వుంది. అయితే అందరూ గమనించారో లేదో చెప్పలేను. చొక్కాని కిందికి లాక్కుంటూ వేదికమీదికి నడిచాను. నిక్కరు చాలా పెద్దది. నిక్కర్ కాళ్ళు ఆడపిల్ల పరికిణీ వలె టపటమని కొట్టుకుంటున్నాయి. వాటి కింద నుంచి చల్లని గాలి నా పొత్తి కడుపుని తాకి కితకితలు పెడుతున్నట్టుగా అనిపిస్తున్నది. వేదికను చేరుకున్నాను. ఒక మెట్టెక్కి వేదిక మీదకి చేరాలి. నా కాలు కొద్దిగా జారింది. నా క్రాపు మీద మంచినూనె కొంచెమైనా సెక్రటరీ పాంటుకి అంటుకొని వుంటుంది.

వేదిక మీంచి కింద పరచుకున్న మానవ మహాసముద్రాన్ని వీక్షించాను. అన్ని కళ్ళు నన్ను గుచ్చి గుచ్చి చూస్తున్నాయి. కిష్టసామి నేత్రాల్లో అసూయా, ద్వేషాలు ప్రజ్వరిల్లుతున్నాయి. వాడి తమ్ముళ్ళు, తెలిసిన వాళ్ళు, అపరిచితులు, ముఖ పరిచయం మాత్రమే వున్నవాళ్ళు నా తరగతిలో వెనక బెంచీలో కూర్చుని నన్ను బటానీలతో కొడుతూ ఏడిపించే బల్‌వంత్‌సింగ్ - వాడి టర్బన్‌లోంచి కిందికి జారిన నల్లని తలవెంట్రుకల్ని చూట్టం నా కిష్టం - అందరి కళ్ళు నన్నే పరికిస్తున్నాయి. వాడెందుకో నన్నే వురిమి చూస్తున్నాడు. కొందరి కళ్ళలో మెచ్చుకోలు, కొందరి కళ్ళలో అసూయ, కొందరి కళ్ళలో ఎగతాళి యిలా రకరకాల భావాలు. నేను వేదిక అంచుమీద నిలబడి ఈ వేదిక అమాంతం కూలిపోతే ఎంత బావుణ్ణు అనుకున్నాను.

"ఏదైనా పాడు. భక్తిపాట ఏదైనా' అంటున్నాడు ప్రిన్సిపాల్ నాకేసి తిరిగి. విశాలమైన ముఖం. ఆ ముఖంమీద గుబురుగా మీసాలు. ఆ మీసాల అడవిలో సింహాలు, చిరుతపులులు, దాసరి పాములు.

'పాడవోయ్ కుర్రాడా!'

సెక్రటరీ, ఛైర్మన్, ప్రిన్సిపాల్ అంతా ఎదురు చూస్తున్నారు నా పాట కోసం. ఎవరు నన్నీ ఇరకాటంలో నెట్టింది? ఏ బడుద్దాయి, నేను పాడగలనని ఈ ప్రిన్సిపాల్‌తో చెప్పాడు. వాడు నా జన్మ విరోధై వుండాలి. ఇందులోంచి ఎలా తప్పించుకోవటం? పాడకుండా ఈ సమావేశాన్ని విచ్ఛిన్నం చెయ్యడం సాధ్యంకాదు. ఈ క్షణం గంటలుగా, యుగాలుగా సాగిపోతున్నట్టు అనిపిస్తుంది నాకు. ఈ క్షణం బద్దలై పోయి నేను సీతమ్మ తల్లిలా భూమిలోకి కుంగిపోతే ఎంత బావుణ్ణు.

'ఎంత సేపయ్యా? భక్తిగీతం పాడవా ఏమిటి?' ప్రిన్సిపాల్ విసుక్కుంటున్నాడు.

'సినిమా పాటలు మాత్రమే తెలుసేమో' సెక్రటరీ వ్యాఖ్యానానికి అతని పక్కనుండే ఆ ముగ్గురూ నవ్వేరు. నేను కొంచెం నిలదొక్కుకున్నాను. ఇక తప్పదు. పాడాలి. ఏదో ఒకటి పాడి తీరాలి. అప్పుడు నా ఆలోచనకి తట్టింది ఒక పాట 'శ్రీరామ పాదమా', వెంటనే ఎంచేతో అది పాడాలనిపించలేదు. ఆ పాట మా సుందర భాగవతార్ – హార్మోనియం – మా ఇద్దరు అక్కలు – వీరు తప్పితే మరెవరికీ ఆ పాట పాడే అర్హత అధికారం లేదనిపించింది. పటా, పటామంటూ భాగవతార్ తొడమీద తాళం వేస్తూ గానం చేసే పాట అది. తొడని ఎగరేసి నేలకేసి బాదుతూ మరీ పాడేవాడు. దానికి వంత పాడుతూ మా ఇద్దరు అక్కలు గొంతులు చించుకునేవారు. ఒకవేళ ప్రిన్సిపాల్ హార్మోనియం వాయిస్తే నేనా పాట పాడగలనేమో.

ఎలాగైతేనేం చివరికి పాట పాడేను. ఏం పాడుతున్నానో, ఎలా పాడుతున్నానో కూడా తెలీకుండా పాడేను. సెక్రటరీ చెప్పింది నిజమే. అది సినిమా పాటే. అయితే నేనా సినిమా చూళ్ళేదు. ఆ వూరికి రావటానికి ఇంకా అది పాతబడలేదు. రేడియోలో విని మిడిమిడిగా నేర్చుకున్న పాట అది. 'నా ఎడమ భుజము, కన్ను అదిరేవెందుకో' – దుష్యంతుణ్ణి కలుసుకున్న తరువాత శకుంతల పాడే పాట అనుకుంటాను. 'శ్రీరామ పాదమా...'ని బహిష్కరించి నా మనస్సులో చోటు చేసుకుని స్కూలు సాహితీ సమితి ప్రారంభోత్సవంలో నేను పాడిన పాట 'నా

ఎడమ భుజము...' తొందర తొందరగా, కొన్ని మాటలు మింగేసి, కొన్ని చరణాలే వదిలేసి ఎలాగో పాట అయిందనిపించి కిందికి దిగేను. నేను నా స్థలంలోకి వెళ్ళి కూర్చుంటున్నప్పుడు చీమ చిటుక్కుమనేంత శబ్దం. హాల్లో వేదిక మీద నేనేం పాడేనో ఎవరికీ అర్థమై వుండదేమో.

సెక్రటరీ లేచి మాట్లాట్టం ప్రారంభించేడు. నేను కూర్చున్న స్థలం మరిచిపోయి ఎవరెవరి కాళ్ళనో తొక్కుకుంటూ వెళ్ళి ఓ చోట ఇద్దరి తొడల మధ్య నా తొడలు ఇరికించి ఒదిగి కూర్చుని వింటున్నాను. 'ఇస్... ఉస్...' మంటూ నన్ను ముందుకి తోస్తున్నారు ఆ ఇద్దరూ. నా కంతా అయోమయంగా వుంది. సెక్రటరీ మాటలు వినిపించటంలేదు. ఏదో చేస్తున్నాను కొద్ది నిమిషాలదాకా. సెక్రటరీ తన అర్థగంట వుపన్యాసంలో చాలా భాగం నా 'భక్తి గీతా'నికే కేటాయించాడు. అతనికి నేను పాడింది సినిమా పాట అన్న సంగతి తెలీదు పాపం. అలాగే చాలామందికి తెలిసినట్టు లేదు. నాకే అది ఫలానా సినిమాలో, ఫలానా సందర్భంలో, ఫలానా పాత్ర పాడిన పాట అన్న సంగతి అప్పట్లో తెలీదు. సెక్రటరీ నా పాటని ఎంతగానో పొగిడేడు. అతను తమిళ పాటలెప్పుడూ వినింది లేదు కాబోలు. తన వుపన్యాసంలో అతనొక సలహా కూడా ఇచ్చేడు!" ఇంత మంచి భక్తి పాటలో 'ఎడమ భుజము ఎడమ కన్ను అదరటం' గురించే వుంది. ఇది మగపిల్లల బడి. అందుచే ఆ పంక్తుల స్థానంలో 'నా కుడి భుజము, కుడి కన్ను' అని మారిస్తే ఉచితంగా వుంటుందని భావిస్తున్నాను. దీనిని గురించి తమిళ పండితులు ఆలోచించవలసిందిగా మనవి చేస్తున్నాను" అన్నారు.

అతని సలహాకి అంతటి ప్రభావం వుంటుందని నేనూహించలేదు. ఆ రోజంతా నేను మామూలుగా లేను. ఏదో గాలి సోకిన వానిలా పిచ్చి చూపులు చూస్తూ, అస్థిమితంగా గడిపేను. మిరియాల కషాయం కాసిచ్చింది మా అమ్మ. మా ఇంట్లో ఎవరికి ఏ జబ్బు చేసినా పడిశం, తలనొప్పి, బెణుకు, నెత్తిమీద దెబ్బ - ఏదైనా సరే మిరియాల కషాయం తాగిస్తారు. నాలుగైదు రోజులు గడిచాక ఒకరోజు బంట్రోతు గంగారాం వచ్చి నన్ను ప్రిన్సిపాల్ పిలుస్తున్నట్లు చెప్పాడు. మా స్కూల్‌లోని నలుగురు బంట్రోతుల్లో యితనొక్కడే కొంచెం ఆరోగ్యంగా వున్నట్టు కనబడతాడు. మరాటీ కలిసిన ఉరుదూ తప్పవేరే భాషరాదు. నేను గంగారాం చెప్పింది అర్థం చేసుకుని ప్రిన్సిపాల్ గదికి వెళ్ళి అతని ముందు నిలబడేసరికి బడి వదిలి పావుగంట అయివుంటుంది. అన్ని గదులు అంత పెద్ద

మైదానం మొత్తం బడి ఆవరణ అంతా నిశ్శబ్దం ఆవరించి కనిపించింది. గదిలో ప్రిన్సిపాల్ లేరు. ఆ గదిలోని ప్రతి అంగుళాన్ని పరిశీలిస్తూ నించున్నాను. అల్మేరాల నిండా ఎప్పటివో ట్రోఫీలు, షీల్డులు, కప్పులు, బూజు పట్టి దుమ్ము పేరుకొని దీనంగా దర్శనమిస్తున్నాయి. గోడలకి అయిదారు ప్రపంచ పటాలు ఇండియా, ఇంగ్లండు, అమెరికా - ఇండియాలో నైజాం సంస్థానం. మనిషి శరీర భాగాలు చిత్రించిన మరో పటం చర్మం పీకేసి నరాలు మాత్రం కనిపించేలా ఒక అస్థి పంజరం, నాలుగైదు పుర్రె ఎముకలు, పుస్తకాలు నోటు బుక్కులు మేము వ్యాసాలు రాసి మేష్టర్లకి చూపిస్తే, మేష్టరు వ్యాసం రాసి ప్రిన్సిపాల్‌కి చూపించాలి. ఆయన వాటిని తప్పులు దిద్ది కొశ్చన్ మార్కులు పెట్టాలి. ఎర్రసిరాతో గీతలు గీసి కాయితాలని ఖరాబు చేసి ఆ నోటు పుస్తకాలని మూలకి విసిరేయాలి. అప్పుడే అతడు ప్రిన్సిపాలనిపించుకుంటాడు అదే బడి న్యాయం. నియమం.

"వాట్ డూ యు వాంట్" ఆ కంఠం విని దిమ్మెరపోయి తిరిగి చూశాను. ప్రిన్సిపాల్ గది లోపలికి వచ్చాడు.

"వాట్ డు యు వాంట్?" వాట్స్ యువర్ నేమ్?" మళ్ళీ ప్రశ్నించాడు.

"గంగారాం" అంటూ గొణిగాను. ఆపైన మాట పెగల్లేదు.

"ఓ.... చంద్రశేఖరం కదూ. నువ్వేనా ప్రేయర్ పాడింది" అడిగారు ఆయన.

"ఎస్సార్"

"నిన్ననే పిలవనంపాను నిన్ను"

"గంగారాం ఇవాళే చెప్పాడు సర్"

"మన స్కూల్లో ఇంక పాడేవాళ్ళెవరైనా నీకు తెలుసా?"

"ఏమిటి సర్"

"పాడేవాళ్ళు - బాగా పాడేవాళ్ళెవరైనా వున్నారా?"

అర్థం కావడానికి కొద్ది క్షణాలు పట్టింది నాకు.

"జగన్నాధం పాడతాడు సార్. ప్రతి సారీ స్కౌట్ కాంప్ ఫైర్లో వాడే సార్ పాడేది"

"ఏం పాట?"

"తెలుగు, వురుదూ - అన్నీ పాడగలడు సార్"

"తమిళం రాదా?"

"తెలుగు పిల్లాడు సార్ వాడు"

"తమిళ పాటలు పాడేవాళ్ళు కావాలయ్యా నాకు"

"చాలా మందికి తమిళ పాటలు తెలియవు సార్"

"వరదాచారి పిళ్ళై పాడతాడని అన్నారే"

"ఎవరు సార్?"

"నీకు తెలిసిన వాళ్ళెవరూ లేరా?"

"తమిళ పండిట్ పాడతారనుకుంటాన్సార్"

"తమిళ పండిట్టా!" నవ్వేరు ప్రిన్సిపాల్.

"అదీ ఒక పాటేనా?"

నేనేమీ మాట్లాడలేదు. తిరుక్కురళైనా, తిరువాచకమైనా అన్నీ ఒకే మాదిరి రాగంతో పాడే వాడు మా తమిళ పండిట్. నాకు బాగానే వున్నట్టనిపించింది.

"మన తమిళ విద్యార్థులంతా కలిసి ఒక డ్రామా వెయ్యాలోయ్" అన్నారు ప్రిన్సిపాల్.

నేను మౌనంగా వింటున్నాను.

"మన స్కూల్లో ఇంతవరకు ఒక తమిళ నాటకం కూడా వెయ్యలేదని విన్నాను. తెలుగు, ఇంగ్లీషు డ్రామాలు వేస్తున్నారే గాని ఒక్కసారైనా తమిళం వెయ్యలేదు. ఇక నించైనా ఏడాదికి ఒకటో రెండో మనం వేసి చూపించాలి"

నాకు సంబంధించని విషయాలు వింటున్నట్టుగా నిలబడ్డాను.

"ఈ సంవత్సరం 'కర్ణన్' డ్రామా వెయ్యాలి. నా దగ్గర పుస్తకం కూడా వుంది. కర్ణుడు, అతని తల్లి కుంతి, కృష్ణుడు. వీళ్ళు ముగ్గురికీ పాటలున్నాయి. నువ్వు కుంతిగా వేసినా కర్ణుడికి, కృష్ణుడికీ మనకి మనుషులు కావాలి. నువ్వు కొంచెం పొట్టి కాబట్టి కుంతి వేషం నీకు సరిపోతుంది."

ఇప్పుడిది నాకు సంబంధించిన విషయమైపోయింది. దాంతోబాటు ఏదో ఆపదలో ఇరుక్కుంటున్నట్టు కూడా స్ఫురించింది. పొరపాటున ఒక పాట పాడేను. కాని నాటకంలో ఎన్నో పాటలు పాడగలనా? అదీ ఆడవేషం వేసుకుని. అంతా ఎందుకో నామీద కుట్ర పన్నుతున్నట్టనిపించింది. నేను ఆడవేషం వేసినట్టు మా లాన్సర్ బారక్స్‌లో తెలిస్తే ఇంకేమైనా వుందా? నాకు వొణుకు పుట్టుకొచ్చింది.

"నీకెవరైనా తెలిసుంటే చెప్పు. నేను కూడా ఒక్కో తరగతికీ వెళ్ళి

కనుక్కుంటాను." అన్నాడు ప్రిన్సిపాల్.

"సుందరం సరిగ్గా వస్తున్నాడా?"

"ఎవర్సార్?"

"అదేనోయ్. ఆ సంగీతం నేర్పించేవాడు"

అప్పుడర్థమైంది నాకు సుందర భాగవతార్ అని. ఇంకో విషయం కూడా విశదమైంది నేను పాడగలనని భాగవతారే ప్రిన్సిపాల్‌తో చెప్పి ఉండాలి.

డ్రామా టిక్కెట్లు అచ్చువేసి చాలా అమ్మగలిగేము. సికిందరాబాదు తమిళ ప్రజ అంతా 'కర్ణణ్ణి' చూట్టానికి తరలి వచ్చింది. రెండు రోజులు జరిగింది. మొదటిరోజు నాకు తెల్ల చీరె కట్టారు. రెండో దినం నల్ల చీర. నా వితంతువేషం సానుభూతి సృష్టించటానికి బదులు హాస్యానికి గురైంది. నేను స్టేజి మీదికి వచ్చినప్పుడల్లా అంతా చప్పట్లు చరుస్తూ నవ్వేవాళ్ళు. మా అమ్మ మాత్రం నవ్వకుండా, నాకేసి సూటిగా చూడకుండా నాటకం చూసింది. ఐదుసార్లు స్టేజిమీద కనిపించేను. వేదికమీదికి ప్రవేశిస్తూ నిష్క్రమిస్తూ పాట పాడాలి. ఇదిగాక సీను జరిగేటప్పుడు కూడా ఒక్కో పద్యం పాడాలి. ఒక దృశ్యంలో నేనూ, కర్ణుడూ పద్యాల్లోనే సంభాషించుకున్నాం. "నువ్వు నా కొడుకువి. నువ్వు నా సుపుత్రుడివి. నువ్వే నా కన్న కొడుకువి" అని నేను ప్రారంభిస్తే "నువ్వు నా తల్లివి. నీవే నా మాతవి, నా కన్నతల్లివి నీవే" అని కర్ణుడు చెప్పాలి. ఆ తరువాత దుర్యోధనుడికి ద్రోహం చెయ్యజాలనని, అర్జునుడు మినహా తక్కిన పాండవులతో యుద్ధం చెయ్యనని, నాగాస్త్రాన్ని ఒక్కసారి కంటే ప్రయోగించేది లేదని ప్రమాణం చెయ్యాలి. అతను మరణించేక అతని మృతదేహం మీదపడి పిలపిస్తానని అతనికి నేను మాటివ్వాలి. ఇక్కడే చాలా కష్టమనిపించింది నాకు.

"పుత్రా! నీవు పోయాక కూడా ఇంకా ఈ భూమ్మీద బ్రతికున్న పాపినైనాను కదరా" అంటూ ప్రారంభించి బిల్హరి రాగంలో విలపించటం చాలా కష్టంగా అనిపించింది. రెండో రోజు తెల్ల చీరలోంచి నల్ల చీరలోకి మారినట్టుగానే పాట రాగాన్ని కూడ మార్చి పాడేను. పాడేను అనటం కంటే ఏడ్చేను.

ఈ నాటకం ఫలితంగా నేను నిజాం కాలేజీలో చేరినప్పుడు పద్దెనిమిదిమందితో మాత్రమే ప్రారంభమైన 'టమిల్ ఎసోసియేషన్' ప్రారంభోత్సవంలో నేను తప్పనిసరిగా ప్రార్థనా గీతం పాడాల్సి వచ్చింది. తరువాత మరోపాట పాడమని బలవంతం చేశారు. అప్పుడు 'విడుదలై విడుదలై' అనే భారతియార్ పాట పాడేను.

ఆ మరుసటి రోజే హైదరాబాదు నగరం అంతా 'జాయిన్ ఇండియన్ యూనియన్' నినాదాలతో దద్దరిల్లిపోయింది. ఇది జరిగిన వారం రోజులకి ఇండియాకి స్వాతంత్ర్యం వచ్చింది. హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెస్ నిషేధించబడి బొంబాయి నుంచి పనిచెయ్యసాగింది. జయప్రకాశ్ నారాయణ్ ముఖ్య సలహాదారు. పోలీసుల కంటబడకుండా రహస్యంగా హైదరాబాదుకి వచ్చాడు కాంగ్రెస్ నాయకుడైన కాశీనాథ్ విద్యా. నన్ను అతని దగ్గరికి తీసుకెళ్ళి పరిచయం చేశాడు నరసింహారావు అనే తెలుగు కుర్రాడు. నేను పాడిన పాటని తెలుగులోకి తర్జుమా చేసి వినిపించేడు అతనికి. నిజాం సంస్థానమంతా ఆ గీతం విప్లవ గీతంగా ప్రతిధ్వనించాలని ప్రశంసించేరు కాశీనాథ్ విద్యా. అక్కడ చేరినవారికి నేనా క్షణంలో ఒక విప్లవకారునిగా కనిపించి వుంటాను.

## 3

సాలార్ జంగ్ హాల్లో ప్రొఫెసర్ రంగా గారి షేక్స్పియర్ క్లాసు ప్రారంభమైంది. రెండో రిచర్డ్ 'ఓల్డ్ జాన్ ఆఫ్ కాంట్' అంటూ రెండో రిచ్చర్డ్ ప్రారంభించేడు. రంగాగారికి విద్యార్థులు పెట్టిన పేరు 'ఓల్డ్ జాన్ ఆఫ్ కాంట్." రంగా క్లాసు ప్రారంభించే ముందు క్లాసులో చిన్న కలకలం. ఆ తరువాత సర్దుకుంటుంది. చివరి వరుసలో కొందరు హాయిగా బల్లలు మీద వాలి నిద్రపోతున్నారు. చంద్రశేఖరం చివరి బెంచీమీదే కూర్చున్నాడు. పాఠం చెపుతున్నప్పుడు ముందు వరుసలో కూర్చున్నవాళ్ళతో నేరుగా మాట్లాడుతున్న ధోరణిలో వుంటుంది ప్రొఫెసర్ రంగాగారి పద్ధతి. బోవింగ్ బ్రూక్, మోబ్రేలు రంగాగారి రూపంలో విద్యార్థుల్ని తికమకలు పెట్టేవారు. ఈ కారణంచేత ముందు వరుసలోని బెంచీలెప్పుడూ చాలా వరకు ఖాళీగానే వుండి పోవడం కద్దు. చంద్రశేఖరంలా చాలామంది పరిగెత్తుకొచ్చి చివరి బెంచీలని ఆక్రమించుకునేవారు. ఈ విషయాలేమీ పట్టించుకునే రకంకాదు రంగా. అటెండెన్స్ తీసుకోవడం పూర్తి చేసి మిగిలిన యాభై అయిదు నిమిషాలూ రిచ్చర్డ్ ది సెకెండ్ పుస్తకాన్ని చేతపట్టుకొని నటించే ధోరణిలో చదువుతూ పోయేవాడు. ఆరు పీరియడ్‌లలో పూర్తి కావల్సి వుంది ఆ పాఠం. మొదటి అంకం జరుగుతున్నది. ప్రతి రోజూ మొదటి నించీ ప్రారంభించేవాడు.

"ఓల్డ్ జానాఫ్ కాంట్" అంటూ. ఆయన కంఠధ్వని తప్ప వేరే శబ్దం

వినిపించేదికాదు. సాలార్ జంగ్ హాలు నానుకుని కాలేజీ ఆఫీసు వుంది. అక్కణ్ణించి టైపు చేసే చప్పుడు మాత్రం సన్నగా వినిపిస్తూ వుండేది. ఎప్పుడైన బయట రోడ్డు మీద మోటారు హారన్ మోత.

చంద్రశేఖరం పక్కనే కూర్చున్న మసూద్, ఎదురుగా కూర్చున్న అన్వర్ అలీఖాన్ హాయిగా నిద్రపోతున్నారు. ఇద్దరి షేర్వాణీలు చాలా ఖరీదైన గుడ్డతో తయారుచేసినవి. ఇంగ్లీషు తరగతిలో మాత్రమే ఈ హాయైన వాతావరణం నెలకొని వుండేది. సైన్సు, చరిత్ర గ్రూపు విద్యార్థులకి ఇంగ్లీషు క్లాసు కామన్‌గా వుండేది. సైన్సు గ్రూపు తీసుకున్న వాళ్ళు తప్పనిసరిగా కష్టపడి చదివి తీరాలి. వీళ్ళు వీపులు వంగి, కళ్ళు లోతుకు పీక్కుపోయి డీలాపడి కనిపించేవారు. హిస్టరీ గ్రూపు పిల్లలంతా చలాకీగా చురుగ్గా, ఉత్సాహంగా కనిపిస్తారు. అమ్మాయిలు కూడా ఎక్కువ మంది ఈ గ్రూపులో, కార్లలో వచ్చేవాళ్లు ఎక్కువ. ఆటల పోటీల్లోను, మాటల పోటీల్లోను, మాక్ పార్లమెంట్ జరపటంలోను వీళ్ళదే పై చేయి. కాలేజి యూనియన్ వైస్ ప్రెసిడెంట్, సెక్రటరీ అంతా ఈ గ్రూపుకి చెందినవాళ్ళే.

మసూద్ నిద్రలో తలని పక్కకి తిప్పినప్పుడు చంద్రశేఖరం పుస్తకం జారి కిందికి పడింది. మసూద్ కళ్ళు తెరిచి "సారీ దోస్త్" అన్నాడు. తన పొడవాటి చేతిని కిందికి చాపి పుస్తకం ఎత్తి బెంచీమీద పెట్టి మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు మసూద్. మంచి దృఢమైన భుజాలు. అమాయకంగా కనిపించే ముఖం.

షేక్స్పియర్ నాటక ప్రక్రియలోని డ్రమాటిక్ ఐరనీ గురించి చెపుతున్నాడు రంగా. ప్రేమ పాత్రుడనుకున్న జాన్ ఆఫ్ కాంట్‌ని రిచర్డ్ వుదాసీన పరుస్తాడు. ఖైదులో బంధించి, దేశ బహిష్కారం చేసి ఆస్తులు జప్తు చేసుకునే అధికారాలు పొందిన రిచర్డ్ తానే సింహాసనం కోల్పోయి జైల్లోకి నెట్టబడినాడు. అప్పుడతని ఆక్రందన జాన్ ఆక్రందనని మించిపోయింది. వీళ్ళిద్దరిని మించి రంగా ఆక్రందనే అధికంగా వుంది. షేక్స్పియర్ నాటకంలో జాన్ ఆఫ్ కాంట్ గొప్ప దేశభక్తునిగ మనకు దర్శనమిస్తున్నాడు. వృద్ధుడు, అధికారాలు కోల్పోయినవాడు. అయితే వుత్తమోత్తమ దేశభక్తునిగా వున్నత శిఖరాలందుకున్నవాడు. అతని చివరి శ్వాస ఇంగ్లాండుకా లేక అతని కొడుకుకా అనే సందేహం కలుగుతుంది మనకి. "ఓల్డ్ జాన్ ఆఫ్ కాంట్"

దేశభక్తి – రంగాగారి లెక్చర్ వినే ఓపిక కోల్పోయాడు చంద్రశేఖర్.

చుట్టూ చూశాడు. వందల కొలది విద్యార్థినులు. స్కూలు నిబంధనల ననుసరించి దుస్తులు ధరించిన వారు. వారిలో చాలా మందికి ఆ ఒక్క యూనిఫారమే వుండుంటుంది. మాసి, నలిగి, కుట్లు చినిగినవి. అయితే అమ్మాయిలకి మాత్రం డ్రెస్సు విషయంలో ఎటువంటి నియమాలు లేవు. అంతా చీరెలు ధరిస్తారు. అయితే ఆ చీరని చూసి వారి స్థితిగతుల్ని అంచనా వేయొచ్చు. మసూద్ ధరించిన షేర్వాణిని పరిశీలిస్తే అతని జీవనస్థాయి సులభంగ అర్థమవుతున్నది. అతను తినే ఆహారం, అతనింట్లో ఎంతమంది నౌకర్లు, అతని తండ్రి స్వభావం మొదలైనవన్నీ అర్థమవుతున్నాయి. ఇంత దృఢంగా వున్నా కూడా మసూద్ కి అతని తండ్రిలాంటి గట్టి హృదయం వుండకపోవచ్చు. అటువంటిది ఆ రోజు మసూద్ ఎంత తీవ్రంగా రెచ్చిపోయాడు.

ఇది జరిగి వారం పదిరోజులై వుంటుంది. ఒకరోజు హటాత్తుగా లంచ్ అవర్ లో కలకలం. హైదరాబాదులోని కాలేజీ విద్యార్థినులంతా ఒక వూరేగింపు జరిపారు. పోలీసు అనుమతి కూడా పొందారు. ప్రభుత్వంలో ప్రజా ప్రతినిధులు వుండాలి. ప్రజల కోరికలను నెరవేర్చాలి. పైకి కనిపించే కారణాలు ఇవి. అయితే వేరే కారణాలు కూడా లేకపోలేదు. ఈ నిజం బయటపడే విధంగా వూరేగింపు ప్రారంభంలోనే కొన్ని సంఘటనలు జరిగేయి. షేర్వాణీలన్నీ గుంపులోంచి విడిపోయి ఒకటిగా చేరాయి. షర్టు, కోటు, పైజమాలన్నీ ఒకటైనాయి. షేర్వాణీల కోసమని ప్రత్యేకంగా పాఠాలు జరుగుతాయి. ప్రిన్సిపాల్, ప్రొఫెసర్లు వరండాలోను, కాలేజీ భవనం ముందు నిలబడి ఎదురుచూస్తున్నారు. ఇంతకు ముందెప్పుడూ వాళ్ళు అలా తమ నిజస్వరూపాలని బహిర్గతం చేసింది లేదు. వాళ్ళ ముఖాల్లో దైన్యం వుంది. ఆందోళన వుంది. వాళ్ళలో రంగా వున్నాడు. మహమ్మద్ గని వున్నాడు. తమిళ పండిట్ వున్నారు. ప్రిన్సిపాల్ వున్నాడు.

బషీర్ బాగ్ నించి ఓ చిన్న గుంపు వూరేగింపుగా వచ్చింది. వాళ్ళతో నిజాం కాలేజీ విద్యార్థులు కలిశారు. ఒకరికొకరు పెద్ద పరిచయం కూడ లేదు. అందుచే వూరేగింపు రెండుగ చీలింది. ఊరేగింపు నాయకులు మాత్రం విద్యార్థుల్లా కనిపించటంలేదు. కొంచెం వయసు మళ్ళిన వారివలె అవుపిస్తున్నారు. రోడ్డుకి కుడివేపుగా ఊరేగింపు ముందుకి సాగిపోతున్నది. హైదరాబాదు పోలీసులు నాలుగు పక్కల నుంచీ కమ్ముకుంటున్నారు.

కసకసమని అడుగులు పడుతున్న శబ్దం. నినాదాలు లేవు. అబీడ్స్

రోడ్డుమీద వూరేగింపు మరింత పొడవైంది. పాలెస్ టాకీసు వుండేది ఇక్కడే. రోడ్డు మీంచి ఇరవై మెట్లెక్కి హాల్లోకి వెళ్లాల్సి వుంటుంది. పనిమనుషులు, రాళ్ళు, సిమెంటు చాలా చౌకగా దొరికే కాలంలో కట్టి వుంటారు ఈ హాలుని. అక్కడ బజారుగాని, సినిమా పోస్టరుగాని లేకపోతే ఇదేదో పెద్ద జమీందారుల భవంతి అని అనుకోవల్సి వస్తుంది. ఇప్పుడీ హాల్లో 'అన్మోల్ గడీ' ఆడుతోంది. సినిమా కోసం వచ్చిన వాళ్ళు మెట్ల మీద నిలబడి వున్నారు. లాఠీలు పట్టుకుని పోలీసులు చెరో పక్క కంచెలా నడుస్తుంటే సాగిపోతున్న వూరేగింపుని హాలు ముందు నిలబడిన జనం తమాషా చూస్తున్నారు. అయితే అది తమాషా అని అనుకోవడానికి కూడ లేదు. మిట్ట మధ్యాహ్నం సినిమా చూట్టానికి వచ్చేవాళ్ళు, అందులోనూ హిందీ సినిమా. ఒక వర్గానికి చెందిన వాళ్ళే మతం ఏదైనా సరే. సినిమాహాల్లో కుర్చీల మీదెక్కి నడుచుకుంటూ వెళతారు వీళ్ళు. హాల్లో బీడీలు, చుట్టలు కాలుస్తారు. వీపులు గీరుకుంటూ వుంటారు. కనబడ్డ చోటల్లా ఎంగిళ్ళు వూస్తూ వుంటారు. సినిమాని కూడా నిదానంగా చూడలేని పరిస్థితి వీళ్ళది. పంజాబ్ మైల్ అనే స్టంటు సినిమాలో హీరో హీరోయిన్లు తైతక్కలాడతారు. కొవ్వెక్కి గుండుగ వుండే నాడియా సునాయాసంగా నేలమీంచి రెండంతస్తులు పైకెగిరి రెండో అంతస్తు పిట్టగోడ మీద చెంగున వాలేది. దీపాలు పట్టుకుని వుయ్యాలలూగుతూ చెంగున బయట నిలబడ్డ గుఱ్ఱం మీదికి గెంతి 'హే' అని మెరుపులా దూసుకుపోయేవాడు జాన్ గవాస్. ఆ సినిమాలో ఓ సందర్భంలో కాంగ్రెస్ జెండా కనిపిస్తుంది. మరో సీనులో గాంధీని కూడా చూపించేవారు. హాల్లో ఒకటే గోల. కేకలు ఆ దెబ్బతో సినిమా ఆగిపోయింది. మూడు రంగుల జెండా ఏది కనిపించినా దాన్ని కిందకి దింపి ముక్కలుగా చింపి పారెయ్యాల్సిందే. అయితే అన్మోల్ గడి సనిమాలో ఈ గొడవలు లేవు. చిన్న పిల్లలుగా వున్నప్పుడు ప్రేమించుకుంటారు. పెరిగి పెద్దయ్యాక కూడా వేరే పనేమీ లేకపోవడంతో అదే పనిగా ప్రేమించేసుకుంటూ వుంటారు. నూర్జహాన్ సురేంద్రని తల్చుకుని పాటలు పాడుతుంది. సురేంద్ర నూర్జహాన్ని తల్చుకుంటూ పాడతాడు. ఆ ఇద్దరి కోసం నిజంగా పాడేది సురయ్యా.

సుల్తాన్ బజార్ మీదుగా పోతున్నప్పుడు వూరేగింపు పెద్దదైంది. ఇప్పుడు విద్యార్థులు కానివాళ్ళు కూడ చాలామంది చేరారు వూరేగింపులో. ఈ ప్రాంతంలోనే నాలుగైదు నెలల్నించి తరచుగా కొట్లాటలు జరుగుతున్నాయి. ముగ్గురు

వచ్చిపోయారు కూడాను. స్వతంత్రం రావడానికి ముందుగనే ఎవరో ఈ ప్రాంతంలో మూడు రంగుల జెండా ఎగరేశారు. మళ్ళీ ఆగస్టు పదిహేనున కూడా. ఇంత పొద్దున్నే ఎవరింత సాహసానికి ఒడిగట్టేరా అని పోలీసులకే అంతుబట్టలేదు. గడబిడ పడిపోయి ఊరంతా తిరిగారు పోలీసులు బిక్కముహాలేసుకుని, ఆ సాయంత్రం వీధుల్లో నిలబడ్డ జనాన్ని లాఠీలతో బాదేరు. సెక్షన్ 144 - బాష్పవాయు ప్రయోగం, కత్తులతో పొడుచుకోవడాలు హైదరాబాదులో జరిగిన ఈ అల్లర్ల ప్రభావం సికిందరాబాదులో కూడ కనిపించింది. నెత్తిని తడిమి చూసుకున్నాడు చంద్రశేఖరం. చిన్న చిన్న సందుల గుండా సాగి లక్‌డీకాపూల్ చేరుకుంది ఊరేగింపు. అక్కడ మూసీ నదిమీద చిన్న వంతెన. అది దాటితే మైదానం. ఊరేగింపు అక్కడికి చేరుకోవాల్సి వుంది. వంతెనకి వంద గజాల దూరంలో ఒక పెద్ద పోలీసు పటాలం నిలబడి వుంది. వాళ్ళలో పోలీసాఫీసర్లు కూడా వున్నారు. ఊరేగింపు అలాగే నిలబడి వుంది.

ఎండ తీవ్రంగా వుంది. పల్చగా సాగిన ఊరేగింపు ఇప్పుడు బాగా దగ్గరికి చేరి దట్టంగ మారింది. నాలుగు వెరగుల పోలీసులు మీటింగుకి పర్మిషన్ ఇవ్వలేదనే వార్త గుంపుల్లో గుసగుసలుగా పాకింది. నాయకులు అనుమతి కోసం ప్రయత్నిస్తున్నారు. "ఏమైనా సరే ఈ రోజు బహిరంగసభ జరిగి తీరుతుంది. ఎంతసేపైనా సరే. అంతా అలాగే కూర్చోండి ఎవరూ కంగారు పడకండి. అలాగే కూర్చోండి దయచేసి.

గుంపులో తొక్కిసలాట మొదలైంది. కొందరు వల్లగా సందుల గుండా జారుకుంటున్నారు. చంద్రశేఖరానికి ఆ ప్రాంతం కొత్త. అంతగా పరిచయం లేదు. ఇంటికి వెళ్ళాలంటే అక్కణ్ణించి ఏ బస్సెక్కాలో తెలీదు. అక్కడి మనుషులు కూడా భిన్నమైనవాళ్ళు. ఏదో వేరే దేశం ప్రజల్లా అనిపిస్తున్నారు. ఆ చుట్టుపక్కల ఒక్క స్థిరమైన ఇల్లు కూడా లేదు. అన్నీ మట్టి కొంపలు, పూరి గుడిసెలు కూడా అంత కన్న మెరుగ్గా వుంటాయనిపించింది. అతి చిన్నవైన పొట్టి గడపలు. బయట మురికి నీరు నిలిచిన కాల్వలు, భరించరాని కంపు. కుక్కలు పందులు - కోడిపిల్లలు, బాతులు, గుమ్మాలకి పాత గుడ్డ తెరలు. ఆ మాసిన తెరల వెనక ఎన్నో మాసిన బతుకులు. మురికి, అనారోగ్యం అలవాటైపోయిన జీవాలు. ఇక్కడ మతంతో ప్రమేయం లేదు. అన్నీ జీవిత పోరాటంలో అలిసి, ఓడిపోయిన జీవాలే. అయితే చిత్రమేమిటంటే మతకలహాలు చెలరేగినప్పుడల్లా కాలి

బూడిదయ్యేది వీళ్ళ గృహాలే. ఈ మట్టి కొంపలే. పగిలేవి వీళ్ళ తలలే. చితికేవీ వీరి బతుకులే.

చంద్రశేఖరం రోడ్డుమీద కూలబడ్డాడు. అతనికీ ముందు వరుసలోని జనానికి మధ్య పదడుగుల దూరమే వుంది. ముందు వరుసనానుకుని ఇనుపటోపీల పోలీసులు. ఒక్కొక్కడి చేతిలనూ లాఠీకర్రలు. వాటికి నెత్తురు మరకలు అంటవు. కర్రలకి నెత్తురే పాలిష్.

కసకసమంటూ చప్పుడు. ఆ రోడ్డు మీద రాకపోకలాగిపోయినయ్. చంద్రశేఖరం కొంచెం తలపక్కకి తిప్పి చూశాడు. వెనుక చాలా గజాల మేర జనం కూలబడి వున్నారు. వాళ్ళ వెనుక కూడా లాఠీలు ధరించిన పోలీసులు, ఇనప టోపీలు ఎవరేం చేస్తున్నారో తెలీటంలేదు. వూరేగింపుని ఏర్పాటు చేసిన నాయకులేమైనారో కనిపించటంలేదు. ఎక్కడ చూసినా పోలీసుల మయంగానే వుంది. ఇంక ఎంతసేపు ఈ స్మశాన నిశ్శబ్దం.

టప టప శబ్దంతో రెండు మోటారు సైకిళ్ళు నలుగురు పోలీసు అధికారుల్ని ఎక్కించుకుని ఆ మైదానం చుట్టూ తిరిగాయి. ఇక లాఠీ ప్రయోగం తప్పదనే భీతి అందరిలోనూ వ్యాపించసాగింది.

భయంతో చుట్టూ కలయజూశాడు చంద్రశేఖరం. అతని చుట్టూ వెల్లువలా చుట్టుకున్న జనసమూహం. ఒక్కటీ అతనికి తెలిసిన ముఖంకాదు. ఊరేగింపు ప్రారంభంలో కనీసం అతని కాలేజీ విద్యార్థులు యాభై మందయినా వున్నారు. ఇప్పుడు ఒక్కడూ కనిపించటంలేదు. మధ్యలోనే జారుకున్నారా? లేక వూరేగింపులో ఇంకెక్కడైనా చిక్కడిపోయారా? అయ్యో! ఎంత బుద్ధి మాలిన తనం. వెనకా ముందూ తెలీని ప్రాంతానికి ఈ వూరేగింపుని నమ్ముకుని వచ్చామే! తల పగిలి ఇక్కడే పడి ఛస్తే ఇంకేమైనా వుందా?

ముందు వరుసలోని వాళ్ళు పోలీసులతో ఏదో మాట్లాడుతున్నారు. కాని పొరపాటున అటూ ఇటూ కదిలినా లాఠీలతో నెత్తిమీద బాది బుద్ధిగ కూర్చో కదలకుండా అంటున్నారు పోలీసులు. ఆ పోలీసులు అక్కడ్నించి కదిలి చంద్రశేఖరం దగ్గరికి రావడానికి నిమిషం కూడ పట్టదు. టిక్కమొహం వేసుకుని ఒక పోలీసు ఆఫీసరు ఊరేగింపు ముందుకొచ్చాడు. కింద కూర్చుని వున్నవాళ్ళ ముఖాలన్నీ పరికించి చూస్తున్నాడు. చంద్రశేఖరం ముఖం మీద ఒక్క క్షణం అతని చూపులు నిలిచాయి. అతని యూనిఫారం మీది ఇత్తడి బొత్తాములు ఆ ఎండకి తళ

తళ మెరిశాయి. భుజాలకి రంగుల పట్టాలు. బాగా అనుభవం గల ఆఫీసరై వుంటాడు. అతనికీ పిల్లలుండి వుంటారు. తన కొడుకు కూడా ఈ గుంపులో వున్నాడేమో అని వెతుకుతున్నట్టుగా వున్నాయి అతని చూపులు. మరో పోలీసు వానువచ్చి ఆగింది. వేరే యూనిఫారాలు ధరించిన పోలీసులు దబదబమని దిగేరు దాంట్లోంచి. వాళ్ళంతా ముఖాలకి ఇనప ముసుగులు తొడుక్కొని వున్నారు. బాష్పవాయు ప్రయోగం చేసే విభాగానికి చెందిన పోలీసులు. ఇప్పుడు ఊరేగింపు జనం ఒక నిర్ణయానికి రావాలి. వెళ్ళిపోతారా? లేక తన్నులు తింటారా? గుంపుల్లో కలకలం అధికమైంది.

అలాగే కూర్చోండి. ప్రాణం పోయినా సరే ఇక్కణ్ణించి కదలకండి. చిన్నపిల్లలు కూడా లాఠీ దెబ్బలకి గురి కావాలా? పిల్లల్ని మాత్రం వెళ్ళిపోనివ్వండి?

ఎందుకు వెళ్ళాలి? వెళ్ళడానికి వీల్లేదు. అట్లాగే ఎక్కడి వాళ్ళక్కడ కూర్చోండి. పోలీసులు కొడితే అట్లాగే నేలమీద పడుకోండి. కొందరప్పుడే ఏడ్పులు ప్రారంభించారు. చంద్రశేఖరానికి దగ్గరగా కూర్చున్న పిల్లలు "అమ్మా" నాయనోయ్! కాపాడండి" అంటూ అరుస్తున్నారు. పుస్తకాల సంచుల్ని తలలమీద అడ్డుగా పెట్టుకుంటున్నారు. చేతి గుడ్డలల్ని తడిపి కళ్ళకి అద్దుకోండి. బాష్పవాయువు అప్పుడేమీ చెయ్యదు" అంటూ ఎవరో అరుస్తున్నారు. తడపడానికి నీళ్ళేవి? దగ్గర్లో వుండే మూసీ నదిలో కూడా ఎక్కడా సన్నని పాయలు తప్ప వేరే నీళ్ళు లేవు. అక్కడి కెళ్లాలన్నా చాలా దూరం నడవాలి. లాఠీ దెబ్బల్ని తప్పించుకోకుండా వెళ్ళడం సాధ్యంకాదు. అయినా ఇంత పెద్ద గుంపులోంచి తిన్నగా అక్కడికి వెళ్ళగలగడం సాధ్యమవుతుందా? బాగా చిక్కుకుపోయాను.

బాష్పవాయు ప్రయోగం చేసే పోలీసులు సైనికుల్లా కమ్ముకుంటున్నారు. నాలుగు వేపుల్నించీ పోలీసు ఈలలు. మైకులోంచి ఉర్దూలో హెచ్చరిక. మూడే నిముషాల్లో అంతా చెదిరిపోవాలి. మూడే నిమిషాలు గుంపులో కలకలం చెలరేగింది. గోల. అరుపులు, కేకలు, పెద్దలు చిన్నలు అంతా అడ్డదిడ్డంగా పరుగులు. కొందరు వాళ్ళని ఆపి నిలబెట్టే ప్రయత్నం చేస్తున్నారు. వాళ్ళని తోసుకుని పరుగులు తీస్తున్నారు.

"అమ్మా!" అని కేక పెట్టాడు చంద్రశేఖరం. అతని భుజం మీద ఎవరో చెప్పుకాలితో బలంగా తొక్కి వెళ్ళారు. చంద్రశేఖరం కూడా పైకి లేచి పరిగెట్టే ప్రయత్నం చేశాడు. ఎటువేపుకి పరిగెట్టాలో కూడా అర్థంకాని పరిస్థితి. ఊరేగింపు

వెనక వరుసలో కొందరు వయసు మళ్ళిన వారున్నారు. వాళ్ళింకా కదల్లేకున్నారు. ముందు వెనుకలు పోలీసులే. ఎడం వేపున తలుపులు మూసిన ఇళ్ళు. ఏడెనిమిది ఇళ్ళకి చిన్న చిన్న సందులు. అప్పుడే చాలా మంది నిండిపోయి వున్నారు ఆ సందుల నిండా. ఇంకా కొందరు అక్కడ జొరబడే ప్రయత్నంలో వున్నారు.

మొదటి బాష్పవాయు తూటా ప్రయోగించారు. గుప్పున ఏదో ఘాటు వాసన. ఆ వెంటనే దట్టమైన పొగ, క్షణాల్లో కళ్ళు మంటలు. అరుపులు 'అమ్మా! అబ్బా!'

పిచ్చిగా ఒక సందులోకి దౌడు తీశాడు చంద్రశేఖరం. చేతిలోని పుస్తకాలు కొన్ని జారి కింద పడినయ్. అయినా లెక్క చెయ్యకుండా పరిగెట్టాడు. అతడు దూరిన సందులో వందమంది పైగా కిటకిటలాడుతున్నారు. చటుక్కున ఒక ఇంటి గుమ్మం తలుపు తట్టాడు చంద్రశేఖరం. చిన్నగా నెట్టాడు. తెరుచుకుంది. లోపలికి దూరి తలుపు మూశాడు. చాలా పాత ఇల్లే అయినా ముందు చిన్న వసారా. అక్కడ పాతవి అల్యూమినియం గిన్నెలు మసిబారి పడి వున్నాయి. ఆ వసారా నానుకుని మురికి నీటి కాలువ. రెండు కోడి పెట్టలు రెక్కలు టపటపలాడించుకుంటూ లోపలికి పరిగెత్తేయి. ఆ ఇంట్లో ఒక ఆకారం - ఎముకల గూడులా ఓ ముసిల్ది. మాసి మరగడమైన పాత గుడ్డ కప్పుకుని వుంది. నోరు తెరిచింది. పై దవడ పళ్ళు వూడివున్నాయి. మిగిలిన పళ్ళు గారపట్టి అసహ్యంగా వున్నాయి. ఆమె నోరు తెరిచి అరవబోయింది. చంద్రశేఖరం రెండు చేతులూ ఎత్తి ఆమెకి దణ్ణం పెడుతున్నట్టుగా అర్థించాడు అరవొద్దని. ఆమె అరిచే ప్రయత్నం మానుకుంది.

ఆ మసూద్ గాడికి ఇదంతా తెలీదు. వాడిలాంటి షేర్వాణీ గాళ్ళకి ఇది అర్థం కాదు.

"మీరేనటోయ్ మా నిజాంని గద్దె దించేది?" అని అపహాస్యం ఆడ్డం మాత్రమే తెలుసు వాళ్ళకి. రెండు మూడు సార్లు నిజాం నవాబుని చూసి వున్నాడు చంద్రశేఖరం. నిజాం నవాబు కోసం విజిల్ వూది తక్కిన రాకపోకల్ని నిలిపేవారు పోలీసులు, నవాబుగారి కారు రయ్‌మంటూ దూసుకుపొయ్యేది. మసీదుకి పోతూ కనిపించేవాడు. కారు వెనక సీట్లో ఓ మూలకి వొదిగి కూర్చుని కనిపించేది నిజాంగారి ఆకారం. ఆ నిజాంని తను గద్దె దించగలడా? 'హిస్ ఎక్సాల్టెడ్ హైనెస్ మీర్ వుస్మాన్ ఆలీఖాన్ బహదూర్ బ్లాకావల్ లో ఇంకా ఏదేదో తోక. ఈ నిజాం

నవాబు, ఆ పెంకుటింట్లో పళ్ళూడిన ముసిల్ది ఏదో జన్మలో ఒక తల్లి బిడ్డలై వుండాలని అనిపించింది ఎందుకో చంద్రశేఖరానికి. ముస్లింలకి మరుజన్మలుంటాయా? లేవనే అనిపిస్తుంది. మరి అచ్చం ఆ నిజాంని ఒలిచి పెట్టినట్లుగా వుంది ఈ ముసిల్దాని ఆకారం. ఆ ముసిల్దానికి సంబంధించినంత వరకు నిజాం పరిపాలిస్తేనేం, శివాజీ పాలిస్తేనేం, అశోకుడు రాజ్యం చేస్తేనేం. ఆమె బతుకు బాగుపడనంత కాలం ఎవరు ఏలితేనేం. ఎన్ని తరాలుగా ఆమె ఆ పేదరికంలో మునిగి ఆకలితో, అనారోగ్యంతో, అశుద్ధంతో మగ్గిపోతున్నదో. ఇంకా ఎన్నేళ్ళు ఇలానే మురిగిపోనున్నదో. ఫూదితే కిందపడిపోయేలా వుంది. ఒక్క దెబ్బకి చచ్చిపోయేట్టుగా కూడా వుంది. అతని అభ్యర్థనని మన్నించి అతడ్ని రక్షించింది. లేకుంటే ఆ రోజు తలలు పగిలి చచ్చిన వాళ్ళలో తనూ ఒకడై వుండేవాడే. ఈ మానవతని, జాతి భేదాలకి అతీతమైన ఈ బంధాన్ని మసూద్ అర్థం చేసుకోగలడా?

షేక్స్పియర్‌ని జమాయించి పారేయిస్తున్నాడు ప్రొఫెసర్ రంగా. జాన్ ఆఫ్ కాంట్ యొక్క వివేకం, సహనం, దేశభక్తి – మూర్ఖుడూ, అహంభావీ అయిన రాజు పట్ల కూడా అచంచలమైన దేశభక్తి. జాన్ ఆఫ్ కాంట్ కూడా రాజవంశీయుడే. రిచర్డ్‌కి బంధువే. ఎన్నో భోగభాగ్యాలు అనుభవించవలసిన వాడు. అతని కాలంలో కూడా ఆ పళ్ళూడిన ముసల్దాని వంటి పేద జీవులు వుండి వుంటారు. పేదల జనాభా కూడ ఎక్కువే వుండి వుంటుంది. ఆ రోజుల్లో సైతం వాళ్ళంతా కూడా ఈ జాన్ ఆఫ్ కాంట్ వలె వేదాంతం, తర్కం కలిపి సుదీర్ఘంగా, మాట్లాడి వుంటారా? అసలు వాళ్ళకి మాట్లాడే ఓపిక వుండేదా? ఆ ముసిల్దానికి కంఠం వుందా? ఆ ముసిల్దే మాట్లాడగలిగితే ఆమె చేత కూడా ఒక మాటకి రెండర్థాలు ఒక వాక్యానికి నాలుగు భావాలు వచ్చేలా మాట్లాడించి వుండేవాడా ఈ షేక్స్పియర్? ఈ షేక్స్పియర్ వాలాని హైద్రాబాద్‌కి లాక్కువస్తే ఎలా వుంటుంది? తల పోటెత్తింది. రెండు చేతుల్తోటీ కణతలదుముకుంటూ బెంచీమీద వాలాడు చంద్రశేఖరం. మసూద్ చంద్రశేఖరం కేసి చూశాడు. కన్ను కొట్టాడు. చంద్రశేఖరం ముఖం తిప్పుకున్నాడు. అతని చెవిని మెలి తిప్పాడు మసూద్. చంద్రశేఖరం అతడ్ని విదిలించాడు.

"చోడ్ దో యార్" అన్నాడు.

"గుస్సా మత్ కరో దోస్త్" బుజ్జగింపుగా అన్నాడు మసూద్. మళ్ళీ చిలిపిగ

కన్ను కొట్టాడు. అయితే అది మామూలుగా అనిపించలేదు చంద్రశేఖరానికి.

క్లాసు ముగిసింది. అంతా వేరే గ్రూపు తరగతులకి వెళ్ళాలి. మసూద్‌ని వొదుల్చుకుని సైన్సు తరగతుల కేసి పరిగెట్టాడు చంద్రశేఖరం. ప్లే గ్రౌండులో రెండు టీములు క్రికెట్ ఆడుతున్నారు.

## 4

"విడుదలై ! విడుదలై" గీతం పాడినందుకు ఇంత ప్రభావం వుంటుందని నేననుకోలేదు. మా కాలేజీలో జరిగే తెలుగు ఉరుదూ అసోసియేషన్ మీటింగులకి హాలు నిండిపోయేది. అదే టమిల్ ఎసోసియేషన్ మీటింగుకు కుర్చీలన్నీ ఖాళీగా కనిపించేవి. ఇతర గ్రూపుల విద్యార్థులు కొందరు ముందే వచ్చి ఓ పదినిమిషాల పాటు కూర్చుని వెళ్ళిపోయేవారు. కాలేజీలో తమిళం తెలిసిన లెక్చరర్లు అయిదుమంది వున్నా మా తమిళ విద్వాన్ తప్ప ఇంకెవరూ ఆ మీటింగులకి హాజరవరు. అన్ని మీటింగులకు ప్రిన్సిపాల్‌గారే అధ్యక్షులు. అంచేత ఆయన రావడం తప్పనిసరి. వచ్చి మధ్యలో వేసిన కుర్చీలో ఓ అయిదు నిమిషాలు కూర్చుని అతనూ వెళ్ళిపోయేవాడు. నేను విడుదలై గీతం పాడినప్పుడు ఆ పాటని తంబిముత్తు విన్నాడన్న సంగతి నాకు తెలీదు. నాకు తెలిసే అవకాశం కూడా లేదు. నేను పాడేటప్పుడు ఏదో ఆవేశంలోను, పరవశంలోను వుండిపోయాను. ఆ సందర్భంలో తంబి ముత్తు నాకేసి చిరునవ్వుతో మెచ్చుకోలుగా చూస్తే అది మరెవరినో అనుకున్నాను. తంబిముత్తు కెమిస్ట్రీ ప్రొఫెసర్, లెక్చరర్లతో నాకెక్కువ చనువు కూడా లేదు. ఒక అనామధేయునిగా మాత్రమే మెలిగేవాణ్ణి. దూరదూరంగ మెలిగేవాడిని. అయినా నాలోనూ కొన్ని ప్రత్యేకతలున్నాయని తెలిపేవి అప్పుడప్పుడు జరిగే కొన్ని సంఘటనలు. అందులో ఒకటే ఈ తంబిముత్తు వ్యవహారం. ఆ సాయంత్రం అతని గదిలోకెళ్లి అతని ముందు నించున్నాను.

"రావోయ్ రా. నువ్వు తమిళ పిల్లాడివా?" అంటూ తమిళంలో ఆహ్వానించేడు.

"నీ పేరేమిటి" అనడిగేడు. నాలుగు నెలలకి పైగా అతని క్లాసులో చదివేను. కెమిస్ట్రీ ప్రాక్టికల్సులో హైడ్రోజన్ సల్ఫైడ్ సీసా మూతని పగలగొట్టి అందరూ ముక్కులు మూసుకుని పరిగెత్తేలా చేసి వున్నాను. సైన్సు గ్రూపులోనే అందగత్తెగా పేరుగాంచిన అమ్మాయితో ప్రాక్టికల్సు చేసివున్నాను. ఒకసారి ఈ తంబిముత్తు చేతనే 'వెధవా' అనిపించుకుని వున్నాను. అయినా ఈయనకి నా పేరు తెలీకుండా జాగ్రత్తపడ్డాను.

నా పేరు చెప్పాను.

"నీవు పాడగలవని నాకు తెలీదే"

మా హైస్కూల్ ప్రిన్సిపాల్ గుర్తొచ్చాడు నాకు. అతనూ ఇలాగే ప్రారంభించాడు. ఆ తరువాత నాకు చీర చుట్టబెట్టి వేదిక నెక్కించి తమాషా చూసేడు.

"ఏం పాట అది?"

"ఏది సార్?"

"అదేనోయ్, టమిల్ డే రోజున పాడేవే"

"విడుదలై సార్?"

"అవును. ఏమిటది?"

"విడుదలై సర్"

"ఏదీ పాడు"

"ఇక్కడా సార్?"

"అవును"

"ఇప్పుడా సార్?"

"అవును. ఏం ఇంటికెళ్ళడానికి టైమైందా?"

"అవున్సార్...అహ...లేద్సార్"

"రెండు నిమిషాలే కదయ్యా. చాలా బాగా పాడేవు ఆ రోజు. పాడు ఒకసారి."

"తెలవదు సార్"

"పాడవయ్యా బెట్టు చెయ్యక"

ఈజిప్షు ఫెరోలు మొదలుకుని మేడం క్యూరీదాకా రకరకాల ఆత్మలు గోడలకి వేళ్ళాడే గదిలో నిలబడి విడుదలై పాడేను.

"భేష్. దీన్ని అలాగే నాకు రాసివ్వు" అలవాటు ప్రకారం తటపటాయించేను.

"ఇది తమిళ గీతం సార్"

"తెలుసు"

"దీన్ని తమిళంలోనే రాయాలిసార్"

"అవును. నాకు తమిళం రాదనుకుంటున్నావా?"

"లేద్సార్... అలాగే సార్"

కెమెస్ట్రీ ప్రాక్టికల్సు నోటు పుస్తకంలోంచి ఒక పేజీ చింపి ఆ పాట రాసిచ్చేను.

ఆ కాయితాన్ని చేతికి తీసుకుని కాస్సేపు పరిశీలించేడు తంబిముత్తు.

"నేను వెళ్ళొచ్చా సార్?" అడిగేను.

"తొందరెందుకు? కూర్చో" అన్నాడు. నేను నిలబడే వున్నాను. పాటని వదిలేసి పాఠాల గురించి అడుగుతాడేమో ననే భయం నాకు. ఆ యేడు సిలబస్‌లో డికెన్సు 'కవర్లీ పేపర్సు' వుంది మాకు. అందులో విల్ హానీకాంబ్ అనే ఒక పాత్ర వస్తుంది. ఇతడు సంపన్నుల కుటుంబంలో జన్మించి ఎంతో కొంత చదువుకున్నాడు కూడాను. అయితే ఒక లక్ష్యం అంటూ లేకుండా ఎప్పుడూ వేటాడుతూ, స్త్రీ వ్యామోహంలో మునిగి తేలుతూ వుంటాడు. ఎందుకో మరి తంబిముత్తుకి విద్యార్థులు 'విల్ హానీకాంబ్' అనే పేరు పెట్టారు. నేను అతని గదిలో నిలబడి వుండగా ఇంగ్లీషు పాఠం బాగా గుర్తొచ్చింది.

"మళ్ళీ పాడు" అన్నాడు.

"మళ్ళీ సార్?" అన్నాను.

"అవును. పాడు" అన్నాడు.

కాయితాన్ని అతని చేతిలోంచి తీసుకున్నాను. పాడేటప్పుడు ఒక రకంగా వున్న పాట అక్షరాల రూపంలో కొన్ని మార్పులకు లోనైంది. ఎలాగో మళ్ళీ ఒకసారి పాడేను.

నాతోబాటు అతనూ గొంతు కలిపాడు. మేమిద్దరం పాడటం వేరెవరైనా వింటున్నారేమోనని భయపడ్డాను. పాటలో శృతి తప్పడంలో ఆ భయం వెల్లడైంది. తంబి ముత్తుకి కూడా శృతి లయల మీద అంత నమ్మకం వున్నట్టు లేదు. మేమిద్దరం చేరి ఎన్నిరకాల శబ్దాలు లేవదియ్యాలో అన్ని రకాల శబ్దాలనూ శృతిచేసి పాడసాగేము. తంబి ముత్తు సంతోషానికి అంతులేదు. సంగీతానికి ఇంతటి శక్తి వుందన్న సంగతి నాకు తెలీదు.

"చూడయ్యా. నేను తమిళపాట పాడటం ఇదే మొదటిసారి" అని వొప్పేసుకున్నాడు. "నేను వెళ్ళనాసార్" అడిగేను మూడోసారి. "వుండవయ్యా. ఎందుకట్టా తొందరపడిపోతున్నావు? ఇప్పుడు వెంటనే బస్సుందా నీకు?" "సైకిల్ వుంది సార్ నాకు"

"అయితే ఇంకేం. ఎప్పుడైనా వెళ్ళొచ్చులే. ఇప్పుడు నేనొక్కణ్ణే పాడతాను. సరిగ్గా వుందేమో చూడు"

తంబి ముత్తు పాడేరు. సర్వస్వతంత్రుడై పాడేరు. ఎవరూ కనీ వినీ ఎరుగని శబ్దాలని రాగాలని పలికిస్తూ పాడేరు. పాడ్డం ముగించి విజయగర్వంతో నాకేసి చూసి "సరిగ్గా పాడేనా?" అన్నారు.

"బాగనే వుంది సార్" అబద్ధమాడేను. "ఒక్కసారి వింటే చాలోయ్ ఇట్టే పట్టేస్తాను. నువ్వు ఆ రోజు పాడేవు చూడు అప్పట్నించీ ఈ పాటనే సాధన చేస్తూ వచ్చాను తెలుసా?" నేను మౌనంగా వుండిపోయాను. "ఇంతకీ ఇది ఎవరు రాసిన పాట?" అడిగేరు.

"భారతియార్" అన్నాను.

"ఎవరూ?"

"భారతి సార్"

"ఎవరాయన? ఇప్పుడున్నాడా?" అప్పుడు భారతియార్ గురించి నాకు తెలిసిందల్లా ఎట్టయాపురంలో అతని కోసం స్మారకచిహ్నం నిర్మాణానికై 'కల్కి' పత్రిక నిధి వసూలు ప్రారంభించడం మాత్రమే. దీన్ని గురించిన ప్రకటన ఆ పత్రికలో నెలల తరబడి వచ్చింది. భారతియార్ గురించికన్నా నిధికి డబ్బులిచ్చిన వాళ్ళని గురించే నే నెక్కువగా చదివేవాడిని. మా నాన్న కూడా ఒక చిన్న మొత్తం వసూలు చేసి 'కల్కి' పత్రిక్కి పంపేడు. ఆయన పేరు కూడా ఆ పత్రికలో ప్రచురించేరు. ఈ శతాబ్దపు నా తమిళ సాహితీ పరిజ్ఞానం మా వూరికి ముక్కుతూ మూల్గుతూ వచ్చే కల్కి, 'ఆనంద వికటన్' పత్రికలతో ముడివేసుకుని వుండేది. తంబిముత్తులాంటి వాళ్ళకైతే అదీ లేదు. అతను హైదరాబాదుకొచ్చి ఎంత కాలమైందో ఏమో.

భారతదేశం స్వతంత్రమైన సంవత్సరంలో నేను, తంబిముత్తు కలిసి "విడుదలై పాటద్వారా భారతియార్‌కు అంజలి ఘటించాము. "చాలా చక్కని పాటోయ్" మెచ్చుకున్నాడు తంబిముత్తు. "నువ్వు పాడకపోతే దీని గురించి నాకు తెలిసేదే కాదు."

"నాకింకా రెండు పాటలు తెలుస్సార్. ముందు వాటిలో ఏదైనా పాడాలనుకున్నాను. అయితే అవి కొంచెం పెద్ద పాటలు."

"అవన్నీ నాకూ నేర్పించవయ్యా"

"ఈ రోజు కాదు సార్"

"ఇంకో రోజేలే. మరో సంగతి..."

"ఏమిటి సార్"

"ఈ సంగతి ఎవరితోనూ చెప్పకు"

ఏ సంగతి అన్నది నాకర్థం కాలేదు.

"అదే నేను పాట నేర్చుకున్న సంగతి"

"సరే సార్"

ఊరుకోకుండా పుసుక్కున ఒకమాటన్నాను.

"ఈ పాటని తెలుగువాళ్ళు కూడా నేర్చుకోవాలనుకుంటున్నారుసార్."

"అలాగా? ఎవరు?"

"నరసింహారావు సార్"

"ఎవరా నరసింహారావు?"

'ఎ' బాచ్ స్టూడెంటు సార్. కాంగ్రెస్ లీడర్"

ఆ మాట వినడంతో తంబిముత్తు ముఖం కందిపోయింది.

"వాళ్ళతో కలవకుండా జాగ్రత్తపడు"

"అదే వీలు కావటం లేదు సార్".

కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు తంబిముత్తు. "చంద్రశేఖర్ నువ్వు మనవాడివని చెప్తున్నాను. నీకిదంతా వొద్దు."

"సార్. నేను సంతకం కూడా పేట్టేను సార్" అని వేలు చూపించాను.

"ఏమిటది?"

"నెత్తురుతో సంతకాలు చేసి వున్నాం సార్"

"వాట్ నాన్సెన్స్"

"నేను ఇక వెళ్ళనాసార్"

"ఏమిటా సంతకం?"

నేను బదులు పలక్కుండా నిలుచున్నాను.

"ఆ సంతకం ఏమిటి?" గద్దింపుగా అడిగేరు. "మా దగ్గర ప్రమాణం చేయించుకున్నారు సార్."

"ఏమని."

"... ..."

"పలకవేం? ఏమని ప్రమాణం చేశారు." ఆవేశంగా లేచి నిలబడ్డారు తంబి ముత్తు.

"డిసెంబరు ఒకటో తేదీనించి రోజూ కాలేజీగేటు ముందు సత్యాగ్రహం చెయ్యబోతున్నాం సార్"

మండిపడ్డాడు తంబిముత్తు.

"గెటవుట్... గెటవుట్"

నేను వేగంగా వెలుపలికొచ్చాను. కాని గుమ్మందాటుతుండగా "చంద్రశేఖరం" అంటూ పిలిచాడు తంబిముత్తు. గుమ్మంలోనే నిలబడి వెనక్కి తిరిగి చూసేను.

"ఇలారా"

అతని మేజా దగ్గరికి నడిచేను. లేచి వెళ్ళి గది తలుపు మూసి వచ్చాడు. అప్పటికే చీకటి పడుతున్నది బయట. గదిలో వెలుతురు చాలా తక్కువగా వుంది.

"అంతా వివరంగా చెప్పు" అన్నాడు తంబిముత్తు నాకెదురుగా కూర్చుని.

ఏమీ చెప్పకూడదని తీర్మానించుకున్నాను. అతనిది గ్రహించాడు.

"చూడు చంద్రశేఖరం! అనవసరంగా నువ్వు చెడిపోవడం నా కిష్టంలేదు. ఎవరెట్లాగైనా పోనీ. ఈసారి మళ్ళా స్ట్రైకు, గీకు అంటే మాత్రం వెంటనే రస్టికేషన్ తప్పదు."

రస్టికేషన్ అనేది ఒక రకమైన శిక్ష అని మాత్రమే తెలుసు నాకు.

"నన్ను నమ్మి అంతా చెప్పు. ముందు ముందు నీకు మేలు జరగొచ్చు"

నా పట్టుదల క్రమంగా సడలింది. నరసింహారావుతో వెళ్ళి హైద్రాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ నాయకుణ్ణి రహస్యంగా కలుసుకున్న సంగతి చెప్పేశాను. రహస్యంగా కరపత్రాలు పంచిపెట్టిన వైనం గురించి చెప్పాను.

"ఆ కరపత్రం వుందా నీ దగ్గర?"

"లేదు సార్"

"ఏం నోటీసది?"

– దిగంబరరావ్ బిందు అనే ఆయన ఢిల్లీలో వల్లభాయ్ పటేల్‌ని కల్సుకుని మాట్టేడేడు. ఎవరి ఆలోచనో తెలీదు. నిజాం రజాకార్ల దుండగాలని ఎదిరిస్తూ హైద్రాబాద్ కాలేజి విద్యార్థులు ఇంకా తీవ్రంగా పోరాడాల్సి వుంది. ఈ పోరాటంలో మొదటిఘట్టమే ఈ ప్రమాణ స్వీకారం. రెండు పేజీల ప్రమాణపత్రంలో అంతా సంతకాలు చెయ్యాలి. ఆ రోజు నాతోబాటు పదిహేను మంది సంతకం చేశారు. రక్తంతో సంతకం! నా వేలికి బ్లేడుతో గాటు పెట్టారు. నెత్తురు బొటబొట కారింది. నా నెత్తుర్లోనే పేనాని అద్ది ఇద్దరు ముగ్గురు సంతకాలు చేశారు. ఇంకుతో

రాసిన అక్షరాల కింద ఈ నెత్తురు సంతకం చాలా మసగ్గా అస్పష్టంగా కనిపించింది. రాయటానికి నెత్తురు అంతగా వుపయోగపడదు.

ఇంత దృఢ నిశ్చయంతో, నిశ్చలంగా కూర్చున్న తంబిముత్తుని నివ్వెరపోయి చూస్తున్నాను.

"ఇందులో అమ్మాయిలు కూడా వున్నారా?"

"ఉన్నారు సార్. అయితే మన కాలేజీ గరల్సెవ్వరూ లేరు"

"అమ్మాయిలున్నారని చేరావా నువ్వు కూడా"

"అబ్బే! అదేం కాదు సార్"

మళ్ళీ లేచి నిలుచున్నాడు తంబిముత్తు.

"చూడు చంద్రశేఖరం. నేను ప్రామిస్ చేస్తున్నాను. ఈ విషయం నేనెవ్వరికీ రిపోర్టు చెయ్యను. నేను చెప్పేది విను. ఈ గొడవల్లో ఇరుక్కోవటం వల్ల నీ కెలాంటి మేలూ జరగదు. ఆదర్శాలుండటం మంచిదే. నాకూ వున్నాయి కొన్ని. నీ దగ్గర పాట నేర్చుకున్నానే ఎందుకు? అందులో నీ గొప్ప భావాల కోసమే. అయితే ఈ వూళ్ళో ఈ ఆదర్శాలన్నీ ఎందుకూ పనికిరావు. నా సంగతే తీసుకో. ఈ కాలేజీలో ఇరవయ్యేళ్ళ సర్వీసైంది. ఒకసారి ఇంగ్లండు వెళ్లడానికని సెలవు అడిగాను. ఉద్యోగం వొదలుకుని వెళ్ళమన్నారు. ఎప్పుడో నేను వైస్ ప్రిన్సిపాల్ని కావలసింది. కాని నాకు ప్రమోషన్ రాకుండా చేశారు. నేనెవరికైనా స్కాలర్షిప్ రికమెండ్ చేస్తే దాన్ని రాకుండా చేశారు. ఇక్కడ ఉంటేతురక టోపీ అయినా వుండాలి, లేదా తలపాగా వాడిగానైనా వుండాలి. నాలా క్రాపుమనిషి గొంగళివలె పడి వుండాల్సిందే" కెమిస్ట్రీ లెక్చరర్లు కూడా ఇంత బాగా మాట్లాడగరా అనిపించింది నాకు.

"చంద్రశేఖరం. ఇది చాలా క్లిష్టమైన కాలం. ఇష్టం వున్నా లేకపోయినా ఇక్కడే చదువు పూర్తి చేసి ఇక్కడే వుండిపోవటం మంచిది. ఈ స్టేట్లో చదువుకున్న విద్యార్థికి బయటెక్కడా గుర్తింపు లేదు. ఉద్యోగాలల్లేవు. మెర్జర్ వల్లా, యూనియన్ వల్లా మీకు వొరిగేదేమీ లేదు. నాకు బాగా తెలుసు. హైదరాబాద్ వాణ్ణి ఎవరూ గౌరవించటంలేదు. ఇంతకాలం ఇలా కొనసాగిన పద్ధతి ఇక మీదట మారబోతుందా ఏమి? ఇంత కాలమూ దొరలు అధికారం చెలాయించేరు. ఇకనించీ గాంధీ టోపీలు చెలాయిస్తారు. మనకు సంబంధించినంత వరకు ఇద్దరూ

ఒకటే. మంచికో చెడ్డకో మనం ఇక్కడ ఇరుక్కున్నాం. ఇక్కడే అల్లాట్టం మంచిది. వేరే వె...నికి లేదు" తంబిముత్తు ఆవేశం చూస్తుంటే ఏడ్చేస్తాడేమోననిపించి .

అతని గదిలోంచి బైటపడే సరికి బాగా చీకటి పడింది.

"బ్లేడుతో కోసుకున్నావే. అయోడిన్ రాసుకున్నావా? సెప్టిక్ కాకుండా చూసుకో" గదిలోంచి తంబిముత్తు మాటలు వినిపించేయి.

## 5

"హిందు పత్రిక మళ్ళీ రావటం ప్రారంభించింది. ఒకరోజు సాయంత్రం సోమసుందరం లైబ్రరీలో ఒక కట్ట పత్రికలని టేబిల్ మీద పెట్టి వెళ్ళాడు ప్యూను. కనీసం అవి పదిరోజుల పత్రికలై వుండాలి. ఆరుగంటల కల్లా తలుపులు మూసేడు. మరుసటి రోజు వెళ్ళిచూస్తే ఆ రోజు పత్రిక మాత్రమే కనిపించింది మేజామీద.

ఆ రోజు పత్రిక తిరగేసి బైటికొచ్చాడు చంద్రశేఖరం. నెలకి నాలుగణాలు మాత్రమే చందా. ఆ లైబ్రరీకి అతను చందా కట్టి రెండు నెలలైంది. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో పెద్ద పెద్ద హెడ్డింగులుంటాయి. అయితే క్రికెట్ స్కోరు చూడాలంటే 'హిందూ'లోనే చూడాలి. 'ఎక్స్‌ప్రెస్'లో హెడ్డింగులేగాని వివరాలు చాల తక్కువ. నిజాం నవాబుని, అతని పరిపాలనని తూలనాడుతూ చాలా ఘాటైన వార్తల్ని ప్రచురించేది 'ఎక్స్‌ప్రెస్'. అంచేత ఆ పత్రికను ఇక్కడికి రాకుండా బ్యాన్ చేసేరు. హిందూ పత్రికని కూడా ఆపేస్తే వార్తల కోసం మూడు ప్రాంతీయ పత్రికల మీద మాత్రమే ఆధారపడాలి. 'డెక్కన్ క్రానికల్' 'హైదరాబాద్ బుల్లెటిన్' డైలీన్యూస్ ఈ మూడూ ఒక్కొటి నాలుగు పేజీలు మాత్రమే. అవి కూడా చాలా చిన్నసైజువి. క్రికెట్ స్కోరుకి స్థలం చాలదు.

కింగ్స్వే మీదుగా సైకిల్ని నడిపించుకుని వెళుతున్నాడు చంద్రశేఖరం. నిన్న పెద్దవర్షం పడింది. ఊరంతా చల్లగా వుంది. పది, పదిహేను దినాలు కాస్త చల్లగానే వుంది. నిజాంకి, ఇండియన్ సర్కారుకి మధ్య ఒక తాత్కాలిక ఒప్పందం కుదిరింది. స్టాండ్ స్టిల్ అగ్రిమెంట్' అన్నారు దీన్ని. ఏడాదిపాటు వుంటుంది. ఇండియన్ గవర్నమెంటుకి హైదరాబాదు బాధ కొంత తగ్గినట్లయింది. దీని

మూలాన అయితే వేరే చిక్కులొచ్చిపడినయ్. కాశ్మీర్, ఢిల్లీలలో రెఫ్యూజీల కలవరం, మహాత్మాగాంధీ గారి సత్యాగ్రహం.

ఈ పరిస్థితుల్లో సైతం ఇండియానుంచి మొదటిసారిగా ఒక క్రికెట్ టీము ఆస్ట్రేలియాకి వెళ్ళింది. బెర్త్‌నగర్ మ్యాచి పేరుకి మాత్రమే. అడిలైడ్‌లో బ్రాడ్‌మెన్ వంద పరుగులు తీశాడు. ఆ తరువాత ఆడిన ఇండియన్ టీములో అమర్‌నాథ్ 144 పరుగులు తీసి డూలండ్ బంతి విసరగా సాగర్‌ని స్టంప్ చేసి ఔటైపోయాడు. ఈ ఫోటోని ఒక్క హిందూ పత్రిక మాత్రమే ప్రచురించింది. అమర్‌నాథ్, సాగర్ నవ్వుతూ నుంచున్నారు. ఆ తరువాత మేచి మెల్‌బోర్న్‌లో. అమర్‌నాథ్ 288 నాటవుట్. సిడ్నీలో ఆస్ట్రేలియాని ఇండియా ఓడించింది. మన్‌కడ్‌కి ఎనిమిది వికెట్లు. బ్రిస్‌బేన్‌లో అమర్‌నాథ్ 172 పరుగులకి నాటవుట్. ఇండియాకి ఎంతో ప్రతిష్ఠ. ఈ వార్తలన్నీ హైదరాబాద్ పత్రికల్లో కనిపించవు. ఇండియా పరాయి దేశం వీళ్ళ దృష్టిలో. ఇండియా టీములో ఒక్కడు కూడా హైదరాబాదుకి చెందినవాడు లేడు. గులాం అహ్మద్‌ని తీసుకెళ్ళి వుండాల్సింది. తమిళుడైన భూపతిని తీసుకుని వెళ్ళి వుండవచ్చు. ఎప్పుడో ఒకసారి వచ్చే 'హిందూ' పత్రికలోనే ఈ వివరాలు తెలిసేది. నిజాం ప్రభుత్వం ఇతర పత్రికల్ని నిషేధించకుండా వుంటే ఒక రోజు ఆలస్యంగానైనా క్రికెట్ స్కోరు తెలుసుకునే వీలుండేది. మద్రాసునించి హైద్రాబాదుకి పత్రిక రావాలంటే రైల్లో ఒకరోజు పడ్తుంది. ఎంతోమంది ఇలా ఒకరోజు ప్రయాణం చేసి హైదరాబాదు నుంచి వేరే రాష్ట్రాలకి తరలిపోతున్నారు.

ఇంకా సైకిల్‌ని నడిపించుకుంటూ పోతున్నాడు చంద్రశేఖరం. పగటివేళల్లో కూడా నగరంలో జనసంచారం బాగా పల్చబడి కనిపిస్తున్నది. ఇళ్ళు కూడా చాలావరకు మూసివున్నాయి. కొన్నిరోజుల క్రితం కొన్ని వందల కుటుంబాలు బోలారంలో నివాసమేర్పరచుకున్నాయి. కొంత రక్షణ వుండేది అక్కడి భారత సేనల మూలంగా. అయితే ఇప్పుడు స్టాండ్ స్టిల్ అగ్రిమెంటు మూలంగా సేనల్ని అక్కడ్నించి తరలించాల్సి వుంది. అదివరకు వున్న రక్షణ కూడా లేకుండా పోతుంది అక్కడి కుటుంబాలకి. నిజాం రోజుకి మూడుసార్లు మసీదుకి వెళుతూనే వున్నాడు. విజిళ్ళు వూది పోలీసులు రాకపోకల్ని నిలుపుతూనే వున్నారు. రజాకార్ల ఆటలింకా సాగుతూనే వున్నాయి. ఇండియన్

సర్కార్ హైదరాబాద్ ప్రభుత్వాన్ని ఏమీ చెయ్యజాలదు కాబోలు.

ఆర్యభవన్ హోటల్ ముందు కూడా రెండు మూడు సైకిళ్ళు మాత్రమే కనిపిస్తున్నాయి. సికింద్రాబాదులో కమ్మని కాఫీ, వడ, వేడి వేడి ఇడ్లీ లభించేది ఈ ఒక్క ఆర్యభవన్‌లో మాత్రమే. రెండేళ్ళుగా వుంది ఈ హోటల్. తృప్తిగా రెండు ఇడ్లీ సాంబారు, ఒక స్ట్రాంగ్ కాఫీ పావలా మాత్రమే. లైబ్రరీ చందాకూడా నాలుగణాలే. హైదరాబాద్ నాణెం కాకుండా బ్రిటిష్ పావలా అయితే ఇంగ్లీషు సినిమా మ్యాట్నీకి కూడా వెళ్లిరావొచ్చు. ఇప్పుడు బ్రిటీషు నాణెం అనకూడదు కాబోలు. ఇండియా నాణెం. స్కూళ్ళలో కూడా లెక్కల పాఠాలు మారిపోయినయ్. "వంద రూపాయల ఇండియా నాణేలకి హైదరాబాద్ నాణేలు నూట పదహారు రూపాయల పదణాల ఎనిమిది దమ్మిడీలైతే, ముప్పై ఇండియా రూపాయలకి ఎన్ని హైదరాబాద్ రూపాయలు?"

నిక్కరు జేబులు తడిమి తను తెచ్చుకున్న అర్ధణా భద్రంగా వుందా అని చూసుకున్నాడు చంద్రశేఖరం. కాలేజీకి వెళ్ళటం మానుకున్నప్పట్నించి చేతిలో డబ్బులాట్టంలేదు. ఈ అర్ధణా అయినా ఎక్కడో మూలలో కనిపించింది. కాలేజీకి వెళ్ళకుండా ఇంట్లోనే వుండటం మొదట అమ్మ గమనించింది. సంగతేమిటని అడిగింది. ఏదో సర్దిచెప్పాడు. రెండు మూడురోజుల్లో నాన్న కూడ నిలదీసి అడిగే పరిస్థితి రాకముందే మళ్ళావూళ్ళో గలాటాలు ప్రారంభమైనాయి.

ఎనభై మందికిపైగా బలమైన గాయాలు. పదిమందికిపైగా మరణించేరు. ఫలితంగా స్కూల్సు, కాలేజీలు వారం రోజులపాటు మూత. ఆ వారంలోనే 'స్టాండ్ స్టిల్ అగ్రిమెంటు'. అంటే ఏమిటి? దాని ఫలితాలు, పర్యవసానం ఏమిటి అన్నది మాత్రం ఎవరికీ తెలీదు. ఇండియా ప్రభుత్వం నిజాం విషయంలో జోక్యం కలిగించుకోదు. నిజాం ప్రభుత్వం ఇండియా విషయంలో జోక్యం కలిగించుకోదు. నిజాం ప్రభుత్వం అసలెందుకు జోక్యం కలిగించుకోవాలి? ఇతరులు తన విషయంలో జోక్యం కలిగించుకోరాదనే కదా అతని కోరిక. అతని కోరకే నెరవేరింది ఇప్పుడు. ఇక ఎన్నటికీ యిది తురుష్కుల సామ్రాజ్యంగానే మిగిలిపోతుంది. ఎంతో కాలంగా అలాగే వుంటూ వచ్చింది. అయితే ఆ రోజుల్లో ఎవరికీ వైరాలు లేవు. ప్రాణాలకి భయపడి వూరొదిలి పారిపోలేదు. ఇప్పుడు అంతా ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని బతుకుతున్నారు. 'ఉన్నట్టుండి వీడు ఏ

ప్రాంతం వాడు? ఎవరికి విశ్వాసపాత్రుడు?' అనేది ముఖ్యమైపోయింది. తన విశ్వాసాన్ని నిరూపించుకోవాల్సిన అవసరం కూడా వచ్చి కూచుంది. అలా నిరూపించుకోవాలంటే కొన్ని ముఠాలతో కలిసిపోవాలి. వాళ్ళ కార్యక్రమాల్లో పాల్గొనాలి. తక్కిన ముఠాలకి దూరంగా వుండాలి. రెండున్నర శతాబ్దాలుగా అవసరంలేని నినాదాలు ఈనాటి నిజాం నవాబుకి అత్యవసరమైనాయి.

'అజాద్ హైదరాబాద్ జిందాబాద్.'

కింగ్స్ వేలో మిట్టగా వుండే ప్రదేశం చేరుకున్నాడు చంద్రశేఖరం. ఎడంవేపునకి తిరిగితే మోండాకి వెళ్ళొచ్చు. సైకిలెక్కితే పల్లం వేపునకి వేగంగా దిగి బైబిల్ హవుస్ దగ్గర ఆగొచ్చు. కుడివైపునకు వెళితే రాణీగంజ్ వస్తుంది. సైకిలెక్కి రాణీగంజ్ వేపు పోనిచ్చాడు. జేమ్సు స్ట్రీట్ మీదుగ నల్లకుంట చేరుకుని ఒక ఇంటిముందు సైకిల్ దిగి తలుపు తట్టేడు. పైట లేకుండా కమీజు మాత్రమే వేసుకున్న ఒకమ్మాయి తలుపు తీసింది. "నాన్నగారున్నారా"? అడిగేడు చంద్రశేఖరం. పలక్కుండా లోపలికి నడిచింది. ఆమె ననుసరించేడు. పేము పడక్కుర్చీలో కూర్చుని వున్నాడతను.

"రావయ్యా బాబూ" అన్నాడు చంద్రశేఖరాన్ని చూసి. అతనికి దగ్గరగా వెళ్ళి నుంచున్నాడు. చంద్రశేఖరం. "కూర్చో రా. రొట్టి తింటావా?"

"ఒద్దు, ఒకసారి మిమ్మల్ని ఇంటికి వచ్చి వెళ్లమన్నాడు నాన్న"

"అయితే టీ తీసుకో. ఇదిగో చూడూ! కొంచెం చాయ్ బనావ్"

పుట్టినప్పట్నుంచీ కడలూరులోను, మాయవరంలోనూ గడిపి, హఠాత్తుగా తన అరవయ్యోయేట సికింద్రాబాదు కొచ్చి స్థిరపడ్డాడు సయ్యద్. అప్పట్నించి తెలిసీ తెలియని ఉర్దూలో మాట్లాట్టం అలవాటు చేసుకుంటున్నాడు.

"ఊఁ... ఏమిటోయ్? ఎందుకు మీ అబ్బ నన్ను రమ్మనటం?"

"తెలీదు... నిన్ననే పిల్చుకు రమ్మన్నాడు. కాని నాకీరోజే కుదిరింది."

"నిన్నే ఎందుకు రాలేదోయ్. కాలేజీకి వెళ్ళేవా?"

లేదు. నిన్న కాలేజీ లేదు.

"ఈ కాంగ్రెసోళ్ళు ఎంత గలభా చేస్తున్నారో చూసేవా?"

"విద్యార్థులందరినీ పట్టుకుని చావబాదుతున్నారట కదా. నిన్నెవడైనా ఏమన్నా అన్నాడా?"

"పోలీసోళ్ళు రెండుసార్లు మమ్మల్ని తరుముకుంటూ వచ్చారు బాబాయ్. నాన్న మీతో చెప్పాడో లేదో సికింద్రాబాదులో ఇద్దరు రజాకార్లు నా తల బద్దలు కొట్టినంత పనిచేశారు."

"రజాకార్లా? వుండరు. వాళ్ళు చాలా మంచివారోయ్. ఈ కాంగ్రెసోళ్ళకి భయపడి ఒదిగి ఒదిగి దాక్కుంటున్నారు పాపం. ఎన్ని ఇళ్ళని తగలబెట్టారని, ఎన్ని ఇళ్ళని దోచుకున్నారని, అన్నిటికంటే ఘోరం - తల్చుకుంటేనే వొళ్ళు గగుర్పొడుస్తోంది. స్త్రీలని, పసిబిడ్డల్ని ఎంత నీచంగా అవమానించారని. ఎందరు జనానా స్త్రీల పరదాలని చంపేరో తెల్సా? వీళ్ళ కిదేం పాడు బుద్ధి అంట. వీళ్ళకి నిజాం ఎన్ని వసతులు కల్పించి వున్నాడు! వీళ్ళని ఎంత సంతోషంగా వుంచాలనుకుంటున్నాడు. కుక్కల్లా విశ్వాసంగా పడి వుండక నవాబునే ఎదిరిస్తున్నారా? కాల్చి పారేస్తాం ఏమనుకుంటున్నారో. ఈ నిజాం రాష్ట్రానికి వెలుపల ఎక్కడోయ్ ఇన్ని వసతులుండేది? బియ్యంలేవు. చక్కెరలేదు. కట్టెల్లేవు. బట్టల్లేవు. అన్నిటికీ రేషనే. మెడ్రాస్ ప్రెసిడెన్సీలో వున్నవాడినే కదా. ఒక్క రోడ్డైనా సక్రమంగా వుండదు. బస్సులు సరిగ్గా లేవు. ఈ వూరి బస్సులతో సరితూగే బస్సులెక్కడైనా వున్నాయా అని. ఇంకా ఏం కావాలటోయ్ ఈ కాంగ్రెసోళ్ళకి? ఇక్కడ ఉద్యోగాల్లో కూడా సగానికిపైగా హిందువులే కదా? ఇంకా ఏమిటోయ్ కొరత వీళ్ళకి?"

"ఇక్కడ జనాభాలో ముప్పాతిక మందికిపైగా హిందువులే కదా. మరి వుద్యోగాలకి వద్దన్నా వాళ్ళే కదా దొరికేది".

"ఎందుకు దొరకరోయ్. ఎందుకు దొరకరూ అంట. ఈ వూళ్ళో వుండే బిచ్చగాళ్ళంతా ముస్లింలే అని తెలుసా నీకు? ఎంతమంది తిండికి లేక చచ్చిపోతున్నారు. ఇప్పుడు ఎక్కడ్నుంచో వచ్చి పడే రెఫ్యూజీలే లక్షలమంది వున్నారు. ఒరేయ్! నువ్వు కాంగ్రెసోడివా? చెప్పు. నీ తండ్రి మంచితనాన్ని చెడిపెయ్యొద్దురోరే. చెప్పు. నువ్వూ కాంగ్రెసోడివేనా?"

"అసలు ఇప్పుడిక్కడ కాంగ్రెసెక్కడుంది బాబాయ్. పార్టీని నిషేధించి అందర్నీ జైల్లో తోసేరుగా"

"రాడీమూక. ఊరంతా నాశనం చేస్తున్నారు. ఇప్పుడందర్నీ విడుదల చేశారు. అసలు వీళ్ళని బైటికి వొదలచ్చా అని. అందర్నీ గానుగలో వేసి నొక్క

పిప్పి పిప్పి చేసి పారెయ్యాలి. ఒరేయ్! నువ్వైనా బుద్ధిగా మసలుకోరా."

"మీ రెప్పుడొస్తున్నారు బాబాయ్? ఈ రోజొస్తారా?"

"ఈ రోజు వీలు కాదోయ్. నాకు పెరేడ్ వుందీవేళ"

"మిలిటరీ పెరేడా?"

"కాదురా. సివిల్ వాలెంటర్స్ అని, నువ్వూ చేరతావా? నే చెప్పి చేర్పిస్తాను. అయితే నీకు మస్కెట్ ట్రైనింగు అదీ ఇవ్వరనుకో"

"ఒద్దులే బాబాయ్"

"సరేలే. మీకే ట్రైనింగులన్నీ ఎందుకులే. మేమెటూ మీ కోసం ప్రాణాలకి తెగించి పోరాడబోతుంటే"

"నే వెళతాను బాబాయ్"

"టీ తాగి వెళ్ళరా. నీ కోసం పెట్టమన్నాకదా. జీ! తయార్ హోగయా?"

టీ అధ్వాన్నంగా వుంది. ఇంత గంజి నీళ్ళలాంటి టీ ఇదివరకు అతను తాగింది లేదు. హైదరాబాద్ వారి వలె టీ తయారు చెయ్యటం కూడా రాదు ఈ సయ్యద్‌కి అనుకున్నాడు చంద్రశేఖరం.

సయ్యద్ ఇంట్లోంచి బయటకు వస్తుంటే సయ్యద్ పెద్దకొడుకు ఎదురయ్యాడు చంద్రశేఖరానికి. చంద్రశేఖరాన్ని చూసి చిన్నగా నవ్వేడు. ఏదో ఇబ్బందిలో ఇరుక్కున్నవాడివలె వుంది అతని వాలకం. సయ్యద్‌లో కనిపించే ఆవేశమూ, ఆ వుత్సాహమూ ఇతనిలో కనిపించటంలేదు. ఇక్కడ అతనికి సన్నిహిత మిత్రులెవరూ వున్నట్టులేదు. తండ్రి విశ్వాసాలు ఇతణ్ణి ఆకర్షించినట్టు లేదు. అదే మాయవరం, కడలూర్లలో అయితే ఇతను ఇంత దిగాలుగా కనిపించేవాడు కాదేమో. ఇతను కూడా రేపు పెరేడ్‌కి వెడతాడు. ఇష్టం లేకున్నా తండ్రి లాక్కుని వెళతాడు. పంధొమ్మిదో శతాబ్దపు తుపాకీని చేత పుచ్చుకుని లెఫ్ట్‌రైట్ చేస్తాడు. తన తండ్రి, ఈ సయ్యద్ స్నేహితులు. తండ్రి సంగతేమోగాని సయ్యద్ దృష్టిలో మాత్రం తండ్రి తంజావూరు జిల్లాలో ఏదో పల్లెటూళ్ళో చదువుకునే పిల్లవాడితో సమానం.

'ఈ కాంగ్రెసోళ్ళ అక్రమాలు గమనించావురా?' తండ్రి కూడా తనలాగే అభిప్రాయపడుతున్నాడనే విశ్వాసం సయ్యదుకి. సయ్యద్‌వలె, తండ్రి వలె ఒకే కోణంలోంచి ఇప్పుడు సికిందరాబాదులో జరిగే అల్లర్లని పరిశీలించటం సాధ్యమా?

పంశలించి ఒకే నిర్ణయానికి రావడం సంభవమా?

సయ్యద్ కొడుక్కి నాసిర్ అలీఖాన్, మసూద్ ల వయస్సు వుంటుంది. అయితే ఆ ఇద్దరూ ఈ పరిస్థితుల్లో కూడా తమ దైనందిన జీవితానికి ఏ భంగమూ వాటిల్లకుండా మసగలుగుతున్నారు. నాసిర్ అలీఖాన్ తండ్రి ఒక పెద్ద పోలీసాఫీసరు. ఎన్నో తరాలుగా ఈ సంస్థానంలో పెద్ద ప్రభువులుగా చెలామణీ అయిన కుటుంబం వాళ్ళది. మరీ విపత్కర పరిస్థితుల్లో అయితే చెప్పలేంగాని - ఇప్పుడు కూడా కొంతవరకు అల్లకల్లోలంగా వున్న పరిస్థితే. తమ ఆందోళనని కనబర్చకుండా కప్పిపుచ్చుకుంటున్నారు. తమలో ఎన్ని వాదించుకున్నా, పరాయివాళ్ళ దగ్గర రాజకీయాలు మాట్లాడకుండా జాగర్త పడతారు. రెండు రోజుల క్రింతం చెప్పి పంపాడు నాసిర్ అలీఖాన్ - వచ్చే ఆదివారం క్రికెట్ మ్యాచ్ వుంది. నువ్వు తప్పక రావాలి అని. కాలేజీకే వెళ్ళటంలేదు. మాచ్ కి ఎలా వెళ్ళడం? సుందరసింగు వెళ్ళగలడు. వాడికే గొడవలూ లేవు. ఇప్పుడున్న పరిస్థితిని అతనసలు లెక్కచెయ్యటమే లేదు. **అతనికి సంబంధించినంతవరకు** అతనొక విద్యార్థి. స్పోర్ట్సుమేన్. బుల్ బుల్ **తారా వాయించగల**వాడు. ఇరాని హొటల్లో దూరి పెట్టింది తినగల సమర్థుడు. ఆదివారంపూట టై, కోటు ధరించి చర్చికి వెళ్ళేవాడు. అసలు తన డ్రెస్సు చూపించుకోవడానికే అతను చర్చికి వెళుతున్నాడా అనిపిస్తుంది. అతని కంటె రెండాకులెక్కువే అనిపిస్తాడు మారిస్. ఎప్పట్లాగే చీకూ చింతాలేని ఆంగ్లేయుడు. అతనికిప్పుడు జరుగుతున్న గొడవలతో నిమిత్తం లేదు. తనూ ఒక క్రిస్టియన్ గానో, యాంగ్లో ఇండియన్ గానో పుట్టి వుంటే ఎంత బావుండేది.

రాణిగంజ్ దాటి, నల్లకుంటలో ఒక సందు మలుపు తిరిగి నరసింహారావు ఇంటి ముందు నిలబడ్డాడు చంద్రశేఖరం. ఆ వరుసలో అయిదారు ఇళ్ళు చాలా రోజుల్నించీ మూసే వున్నాయి. ఆ ఇంటి గోడలమీద బొగ్గుతోను, సుద్దతోనూ ఏవేవో రాతలు, నినాదాలు అడ్డదిడ్డంగా రెండు మూడు చిత్రాలు. జెండాకర్ర, జెండాలో నెలవంక. ఇదే వీరి చిహ్నం. అలాంటి వీధిలో నరసింహారావు ఇల్లు మాత్రమే తెరచి వుంది. అయితే ఈ ఇంట్లో చాలామంది అద్దె కుటుంబాలుండేవి. అంతా వెళ్ళిపోయి ఒకటి రెండు కుటుంబాలు మాత్రమే వున్నట్టున్నాయి ఇప్పుడు.

"నరసింహారావ్! నరసింహారావ్" అని పిలిచాడు చంద్రశేఖరం. ఒక

ముసలావిడ తొంగి చూసింది లోపల్నించి.

"నరసింహారావున్నాడా?" అడిగేడు. లేడన్నట్లుగా చేతులూపింది ఆవిడ. రెండు వారాలుగా నరసింహారావు కనిపించనేలేదు. అల్లర్ల మూలంగా కాలేజీ మూసెయ్యడానికి వారం రోజులు ముందు నుంచే పత్తాలేదు. ఆ రోజు తనని, మరో పదిహేను మందినీ ఏదో ఇంట్లో సమావేశపరచి నెత్తురుతో సంతకాలు తీసుకొన్నది ఈ నరసింహారావుగాడే. 'సంతకాలు చేశారు. ఇక కాలేజీకి వెళ్ళకూడదు తెలిసిందా' అని హెచ్చరించేడు. ఆ తరువాత ఏమైంది? ఇలాగే వుంటే సమస్య పరిష్కారమైనట్టేనా?

"ఎప్పుడొస్తాడు" అడిగాడామెని.

"తెలవదు"

"ఊళ్ళోనే వున్నాడా?"

"నాకేం తెలవదు" అనేసి ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

"నేనూ నరసింహారావూ స్నేహితులం. ఒకే క్లాసులో చదువుతున్నాం" అన్నాడు చంద్రశేఖరం.

సమాధానం లేదు. దభాల్న తలుపు మూసుకుంది. కాసేపు అలాగే నిలబడిపోయాడు చంద్రశేఖరం. తిన్నగా వెనక్కి తిరిగేడు. కిటికీ తెరలని తొలగించి రెండు కళ్ళు అతణ్ణి గమనించటం చూశాడు. అవి నరసింహారావు కళ్ళలాగే వున్నాయి.

## 6

అల్లర్లు సద్దుమణిగాక మళ్ళీ స్కూళ్ళు, కాలేజీలు తెరిచారు. ఆర్నెల్ల పరీక్షలు, సెలక్షన్ పరీక్షలు అయిపోయాక ఇక క్రిస్టమస్ సెలవులు ఇవ్వాల్సి వుంది. వర్షాలు కూడా క్రమంగా తగ్గిపోయినయ్. ఎండ తీక్షణత క్రమంగా పెరుగుతున్నది. అయినా తెల్లవారుజామున పొగమంచు కమ్ముతూనే వుంది. హుసేన్‌సాగర్ ప్రశాంతంగా వుంది. టాంక్‌బండ్ మీద గాలి విసురు బాగా తగ్గిపోయింది. ఈ రోజుల్లో టాంక్‌బండ్ మీద మైలుదూరం నడిచినా, సైకిల్ తొక్కినా ఎంతో హాయిగా ఉంటుంది. మీర్జా ఇస్మాయిల్‌కి ప్రధానమంత్రిగా పనిచేసిన చట్టారీ నవాబు పదవీచ్యుతుడైనాడు. తరిమివేయబడ్డాడు. ఇప్పుడు

లెయిక్ అలీ ప్రధానమంత్రిగా వున్నాడు. చట్టారీ నవాబు భవంతి ముందు రజాకార్లు ఆందోళన చేశారు. రజాకార్ల నినాదాలని చట్టారీ నవాబు అంతగా గౌరవించలేదన్నదే అందుకు కారణం కోపోద్రిక్తులైన రజాకార్లు నవాబు ఇంట్లోకి చొరబడి ఎంతో ప్రీతితో పెంచుకున్న నవాబుగారి మీసాన్ని సగానికి పూడబెరికేశారు. నవాబు పదవి నించి దిగిపోతున్నప్పుడు నిజాం ఒక మాట కూడా మంచిగా అనలేదు అతన్ని గురించి. అయితే ఇప్పుడొచ్చిన లెయిక్ అలీకి ఈ అవస్థలన్నీ వుండవు. ఎందుకంటే అతనికి మీసాలేలేవు కనుక. అంతేకాదు ఇతను ఖాసిం రజ్వీకి కావలసినవాడు. ఇంకా ఇతని దృష్టి టాంక్ బండ్ మీద ప్రసరించినట్టులేదు. మీర్జా ఇస్మాయిల్ చేసిన మార్పులతో అట్టాగే వుంది టాంక్‌బండ్. ఆ మార్పులు టాంక్‌బండ్‌కి ఎంతో అందాన్ని తెచ్చి పెట్టాయనే చెప్పాలి. ఏటి గట్టు పొడవునా గోడ అడ్డుగా నిలిచి వుండటం మీర్జా ఇస్మాయిల్‌కి నచ్చలేదు. గోడని పడగొట్టించి ఇనప కమ్మీలతో ఫెన్సింగ్ కట్టించాడు. దాని పొడవుతా బాల్కనీల వంటివి నిర్మించి నడిచి వెళ్ళేవాళ్ళు కూర్చుని విశ్రాంతి తీసుకునేందుకు ఉపయోగపడేలా చేశాడు. చిన్న చిన్న కూర్పులే అయినా ఎంతో చక్కదనం తెచ్చిపెట్టాయి టాంక్‌బండ్‌కి. సైకిల్ దిగి ఒక బాల్కనీ దగ్గర నిలబడి ఏటికేసి చూశాడు చంద్రశేఖరం. దూరంగా ఓడ ముందు భాగం వలె కనిపించే హైదరాబాద్ బోటింగ్ క్లబ్ భవనం, దాని వెనకాతల ఉస్మానియా టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్. పద్దెనిమిదో శతాబ్దపు రాజభవనంలా గోపురాలతో కట్టబడినట్టుగా వుంది అది. ఏటిని అన్ని వేపులనించి బాగా చూడొచ్చు ఈ బాల్కనీ మీద నుంచుని. రెండు మైళ్ళు దాకా వ్యాపించిన ఈ బ్రహ్మాండమైన చెరువుకి అవతలగట్టున కొన్ని బంగళ్ళాలు. వాటి వెనకాతల బంజారాహిల్స్. కుడివేపుగా చీలి ప్రవహించే కాల్వ మీద రైల్వే వంతెన. వంతెన మీదికి రైలు చేరిన రెండు మూడు క్షణాలకి గాని గర్జనలు మించి రైలు నడిచే శబ్దం వినిపించదు. శబ్ద తరంగాల వేగమెంత? క్షణానికి సుమారు వెయ్యి అడుగులేమో. ఆ వంతెన ఇక్కడ్నించి ముక్కాలు మైలు దూరం వుంటుందేమో.

చంద్రశేఖరం వంతెనని, దాని వెనకచెట్లని, అక్కడక్కడా వున్న బంగళాలని వీటన్నిటి వెనక పరుచుకున్న నీలాకాశాన్ని చూస్తూ నిలుచున్నాడు. కాలేజీకి వెళుతూ ఎన్ని తడవలో కాసేపు ఈ బాల్కనీ మీద నించి వెళ్ళాలని అనుకునేవాడు.

అయితే ఒక్కసారి కూడా వీలుకాలేదు. ఇప్పుడు కాలేజీలు తెరిచినా తను వెళ్ళకుండా వున్నాడు. మరి కాసేపు ఇక్కడే నిలబడదాం అనిపించింది అతనికి.

ఇంకా ఎంత కాలమని ఇలాగే వుండిపోవడం? నెత్తురుతో సంతకం చేయించుకున్నాడు ఆ నరసింహారావుగాడు. ఇది చాలదన్నట్టు తన నెత్తుర్లోనే పేనాలు అద్ది ఇద్దరు ముగ్గురు సంతకం చేశారు. క్విట్ కాలేజ్ మూమెంట్. కాలేజీలను బహిష్కరించండి. ఒదిలి వెళ్లిపొండి. ఇంగ్లీషు మీడియం వున్నది ఈ ఒక్క కాలేజీలోనే. దాన్ని వొదిలేసి పో. ఇప్పుడొదిలేసినట్టే. ఇక తరువాత కార్యక్రమం ఏమిటి? ఈ విషయం అడగడానికే నరసింహారావు ఇంటికి వెళ్ళేడు. కాని ఇంట్లో వుండి కూడా లేడనిపించేవాడు వాడు. ఇటువంటి వాడ్ని నమ్మి తను ప్రమాణం చేశాడు. నెత్తురు నీటికంటె చిక్కనైనది. ఇంకు కన్నా కూడా చిక్కనిదే అయి వుండాలి. అలక్ష్యం చేయగలమా?

టాంక్‌బండ్ మీద వాహనాల రద్దీ లేదు. నిజాం ప్రభుత్వం కొన్ని కొత్తరకం బస్సులు మెత్తగా సాగిపోతున్నాయి. పాతబస్‌లు కూడా వెళుతూనే వున్నాయి. ఎక్కువగా పొగని వదలి వెడుతున్నాయి. కొత్తబస్సుల ఇంజన్ శబ్దం వినిపించటమేలేదు. వీటినే కాబోలు సయ్యద్ అంతగా మెచ్చుకున్నది.

సైకిలెక్కి తిన్నగా హైదరాబాదుకేసి పోనిచ్చాడు చంద్రశేఖరం. కాలేజీలో మూడో పీరియడ్ జరుగుతూ వుంటుంది. ఆ తరువాత లంచ్ అవర్. తొందరగా భోజనం ముగించి టేబిల్ టెన్నిస్ ఆడే వాళ్ళు సాలార్‌జంగ్ హాలుకి పరుగెడతారు. టేబిల్ టెన్నిస్ టోర్నమెంటు ప్రారంభమై వుంటుంది. తను కూడా కాలేజీకి వెడుతూ వుండి వుంటే టోర్నమెంటులో చేరివుండొచ్చు. సైన్సుగ్రూపులో టేబిల్ టెన్నిస్ ఆడేవాళ్ళు బహుకొద్దిమంది. ఆటలు, పాటలు, అల్లర్లు అంతా ఆర్ట్సు గ్రూపువాళ్ళకే. హిస్టరీ గ్రూపు అమ్మాయిలందరూ వస్తారు మాచ్ చూట్టానికి. డైమండ్ సెట్ వస్తుంది. మిస్‌తారాపూర్ వాలా, మిస్ ఆనందరావ్, మిస్‌నాయుడు. పడవలాంటి కొత్త వూదారంగు ఫోర్డు డీలక్సు కారులోనే కాలేజీకి వస్తుంది తారాపూర్‌వాలా. అలాంటి కారు మరొక్కటి మాత్రమే వుంది ఆ ప్రాంతాల్లో. అబ్దుల్ ఖాదర్ అండ్ సన్స్ షాపు ముందు కనిపిస్తుంది. వీళ్ళకి సికిందరాబాదులో ఓ పెద్దషాపు. హైదరాబాదులో ఇంకొకటి. ఇవి చాలవన్నట్లు ఫతేపూర్ మైదానం పక్కన మరో ఖరీదైన ఐస్‌క్రీం పార్లర్. ఐస్‌క్రీంతోబాటు ఒక

బిస్కట్ లాంటిది కూడా ఇస్తారు అక్కడ. అలాంటి బిస్కట్లు ఇంకెక్కడా కనిపించవు. బిస్కెట్టునే స్పూన్‌గా వుపయోగించాలి. తింటూ బిస్కెట్‌ని కొంచెం కొంచెం కొరికి నమిలేస్తూ వుండాలి. ఒక ఐస్‌క్రీం అర్ధరూపాయి. రోజూ అక్కడ ఐస్‌క్రీం తినడం మానదు డైమండ్‌సెట్. ఏదేమైనా ఈ తారాపూర్ వాలాని చూసిరావడానికైనా కాలేజీకి వెళ్ళి రావాలనిపిస్తుంది. పట్టులాంటి మృదువైన శరీరం ఆమెది. మెడమీద నరాలు స్వచ్ఛంగా, స్పష్టంగా కనబడుతుంటాయి. రిమ్‌లెస్ కళ్ళజోడు. టోర్నమెంటులో చేరితో మిక్సెడ్ డబుల్స్‌కి పార్టనర్‌గా రమ్మనే అవకాశం చిక్కేది. దానికీ ఎంతో పోటీ. ఇంతవరకూ ఆ అమ్మాయితో మాట్లాడింది కూడా లేదు. ఈ వెధవ ఎం.పి.సి. గ్రూపు లక్షణమే అంత. ఎప్పుడూ లక్ష్మణ్‌రావు, సుందర్‌సింగ్, తంబిముత్తు – వీళ్ళ ముఖాలు తప్ప వేరే వాళ్ళని కలుసుకునేందుకి అవకాశమే వుండదు. ఉన్నట్టుండి ఈ తంబిముత్తుకి తమిళగీతం పాడాలనే కోరిక ఎందుకు పుట్టిందో, ఏదో కెమిస్ట్రీ పాఠాలు చెప్పుకుంటే కాలం గడవదా? కావాలంటే గ్రాహమ్స్ హైపోథసిస్‌ని, పీరియాడిక్ టేబిల్స్‌ని పాటలుగా పాడుకోమను. పద్మాశివరావ్ పాపం చాలా మెత్తని అమ్మాయి. పరమ సాధువు. రెండు రోజులు వస్తే నాలుగు రోజులు నాగా పెడుతుంది కాలేజీకి. ఆమె కూడా క్విట్ కాలేజీ మూవెుంటులో చేరిందా? ఒక పద్మాశివరావ్ కాలేజీ మానేసినంతమాత్రాన ఈ నిజాం నవాబు తన రాజ్యాన్ని ఇండియాలో కలిపెయ్యడానికి ఒప్పేసుకుంటాడా?

టాంక్‌బండ్ దాటి ఎడంవేపుకి తిరిగి బషీర్‌బాగ్‌కేసి వెళుతున్నాడు చంద్రశేఖరం. అయిపోయింది. మరో పది నిమిషాల్లో కాలేజీ చేరుకుంటాడు. అక్కడికెళ్ళి ఏం చెయ్యాలి? తెచ్చుకున్న పూరీలని ఎక్కడో ఒకచోట కూర్చుని తినొచ్చు. ఎవరైనా పరిచయస్థులు కనిపిస్తే మాట్లాడాల్సి రావొచ్చు. క్లాసులకి వెళ్దామా? నెత్తురు ఇంకుకున్న చిక్కన కదా!

ఫతేమైదానం సెంటర్‌కి చేరుకున్నాడు. ఎదురుగా వున్న కాలేజీకి వెళ్ళకుండా మూడురోడ్ల కూడలిలోవున్న చెట్టుని చుట్టి వెళ్ళే రోడ్డు మీదికి తిరిగాడు. తిన్నగా ఆ దారిలో వెళితే నాంపల్లి చేరుకోవచ్చు. ముందు పబ్లిక్‌గార్డెన్ తగులుతుంది. అదే జూ కూడా. అక్కడే ఏ చెట్టు కిందో కూర్చుని కాలేజీ వదిలేవేళకి ఇంటికి బైలుదేరవచ్చు.

ప్రయత్నపూర్వకంగా తనేమీ చెయ్యటంలేదు. అయినా అవనసరంగా ఏవో చిక్కుల్లో ఇరుక్కుంటూ వున్నాడు. తల్చుకుంటే చిత్రంగా వుంది. అక్కడ ఇంటి దగ్గర గేదె చర్చి కాంపౌండులో దూరకుండా వుండలన్నా, పోలీసాఫీసరింట్లో దూరకుండా వుండాలన్నా తనదే బాధ్యత. ఇంటి సమీపంలో క్రికెట్ ఆడిన రోజుల్ని మరిచిపోయి చాలా కాలమైపోయింది. ఆడాలన్నా ఇప్పుడెవరూ లేరు. చాలామంది వూళ్ళకి వెళ్ళిపోయారు. మిగిలిన వాళ్ళకి ఆడాలనే వుత్సాహంలేదు. ఒకవేళ వున్నా వాళ్ళ తల్లిదండ్రులు వాళ్ళని బయటికి వెళ్లనివ్వటం లేదు. తాము ఆడిన ఆ మైదానం ఇప్పుడు తురకల వశమైంది. సాయంత్రంపూట హాకీ ఆడటానికి, వుదయం పూట లెఫ్ట్ రైట్ అంటూ కర్రసాము నేర్చుకోవటానికి వుపయోగించుకుంటున్నారు. ఇప్పుడు హటాత్తుగా టెరిన్సు, మారిస్ పెద్దవాళ్ళైపోయారు. జాట్ బందర్ లేదు. గిల్లిదాండు లేదు. బుద్ధిగా కాలేజీ క్రికెట్ టీంలోనే చేరి ఆడవచ్చు. ఇప్పుడైనా సరే అడిగితే నాసీర్ అలీఖాన్ చేర్చుకోకుండా పోడు. ఈ మధ్య అమ్మాయిలని గురించిన ఆలోచనలు వేధిస్తున్నాయి. అయితే వీటికి ఒక స్పష్టమైన ఆకారం లేదు. ఒక క్షణం ప్యారీబేగం. మరో క్షణం ఆంగ్లో ఇండియన్ పిల్ల. బస్సెక్కడానికి సికిందరాబాద్ స్టేషన్‌కి వెళితే అక్కడ నాగరత్నం. రెజిమెంటల్ బజార్‌లో ఆ గుడిసెల్లో తళుక్కుమనే పిల్ల. పేరేమిటో? పుష్పా. టాంక్‌బండ్ దాటితే పద్మాశివరావ్. తారాపూర్ వాలా. ఆనందరావ్. అందరివీ కలగాపులగంగా కదులుతాయి కళ్ళముందు. ఎవరిని గురించీ ప్రత్యేకంగా ఆలోచించని వాణ్ని ఏ అమ్మాయి మాత్రం అభిమానించగలదు. అందుకేకాబోలు. ఈ మధ్య మన్నాస్ గారి అమ్మాయిలు కూడా కొంచెం దూరందూరంగా వుంటున్నారు. అమ్మాయిల్ని గురించి ఆలోచించడం మానేసి మనసుని పూర్తిగా చదువు మీదకి మళ్ళించాలి. అయితే నాలుగు నెలలుగా ఒక్క పాఠమూ తలకెక్కటం లేదు. పైగా క్లాసులకి వెళ్లనని సంతకం కూడా పెట్టి వున్నాడాయె. క్లాసులు జరుగుతూ వుంటే ఇలా పబ్లిక్ గార్డెన్‌లో తారట్లాడాల్సి వస్తున్నది. అంతా ఆ రోజు సంతకాలు పెట్టామే. ఆ ఇంటికి వెళ్లి అక్కడ అడిగితే కాలేజీకి వెళ్ళొచ్చా అని?

మొజాంజాహి మార్కెట్టు పక్కసందులోకి వెళ్ళాడు చంద్రశేఖరం.

రెండు నెలల క్రితం ఇవన్నీ తనకి పరిచయంలేని ప్రాంతాలు. ఇప్పుడు తనకి తానై పరిచయం చేసుకుంటున్నాడు. ఎన్నో తమిళ కుటుంబాలు ఎన్నో ఏళ్ళుగా సికిందరాబాదులో స్థిరనివాసం ఏర్పరచుకున్నాయి. అయినా ఏదో చుట్టపు చూపుగా వచ్చి చేరిన వారివలే ప్రజాజీవితంలో అంటీ అంటనట్టుగా మసలుకొనే కుటుంబాలు కొన్ని. తనూ అలా వుండిపోవొచ్చు కావాలనుకుంటే. అప్పుడే సమస్యలూ వుండవు. ఇప్పుడున్న రాజకీయ చిక్కుల్ని పరిష్కరించాల్సిన వారిలో ముఖ్యులు...

రజాకార్లు, లెయిక్ అలీ, ఖాసింరజ్వి, నిజాం, జయప్రకాష్ నారాయణ్, వల్లభాయ్ పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, స్వామి రామానందతీర్థ, దిగంబరరావ్ బిందు, కాశీనాథ్ వైద్యా. వీళ్ళెవరైనా పరిష్కారం చూపి తీరాలి. ఏదో చేస్తూనే వున్నారు. ప్రశ్నలకి సమాధానాలిస్తూనే వున్నారు. వీళ్ళలో ఎవరూ తనని చూసి "ఏమిటబ్బాయ్ అలా వున్నావు. భోంచేసేవా" అని అడగబోరు. తను వాళ్ళ దృష్టిలో అంత ముఖ్యుడుకాడు. అనామకుడు. తన అవసరం నరసింహారావు లాంటి వారికి మాత్రమే వుంటుంది. అదీ తీరిపోయినట్టనిపిస్తున్నది ఇప్పుడు. వారంరోజుల్నించి వాడికోసం తిరిగి తిరిగి అలిసిపోయాడు. వాడి గ్రూపు నేస్తాలు కూడా ఎవరూ కనిపించటంలేదు. ఇప్పుడు వెళ్ళేది హెగ్డే దగ్గరికి. పూర్తి పేరు ఏదో ఒకటి వుంటుంది. కాని తెలియనివ్వడు. ఒకసారి అడిగినా చెప్పలేదు. పోలీసులకి భయపడి కాబోలు. మనల్ని కూడా ఎప్పుడో అప్పుడు పోలీసులు లాక్కెళ్ళినా లాక్కెళ్ళొచ్చు. తన్నినా అడిగే దిక్కులేదు. తను చెప్పే వివరాల వల్ల వాళ్లు సాధించేదేమీ వుండబోదు. ఆ కసితోనే మరింత హింసిస్తారు. వాళ్ళు.

హెగ్డే లేదు తీరా వెళితే. ఒక ముసల్ది మాత్రమే వుంది ఇంట్లో. ఈ హైదరాబాదులో ఎక్కడ చూసినా ఈ అవ్వలే తటస్థపడుతున్నారు.

పబ్లిక్ గార్డెన్ లోపలికెళ్ళి కూర్చున్నాడు చంద్రశేఖరం. పెద్దగేటు, ఇనుప కమ్ముల గోడ, మధ్యలో తోట, చెట్లు చెట్లమధ్య కాసేపు కూర్చుని అక్కడున్న చాలా మంది వలె గడ్డిలో పడుకున్నాడు. కాసేపటికి కళ్ళు మూసుకుని, వొళ్ళు మరచి నిద్రపోయాడు.

# మూడవ భాగం

చంద్రశేఖరం ఇంటి గేటు ముందు నుంచున్నాడు. అప్పుడే జోస్యులవారు వస్తూ కనిపించేరు.

"ఎక్కడైనా బయలుదేరుతున్నావా?" అడిగేరు జోస్యులవారు.

"లేదు... అవును"

"ఎందుకైనా మంచిది. కాసేపు లోపలికొచ్చి కూర్చుని వెళ్ళు" అన్నాడు.

అతని వెనకే లోపలికొచ్చాడు చంద్రశేఖరం. వరండాలో వుయ్యాల చెక్కమీద కూర్చున్నాడు జోస్యుడు. వంటింట్లోకి వెళ్ళి "శనీశ్వరుడొచ్చాడు" అని చెప్పాడు అమ్మతో చంద్రశేఖరం.

"శుక్రవారం అదీ, పొద్దున్నే ఏకంగా భోజనానికే వచ్చేసినట్టుంది" అంటూ "నాన్నగారేరీ" అని అడిగింది అమ్మ.

"తెలీదు"

"ఆ గార్డు నాగభూషణంగారింటికి వెళ్లారేమో"

"నే వెళ్లి చెప్పొస్తాను" అని బయలుదేరాడు చంద్రశేఖరం.

నాగభూషణంగారిల్లు మన్సూర్ ఇంటి పక్కనే.

"వాచ్‌మేన్" అన్నాడు మన్సూర్ చంద్రశేఖరాన్ని చూసి, ఇప్పుడేవస్తాను అన్నట్టుగా తలూపి నాగభూషణం ఇంట్లో దూరేడు చంద్రశేఖరం. ఉల్లిపాయలు వేగుతున్న వాసన ఘాటుగా తగిలింది. నాన్న, నాగభూషణం తీరిగ్గా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. సికిందరాబాద్-బెజవాడ ఎక్స్‌ప్రెస్‌కి కొంతకాలంగా నాగభూషణమే గార్డుగా వుంటున్నాడు. చంద్రశేఖరాన్ని చూసి "ఏం మాస్టర్! కాలికి టోపీలేదు తలకి జోళ్ళు లేవు" అంటూ తమాషాగా నవ్వేరు. చంద్రశేఖరం తండ్రికేసి తిరిగాడు. 'కూర్చో' మన్నట్టు కళ్ళతోనే సంజ్ఞచేశాడు తండ్రి. కూర్చున్నాడు. ఆగిపోయిన సంభాషణ మళ్ళీ ప్రారంభమైంది.

"ఎప్పుడూ మిలిటరీ వచ్చేది డోర్నకల్‌నించే. నిన్న కాజీపేటలోనే

కంపార్టు మెంటుకొకడు చొప్పున మిలిట్రీవాళ్ళు ఎక్కారు. నా పెట్టెలో నలుగురు. నించోడానిక్కూడా స్థలం లేదు. కక్కుసుకి వెళ్ళడానికి కూడా చోటు లేదనుకో. పైగా రైలు రెండుగంటలు లేటు. డోర్నకల్ కి 4-12కి రావలసింది. కాని చేరేసరికి ఆరైంది. బాగా తెల్లవారింది. రైలు నడుస్తూనే వుంది. టపటపమంటూ మోటేంగు వున్నట్టుంది. ఎక్కడనుకున్నావు. ఫర్లాంగు దూరంలో చెట్ల వెనకాతల్నుంచి. ఇప్పుడు రైలు ట్రాక్ కి రెండువేపునావున్న చెట్లని, తుప్పల్ని నరికేశారు కదా. అందుకే దూరంగా అడివిలోంచి తుపాకుల మోత. రైలు నిలపాలో, పోనివ్వాలో తోచలేదు నాకైతే. నా కంపార్టుమెంటులో వుండే ఒక ముస్లిం "ఆపు బండినాపు" అంటూ అరుస్తున్నాడు. నాకేమో ఆ బోర్డర్ ఏరియాలో పోలీస్ చెక్కింగ్ కి మాత్రమే రైలు ఆపాలి అని ఆర్డరు. ఏంచెయ్యాలా అని ఒకటే గాబరా నాకు.

"ఎవరైనా గొలుసు లాగతే"

"అయినాసరే బండాపకూడదని ఇన్ స్ట్రక్షన్సు మాకు. బోర్డర్ చెక్కింగ్ తరువాత ఇక తిన్నగా బెజవాడే. మధ్యలో వుండే మూడు హాల్టునీ ఇప్పుడు కేన్సిల్ చేశారు. బోర్డర్ రావటానికి ఇంకా ఇరవై ఆరు మైళ్ళుంది. నా పెట్టెలోకి ఎక్కిన మిలిటరీ వాడు "రోకో, రోకో" అంటూ నన్ను బెదిరిస్తున్నాడు. నేను సిగ్నల్ ఇవ్వడానికి ముందే బండి నిలిచిపోయింది. ఏమిటా అని చూద్దును కదా ఇంజన్ లోంచి ఇద్దరు మిలిటరీ వాళ్ళు కిందికి దూకేరు.

"తరువాతేమైంది?"

"మిలిటరీ వాళ్ళంతా గబాగబా కిందికి దిగేరు. వాళ్ళతోబాటు నలభై యాభై మంది రజాకార్లు కూడా వున్నారు. "హాయ్...హాయ్ అని కేకలేస్తూ తుపాకీ కాల్పులు వినిపించిన దిక్కుగా పరిగెత్తేరు.

"అప్పుడు మరి కమ్యూనిష్టులు ఎదురు కాల్పులు జరపలేదా?"

"లేదు. ఈ మిలిటరీ వాళ్ళని చూసి భయపడ్డారో ఏమో. వీళ్ళు మాత్రం అరుచుకుంటూ అటూ ఇటూ పరిగెట్టారు. పది నిమిషాల తర్వాత ఇద్దరు లంబాడీ మగాళ్ళని, ముగ్గురు లంబాడీ స్త్రీలని బరబరమని లాక్కొచ్చారు. ఆ ఘోరాన్ని ఏమని చెప్పేది."

"బాగా తన్నారా"

"తన్నులా అవి. చితకబాదేశారనుకో. కర్రలతో బాదేరు. తుపాకీ మడమలతో పొడిచేరు. నేల మీద పొర్లించి పొర్లించి కొట్టేరు. తమ కళ్ళముందే తమ భర్తల్ని చావగొట్టడం చూసి లంబాడీ స్త్రీలు గోలుగోలున ఏడుస్తున్నారు. వాళ్ళని పట్టుకొని కూడా బాదేరు. అందరి కళ్ళముందూ వాళ్ల లంగాలని వూడలీకి వివస్త్రలని చేశారు."

"స్త్రీలని కూడానా"

"అవునయ్యా. వాళ్ళ లంగాలు సులభంగా వూడిరాలేదు. కసిలో కత్తితో వీపుకి బిగించిన నాడాలని కోసి పారేశారు కిరాతకులు. నగ్నంగా వుండే స్త్రీలని నేలమీద పొర్లించి అసహ్యంగా వాళ్ళమీదపడి ఛీ...పాపం వాళ్ళు కేకలు పెడుతున్నారు. ఒళ్ళంతా రక్కులు, గాయాలు అట్టాగే దిగంబరంగా వాళ్లని తరిమి తరిమి కొట్టేరు. వాళ్ళు పాపం చచ్చిపడివున్న తమ మొగాళ్ళదగ్గిరకి పరిగెత్తుతున్నారు. వాళ్ళ శవాలమీద పడి ఏడుస్తున్నారు. ఎంత ఘోరమో!

చెప్పడం ముగించి దిగ్భ్రాంతుడైన వాడిలా కూర్చుండిపోయాడు. నాగభూషణం.

చంద్రశేఖరం తండ్రి కూడా దాదాపు అదే స్థితిలో వుండిపోయాడు. చంద్రశేఖరం ఇటువంటి సంఘటనల గురించి ఇదివరకే వినివున్నాడు గనక అంతగా కదిలిపోలేదు.

హైదరాబాదు-భారతదేశం సరిహద్దుల్లో ముఖ్యంగా వరంగల్లు జిల్లాలో పోలీసు మిలిటరీ చర్యలు చాలా తీవ్రంగా తయారైనాయి. కమ్యూనిస్టుల పోరునించి తప్పించుకోవడానికి మైళ్ళకి మైళ్ళు రైలు ట్రాకుకి రెండు పక్కలా వుండే చెట్లనీ, తుప్పల్నీ నరికి మైదానాలుగా మార్చివేశారు. కమ్యూనిస్టులెక్కువగా చిక్కలేదు కాని పాపం లంబాడీవాళ్ళు ఈ మిలిటరీ వాళ్ళకి చిక్కి చిత్రహింసలనుభవించేరు. ఒకసారి ధరించిన దుస్తుల్ని ఒక పట్టాన ఒదలరు ఈ లంబాడీలు. అద్దాలతోనూ, చెమ్కీలతోనూ చేర్చి అందంగా, రంగు రంగులుగా కుట్టబడిన వీళ్ళ లంగాలుగాని, రవికెలుగాని చచ్చేదాకా వారి శరీరాలమీద వుండి వాళ్ళతో బాటు కాలి బూడిద కావలసిందే. ఈ లంబాడీ స్త్రీలని రజాకార్లు, నిజాం మిలటరీ పోలీసులు వివస్త్రలని చేసి అమానుషంగా మానభంగం చేస్తున్నారు. సాధారణంగా ఈ లంబాడీలనీ ఎవరూ మనుషులుగా గుర్తించి గౌరవించరు.

ఎందుకంటే ఈ లంబాడీలు కుక్కలవలే పందులవలె ఎక్కడపడితే అక్కడ మలమూత్ర విసర్జన చేస్తూ అపరిశుభ్రంగా వుంటారని. ఈ లంబాడీలకి ఇప్పుడు శని పట్టుకుంది. కమ్యూనిస్టులకి ఈ లంబాడీలు సహకరిస్తున్నారు. వీళ్ళకి శని పట్టుకుంది.

"జోస్యుల వారొచ్చారు" అన్నాడు చంద్రశేఖరం తండ్రితో మెల్లిగా.

"ఉండు. వస్తాను" అన్నాడు తండ్రి. నాగభూషణం కొంచెం తేరుకుని "అయితే ఈ రోజు ఆఫీసుకి రమ్మంటారా?" అడిగేడు చంద్రశేఖరం తండ్రిని.

"ఎందుకు? ఏదైనా పనుందా?"

"పాస్ అప్లై చేసి వున్నానండీ"

"ఎవరికి?"

"ఫామిలీ పాసు"

"ఏ వూరికి?"

"మద్రాసుకి"

"మెడ్రాసా? పోలీస్ పర్మిట్ తీసుకున్నారా?"

"అదీ లేకుండా కుదరదా?"

"హైదరాబాద్ స్టేట్‌లో ఎక్కడైనా అయితే అవసరంలేదు. అయితే ఈ రాష్ట్రం వదిలి వెళ్ళాలంటే పర్మిట్ లేకుండా టిక్కెట్టివ్వరు. పాసూ ఇవ్వరు. నీకు తెలిసిందే కదా" నాగభూషణం కాసేపు మౌనంగా వున్నాడు. వాళ్ళింట్లో అతను, అతని భార్య, అతని అల్లుడు, ఎదిగిన ఇద్దరు కొడుకులు – అంతా చేరి నలుగురు మగాళ్ళు. అయినా అతనికి కూడా వాళ్ళందరినీ హైదరాబాదు నించి వేరే రాష్ట్రానికి తరలించాలనే ఆలోచన పట్టుకుంది. "ఎందుకైనా ఒకసారి వచ్చి కలవమంటావా?"

"అప్లికేషన్ తీసి చూస్తాను. ఇంగ్లీషు దొరలే ఇటువంటి విషయాల్లో చాలా భయపడుతున్నారు. మనం సికిందరాబాద్ కోర్టు ఆఫీసులోనే పర్మిట్ తీసుకోవాలి. ఇక్కడే వై.ఎం.సి.ఏ సమీపంలో అలెగ్జాండ్రియా రోడ్డులో వుంది ఆ ఆఫీసు. నువ్వు నేరుగా వెళితే వెంటనే పర్మిట్ తీసుకోవచ్చుకదా."

"సరే వెళ్ళి ప్రయత్నిస్తాను. నువ్వు మీ వాళ్ళని ఎక్కడికీ పంపటంలేదా?"

"ఎక్కడికి పంపమంటావు చెప్పు?

"మరో రెండు మూడు నెలల్లో పిల్లలకి యాన్యువల్ పరీక్షలున్నాయి. ఆ తరువాత ఆలోచించాలి." అసలీ యేడు పరీక్షలు జరుగుతాయనుకుంటున్నారా? ఇప్పటికే అల్లర్ల కారణంగా ఎన్నోరోజులు కాలేజీలు మూసేశారు. ఇప్పుడైనా కాలేజీల్లో సగానికి పైగా హాజరుకావటంలేదట విద్యార్థులు."

చంద్రశేఖరానికి ముళ్ళమీద కూర్చున్నట్టుగా వుంది. కాలేజీ గురించిన ప్రసక్తి రాకుడదనే అతను ఇలాంటి మనుషుల నుంచి తప్పించుకుని తిరుగుతున్నాడు.

"చూద్దాం. మరి నే వస్తాను" అని లేచాడు చంద్రశేఖరం తండ్రి.

"సరే. నేను రేపు ఆఫీసుకి వచ్చి కలుస్తాను. పాసు దొరికేట్టు చూడాలి దయచేసి."

"ప్రయత్నిస్తాను. నేను చెప్పిన విషయం ఏమైంది?"

"సారీ. ఈసారికూడా వీలు పడలేదు. వచ్చేసారి ఖచ్చితంగా పదిసేర్లయినా తీసుకొస్తాను".

"ఇంట్లో బొత్తిగా బియ్యంలేవు"

"ఈసారి తప్పకుండా తెస్తాను. పాసు విషయం కొంచెం గమనించండి"

తండ్రి వెనకే బయలుదేరాడు చంద్రశేఖరం. ఇంటికి వెళ్ళి పంచెకట్టి టోపీ, కోటు ధరించి ఆఫీసుకి బయలుదేరడానికి సరిగ్గా వుంటుంది తండ్రికి. భోజనం కూడా మధ్యాహ్నం ఒంటి గంటకి ఇంటికి వచ్చి తినాల్సిందే.

తండ్రిని చూసి జోస్యులవారు లేచి నిలుచున్నారు.

"రండి. రండి. ఎప్పుడు రావటం" అన్నాడు తండ్రి.

"పది నిముషాలైందేమో. అబ్బాయొచ్చి చెప్పాడనుకుంటానే".

"స్నానం అదీ పూర్తయిందా?" అడిగేడు తండ్రి.

"అంతా పొద్దున్నే పూర్తయింది".

"అయితే మీరు భోజనం కానివ్వండి. నాకిప్పటికే ఆలస్యమైంది. మధ్యాహ్నం వచ్చి భోంచేస్తాను. శుక్రవారం అదీ భోంచెయ్యకుండా వెళతామంటున్నారేమిటి?"

"బియ్యం కోసం ఒకరింటికి వెళ్ళానుచెప్పి రావటానికి. ఫరవాలేదు. మీరు కానివ్వండి" తండ్రి త్వరత్వరగా ఆఫీసుకి వెళ్లిపోయాడు. జోస్యులు, చంద్రశేఖరం భోజనానికి కూర్చున్నారు. ముందుగా ఆకుకూర వడ్డించింది. అమ్మ.

"జొన్న రొట్టెలున్నాయి. వెయ్యమంటారా?" అడిగింది.

"అదేమిటమ్మా అలా అడుగుతున్నారు. ఇప్పుడు అందరిళ్ళలోను అవే కదా." అన్నారు జోస్యులు నవ్వుతూ.

"రేషన్‌లో ఇచ్చే బియ్యం రెండు రోజులకి కూడా రావటంలేదు. బియ్యం కూడా ఎర్రగా వుంటున్నాయి. రెండు వారాలుగా చక్కెర లేదు."

"ఇప్పుడు దేశంలో ఎక్కడ చూసినా కరువుగానే వుందిట. మా అల్లుడొచ్చాడు మొన్న తిరువారూరు నుంచి. అక్కడా ఇంతేనట."

"అయితే అక్కడ నరుకుతారు, చంపుతారు అనే భయంలేదు కదా".

ఆకుకూర అద్దుకుని జొన్నరొట్టె ముక్కలు తినసాగేడు చంద్రశేఖరం. ఇప్పుడు నిజాం సంస్థానంలో బాగా దొరికేవి ఆకుకూర, జొన్నరొట్టెలు, శనగనూనె ఇవి మాత్రమే. రేషన్ షాపులకి రావాల్సిన బియ్యం రావటంలేదు. కొంతకాలం కిందట గోధుమలు దొరికేవి. ఇప్పుడు అదీలేదు. నాలుకోసారి చక్కెర చిక్కడమే గగనమైపోయింది. బెల్లంకాఫీయే గతైంది. బొలారంలో మిలిటరీ వాళ్ళున్నంత కాలం తెలిసినవాళ్ళ ద్వారా, మిలిటరీ ద్వారా మిలిటరీ రేషన్ తెప్పించుకునే వీలుండేది. ఆ మిలటరీని రద్దు చేసి రెండు నెలలైంది. బొలారంలో భారత ప్రభుత్వ ప్రతినిధిగా వుండేవాడు కె.యం.మున్షీ. ఆయనగారి సెక్రటరీ నాయనకు ఏదో దూరపుచుట్టం. కాని చక్కెర కావాలని అతడ్ని అడగడం ఏం బావుంటుంది. కె.యం.మున్షీ పెద్ద వకీలు. లక్ష్మీకాంతన్ హత్యకేసులో త్యాగరాజ భాగవతార్, ఎన్.ఎస్.కృష్ణన్‌ల తరపున వాదించింది ఇతనే. అయితే ఇతనేమీ చెయ్యలేకపోయాడు. ఆ కేసు లండన్‌లో తీర్పు చెప్పబడింది. వాళ్ళ విడుదలకి సంబంధించిన ఆర్డర్లు కూడా అక్కడే జారీ చేయబడినాయి. ఇప్పుడు నిజాం సంస్థానానికి వచ్చి వున్నాడు కె.యం.మున్షీ. కొంతవరకు పెద్ద అల్లర్లు జరగకుండా చూడగలిగేడు ఈయన. కాని లంబాడీలకు రక్షణ కల్పించగలడా ఇతను? భోజనం తక్కువగా వడ్డించినా పెరుగు బాగా వడ్డించింది అమ్మ. చేతులు కడుక్కుంటూ అడిగేడు చంద్రశేఖరాన్ని జోస్యులవారు.

"కాలేజీకి వెళ్ళలేదా?"

వినిపించుకోనట్టుగా అతనికి నీళ్ళ చెంబు అందిచ్చేడు చంద్రశేఖరం. జోస్యులు మళ్ళీ అడిగేడు వదలకుండా.

"లేదు"

"ఇంకా కాలేజీలు తెరవలేదా?"

"అదేంకాదు"

"కాలేజీ తెరిచారు కదా?"

"అవును"

"మరి నువ్వెందుకు వెళ్ళటంలేదు?"

"ఈ పూట నాకు క్లాసుల్లేవు"

"ఇలా కూడా వుంటుందా"

"ఊఁ"

అమ్మకి ఈ మాటలన్నీ వినిపిస్తున్నా ఆమె కల్పించుకోలేదు. జోస్యుల దగ్గర్నుంచి కదిలి గేదెని కట్టి వున్నచోటికి నడిచాడు చంద్రశేఖరం. అతణ్ని చూస్తూనే ఆప్యాయంగా తలూపింది అది. దాని కణతల దగ్గర ప్రేమగా నిమిరాడు. దాన్ని వొళ్ళు పులకరించినట్లయింది. దాని వీపు మీద తట్టేడు. రెండు రోజుల్నుంచి దానికి సరిగ్గా తిండిలేదు. ఎప్పుడో కొన్న ఎండుగడ్డి అయిపోయింది. రోజూ మోండాకి వెళ్ళి సైకిల్ మీద గడ్డి తెచ్చి పడేసేవాడు. సైకిల్ మీద ఎక్కువ మోపు తేవడానికి కుదరదు. వారం రోజులుగా గడ్డిమోపు బండ్లు ఇళ్ళ పక్కకి రావటమే లేదు. వారం కిందటేమో ఒక బండి వచ్చింది. ఎక్కువ ఖరీదు చెప్పాడు. అంచేత కొంచెం గడ్డి మాత్రమే కొన్నారు. అదీ తీరిపోయింది. ఎంతో మేలు పత్తిగింజలు, పున్నాకు ఇంకా మిగిలి వుంది. అయితే పున్నాకు ఎక్కువ తిన్నా గేదెకి అజీర్ణం చేస్తుంది. అదీగాక పున్నాకు కడుపు నిండదు. దానికి గడ్డే కావాలి.

పెరటి తలుపు తెరుచుకుని మైదానంకేసి నడిచాడు చంద్రశేఖరం. మిట్టపల్లాలుగా వున్న నేల అది. లాన్సర్ బారక్సు వెనుకవేపు వరుసగా వున్న ఇళ్ళకవతల వుండే ఆ చర్చి నిశ్శబ్దంలో మునిగినట్టు ప్రశాంతంగా వుంది. దానికి వెనకాతల కొన్ని బంగళాలు. పోలీసాఫీసరు ఖాసిం బంగళా కూడా అక్కడే. అటువేపు వెళ్ళి ఎన్నో నెలలైంది. గేదెల్ని మేపుకెళ్ళేవాడు ఇప్పుడు రావటమే లేదు. గేదెని ఇల్లు కదిలించి కూడా చాన్నాళ్ళయింది. ఈ క్షణంలో దాని కట్లు విప్పితే అది తిన్నగా ఖాసిం ఇంట్లో దూరుతుంది. అక్కడే మొక్కలు ఏపుగా పెరిగి వుండేది.

చర్చికి ఎదురుగా వుండే మిలిటరీ సమాధుల కేసి నడిచాడు. చూట్టానికి

దగ్గర్లోనే వున్నట్టనిపించింది. ఈ స్మశానపు కాంపౌండు గేటుని తెరవటం సాధ్యంకాదు ఇప్పుడు. బాగా తుప్పు పట్టిపోయింది. లోపలంతా చెట్లు, తుప్పలూ దట్టంగా పెరిగి అది అలా వుంది. ఎప్పుడో మరణించిన బ్రిటీషు వాళ్ళ శవాలు ఆ చెట్ల మధ్య మట్టిలో కూరుకుపోయి వున్నాయి. బ్రిటీషువాళ్ళు కూడా మరణిస్తారు. బ్రిటీషు వాళ్ళు ఇండియాని వదలి వెళుతున్నారు. ఇప్పుడు హైదరాబాదునొదిలి హిందువులంతా వెళ్ళిపోవాలి. బ్రిటీషువాళ్ళు వెళ్లిపోగలరు. కాని తాము ఎక్కడికని వెడతారు ఈ హైదరాబాదు నొదిలి? హిందువులంతా ఇండియాకి వెళ్ళి, ముస్లింలంతా ఈ హైదరాబాదుకి తరలి వస్తే ఎలా వుంటుంది? మరప్పుడు యాంగ్లో ఇండియన్ లని, పార్శీలని ఏం చెయ్యాలి? ఈ లాన్సర్ బారక్సులో అంతా ముస్లింలే వచ్చి చేరిపోతే అందరికీ ఉమ్మడిగా ఒక పెద్ద అల్యూమినియం పాత్రలో భోజనం వండి వడ్డేయవచ్చు. కావాలంటే రెఫ్యూజీలు తయారుచేసి అమ్మే పకోడాలని తెచ్చి కూడా వడ్డించవచ్చు. బక్ రీద్ పండగప్పుడు మేకని కొయ్యడం చూశాడు తను. ఆ మేక మాంసంతో బిరియానీ వండుకుని తినడం చూసివున్నాడు. పక్కింట్లో ముస్లింలు లేకుంటే ఇవన్నీ తనకి తెలిసేవేకాదు. తనకి తెలిసిందల్లా నాసిర్ అలీఖాన్ గాడి క్రికెట్ ఆట, మసూద్ వేసుకునే ఖరీదైన షేర్వాని, బెండకాయల వరుగు లాంటి నిజాం, అతడ్ని పోలి వూరంతా నిండి వున్న వృద్ధమూతలు, ప్యారీబేగం, నీలిమేఘాలల్లోంచి అప్పుడే దిగి వచ్చిన దేవతలా అగుపించే నాసిర్ అలీఖాన్ చెల్లెలు – ఈ అమ్మాయి కంఠంమీద కూడా పచ్చగా నరాలు నర్గీస్ తారాపూర్ వాలాకి వలె. అయితే నర్గీస్ కళ్ళలో ఎన్నో గడుసు భావాలు. అమాయకత్వం లోపించిన ఎన్నో గడుసు భావాలు. అమాయకత్వం లోపించిన కళ్ళు అందంగా కనిపించవు తనకి.

చంద్రశేఖరానికి గొంతులో ఏదో అడ్డుపడినట్టుగా వుంది. దుఃఖం పెల్లుబుకుతున్నా దాన్ని అదిమిపట్ట గలుగుతున్నాడీ మధ్య. ఇంకా ఎంత కాలమని ఇలా ఇంట్లోనే కూర్చుని వుండటం? నాలుగైదు రోజులకోసారి మాత్రం కాయగూరలకని, జొన్నల పిండికి ఎండి మిల్లుకని, గేదెకి గడ్డి కోసమని బజారుకి వెళ్ళి వస్తున్నాడు. కాలేజీకి వెళ్ళడం మానేశాడు. తన పేరు కూడా కొట్టేసి వుంటారు. అయితే ఆ వూళ్ళో కాలేజీలో ఎప్పుడైనా వెళ్ళి ఫీజు కట్టి మళ్ళీ పేరు రాయించుకోవచ్చు. అయితే ఒక సంవత్సరం నష్టపోయినట్లవుతంది. పరీక్షలుగాని జరిగితే.

చంద్రశేఖరానికి గుండెల్లోంచి దుఃఖం తన్నుకొచ్చింది. కాలేజీకి వెళుతూన్న

రోజుల్లో చాలా సాధారణంగా కనిపించే దృశ్యాలన్నీ ఇప్పుడు ఏదో ప్రత్యేకతని సంతరించుకుని దర్శనమిస్తున్నాయి. మర్రిచెట్టు, సాలార్‌జంగ్‌హాలు, సైన్సు బ్లాకు, ప్లేగ్రౌండు, లెక్చర్‌హాలు, రంగు వెలిసిన సీలింగు ఫాను – ఈ జడపదార్థాలే గాక తనకి తెలిసిన ముఖాలు, తన నెరిగిన ముఖాలు. నర్గీస్ తారాపూర్‌వాలా ముఖాన్ని చూడకుండా ఎలా వుండగలడు. ఆమె ఒక్క తమిళం ముక్క కూడా రాదు. తన సాంఘిక అలవాట్లకి ఆమె అలవాట్లకి పొంతనే లేదు. అబ్దుల్ ఖాదర్ ఐస్‌క్రీం మినహా ఆమె రుచులు వేరు, తన రుచులు వేరు. ఎందుకో ఆమెనొకసారి చూడాలని మనసు వువ్విళ్ళూరుతున్నది.

ఇంట్లోంచి ఎవరో పిస్తున్నట్టుంది. పెరట్లోంచి ఇంట్లోకి వచ్చాడు చంద్రశేఖరం. స్కూల్ నించి చెల్లెళ్ళిద్దరూ మధ్యాహ్నం భోజనానికి వచ్చారు. ఉయ్యాల చెక్కమీద పడుకుని హాయిగా జోగుతున్నాడు జోస్యులు.

"మిరపకాయ లాడించుకొస్తావా?" అడిగింది అమ్మ.

"బాగ ఎండబెట్టేవా?" అడిగేడు చంద్రశేఖరం.

"ఈ మంచుకాలంలో ఎంతని ఎండబెట్టను. నువ్వే చూడు."

ఆరేసి వున్న ఎండు మిరపకాయల్ని రెండు ఎత్తి విరిచి చూశాడు. ఇంకా బాగా ఎండలేదు.

"వీటిని ఆడించడు వాడు. అంతదూరం వెళ్ళి అనవసరంగా తిరిగి రావాల్సిందే."

"ఇంట్లో బొత్తిగా మిరప్పొడి లేదు. ఏం చెయ్యను"?

"కావాలంటే రోట్లో నేనే కొంచెం దంచి పెడతాను" రోలుని తుడిచి శుభ్రం చేసింది తల్లి. రోకలి చేతబట్టుకుని రోటిముందు కూర్చున్నాడు చంద్రశేఖరం. చెల్లెళ్ళిద్దరు బళ్ళకి వెళ్ళిపోయారు. రోట్లో మిరపకాయలు పోసింది అమ్మ. రోకలితో దంచడం మొదలెట్టాడు చంద్రశేఖరం. వీధి తలుపు చప్పుడైంది. తండ్రి వస్తున్నాడు. ఇక తప్పించుకోలేడు తను. ఇంటికి పెద్దకొడుకు, కాలేజీ ఎగ్గొట్టి ఇలా మిరప్పొడి దండచమేమిటి? ఏం దంచితేనేం? తండ్రి కూడా ఈమధ్యన లోలోపల మధనపడి పోతున్నాడు. ఆయన్ని అర్థం చేసుకోవటం కష్టంగా వుంది. రెండు నెలల నించీ తనతో సరిగ్గా మాట్లాటం లేదు. తన నించి ఎందుకో తప్పుకు తిరుగుతున్నట్టుగా వుంటోంది ఆయన ధోరణి.

జోస్యుడింకా నిద్రపోతూనే వున్నాడు. నిదానంగా భోంచేశాడు తండ్రి. అమ్మవేసిన జొన్నరొట్టెని పెరుగులో అద్దుకుని తిన్నాడు.

చంద్రశేఖరానికి ముక్కు మంట పుట్టింది. మిరప్పొడి దంచిన చేత్తో ముక్కు రుద్దుకోవటం వల్ల కలిగిన ఫలితం. దంచుతూనే వున్నాడు. మిరపకాయలు చిన్న చిన్న ముక్కలుగా నలుగుతూనే వున్నాయి. పొడిగా కూరేట్టు లేదు. గింజలు ఎంత దంచినా నలగడం లేదు. రోటి అంచులకి రోకలి తగిలినప్పుడల్లా ఖంగు ఖంగుమని శబ్దం వస్తున్నది. అయినా జోస్యులవారికి నిద్రాభంగం కలగటంలేదు. తండ్రికి వడ్డన పూర్తిచేసి ఒక గరిటతో నలిగిన మిరపకాయ ముక్కల్ని ఒక గిన్నెలోకి ఎత్తింది అమ్మ. ఆ ముక్కల్ని జల్లెడలో వేసి జల్లించింది. పొడి కంటే వక్క ముక్క అయిన ముక్కలే ఎక్కువగా వచ్చినయ్.

తండ్రి భోంచేసి ఆఫీసుకి వెళ్ళిపోయాడు. సాయంత్రం భోజనానికి మళ్ళీ జొన్న రొట్టె తయారుచెయ్యడం ప్రారంభించింది తల్లి. పిండి పిసకడానికి చంద్రశేఖరాన్ని సహాయంగా పిలిచింది. మాట్లాడకుండా వంట పనిలో తల్లికి సహాయంగా వుండటానికి సిద్ధమైనాడు. జోస్యులు నిద్రలేచేసరికి చంద్రశేఖరం తమ్ముడు బడి నుంచి తిరిగొచ్చాడు. మరో పావుగంటలో చెల్లెళ్ళు కూడా వచ్చేశారు. ఒక్కొక్కరిని టిఫిన్ తినడానికి పిలిచింది అమ్మ. జోస్యులు, చంద్రశేఖరం మినహా తక్కిన వాళ్ళెవరూ ఆ జొన్నరొట్టెలు తినడానికి రాలేదు.

తండ్రి ఆఫీసు నించి తిరిగొచ్చాడు. జోస్యుల రాకకి అప్పుడు ప్రయోజనం కనిపించింది. అందరి జాతకాలూ పట్టుకొచ్చి జోస్యులు కెదురుగా కూర్చున్నాడు తండ్రి. ఇంతకుముందు కూడా చాలాసార్లు ఆ జాతకాలని పరిశీలించి వున్నాడు జోస్యులు. వాటి ఫలితాలు అతనికీపాటికి కంఠతా వచ్చి వుండాలి. చంద్రశేఖరానికి ఏడేళ్ళ శని పట్టుకుంది అని అతను చెప్పాడు కాబట్టే బతికిపోయాడు చంద్రశేఖరం. లేకుంటే తల్లిదండ్రులతని పట్ల ఈపాటి సానుభూతి సహనం ప్రదర్శించి వుండేవారు కాదు.

బాగా చీకటి పడింది. పిచ్చుమణి తప్ప అంతా వినాయకుడి గుడికని బయలుదేరారు. రైల్వేస్టేషన్ దగ్గర్లో వుంది గుడి. మైలు పైగానే వుంటుంది. జోస్యులు కూడా తోడైనాడు. గుడికి దగ్గర పడుతుండగా వేరెటో వెళ్ళిపోయాడు. గుడి దగ్గర జనం తక్కువగా వున్నారు. పక్కనే మసీదు. అంచేత గుడివాళ్ళు కొంచెం జాగర్తగానే వుంటుంటారు. గంటలు కూడా పెద్దగా మోగించరు. పాటలు పాట్టంగాని, వాద్యాలు వాయించటంగాని చెయ్యరు. ఈమధ్య మరీ జాగ్రత్త వహిస్తున్నారు. గుసగుసగా అష్టోత్తరం పాడి ముగించేస్తున్నారు.

గుడి నుంచి ఇంటికి తిరుగు ప్రయాణం ఒక వూరేగింపులా సాగింది. తండ్రి వెనుక చంద్రశేఖరం, తరువాత అతని ఇద్దరు చెల్లెళ్ళు. అందరికీ వెనక, చాలా వెనక మెల్లిగా నడుస్తూ అమ్మ. అలా అరఫర్లాంగు నడిచేసరికి ఎవరో స్నేహితుడెదురు పడ్డాడు. తండ్రిని ఏదో విచారించి వెళ్ళిపోయాడు. తండ్రి కూడా ఎందుకో కంగారు పడుతున్నట్టుగా అనిపించింది. ఎవరో ఒకాయన, కోటు, టోపీతో ఎదురైనాడు. "గాంధీని కాల్చింది నిజమేనా?" అని ఇంగ్లీషులో అడిగాడు తండ్రి ఆ కోటు ఆసామిని. అంతలో చంద్రశేఖరం కూడా తండ్రిని చేరుకున్నాడు.

"ప్రాణంపోయి రెండు గంటలు దాటితే ఇప్పుడడుగుతున్నారా?" కోపంగా అనేసి చరా చరా నడుస్తూ వెళ్ళిపోయాడు కోటు మనిషి.

## 2

వాళ్ళ కుటుంబపు వూరేగింపు చెదిరిపోయింది. నడకవేగం పెంచాడు తండ్రి. వెనకాలే వస్తున్న చెల్లెళ్ళు, తల్లి కూడా హడావిడిగా నడవడం ప్రారంభించేరు. అందరికన్నా ముందుగా పరిగెత్తుతున్నట్టుగా నడుస్తున్న చంద్రశేఖరం ఒక్కసారి వెనక్కి తిరిగి చూశాడు. వెనక నడిచి వస్తున్నవాళ్ళు ఆ మసక వెల్తురులో నీడలు కదలి వస్తున్నట్లుగా కనిపిస్తున్నారు చార్లెస్ వీధ మీదుగా కీయ్స్ హైస్కూల్ వీధిలోకి దిగారు. దూరాన ఆక్సుఫోర్డు వీధి మలుపు తిరిగి మారాడుపల్లి హద్దులో కలిసిపోయింది. ఆ ముక్కాలు మైలు పొడవుతా ఆ సమయంలో నిశ్శబ్దం రాజ్యం చేస్తూనే వుంది. రోడ్డు రెండు పక్కలా కాంపౌండు గోడలు వాటి లోపల కొంచెం దూరంలో బంగళాలు. అవి కూడా చీకటిలో మునిగి కనిపిస్తున్నాయి. లాన్సర్ బారక్సు ఇళ్ళలో దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి. ఎక్కువ కాంతి బయటకు ప్రసరించకూడదనే వుద్దేశ్యంతో తక్కువ వాట్సు బల్బులనే ఉపయోగిస్తున్నారు. రక్షణకోసం పాటించే విధుల్లో ఇదీ ఒకటి. ఎవరి దృష్టిలోనూ పడకుండా కాలాన్ని నెట్టెయడం ఒక విధంగా మంచిదేనేమో. ఆ సమయంలో ఎవరూ రేడియో కూడా పెట్టుకున్నట్టు లేదు.

మర్రిచెట్టుని సమీపించినప్పుడు మారిస్ కనిపించాడు చంద్రశేఖరానికి. ఇద్దరూ మాట్లాడుకోవటం లేదు కొన్ని దినాలుగా. పెద్ద కారణమేమీ లేదు. మారిస్ కూడా పెద్దవాడవుతున్నాడు. జీవితాన్ని గురించి చింత ప్రారంభమై వుంటుంది

అతనిలో. అయితే ఇప్పుడు చంద్రశేఖరాన్ని చూసి 'హల్లో' అని పలకరించాడు మారిస్.

"నీకు విషయం తెలుసా?" అడిగాడు చంద్రశేఖరం.

"ఏమిటి?"

"గాంధీ గురించి"

"గాంధీ ఎవరు?"

"మహాత్మాగాంధీ"

"ఓహో ఏమైంది?"

"ఎవరో తుపాకీతో కాల్చారట"

"అలాగా"

అంత రాత్రి వేళప్పుడు కూడా ఒక మర్రివూడని పట్టుకుని వుయ్యాలలూగటం ప్రారంభించేడు మారిస్.

"నీకీ విషయమే తెలీదా?" అడిగేడు చంద్రశేఖరం ఆశ్చర్యంగా.

"తెలీదు" వూగుతూనే చెప్పాడు మారిస్. చంద్రశేఖరం ఇంటికి నడిచాడు. తాళంచెవి తేలేదన్న సంగతి గుర్తొచ్చింది. అమ్మ దగ్గరుంది తాళంచెవి. అమ్మ వచ్చేదాకా వేచి వుండాలి. చంద్రశేఖరం వెనక్కి తిరిగాడు. మర్రిచెట్టు దగ్గర మారిస్ "వాట్‌మేన్?" అని అడిగాడు ఆశ్చర్యంతో. పలక్కుండా త్వరగా అడుగులు వేశాడు చంద్రశేఖరం. వీధి మొగలో నుంచుని వున్నాడు తండ్రి.

"ఎక్కడికి మళ్ళా?" అడిగేడు.

"తాళం చెవి అమ్మ దగ్గరుంది"

"పిచ్చుమణి లేడూ"

మళ్ళీ ఇంటికేసి పరిగెట్టేడు. ఇంట్లో తమ్ముడున్నాడనే సంగతే గుర్తుకి రాలేదు. మళ్ళీ మారిస్ ఎదురైనాడు. అయితే పలకరించలేదు. "లైటు వేసుకోకుండా కూర్చున్నావెందుకు?" అని అడిగాడు తమ్ముణ్ణి చంద్రశేఖరం. పిచ్చుమణి పలకలేదు. రేడియోని ఆన్ చేశాడు చంద్రశేఖరం. అన్న పక్కనే నిలబడ్డాడు పిచ్చుమణి తమాషా చూస్తున్నట్టుగా. మామూలుగా వేడిని పుంజుకోవడానికి ఆ రేడియోకి ఒక నిమిషం పడుతుంది. రెండు నిమిషాలైనా ఏ శబ్దమూ లేదు. "లైటెందుకు వేసుకోలేదు?" అంటూ ఒక స్విచ్చి వేశాడు చంద్రశేఖరం. చాలా

మందంగా వెలిగింది లైటు. "ఎందుకింత గుడ్డిగా వెలుగుతోంది?" అన్నాడు చంద్రశేఖరం. చాలాలరోజుల తర్వాత తమ్ముడితో మాట్లాట్టం అదే.

"నాకేం తెలుసు?" అన్నాడు పిచ్చుమణి. బయటికొచ్చి పక్కింట్లోకి తొంగి చూశాడు చంద్రశేఖరం. ఆ సమయంలో ఖాసిం ఇంటి రేడియో వాగకుండా వుండదు సాధారణంగా. కాని అప్పుడు అదీ నోరు మూసుకుని పడి వుంది. వాళ్ళింట్లో కూడా దీపాలు దీనంగా వెలుగుతున్నాయి. అంతలో అమ్మా, నాన్న అంతా వచ్చారు. "రేడియో పెట్టండిరా?" అంది అమ్మ. గాంధీని గురించి అమ్మ కూడా విన్నట్టుంది. నాన్న చెప్పి వుంటాడు.

"రేడియో పాట్టంలేదు" అన్నాడు చంద్రశేఖరం. లాంతర్ కోసం లోపలికెళ్ళింది అమ్మ. టేబిల్ డ్రాయర్ తెరిచి మూలల్లో వెతికాడు చంద్రశేఖరం. చిల్లరడబ్బులు ఆ సొరుగులోనే వేసి పెట్టేవాడు. పావలా తగిలింది చేతికి. బయటికి బయల్దేరాడు ఆ నాలుగణాలతో. భోజనం సంగతి కూడా వదిలేసి నాన్నతో మాట్లాడుతూ కూర్చుంది అమ్మ. గాంధీ మరణం అమ్మ దినచర్య మీద కూడా దెబ్బతీసింది.

ఇప్పుడు బాగా అర్థమైంది. లాన్సర్ బారక్సులో ఏ ఇంట్లోనూ లైట్లు వెలగటంలేదు. రేడియో పలకటం లేదు. వెలిగించిన నూనె దీపాలు పేరుకి మాత్రమే వెలుగుతున్నాయి. మన్నాస్ ఇంటిని సమీపించాడు చంద్రశేఖరం.

"యూమేన్" అన్న మన్నాస్ గొంతు వినిపించింది. "గాంధీ చచ్చేడా" అంటూ చంద్రశేఖరాన్ని అడిగేడు.

"అదే విన్నాను మీకెవరు చెప్పారు?" అడిగాడు చంద్రశేఖరం.

"మా అబ్బాయి"

"బెరిన్నా?"

"కాదు మారిస్"

చంద్రశేఖరం వేగంగా నడిచాడు. మర్రిచెట్టు కింద మారిస్‌తోబాటు మరో నలుగురైదుగురున్నారు. అటుకేసి చూడకుండా వీధిలోకొచ్చాడు చంద్రశేఖరం. ఎక్కడా మనిషి జాడలేదు.

క్లాక్ టవర్ వేపుగా నడుస్తున్నాడు. ఆక్స్‌ఫోర్డు వీధి సైతం నిర్మానుష్యంగా వుంది. లోపలెక్కడో దూరంగా వుండే బంగళాల చుట్టూ ఎత్తయిన కాంపౌండు

గోడలు. ఖాళీ ప్రదేశం నిండా చెట్లు, తుప్పలు. వాటి మధ్యన పాములు. అవి వీధిలోకొచ్చి కార్లకింద, మోటారు సైకిళ్ళ కింద చిక్కి నలిగి చావటం చాలాసార్లు చూసి వున్నాడు. ఇప్పుడు శీతాకాలం. ఈ చలిలో పాములు అంతగా బైటికి రావు. వచ్చినా తనేం చేయగలడు. పారిపోవటం తప్ప.

పాము కనిపించకపోయినా పరిగెట్టసాగేడు చంద్రశేఖరం. చెప్పులు పాదాలకి టపటప కొట్టుకుంటున్నాయి. అదీ ఒకందుకు మంచిదే అనిపించింది. ఒకవేళ పామొచ్చినా ఆ శబ్దాన్ని విని పారిపోతుంది.

క్లాక్ టవర్ దగ్గర మాత్రం దీపాలు కొన్ని వెలుగుతున్నాయి. కొద్దిగా జన సంచారం కూడా కనిపించింది. అల్లావుద్దీన్ ఐస్‌ఫ్యాక్టరీలోంచి మోటార్లు తిరిగే శబ్దం వినవస్తోంది. అల్లావుద్దీన్ కుటుంబం అంటే నిజాంకి కిట్టదని చెప్పుకునేవాళ్లు. అందుచేతనే అల్లావుద్దీన్‌కి పోటీగా అతని బంధువొకతనికి డబ్బు సహాయం చేసి 'జి.అల్లావుద్దీన్ ఐస్‌ఫ్రూట్ ఫ్యాక్టరీ' అనే మరో షాపుని నిజాం నవాబు తెరిపించాడు అని కూడా చెప్పుకునేవారు. ఈ చలికాలంలో కూడా ఐస్‌క్రీములు. ఐస్‌ఫ్రూటులూ తింటూనే వున్నారు జనం. ఈ ప్రాంతంలో తప్పకుండా రేడియో వుండి తీరాలి. గాంధీని గురించి వివరాలు ఇక్కడి వాళ్ళనడిగితే?

కింగ్స్‌వేలో కూడా జనసంచారం తక్కువగా వుందె. ముఖ్యంగా శుక్రవారాలపూట తొమ్మిదిన్నర దాటేకనే షాపులు మూస్తారు ఈ ప్రాంతంలో. ఏదైనా సినిమాహాలలు దగ్గరకెళ్ళి ప్రయత్నించాలి. ఏదైనా పత్రిక కొని చదవొచ్చు అక్కడ. అక్కడ తప్ప మరెక్కడా పత్రికలు దొరకవు ఈ వేళప్పుడు. సాయంత్రాలు వచ్చే పత్రిక 'హైదరాబాదు బులెటిన్'. అందులో తప్పకుండా గాంధీ మరణవార్త వచ్చి వుంటుంది. మొదట్లోనే రైల్వేస్టేషన్ వేపుకి వెళ్ళి వుంటే ఈపాటికి పత్రిక వుండొచ్చు. క్లాక్‌టవర్ కేసి రావాలనిఎందుకనిపించింది తనకి? 'గాంధీ మరణించి రెండు గంటలైంది' అని కోపంగా వెళ్ళిపోయాడే అతడినే మరికొన్ని వివరాలడిగి వుండొచ్చు. కాని తండ్రి పక్కనే వుండగా తగుదునమ్మా అని తను కల్పించుకోగలడా? తండ్రి అయినా అడిగి వుండొచ్చు. కాని ఎంచేతో అతనూ అడగలేదు. గాంధీ అంటే తన తండ్రికి ఇష్టం లేదా? గాంధీ అంటే గౌరవం లేనివాళ్ళు కూడా వుంటారా అసలు. అతణ్ని కాల్చి చంపినవాడు తప్ప. ఎవడా హంతకుడు? ముస్లిమేనా?

చంద్రశేఖరానికి శరీరం వేడెక్కింది. ముస్లిం! గాంధీని చంపింది ముస్లిం అయివుంటే ఈపాటికి పదిమంది ముస్లింలని హతమార్చి వుండేవాడు. వీలైతే వందమందిని. చంపుతూనే వుండేవాడు. నిజామునే అంతమొందించి వుండేవాడు. ఖాసిం రజ్వీని పొడిచి చంపివుండేవాడు.

వందమంది ముస్లింలు తనకోసం మెడలు వంచి నిలబడతారా? మెడలు చాచి నిలబడేది హిందువులేనాయె ఇక్కడ. హిందువులు, లంబాడీలు. ఇంతకీ లంబాడీలు హిందువులా ముస్లింలా?

చంద్రశేఖరం మినర్వాటాకీసు చేరుకున్నాడు. మొదటాట విడిచిపెట్టారు. అంతా వెళ్ళిపోయారు. ఒక బడ్డీకొట్టు మాత్రం తెరచి వుంది. ఆ కొట్టు కుర్రవాణ్ని అడిగాడు చంద్రశేఖరం.

"గాంధీగారి సంగతేమైనా తెలుసా?"

"తెలుసండి. ఆయన్ని పాపం ఒక పిచ్చి ముండాకొడుకు చంపేశాడు."

"ఎట్టా తెలుసు నీకు?"

"రేడియోలో చెప్పారండి. సంగతి తెలిసి కింగ్సువేలో ఏడున్నరకే కొట్లన్నీ కట్టేసేరు" "రైల్వేస్టేషన్ దగ్గర ఎవరూ అనుకున్నట్టు లేదే"

"ఊరంతా అనుకుంటున్నారు కదండీ"

కాదు ఇంక వూరంతా పాకలేదు. లేక లాన్సర్ బారక్సు వూళ్ళో భాగంకాదా? అక్కడ కరెంటు పోయింది. రేడియో విని తెలుసుకునే అవకాశం లేదు. లాన్సర్ బారక్సుకి సంబంధించినంతవరకు గాంధీ అనే ఒక ఆత్మలేదు. అక్కడి ఆంగ్లో ఇండియన్‌లకి, రజాకార్లకి గాంధీతో పనేమిటి?

గాంధీ నిజంగా మరణించేడా? అయి వుండదు. నూట పాతికేళ్ళదాకా తను జీవించి వుంటానని అనేవాడే! ఎవరో పుకారు పుట్టించేరు. రేడియోలో అబద్ధం చెప్పి వుండకూడదా ఏమి? యుద్ధపు రోజుల్లో రేడియోలో వాడినవన్నీ అబద్ధాలు కావా ఏమి? జర్మన్ రేడియో బ్రిటన్‌కి అబద్ధాలు, బ్రిటీష్ రేడియోలో జపాన్‌కి అబద్ధాలు. అంచేత ఇప్పుడు రేడియోలో చెప్పింది అసత్యమే అయివుంటుంది. గాంధీకి మరణమా? ఎన్నిసార్లు నిరాహారదీక్ష పూని వున్నాడు. ఇరవై ఒక్కరోజులు వుపవాసం వున్నాడే! 'అదో అయిపోయింది. ఇదిగో చనిపోతున్నాడు' అన్నారే అప్పుడు కూడా. కాని గాంధీ బతికేడు. పత్రిక కోసం వెదుక్కుంటూ డివోలీ

సినిమాదాకా వచ్చాడు చంద్రశేఖరం. హైదరాబాదు బులెటిన్ పత్రిక ఈసినిమాహోలు వాళ్ళదే. ఎక్కడ దొరికినా దొరక్కపోయినా ఈ హోలు ముందు మాత్రం కట్టలు కట్టలు పత్రికల్ని అమ్ముతూ తిరిగేవాళ్ళు కుర్రాళ్ళు. అయినా మధ్యాహ్నం పూట, సాయంత్రాలు మాత్రమే చూసి వున్నాడు చంద్రశేఖరం. ఇప్పుడు వూరు వూరంతా నిశ్శబ్దంతో మునిగివుంటే ఎవరైనా పత్రికలమ్ముతూ తిరుగుతారా?

డివోలీలో రాత్రి ఆటలుండవు. ఆ సినిమా నానుకున్న కిళ్ళీ కొట్టు, చిన్న హోటలు అన్నీ మూసివున్నాయి. మేనేజర్ గది మాత్రమే తెరచి వుంది. తలుపు దగ్గరకెళ్ళి నించున్నాడు చంద్రశేఖరం.

"ఎవరూ?" అని ప్రశ్నించేడు లోపల కూర్చున్న ఒకతను.

"ఒక బులెటిన్ పత్రిక కావాలి" అన్నాడు చంద్రశేఖరం.

"అంతా మూసివేశాం కదా"

చంద్రశేఖరం వెనక్కి తిరిగేడు. "కావాలంటే నా పత్రిక వుంది తీసికెళ్ళు" అన్నాడు లోపల్నించి ఆ మనిషి. మేజా డ్రాయరులాగి పత్రిక తీసిచ్చాడు. హడావిడిగా పత్రిక తెరచి చూసేడు చంద్రశేఖరం. హైదరాబాదు బులెటిన్ ఒకటే పేపర్. నాలుగ్గా మడిచి వుంది. ఏవేవో వార్తలు, ప్రకటనలు - హైదరాబాదు మంత్రివర్గంలో మార్పులు. జి.రామాచారి-హిందూద్వేషి. లెయిక్ అలీ నాయకత్వంలో ఒక హిందూ మంత్రి. ఇద్దుహాదూల్ ముస్లిమీన్ ముఠా ఆయత్తం. భారత సర్కార్ అక్రమాలు. హైదరాబాదు సంస్థానంలోని రెండు కోట్ల ప్రజల్ని ఆకలితో మాడ్చి చంపడానికి కుట్ర! అత్యవసర వస్తువుల్ని సైతం హైదరాబాదుకి రానివ్వటంలేదు భారత ప్రభుత్వం. పెట్రోల్ లేదు. డీసెల్ లేదు. మందుల్లేవు. ఆహారధాన్యాలు లేవు. యంత్రసామాగ్రి లేదు. లారీల్లేవు. కార్లు లేవు. నీళ్ళని శుద్ధి చేయడానికి అవసరమయ్యే క్లోరిన్ కూడా లేదు. నిజాం సంస్థానాన్ని భారత సర్కార్ గుత్తకు తీసుకున్నదా? నిన్నటిదాకా జైలు పక్షులుగా వున్న వాళ్ళంతా ఈనాడు పెత్తందారులైనారు. తరతరాల రాచ వంశీయుల్ని పీడిస్తున్నారు. ఏడు తరాల నవాబుల వంశం. ఇంకా ఎంతో కాలం సాగదు ఈ భారత సర్కారు అక్రమాలు. మన 'రుస్తుమిదివాన్ అరస్తుయి జామన్ ముజఫరల్ ముల్క్‌వాల్ ముమయ్యిక్ ఫతేజంగ్ సిబ్బహ్ 'సలార్ జా' గారి పాదాలని బంగాళాఖాతపు కెరటాలు కడిగే రోజు ఎంతో దూరం లేదు. అరేబియా సంద్రపు అలల నురగలు

మనం నిజాంగారి పాదరక్షల్ని స్పర్శించే కాలం దగ్గర్లోనే వుంది. ఢిల్లీ ఎర్రకోట మీద అసఫ్‌జా గారి పవిత్ర పతాక త్వరలోనే ఎగురనున్నది'

పేపరంతా వెతికి చూశాడు చంద్రశేఖరం. ఎక్కడా గాంధీ మరణవార్త కనిపించలేదు. గాంధీ చనిపోలేదు.

"ఎందుకు తిరిగిచ్చేస్తున్నావు. ఒద్దా?" అడిగేడు ఆ మనిషి.

"అవసరంలేదు. ఎవరో గాంధీ చనిపోయాడని పుకారు పుట్టించారు. నిజమో కాదో తెలుసుకుందామని పేపరు చూశాను"

"అది పుకారు కాదబ్బాయ్. నిజమే. అందుకే ఈ రోజు రాత్రి ఆట కాన్సిల్ చేశాం"

"ఏమిటి? నిజమా? నిజమా?"

"అవునబ్బాయ్. నిజమే ఏం చేస్తాం చెప్పు"

"అయితే పేపర్‌లో వెయ్యలేదే?"

"ఈ పత్రిక నాలుగ్గంటలకే అచ్చయింది"

"ఒక్క ముక్క కూడా లేదే గాంధీ గురించి"

"అప్పుడాయన చనిపోలేదు కదా"

విచారం ధ్వనించే గొంతుతో అంటూ ఓ మూలగా వున్న రేడియోని తిప్పేడు అతను. గరగర మని శబ్దం చేసింది రేడియో. మెల్లిగా మీట తిప్పాడు. ఆంగ్లంలో ఒక కంఠం జీరగా పలికింది.

"పండిట్ నెహ్రూ... పండిట్ నెహ్రూ... విను" అన్నాడతను.

"మన జీవితాలలోంచి ఒక జ్యోతి ఆరిపోయింది. అంతటా చీకటి. ఈ భూమి మీదికి వెలుగుని ప్రసరించిన ఆ కాంతి సామాన్యమైన జ్యోతికాదు. అది ఈనాటిది మాత్రమే కాదు. రాబోయే తరాలని కూడా ప్రభావితం చేయగలది. ఎల్లప్పుడూ జీవించి వుండే శాశ్వత సత్యాన్ని ప్రతిఫలించగల జ్యోతి అది..."

రేడియోలో ఇంకా ఆ గొంతు వినిపిస్తుండగానే చంద్రశేఖరం అక్కణ్ణించి కదిలేడు. ఎక్కడో వుండే ఒక సినిమాహాలు అతడి గాంధీని చంపేసింది. గాంధీ నిజంగానే మరణించేడు.

రోడ్డు పొడవునా నిలబడిన చెట్లు ఆ జనవరి మాసపు చీకటిని మరింత చిక్కబరుస్తున్నట్టుగా వుంది. అంతటా చీకటి. వెలుగు మాయమైంది. సామాన్యమైన

వెలుగు కాదది. అతనికామాటలు పూర్తిగా అర్థంకావటంలేదు. కేవలం భౌతిక వార్తలుగా మాత్రమే అనిపించాయి. డిపోలీ నుంచి ఇక ఇంటికి వెళ్ళాల్సిందే. రెండుమైళ్ళకి పైగా నడవాలి. ఇదంతా మిలటరీ ప్రదేశం. ఒకప్పుడు ఇరవై నాలుగు గంటలూ పిశాచాల్లా మిలిటరీ ట్రక్కులు వెళుతుండేవి ఈ దారమ్మట. ఇప్పుడు మిలిటరీ లేదు. సజీవ పిశాచాలు తిరుగుతున్నాయి ఇక్కడ పెరేడ్ మైదానంలో. పెద్ద స్మశానం.

క్రిస్టియన్ పిశాచాలు తిరుగాడే ప్రదేశం. డిపోలీ సినిమాహాల్లోనే ఏదో దెయ్యం తిరుగుతూందని చెప్పుకుంటారు. చనిపోయిన వాళ్ళంతా దయ్యాలవుతారా? గాంధీ కూడానా? కనీసం అతని దయ్యమైనా కనబడుతుందా తనకి?

గాంధీని అతడొక్కసారి కూడా చూసిందిలేదు. గాంధీ వెళ్ళిన ప్రదేశాలు, విడిది చేసిన స్థలాలు అన్నీ వూహాచిత్రాలుగానే మిగిలిపోయినయ్ అతని దృష్టిలో. వార్ధా, ఎర్వాడా జైలు, సేవాగ్రాం, సబర్మతి, నౌకాళి, హిందీ ప్రచారసభ, మద్రాసులోని హిందీ ప్రచార సభదాకా వచ్చాడు గాంధీ. అయినా ఒక్కసారి కూడా ఈ హైదరాబాదు సంస్థానానికి వచ్చింది లేదు. ఏయేమారుమూలల ప్రదేశాలకంతానో వెళ్ళివున్నాడు కాని సికింద్రాబాదుకి రాలేదు. ఇక్కడి వారికి ఆయనంటే ప్రేమలేదా? వీళ్ళకి ఆయన అవసరం లేదా?

గాంధీ! గాంధీ అరుస్తూ పరిగెడుతున్నాడు చంద్రశేఖరం. అతని అరుపులకి కొన్ని చీకటి పురుగులు ఒక్కక్షణం నిశ్శబ్దం వహించేయి. ఒక పక్షి గజగజ వొణికి కొమ్మల సందున ఆకుల మధ్య ఒదిగిపోయింది. రోడ్డు మీంచి పెరేడ్ మైదానం మధ్యగా పరిగెట్టాడు. గాంధీ అని కేకలు పెడుతూ పరిగెడుతున్నాడు. చీకట్లో చెట్లు కూడా కనబట్టంలేదు. పైన విశాలంగా పరుచుకున్న ఆకాశం. నక్షత్రాలు. ఒక చిన్న చెట్టుకి కొట్టుకున్నాడు. ముందుకి తూలిపడ్డాడు. ఎర్రమట్టి పరచిన మైదానం. చిన్నవీ, పెద్దవీ ఎర్రమట్టిరాళ్ళు. ముక్కులోంచి నెత్తురు కారి పెదాలని తడిపింది. అలా నేంమీద కూలబడి "చచ్చిపోయావా? గాంధీ నువ్వు చనిపోయావా?" అంటూ కాళ్ళూ చేతులూ నేలని కొడుతున్నాడు చంద్రశేఖరం.

పైకి లేచాడు. కాళ్ళూ చేతులూ గీరుకుపోయినయ్. మరో దిక్కుగా పరిగెత్తేడు. అటువేపే స్మశానం. మళ్ళీ ఏదో తట్టుకుని కిందపడ్డాడు.

"అయ్యో, ఒక్కసారి కూడా చూడలేదే నిన్ను" అంటూ ఆక్రోశించాడు. మళ్ళీ చేతుల్తో నేలని బాదేడు. "గాంధీ! ఓ గాంధీ! అని పిలిచాడు. చుట్టూ తిరిగి చూసేడు. అతని చేష్టలు అతనికే చిత్రంగా కనిపిస్తున్నాయి. గుప్పెట్లోకి మట్టిని తీసుకున్నాడు. ఆ మట్టిని పైకెగరేశాడు. మళ్ళీ పైకి లేచాడు. ఎటువేపో తెలీకుండా పరిగెట్టాడు. మళ్ళీ బోర్లా పడ్డాడు. తలని నేలకేసి బాదుకున్నాడు.

దూరంగా రేస్‌కోర్సు సమీపంలో ఒక మోటారు కారు దూసుకుపోయింది. అరమైలు దూరమైనా వుంటుంది. అయినా ఆ కారు కేసి పరిగెత్తాడు. నిమిషంలో అది అతని దృష్టికి అందకుండా పోయింది. ఏవేవో ఆర్తనాదాలు చేశాడు. నేలమీదికి వంగి గడ్డినీ, పిచ్చి మొక్కల్నీ పీకసాగేడు. చేతివేళ్ళు మంటలు పెట్టాయి. మళ్ళీ పరుగు సాగించేడు. చొక్కా చాలా చోట్ల చిరిగిపోయింది. మంచు కురుస్తున్నా వొళ్ళంతా మండుతున్నట్టుగా అనిపించింది. ఎవరిమీదో తెలియని కోపంతో చొక్కా చింపుకున్నాడు. కిందపడ్డాడు. కింద రాళ్ళ గుట్ట మీద పడ్డాడు. గుప్పెళ్ళకి ఆ రాళ్ళని తీసుకున్నాడు. నాలుగు వేపులకి బలంగా ఆ రాళ్ళని విసిరేడు. కుడిచెయ్యి ఆ విసురుకి బెణికింది. అయినా అలాగే విసురుతున్నాడు. అప్పుడు భుజం దగ్గర కలుక్కుమంది. బాధతో "అమ్మా" అని అరిచేడు.

ఎగరొప్పుతున్నాడు. శరీరంలో చాలా చోట్ల గాయాలు, బాధగావుంది. అప్పటికీ అతని ఆవేశం చల్లారలేదు. ఎవరో తనని ఘోరంగా వంచించిన భావన. ఆకాశంలోకి ఎలుగెత్తి పిలిచాడు.

"గాంధీ! గాంధీ!"

ఎడం చేత్తో రాళ్ళని బలంగా విసిరేడు. ఎక్కువ పైకెగరలేదు, ఆ రాయి దభీమని కింద పడింది. ఆకాశం ఎప్పటిలాగే వుంది. నక్షత్రాలు మామూలుగానే ప్రకాశిస్తున్నాయి. అలసిపోయి నేలమీద పడివున్నాడు చంద్రశేఖరం. చీకటి రంగులు మారుతున్నట్టుగా అనిపించింది అతని కళ్ళకి. చీకటి ద్రవంగా మారుతున్నట్టనిపించింది. చేతుల్లో నేలని తడిమిచూశాడు. క్రికెట్ పిచ్‌మీద పడుకుని వున్నట్టు తెలిసింది. ఈ ప్రదేశంలో తను క్రికెట్ కూడ ఆడి వుంటాడు ఒకప్పుడు.

ఇల్లు గుర్తొచ్చింది అతనికి. ఇంట్లో కరెంటు వచ్చి వుంటుందా. లేక ఇంకా చీకట్లో పడికొట్టుకుంటున్నారా? వెలుగు మాయమైంది. ఈపాటికి అంతా

చీకట్లోనే నిద్రపోతూ వుండి వుంటారు. లేక తన కోసం మేలుకుని వుంటారా? గాంధీని గురించి సరైన సమాచారం అందక తికమక పడి వుంటారు. అంతా దుఃఖంలో మునిగి వుంటారు. వండినవన్నీ అలాగే వంటింట్లో పడి మూలుగుతుంటాయి. ఎలుకలు, బొద్దింకలు స్వాహా చేస్తుంటాయి. గమనించే నాథుడు లేక గేదె అరుస్తూ వుంటుంది.

జన సంచారం లేని ఆ ప్రదేశంలో అలా పడి వుండటం మనసుకి కొంత వూరటగా వున్నట్టనిపించింది. అది నిజంగా వూరడింపేనా? ఎందుకో అందరూ తనని మోసం చేసి వెళ్ళిపోతున్నట్టుగా అనిపిస్తోంది అతనికి. అన్నీ సందేహాలే. చివరికి గాంధీ కూడా తనని మోసగించి వెళ్ళిపోయాడు.

కోపమూ, దుఃఖమూ పొంగుకొచ్చింది చంద్రశేఖరానికి. ఆ మైదానంలో ఒక్క క్షణం కూడా ఇక వుండాలనిపించలేదు. చివాలున లేచి పరుగు లంకించుకున్నాడు. ఎప్పుడో పత్రికలో చూసిన గాంధీ ఫొటోలు మనసులో లీలగా కదిలేయి. ఒక రైలింజన్ని అలంకరించేరు. ఆ ఇంజను ముఖానికి ఒక పెద్ద గాంధీ ఫొటోని తగిలించారు. తను గాంధీని చివరిసారిగా చూట్టం ఆ సందర్భంలోనే. గాంధీని చివరిసారిగా దక్షిణ ప్రాంతాలకి మోసుకెళ్ళింది ఆ యింజనే. ఇప్పుడు ఆ ఇంజనులాగే పరిగెడుతున్నాడు తను. ఒకచోట నిలబడిపోయి పెద్దగా ఆర్తనాదం చేశాడు చంద్రశేఖరం. ఆ వెంటనే వెక్కి వెక్కి ఏడ్చాడు.

## 3

ఆ రోజు నాగరత్నం వచ్చింది ఇంటికి. పరీక్షలైపోయినయ్. పాఠాలు జరక్కపోయినా పరీక్షలు జరిగినయ్. సగం మంది మాత్రమే పరీక్షలు రాసేరు. ఎంతమంది పాసవుతారో. తను మాత్రం పరీక్షలు బాగానే రాసిందట నాగరత్నం. ఇంట్లో అంతా వూరికి వెడుతున్నారట. బాగా గడ్డం పెంచి ఒంట్లో ఆరోగ్యం లేదని డాక్టరు సర్టిఫికేటు సంపాదించి రెండు నెలలు సెలవు పెట్టాడు వాళ్ళ నాన్న. హైదరాబాదు నించి వెళ్ళడానికి పోలీసు పెర్మిట్ కూడా సంపాయించేడు. వచ్చే శనివారం 12 డౌన్ ట్రైన్ వాళ్ళని కాజీపేట జంక్షనుకి చేరుస్తుంది. కాజీపేటకి చేరుకునేసరికి రాత్రి పదకొండవుతుంది. నాలుగ్గంటల సేపు ఆ రైలు పెట్టెలు స్టేషన్‌లోనే నిలిచి వుంటాయి. గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ వస్తుంది. ఆ పెట్టెల్ని

దానికి తగిలిస్తారు. నిన్నటిదాకా అలాగే జరుగుతూ వచ్చింది. ఈ వారమంతా కూడా అలాగే జరిగితే బావుణ్ణు. ఉదయం ఎనిమిదికల్లా బెజవాడు చేరుకోవచ్చు. ఆ తరువాత ఇక భయంలేదు. ఈ వూరు బతికి బాగుపడితే మంచిరోజు చూసుకుని తిరిగి రావచ్చు. మద్రాసు ప్రెసిడెన్సీలో లేని కాలేజీలా? రిటైరయ్యే దాకా నాన్న ఎటూ ఆ వూళ్ళో తిప్పలు పడాలి. ఇంకా రెండు మూడేళ్ళే సర్వీసుంటుంది ఆయనకి.

"నేను వెళ్ళిరానా? అందరికీ చెప్పిపోదామని వచ్చాను. ఏరా చంద్రూ! నాకు ఉత్తరాలు రాస్తుంటావా? వెళ్ళిన వెంటనే నేను మీకందరికీ తప్పకుండా వుత్తరం రాస్తాను."

తదేకంగా ఆమెకేసి చూస్తూ నుంచున్నాడు చంద్రశేఖరం. ఇటీవల ఇదో దురలవాటై కూర్చుంది. ఎవరైనా మాట్లాడుతూ వుంటే కన్నార్పకుడా వాళ్ళ ముఖాన్నే చూస్తూ వుండటం. నాగరత్నాన్ని ఇంత దగ్గరగా చూసి చాలా రోజులైంది. నాగరత్నం ఎంతో ఎదిగిపోయినట్టుగా అవుపిస్తున్నది. నల్లగా వుంది. ముఖం అంత నునుపుగా లేదు. శిరోజాలు కూడా అంత క్రమంగా పెరగలేదు. అస్తవ్యస్తంగా నుదుటిమీద, చెక్కిళ్ళమీద పడుతున్నాయి. అయినా నాగరత్నం అతనికి కంటికి అందంగానే కనబడుతోంది.

"ఏరా మౌనంగా నిలబడ్డావు. నాతో మాట్లాడవా?" ఆప్యాయతతో కొంత చిలిపినవ్వు రంగరించి అడిగింది.

"ఏదో ఆలోచిస్తూ వుండిపోయాను" అన్నాడు చంద్రశేఖరం.

"బావుంది నేను మాట్లాడుతుంటే వినకుండా నువ్వేదో ధ్యాసలో వున్నావన్నమాట?"

"వింటూనే ఆలోచిస్తున్నాను"

"అదెలా సాధ్యం" కళ్ళు చక్రాల్లా తిప్పింది.

"నువ్విప్పుడు మాట్లాడినదంతా అట్టాగే వప్పజెప్పనా?"

"వద్దులే బాబూ"

కాస్సేపు ఇద్దరి మధ్యా మౌనం.

"ఇక్కణ్ణించి వెళ్లిపోవాలంటే ఒకవేపు సంతోషంగా వుంది. మరో పక్క ఏదో భయంగానూ వుంది. అక్కడ మా చుట్టాలంతా అదో రకం మనుషులు.

వాళ్ళ మధ్య నేనెలా సర్దుకుపోగలనో అని తల్చుకుంటే దిగులుగా వుంది. ఏమిటి? మళ్ళీ నా మాటలు వినకుండా ఆలోచనల్లో మునిగిపోయావా?"

"చెప్పనా?"

"ఏమిటి?"

"నే నేమని ఆలోచిస్తున్నానో"

నాగరత్నం కూడా కొంచెం సిగ్గుపడింది. చెప్పమనడానికి ఆమె సంకోచిస్తున్నదని గ్రహించగలిగాడు చంద్రశేఖరం. ఇంతకుముందు ఇంత చనువుగా ఆమె అతనితో మాట్లాడింది లేదు. అతనంటే ఏదో చిన్న కుర్రాడు అనే భావన మాత్రమే వుండేది ఇది వరకు ఆమెకి. తనని చూడాలని ఈ అబ్బాయి పడే తంటాలని ఆమె గమనిస్తూనే వచ్చినా పెద్దగా పట్టించుకునేదికాదు. ఈ సంగతులు సూచనప్రాయంగా అతనికి తెలియచెప్పింది కూడా. ఊరువదిలి వెళ్ళిపోతున్నామనే నెపంతో ఈ రోజు పనిగట్టుకుని వచ్చి ఇంతసేపు తీరిగ్గా మాట్లాడుతున్నది. రెండు నెలల కిందట హఠాత్తుగా కనిపించకుండా పోయి రెండు రోజుల తరువాత తిరిగి వచ్చింది అని కూడా అనుకున్నారు నాగరత్నం గురించి. అంతటి నెరజాణ. అయినా సంకోచిస్తున్నది తన ముందు.

"నే వెళుతున్నాను" అనేసి అక్కడ్నించి వెళ్లిపోయింది. ఆ పది నిమిషాల అనుభవం ఏదో స్వప్నం వలె అనిపించింది అతనికి. అనుకోకుండా ఈనాడు మానసికంగా తనకి దగ్గరైంది ఈ నాగరత్నం. అపును మానసికంగా మాత్రమే. శారీరకంగా దగ్గరయ్యే తెగింపు ఆమెకున్నా తనకి మాత్రం లేదు. తను ఆలోచనల్లో వుండగానే మళ్ళీ మెరుపులా మాయమైంది. నాకిలాంటి గడుసు అమ్మాయిలతో పనిలేదు. అసలు అమ్మాయి సావాసమే వద్దిక. ఇదే ఆర్నెల్ల క్రితం ఈ నాగరత్నం ఇంత చనువుగా మాట్లాడి వుంటే తనెంతో పొంగిపోయి వుండేవాడు. కాని ఇప్పుడు ఆనందించే స్థితిని కోల్పోయి వున్నాడు.

నాగరత్నం ఇంట్లో వాళ్ళందరికీ వెళ్ళొస్తానని చెప్పి కదిలింది. ప్రయత్నించి వుంటే ఒక్క క్షణం ఆమెని ఆగమని వెనక్కి పిలిచి వుండొచ్చు. ఆమె ఎంతో దూరానికి వెళ్ళిపోతూంది. మరి కొంతసేపు ఆమెతో మాట్లాడి వుండొచ్చు. అయినా శిలా ప్రతిమలా కూలబడిపోయాడు చంద్రశేఖరం.

ఇంటిముందు మే ఫ్లవర్ చెట్లు విరగబూసి వున్నాయి. మే నెలని ఎప్పుడూ

అవి మరచిపోవు. హైదరాబాదు వర్షాలు కూడా అంతే. జూన్ అయిదారు తేదీల్లో వర్షాలు పడతాయి. భారీవర్షాలు రావు. బాగా వర్షం పడితే జనం ఎందుకిలా జొన్నరొట్టెలు, శీతాఫలాలు తిని కడుపు నింపుకుంటారు?

ఇంట్లో పాత్రలు, డబ్బాలు, కుండలు అన్నీ ఖాళీగా వున్నాయ్. కాయగూరలు ఎన్ని దొరికినా ఏం లాభం? వంటకి కావాల్సిన తక్కిన సామాన్లు లేవు. ఉప్పు లేదు. మిరపకాయల్లేవు. ఆఖరికి సెనగనూనెకి కూడా గిరాకీ ఇప్పుడు. డీసెల్ కి బదులు సెనగనూనె వాడితే ధరలు పెంచాల్సిందే మరి. అయితే ఒక మంచి జరుగుతోంది. ఇంట్లో వండుకోకపోయినా వీధిలోకి వస్తే చాలు. ఘుమ ఘుమ వాసన. ఊరు వూరంతా పకోడీల వాసన. నూనె సగానికిపైగా పొగ రూపాన వృథా అయిపోతున్నది. వీధిలోకొస్తేచాలు సెనగనూనె పొగ. బజ్జీలు, ఓంపొడి కారాబూందీ వేగుతున్న కమ్మటి వాసన.

నూనెకి ఇంత గిరాకీ వున్నా నాగపూర్ రెఫ్యూజీలింకా తినుబండారాలు చేసి అమ్ముతూనే వున్నారు. వాళ్ళ సరుకుని కొన్ని హోటళ్ళు మొత్తంగా కొనుక్కుంటున్నాయి.

నాన్నగారికి ఇటీవల ఆఫీసులో బోలెడు ఇబ్బందులు. వాళ్ళ డిపార్టుమెంటుకి ఒక ముస్లిం ఆఫీసరుని నియమించేరు. అతనికి వురుదు తప్పితే మరో భాషరాదు. ఆఫీసు నోటింగులన్నీ వురుదూలోనే రాస్తున్నాడు. అతనిలాగే చాలామంది ముస్లిముల్ని తెచ్చి పడేస్తున్నారు ఆఫీసులో. ఈ రైల్వేశాఖ ఎలాగో ఇంతకాలమూ తన ప్రత్యేకతని కాపాడుకుంటూ వచ్చింది. ఆంధ్రులు, తమిళులు, ఆంగ్లేయులు, ఆంగ్లో-ఇండియన్లు - వీళ్ళే ఎక్కువగా వుంటూ వచ్చారు. ఇప్పుడు ఇది కూడా నిజాం రాజ్యంగా మారిపోయ్యేట్టుంది. కొత్తగా వచ్చిన ముస్లిములలో సగానికిపైగా బొంబాయి నుంచి, పాట్నా నుంచి వచ్చి పడుతున్నారు. ఒక్కొక్కడూ ఒక్కో యాసతో మాట్లాడుతున్నాడు. వాళ్ళమాటలే వాళ్లకి అర్థం కావటంలేదని చెప్పాడు నాన్న. నాన్న ఎందుకో భయపడుతున్నట్టుగా వుంది. ఒకరోజు నాన్నగారి వాకింగ్ స్టిక్ ని ఒక పోలీసు లాక్కున్నాడు. నాన్నని పోలీస్ స్టేషన్ కి తీసుకుని వెళ్ళాడు. ఆయుధాలు పట్టుకుని తిరుగుతున్నాడని నేరం మోపాడు. ఆ ఇన్ స్పెక్టర్ నాయన్ని హెచ్చరించి విడిచిపెట్టాడు. చేతికర్రని మాత్రం తిరిగి ఇవ్వనేలేదు. ఇంట్లో అలాంటి కర్రలు ఇంకా రెండు మూడు వున్నాయి. అయినా

వాటిని తాకడానికే భయపడుతున్నాడు నాన్న. చేతికర్ర లేకుండా ఆయన నడిచి వెళ్ళడం చూస్తే ఏదోగా వుంది. అసలెక్కువగా బయటికి వెళ్ళడం మానుకున్నాడు. ఊళ్ళో కూడా జనం ఎక్కువగా తిరగటంలేదు. నాగరత్నం ఒంటరిగా నడిచి వచ్చిందీరోజు. ఆ అమ్మాయికి ధైర్యం జాస్తి. ఇంట్లో ఎవరికీ చెప్పకుండా బయలుదేరి వుంటుంది.

పక్కింటి ఖాసిం నాన్నని పిలుస్తున్నాడు. బయటికి తొంగి చూసి "నాన్న ఇంకా ఆఫీసు నుంచి రాలేదు" అన్నాడు చంద్రశేఖరం.

"మా ఇంట్లో నీళ్ళే రావటంలేదు. ఏం గోల్మాల్ చేశారు" అని అడిగాడు కోపంగా ఖాసిం. ఆ ఇంట్లో ఖాసిం ఉన్న జాడే తెలియదు సాధారణంగా. ఆ ఇంటి రేడియో మాత్రం ఎప్పుడూ వాగుతూనే వుంటుంది. ఈమధ్య ఖాసిం పెద్దగా అరుస్తున్నాడు. నాన్నమీద కేకలేస్తున్నాడు. బెదిరిస్తున్నాడు.

"మేమేం చేస్తాం. మా ఇంట్లో కూడా నీళ్ళు రావటంలేదు." అన్నాడు చంద్రశేఖరం.

"ఎందుకు రావటంలేదు. ధనధనమని ఇరవై నాలుగ్గంటలూ నీళ్ళు పడటం మాకు వినపట్టంలేదా? ఏమిట్రా ఈ దగుల్బాజీతనం" అంటూ అడ్డగోడ దూకి. చంద్రశేఖరాన్ని నెట్టివేసి ఇంట్లోకి దూరేడు అరుచుకుంటూ. అతని వెంబడే చంద్రశేఖరం కూడా వెళ్ళేడు.

చెప్పుల కాళ్ళతోనే పూజగది, వంటగది దాటుకుంటూ పెరట్లో వున్న కుళాయి దగ్గరికి నడిచాడు ఖాసిం. కుళాయి మెయిన్ పెరట్లోనే వుంది. ఆ మెయిన్ద్వారా రెండు వైపులకి కనెక్షన్ వుంది. ఖాసిం ఇంటికి చంద్రశేఖరం వాళ్ళ ఇంటికి కొద్ది రోజుల్నించీ నీళ్ళు సరిగ్గా రావటంలేదు.

మెయిన్ దగ్గర నిలబడి కిందికి వంగి "ఏమిటిది?" అని గద్దించేడు ఖాసిం. చంద్రశేఖరానికి ఏమీ అర్థంకాలేదు. ఈ గొడవ విని వంట గదిలోంచి భయంగా తొంగి చూస్తోంది అమ్మ.

"ఎందుకురా ఎప్పుడూ కుళాయి తెరిచే వుంచుతున్నారు?"

ఖాసిం కుళాయి మర తిప్పి మూసేశాడు. "నీళ్ళన్నీ మీరిలా వాడుకోబట్టే మాకు రావటంలేదు" అంటూ కేకలు పెట్టాడు. పెరటి నలువేపులలా పరికించాడు. గేదె కోసం పెట్టిన కుడితి తొట్టి అతని కంట పడింది.

"మనుషులకే నీళ్లు లేవు. ఈ గొడ్డుకి నీళ్లని వృధా చేస్తున్నారా మీరు? ఈ రాత్రిలోగా ఈ గొడ్డుని ఇక్కడ్నించి కదిలించాలి తెలిసిందా?" అమ్మ మరికొంచెం తొంగి చూసి అన్నది. "మేము దానికి మంచినీళ్ళు పెట్టటమే లేదు. బావినీళ్ళు మాత్రమే పోస్తున్నాం."

"ఇదేం మీ భాబుగాడి జాగీర్దారనుకుంటున్నారా? అసలు రైల్వే క్వార్టర్సులో బర్రెనెలా వుంచుకోవచ్చు. ఈ సంగతి రైల్వే ఆఫీసుకి రాసి పడేశానంటే చాలు వారానికల్లా మీ చట్లూ, కుండలూ లాగి వీధిలో పడేస్తారు జాగ్రత్త" అంటూ పెద్దగా కేకలేశాడు ఖాసిం. వెళుతూ వెళుతూ చంద్రశేఖరంతో "మీ అబ్బ వచ్చిన వెంటనే నన్నొచ్చి కలవమని చెప్పు" అని వెళ్ళాడు. ఏమనుకుందో ఏమో గేదె అతడ్ని చూసి రంకె వేసింది. విసురుగా వెనక్కి తిరిగి కాలితో దాన్ని ఒక్క తాపు తన్నేడు ఖాసిం. అతను వెళ్ళి తరువాత వాకిలి తలుపు మూసి గడియపెట్టి బయ లుదేరాడు చంద్రశేఖరం. ఖాసిం ఇంటి తోటలో ప్యారీబేగం నిలుచుని వుంది. అతడ్ని చూసి చిన్నగా, దొంగచాటుగా నవ్వింది. తండ్రి అరిచి వెళ్ళిన సంగతి ఆమెకి తెలిసుండకపోవచ్చు. ఖాసిం అంత మొరటుగా అంతకుముందెన్నడూ ప్రవర్తించింద లేదు. చంద్రశేఖరం మౌనంగా నడిచాడు.

ఆ వూళ్ళో ఇదివరకు కొందరితో గొడవ పడివున్నారు. పనిమనిషి, పాలవాడు, పాకీ, లారీవాళ్ళు, డ్రైవరు, టంగావాలా ఇలా చాలామందితో తగవులాడి వున్నారు. ఖాసిం వాళ్ళతో కూడా కొన్నేళ్ళ కిందట జగడం వేసి వున్నారు. ఖాసిం కూతురు ప్యారీబేగానికి 'బురదపంది' అనే నామకరణం జరిగింది కూడా ఆ సందర్భంలోనే. అయితే అప్పుడంతా ఖాసిం ఇలా మొరటుగా ప్రవర్తించలేదు. ఇప్పుడెందుకో మరి ఎగిరెగిరి పడుతున్నాడు.

అమ్మ, చెల్లెళ్ళు బిక్కుబిక్కుమంటూ కూర్చుని వున్నారు. నాన్న ఆఫీసు నుంచి ఇంటికి రాగానే చెప్పింది అమ్మ. ఇన్ని రోజులూ వూళ్ళోనే అక్రమం అనుకుంటూ వున్నాం ఇప్పుడు మనింటికే వచ్చి పడింది.

గేదెని ఏంచెయ్యాలి? ఊళ్ళోని పాల వాళ్ళలో చాలామంది వూరొదిలి వెళ్ళిపోయారు. గేదె ఇంకా నాలుగైదు నెలల్దాకా పాలిస్తుంది.

"పిలిచాడని చెప్పావు కదా. ఒకసారి వెళ్ళి మాట్లాడి వస్తాను" అన్నాడు నాన్న. ఆయన ముఖంలో ఏదో ఆందోళన కనిపిస్తున్నది.

చిన్నగా "మిస్టర్ ఖాసిం" అని పిలిచాడు నాన్న. రెండోసారి మళ్ళీ పిలిచాడు. సమాధానం లేకపోయేసరికి తలుపు తెరుచుకుని అతనింటి మెట్ల దగ్గర నిలబడి "మిస్టర్ ఖాసిం" అని పిలిచాడు మూడోసారి.

తల బయటికి పెట్టి లోపల్నించే "ఏం?" అన్నాడు ఖాసిం.

"నీతో మాట్లాడాలి"

కొంచెం తటపటాయించాక లోపలికి రమ్మన్నాడు ఖాసిం. ఓ వారగా నుంచుని చంద్రశేఖరం వాళ్ళ కుటుంబం గమనిస్తున్నారు. చాలా సేపటిదాకా ఖాసిం గొంతే వినబడింది. మధ్య మధ్య నాన్నగారి మాటలు. వాళ్ళింటి నించి బయటికి వస్తుండగా నాన్నగారి ముఖమంతా చెమటతో నిండి కనిపించింది.

"అతను చెప్పేది కూడా న్యాయమే. ఎప్పుడూ కుళాయిని మనం తెరిచే వుంచితే ఎల్లా? నీళ్ళు పట్టుకున్న వెంటనే మూసెయ్యాలి" అన్నాడు నాన్న. ఎవరూ బదులు పలకలేదు. అసలు కుళాయిలో నీళ్ళు రావటమే అరుదుగా వుంది. మూసి వుంచినా తెరచి వుంచినా ఒకటే.

"గేదె సంగతి ఏమన్నాడు" అడిగింది అమ్మ.

"మనింట్లో మన గేదెని వుంచుకోవటానికి ఈయన అనుమతి దేనికి?"

"ఇస్ చిన్నగా మాట్లాడు" అన్నాడు నాన్న.

"గేదెకి అసలు నీళ్ళే పెట్టబోమని చెప్పి వచ్చాను.

కుళాయిని తెరవడానికే వీలు పడలేదు. తండ్రీ కొడుకులిద్దరూ కలిసి ప్రయత్నించినా కూడా. అంత గట్టిగా తిప్పేసి వెళ్ళేడు ఖాసిం.

"సుత్తితో కొట్టి తెరిస్తే పోలా?" అంది అమ్మ. అలా చేస్తే ఇంకెంత గొడవ పెడతాడో ఖాసిం. మళ్ళీ ఖాసిం ఇంటికి వెళ్ళి "ఖాసిం" అని పిలిచాడు నాన్న. వెంటనే రానని చెప్పేశాడు ఖాసిం. "ఇప్పుడేం తొందర రేపొచ్చి తెరచి పెడతాలే" అన్నాడు. రేపు మళ్ళీ అతని ఇంటి ముందు నిలబడాలి నాన్న.

ఆ నెల రేషన్ చక్కెర కొనడానికి అదే ఆఖరు దినం. రోజూ అంగడివాణ్ణి అడిగి వస్తూనే వున్నారు. ఆఖ్రోజు అంగడి మూసేవేళకి గాని వస్తే ఒక శేరు ఇస్తానని చెప్పాడు. ఆ రోజు వెళితే, అతనికి మనసైతే, ఆరుశేర్ల చక్కెర కొన్నట్లుగా రాయించుకుని ఒక శేరు తెచ్చుకోవచ్చు.

"నాన్నతో నువ్వూ వెళ్ళరా" అంది అమ్మ. నాన్నతో బయల్దేరాడు

చంద్రశేఖరం. లాన్సర్ బారక్సులో చాలా ఇళ్ళు తాళాలు వేయబడి వున్నాయి. పోలీసు పర్మిట్ లేకుండానే రైల్వేపాసు సంపాదించి కుటుంబంతో సహా ఏ వూరికో వెళ్ళిపోయాడు నాగభూషణం. జాఫర్ అలీ, మన్సూన్, నాషీర్ - వీళ్ళ ఇళ్ళు మాత్రమే నిండుగా వున్నాయి.

చార్లెస్ వీధి గుండా, రెజిమెంటల్ బజారు పోలీస్‌స్టేషన్ మీదుగా నడుస్తున్నారు. చంద్రశేఖరం అతని తండ్రి. పోలీస్‌స్టేషన్ కూడా ఇసోమని వుంది. ఒక్క మెర్క్యురీ లైటు మాత్రం వుంది అక్కడ. కాని ఇప్పుడది వెలగటంలేదు. సికింద్రాబాదులో ప్రకాశంగా వెలిగే లైట్లన్నిటినీ ఆర్పేస్తున్నారు. తక్కిన లైట్లకి నల్లటి ముసుగులు తొడిగేరు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో కూడా ఇలాగే జరిగింది. భారతదేశ విమానాలు జంట నగరాల మీద బాంబులు కురిపిస్తాయేమోనన్న భయం. నిజాముకి, భారతదేశానికి మధ్య కుదిరిన తాత్కాలిక ఒప్పందం ఇంకా ఆర్నెల్లుంది. అయినా ఇప్పటికే హైదరాబాదులో యుద్ధవాతావరణం నెలకొన్నట్టుగా వుంది.

రేషన్ షాపుకి వెళ్ళేదారిలోనే వుంది ఆ రాజస్థానీ నూనె అంగడి. మోండా ప్రాంతం చాలావరకు నిర్మానుష్యంగా వుంది. నూనె దుకాణం మూసి వుంది. ఆ అంగట్లోని ఆర్య సమాజానికి చెందిన ఒక కుర్రాణ్ణి పోలీసులు ఒక రోజు చితకతన్ని రోడ్డుమీద పడవేసి పార్లించి, పార్లించి హింసించారు. నూనె కొనడానికి వచ్చిన చంద్రశేఖరం ఆ దృశ్యం చూసి మనసు వికలమై పోగా నూనె కొనాలనే సంగతి మరిచిపోయి ఖాళీ డబ్బాతో తిరిగి వెళ్ళాడు.

మౌనంగా తండ్రి వెంట నడుస్తున్నాడు చంద్రశేఖరం. రెండేళ్ళ కిందట అయితే అలా నడుస్తూ ఎంతో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ వెళ్ళేవారు. ఎంతోమంది పరిచయస్తులని కలుసుకుని పలకరించడం జరిగేది. వాళ్ళతో ఎన్నో విషయాలను గురించి చర్చించేవారు నాన్న. కొంత విసుగనిపించినా వాళ్ళ కబుర్ల ద్వారా ఎన్నో కొత్త విషయాలు తెలిసేవి చంద్రశేఖరానికి. అయితే ఈ రోజు రెండు మైళ్ళ దూరం నడిచి వచ్చినా ఇద్దరూ ఒక్కమాట కూడా మాట్లాడుకోలేదు. తెలిసిన ముఖం ఒక్కటి కూడా కనిపించలేదు.

సంచి తీసుకుని పక్కింటిలోనికి వెళ్ళాడు రేషన్ షాపు మనిషి. రేషన్ కార్డు, డబ్బు ముందుగానే తీసేసుకున్నాడు. పదినిమిషాల తరువాత సంచీలో ఒక చిన్న

పాట్లంతో తిరిగి వచ్చాడు. ఆ నెలంతా తాము వాడుకోవాల్సిన చక్కెర అదే.

"ఏం బాబూ! బియ్యం దొరుకుద్దా? ఓ అయిదు శేర్లిచ్చినా చాలు" అడిగాడు నాన్న.

"పేరుకు బియ్యం వున్నాయిగాని, అవి మీరు తినలేరు. రైల్వే రేషన్ లో ఇచ్చేవే మేలు" అన్నాడు వాడు.

"మా బియ్యమూ అంతంత మాత్రమే. ఒట్టి రాళ్ళూ, మట్టీ కలిసి ఎర్రగా వుంటున్నాయి. అవి తిన్నప్పట్నించి ఇంట్లో అందరికీ విరోచనాలు పట్టుకున్నయ్" అన్నాడు నాన్న.

"ఇప్పుడంతా ఇక్కడికి బియ్యం, పప్పులు – ఇవి వచ్చి దిగటం లేదు. ఏరోప్లేనులో తుపాకులు, బాంబులు మాత్రమే దిగుమతి అవుతున్నాయండీ. ఈరోజు కూడా బ్రిటీషువాళ్ళ ప్లేను మలక్ పేటలో దిగిందని చెప్పుకుంటున్నారు." రహస్యం చెపుతున్నట్టుగా అన్నాడు షాపు మనిషి.

"అలాగా?" అని అన్నాడేగాని ఆ విషయం తండ్రికి తెలిసిన సంగతే. చంద్రశేఖరానికి కూడా తెలుసు. సిడ్నీ కాట్టన్ అనే బ్రిటీష్ స్మగ్లర్ విదేశాల నుంచి రహస్యంగా మారణాయుధాలని నైజాం నవాబుకి చేరవేస్తున్నాడు. ఒక చిన్న టాంకునే విమానం ద్వారా తెచ్చాడని కూడా పుకారు లేచింది. ఈ వార్తలు ప్రజల్లో మరింత భీతావహం కలిగించేయి. సికిందరాబాద్ కి ఇరవై మైళ్ళ దూరంలో వుండే బీబీనగర్ లో ఖాసిం రజ్వీ రజాకార్ల ముఠా నిజాం పోలీసు ట్రక్కుల్లో వెళ్ళి అక్కడి ప్రజలపై దౌర్జన్యకాండ జరిపి బజారునే తగులబెట్టింది. ముగ్గురుని దారుణంగా హత్యచేశారు. నలభై మందికి పైగా తీవ్రమైన గాయాలు తగిల్నయ్. అందరికన్నా ఘోరంగా అవమానించబడింది స్త్రీలే.

చక్కెర కొనుక్కుని తిన్నగా కూరగాయల బజారుకి నడిచారు. మార్కెట్ మొదట్లోనే ఒక పెద్ద టవర్ క్లాక్. నాన్న కూరలు కొనుక్కున్నాడు. క్లాక్ టవర్ కి రెండు పక్కలా రెండు హోటళ్ళు. ఒకటి భారత్ భవన్. ఇంకోటి షోలాపూర్ వాలా. భారత్ భవన్ మూతబడింది. షోలాపూర్ వాలా ఇంకా వ్యాపారం కొనసాగిస్తూ వుంది. ఆ అంగట్లో ఆరణాకి కట్ కట్ అనే మిఠాయి కొన్నాడు నాన్న. దీన్నే సోంపప్పిడీ అని కూడా అంటారు. రేషన్ షాపులో బియ్యం లేవు – హైదరాబాదుకి మరణాయుధాలు మాత్రమే సప్లై అవుతున్నాయి – ఇంట్లో పక్కింటి ఖాసిం

రచ్చచేసి పోతున్నాడు. అయినా నాన్నకి ఇప్పుడు మిఠాయి కొనాలని అనిపించింది. ఎలా అర్థం చెప్పుకోవాలి ఈ చర్యకి అనిపించింది చంద్రశేఖరానికి. అంగడి వాడి నడిగి ఒక చిన్న మిఠాయి ముక్క తీసిచ్చాడు తండ్రి చంద్రశేఖరానికి. చిన్నప్పుడు ఈ కొసరు మిఠాయి కోసం చంద్రశేఖరం ఎంతో తహతహలాడేవాడు. ఇప్పుడు తను నూనూగు మీసాల వాడైనాడు. అయినా చిన్నప్పటి అలవాటుని మరిచిపోలేక కాబోలు మిఠాయి ముక్క అందిస్తున్నాడు నాన్న.

"ఎలా వుంది?" అడిగాడు నాన్న అంగడి నుంచి కదుల్తూ.

"బావుంది."

డిస్పెన్సరీ తలుపులు మూస్తూ కనిపించాడు పురుషోత్తం డాక్టరు. తండ్రిని చూశాడు.

"ఒక్క నిమిషం ఇలా వస్తారా సార్" అన్నాడు. ఇంకా రెండు చెక్క పలకల్ని ఎత్తిపెడితే డిస్పెన్సరీ మూసివేసినట్టే. నాన్న అతని దగ్గరికి వెళ్ళి తలుపులు మూయ్యటంలో సహాయపడ్డాడు. చంద్రశేఖరం తాళం కప్ప తీసుకున్నాడు. అన్ని తలుపుల్ని సరిచూసి ముగ్గురూ కలిసి డిస్పెన్సరీని మూసి తాళం పెట్టారు. ఎప్పటిలాగే ఒదులు పాంటు ధరించి వున్నాడు పురుషోత్తం డాక్టరు.

డాక్టరుతో మాట్లాడుతూ ముందు నడుస్తున్నాడు తండ్రి. తన కష్టాలని తండ్రితో ఏకరువు పెడుతున్నాడు డాక్టరు. ఆ ఇబ్బందులు అందరికీ పరిచయమైనవే. భార్య, కొడుకు, కోడలు, మనవళ్ళు అంతా అతణ్ణి వదిలి వేరే వూరికి వెళ్ళిపోయారు. అతడిని కూడా పిలిచారు రమ్మని. కాని ఈ డిస్పెన్సరీని వదిలి ఎలా వెళ్ళటం? ఇంతకుముందు పనిచేసే కుర్రాడు కూడా ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఇప్పుడు తనే తలుపులు తెరిచి, నేలంతా వూడ్చి, కుర్చీలు అవీ సర్దిపెట్టి ప్రాక్టీసు చూసుకోవాల్సి వస్తున్నది. ఈ వయసులో ఇంత పనిచేయటం ఎంతో కష్టంగా వుంది. పనిమనిషి మీదే ఆధారపడాలి. అదెవత్తో నెరజాణలా వుంది. ఎవరెవర్నో ఇంట్లోకే రప్పించుకుంటోంది. వాళ్ళకి అన్నాలు కూడా పెడుతోంది. అసలే గడ్డురోజులు. ఎలా సహించటం ఇదంతా. ఏమైనా అడగాలంటే భయం అది కూడా ఎక్కడ పనిమానేస్తుందోనని. యాభై యేళ్ళు పెళ్ళాం బిడ్డల కోసం తనెంత శ్రమించాడు. వాళ్ళకి ఏ లోటూ రాకుండా పోషించాడు. ఈ చివరి రోజుల్లో అందరూ తనని ఒంటరిగా వదిలి వెళ్ళిపోయారు. ఇక్కడే వుంటే

ఏంపోయింది? ఎవరు వీళ్ళని మింగేస్తారు? ఈ గలాటాలు, రచ్చలు ఎప్పుడూ వుండేవే. వీటికి భయపడి వూళ్ళొదిలి పారిపోవడమేనా? అక్కడికి వెళ్ళిమాత్రం వీళ్ళు వుద్ధరించేదేమిటి? ఎప్పటికైనా మళ్ళీ తిరిగి రావాల్సిందేకదా? ఇంటిదాకా వెళ్ళి డాక్టర్ని దిగబెట్టి వచ్చారు తండ్రీ కొడుకులు. మళ్ళీ రైల్వేస్టేషన్‌కొచ్చి రెజిమెంటల్ బజారు పోలీస్టేషన్ మీదుగానే ఇంటిదారి పట్టారు. అలా తిరిగి రావటం మనసుకి కొంత వూరటగా అనిపించింది.

మే మాసపు రాత్రి హాయిగా వుంది. దూరాన్నుంచి రాత్ కీ రాణీ పూలవాసన తేలి వస్తున్నది. ఆ వాసనకి పాములొస్తాయని అంటారు. కీయ్స్ హైస్కూల్ నించి లాన్సర్ బారక్సు దాకా అంతా రాత్ కీ రాణి పూలవాసనతో నిండి వుంది. ఈ పూలవాసనకి హిందూ ముస్లిం తేడా లేదు. దీనికి బానిసత్వమూ లేదు, స్వాతంత్ర్య పిపాసాలేదు. ఎవరు పెట్టారో దీనికీ పేరు? ఇంటికి వెళ్ళగానే అక్కడ నల్లకుంట సయ్యద్ కూర్చుని ఉన్నాడు. తండ్రిని చూడగానే "ఏమిట్రా మరీ ఇలా వెధవాయివైపోయావు? పక్కింటి వాళ్ళు కేకలేసి వెళ్ళారని నీ పెళ్ళాం చెప్పింది. వాళ్ళకి నీళ్ళు రాకపోతే అడగర్రా మరి? ఇంకా మీ చట్టనాపురం అగ్రహారంలో చలాయించినట్టుగా ఇక్కడ వీలవుతుందనుకుంటున్నారా ఏమిటి? ఏరా అబ్బాయ్? చదువుకి ఎగనామం పెట్టేశావన్నమాట? ఎందుకురా చెప్పుడు మాటలు విని ఇలా చెడిపోతున్నారు మీరంతా? మీ సొంత బుద్ధి ఏమైపోయింది?" బదులు పలక్కుండా చిన్నగా ఇంట్లోపలికి వెళ్ళిపోయాడు నాన్న. చక్కెర, కూరగాయల సంచీలు వంటింట్లో పెట్టి వచ్చి ఒక కుర్చీ లాక్కుని సయ్యద్ పక్కన కూర్చున్నాడు. సయ్యద్ మాట్లాడుతున్నాడు.

"ఏమోయ్ మీ రైల్వే వాళ్ళేదో జబర్దస్తీ చేస్తున్నారటగదా. ఎంతమందో పాపం ప్రాణాలకి భయపడి ఇళ్ళూ వాకిళ్ళు వొదులుకుని ఇక్కడికొచ్చి పడ్డారు కదా. వాళ్ళకి ఉద్యోగాలు ఇవ్వమని అంటున్నారట గదా. రెడ్లు, నాయుళ్ళు కలిసి వాళ్ళని పాపం లోపలికే రానివ్వటంలేదటనే. రైల్వే వీళ్ళ తాత సొత్తా ఏమి? అంతా నైజాం నవాబుదే గదా. నవాబు మనుషులకి అతని సంస్థానంలోనే చోటులేదు పొమ్మనడం ఏమి న్యాయంరా?"

"అద్సరేగాని, నువ్వెట్టా వున్నావు? అది చెప్పు ముందు" అన్నాడు నాన్న.

"నాకేం తక్కువోయ్. మహారాజులా వున్నాను. నల్లకుంట 'వాలంటీర్సు కార్ప్సు'లో నన్ను కేప్టన్‌గా చేసి గౌరవించేరోయ్. ఇక్కడికి రాకుండా ఆ కడలూరులోనో, మాయవరంలోనో వుండి వుంటే నాకింత గౌరవం దక్కి వుండేదా ఈ వయసులో. అక్కడ అసలు మనల్నెవరు లెక్క చేస్తారని."

"ఏమైనా తింటావా? జొన్నరొట్టె లేలే. అయితే అందులోకి నీకిష్టమైన వంకాయ కూర వుందిలే.

"నువ్వు వచ్చే ముందరే అడిగి పెట్టించుకున్నాను లేవోయ్. అప్పుడే చెప్పింది నీ భార్య కుళాయి సంగతి. ఆ కుళాయి మరతిప్పి పెట్టాను. అనవసరంగా పాపం పక్కింటి వాళ్ళని అనడం ఎందుకురా? నీకింకా జ్ఞానం రాలేదు."

"ఇంట్లో అంతా కులాసాయేనా? మీ పెద్దబ్బాయికి వుద్యోగం దొరికిందా?"

"ఉద్యోగానికేంరా? మద్రాసులోలాగ అనుకున్నావా? మా నవాబు రాజ్యంలో అడిగిన వాళ్ళందరికీ ఉద్యోగాలే కదా. మావాడు నాతోబాటే వాలంటీర్సు కార్ప్సులో చేరేడు. నువ్వు అటుకేసి రావటమే మానేశావెందుకు ?"

"పోయిన వారం వచ్చాను. నువ్వెడికో వెళ్లావని చెప్పారు మీ ఇంట్లో."

"రజ్వీసాబ్ మీటింగుకి వెళ్ళానులే. అప్పుడు తెలిసిందోయ్ ఈ కాంగ్రెసోళ్ళు చేసే అక్రమాలన్నీ మా పి.యం. ఫిర్యాదు కూడా చేసి వున్నాడు ఇండియా మీద. ఎన్నో యేళ్ళుగా వస్తోన్న ఆహారధాన్యాలని రాకుండా చేస్తే ఎట్లారా? ప్రజలంతా ఏమైపోవాలని? అదీగాక విమానాలని హైదరాబాదు మీదుగా తిరగనివ్వడం. ఈ ఫిర్యాదుల కంతా వాళ్ళ సమాధానం ఏమిటో తెల్సునా?"

"నాకు తెలియదు. ఇదంతా పేపర్లో రావటం లేదు కదా."

"ఎందుకురా జనానికి ఆహారం లేకుండా మాడ్చి చంపుతున్నావు అంటే – 'నువ్వెందుకు పాకిస్తాన్‌కి ఇరవై కోట్ల రూపాయలిచ్చేవు? ఎందుకు మీటింగులు పెడుతున్నావు? ఎందుకు అది చేస్తున్నావు ఇది చేస్తున్నావు అని అడుగుతున్నాడు. బాగుందిరా వరస"

"ఇరవై కోట్లేమిటి?"

"పాకిస్తాన్‌కి మన నిజాం ప్రభువు అప్పుగా ఇచ్చేడు. అది కూడా ముస్లిం దేశమే కదా? ఒకరికొకరు ఆ మాత్రం సహాయం చేసుకోరా? ఈ పంజాబ్ వాళ్ళు ఆ దేశాన్ని నాశనం చేసి వచ్చారు కదా? చేసే అక్రమాలన్నీ చాలక మళ్ళీ మమ్మల్నే వాడికెందుకు డబ్బిచ్చేవు? వీళ్ళనెందుకు ఇక్కడ చేర్చేవు అంటున్నారే. వీడెవడు మమ్మల్ని అడగడానికి? తుపాకీ శబ్దం వినబడితే చాలు ఆమడదూరం

పరిగెత్తే పిరికి పందలు. తోకాడించేరంటే తరిమి తరిమి కొట్టగలం జాగర్త."

"చూడు సయ్యదు. నాకూ ఏదో కొంత తెలుసు. ఈ హైదరాబాదులో ఇండియా డబ్బే చెల్లదు అని ఆర్డరు వేసినప్పుడు ఇండియా ఆహారధాన్యాలు ఎలా వస్తయ్ ఇక్కడికి?"

"మాకు ఇండియా డబ్బులెందుకోయ్. తరతరాలుగా మాకు హాలీ నాణేలున్నాయి ఇక్కడ. బ్రిటీష్‌వాడు రూపాయి నాణేలు వేశాడంటే వాటిని నమ్మవచ్చు. ఈ రోజు ఈ ఖద్దరు టోపీగాళ్ళు పదవుల్లో కూర్చుంటే వీళ్ళ ఖోడి రూపాయల్ని ఎవడురా నమ్మేది?"

"నువ్వు నిజాంకి మంత్రిగా వుండతగిన వాడివి రా."

"అవుతానురా తప్పకుండా అవుతాను. ఈ అక్రమమంతా చూస్తూ వూరికే కూర్చుని వుండలేను. రక్తం వుడికిపోతూన్నది. ఏదో ఒకటి చెయ్యాలి. ఒరేయ్ నీకో సంగతి చెపుతాను. రహస్యంగా వుంచుకో. కమ్యూనిస్టులంతా రౌడీలు, గూండాలు అనుకున్నాం కదూ ఇంతకాలం. పాపం అలా ఏం కాదట్రా. ఈ ఖద్దరు టోపీగాళ్ళని దగ్గరికి చేరనివ్వటం లేదట తెలుసా? ఈ కాంగ్రెసోళ్ళ సత్తా ఏమిటో వీళ్ళకి బాగా తెల్సు. ఇప్పుడుగాని ఇండియాకి, నైజాం నవాబుకి యుద్ధం జరిగితే నైజాముకి వత్తాసుగా ముందు నిలిచేది ఈ ఈ కమ్యూనిస్టులే తెలుసా? ఇదంతా చాలా రహస్య సమాచారం. ఎవరితోటీ వాగకేం."

## 4

రైళ్ళ రాకపోకలు ఆగిపోయి నాలుగు రోజులు కావస్తున్నది. తంతి తపాలా, పత్రికలు, చుట్టాలు రావటం బందు అయింది. ఇప్పుడు హైదరాబాదు సంస్థానం బయట ప్రపంచంతో సంబంధం లేని ద్వీపంలా తయారైంది. వీటికి మించి ఇంకేదో జరుగుతోందని పక్కింటి రేడియో మూలంగా తెలిసింది. పాకిస్తాన్ పిత మహమ్మదాలీ జిన్నా మరణించేడు. గాంధీ మరణించి ఇంకా ఎనిమిది నెలలు కూడా కాలేదు. ఖాసిం ఇంటి రేడియో జిన్నా మరణానికి పెద్దఎత్తున సంతాపం ప్రకటించింది. పత్రికలు వార్తలు ప్రచురించడంలో బహు జాగర్తగా వుంటున్నాయి. హైదరాబాదు వీధుల్లో ఒక ముస్లిం విలేకరి నెత్తురు తుపాకీ తూటాలకి కాల్వలై ప్రవహించింది. షోయబుల్లాఖాన్ చేతులు ముక్కచెక్కలుగా నరికి వేయబడినయి. 'ఇమరోజ్' అనే పత్రికలో 'హైదరాబాదు సంస్థానం ఇండియాలో విలీనం కాకతప్పదు" అనే సంపాదకీయం రాయటమే ఆ చేతులు చేసిన నేరం.

ఇదేగాని ఒక హిందూ మతస్తుడు రాసి వుంటే అతడ్ని జైల్లో తోసి సరిపెట్టుకుని వుండేవారు. కాని నిజాం ప్రభువు వుప్పుతినే ఒక కృతఘ్నుడైన ముస్లిం ఇలా రాయడం ఎంత ఘోరం. అసలా ఆలోచన రావటం ఎంత పాపం. ద్రోహులారా జాగ్రర్త. మీకూ ఈ గతి పట్టగలదు. మన ప్రభువుకి ద్రోహం తలపెడితే?

చంద్రశేఖరానికి ఏదో కొత్త మార్పు గోచరించింది. దీన్ని ముందుగా వాళ్ళమ్మే పసిగట్టింది. ఇప్పుడు పక్కింటి రేడియోలో సంతాప సంగీతం నిలిచిపోయింది. రోజంతా బ్యాండు శబ్దం లాంటిది వినిపిస్తోంది. "జండా, జండా" అంటూ అరుపులతో బృందగానం వినిపిస్తోంది. మధ్య మధ్య "శాంతి యుతంగా పాకిస్థాన్ పొందగలిగాం. ఇప్పుడు పోరాటం సలిపి హిందుస్థాన్ గెలుచుకుందాం" అనే నినాదాలు.

పోరాటం! నిజంగానే మళ్ళీ యుద్ధం వొస్తుందా? ఇళ్లలోంచి ఎవరూ బయటికి రావటమే లేదు. జిన్నా మరణించి నందుకు నాన్నగారి ఆఫీసుకి సెలవిచ్చారు సోమవారం. యుద్ధం గురించిన వార్తలు కూడా అందుతున్నాయ్ పడమటి దిక్కునించి, ఆగ్నేయపు దిక్కు నించీ. భారతసైన్యం హైదరాబాదు సంస్థానంలోకి చొచ్చుకు వస్తున్నది. రాష్ట్రమంతటా అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది. అన్ని నగరాల్లోను వెంటనే ఏ. ఆర్.పి. చర్యలు తీసుకోబడుతున్నాయ్. రాత్రులు వూళ్ళో లైట్లు వెలిగించరాదు.

ఇంటి గుమ్మం తలుపులు, పెరటి గుమ్మం తలుపులు రెండేసి తాళం కప్పలు బిగించి మూసింది అమ్మ. ఇంట్లో బియ్యం నిండుకున్నాయి. కాయగూరల్లేవు. నీళ్ళు రావటంలేదు. ఇంకొక రోజంతా నీళ్ళు రాకపోతే కటకట లాడిపోవాల్సిందే. స్నానాలు చేసి నాలుగు రోజులైంది. ముఖం కూడా కడుక్కోలేదు నిన్నటి నించి. ఆఖరికి దొడ్డికి కూడా పోలేదు. బర్రె ఇంకా పాలిస్తూనే వుంది. ఆ పాలు, పెరుగే లేకుంటే అసలు బతకటమే కష్టమైపోయేది. మంగళవారం నాన్న ఆఫీసుకు వెళ్ళాడు. వెళ్ళకపోతే వుద్యోగానికి ఏమైనా అవుతుందేమో. పాతిక సంవత్సరాల సర్వీసు పూర్తి చేసిన అయిదారు మందిని డిస్మిస్ చేసి వున్నారు. డిస్మిస్ చేస్తే రిటైర్‌మెంటు బెనిఫిట్‌లు రాకుండా పోతాయ్.

లాన్సర్ బారక్సు బాహ్య వాతావరణంలో పెద్ద మార్పు కనిపించటం లేదు. దున్నపోతుల్లా ఎదిగిన మారిస్, పెరిన్సులు మర్రివూడలు పట్టుకుని

వూగుతూనే వున్నారు.

చంద్రశేఖరం కూడా మర్రి దగ్గరకు బయలు దేరాడు. అప్పుడే కుళాయిలో నీళ్ళు రాసాగినయ్. అమ్మతో బాటు తనూ పరిగెట్టుకెళ్ళి అయిదు బిందెల నీళ్ళు పట్టేడు. పక్కింటి ఖాసిం వాళ్ళుకూడా నీళ్ళు పట్టుకున్నారు. రేడియో కట్టే పెట్టేరు. నిన్నంతా మార్చింగ్ సాంగ్స్‌తో అదిరిపోయిన రేడియో ఈ రోజు ఎందుకో మూగబోయింది.

"గమనించావా?" అడిగింది అమ్మ.

"ఏమిటి?"

"ఖాసిం ఇంట్లో చాలామంది జనం నిండిపోయున్నారు."

అమ్మ చెప్పింది నిజమే. ఖాసిం ఇంట్లో ఎవరో కొత్త ముఖాలు నిండిపోయి వున్నారు. వీళ్ళంతా? ఎప్పుడొచ్చి చేరేరో? నిన్న వుదయం మాత్రం అయి వుండదు. పొద్దుగుంకిన తరువాతే అయివుండాలి. ఎందుకొచ్చినట్టు? వాళ్ళ పండగలు కూడా ఏమీ లేవు కదా ఇప్పట్లో.

అమ్మ 'వద్దురా' అంటున్నా వినకుండా మర్రిచెట్టు దగ్గరికి బయల్దేరేడు చంద్రశేఖరం. ముందుగా మారిస్ పలకరించేడు.

"ఎలా వున్నావ్?"

"మీకు సంగతులేవైనా తెలుసా?"

"ఏం సంగతులు?" అడిగేడు మారిస్

"మీ నాన్న డ్యూటీకి వెళ్ళటం లేదా?"

"అసలు రైళ్ళు నడిస్తేగద డ్యూటీ?"

"మా నాన్న వెళ్ళేడే"

"మీ నాన్నకి ఆఫీసులో కదా పని"

"మీ కసలేమీ తెలీదన్న మాట"

"యుద్ధం గురించేనా? సరిగ్గా తెలీదు. భారత సైన్యాలు చొచ్చుకు వస్తున్నాయట. ఈ రోజు వూళ్ళోకి వెళ్ళి చూడాలని వున్నాను."

అయితే మారిస్‌కంటె ముందు నాన్న వివరాలు సేకరించుకుని వచ్చేడు. అన్ని దిక్కుల నించి భారత సైన్యాలు హైదరాబాదుని చేరుకుంటున్నాయి. యుద్ధం జరుగుతూన్న ప్రదేశాలన్నింటా నిజాం సైన్యాలు పారిపోతున్నాయి.

కొన్ని చోట్ల లొంగిపోతున్నాయి. నిజాం తరఫున పోరాడే వాళ్ళంతా చాలావరకు దరిద్రపు గొట్టు ముఖాలతో దర్శనమిచ్చే రజాకార్లే. అదిలాబాద్ దగ్గర ఈ రజాకార్లు పాతకాలపు కత్తుల్ని ఝుళిపిస్తూ మూర్ఖంగా టాంకుల నెదిరించారు. కోతకోసినట్లుగా పని దిముషాల్లో రెండు వేలమంది రజాకార్లు నుజ్జునుజ్జయి పోయినారు. అయినా హైదరాబాదు రేడియో మాత్రం అన్ని చోట్లా హైదరాబాదు సైన్యం విజయ విహారం చేస్తున్నట్టుగా కల్లబొల్లి కబుర్లని ప్రచారం చేస్తూనే ఉంది. మచిలీపట్నాన్ని కైవసం చేసుకున్నట్టుగా వార్తలందించింది.

"కమ్యూనిస్టులు కూడా రజాకార్లతో కలిసిపోయి పోరాడుతున్నారా?" అడిగాడు తండ్రిని చంద్రశేఖరం – కొడుకు తనతో మాట్లాడటం చిత్రంగా అనిపించింది అతనికి.

"నాకు తెలీదు. అయినా ఎంతో కాలంగా పోలీసు, మిలిటరీ కమ్యూనిస్టుల్ని వేటాడుతూ వుంది కదా. అలాంటప్పుడు వీళ్ళు రజాకార్లతో కలసిపోవడం ఎలా సాధ్యం?"

"సయ్యద్ చెపుతున్నాడే"

"సయ్యద్‌కి బుద్ధి తిన్నగా ఉన్నదనుకుంటున్నావా?"

జంట నగరాల్లో కర్ఫ్యూ విధించబడింది. సాయంకాలం ఆరు దాటిన తరువాత ఎవరైనా వీధుల్లో కనిపిస్తే అక్కడికక్కడే తుపాకీ కాల్పులకి గురి అవుతారని ప్రకటించబడింది. మచిలీపట్నం, గోవాలని ఆక్రమించి ఢిల్లీ వైపుగా సాగిపోతున్నాయి. హైదరాబాదు సేనలు. ఈ వార్తల మధ్య కర్ఫ్యూ ప్రకటన వినిపించారు. ఆవేశంతో ప్రజలు దాడి చేస్తారేమోననే భయంతో బొలారంలో భారత ప్రతినిధి కె.యం. మున్షీగారికి రక్షణ కల్పించబడింది. అతని భవనం చుట్టూ పోలీసులు కాపలా కాస్తున్నారు.

ఆరు గంటల్దాకా లాన్సర్ బారక్సులోనే తిరుగుతూ గడిపాడు చంద్రశేఖరం. అన్ని ఇళ్ళూ తలుపులు మూసి వున్నాయి. తలుపు సందుల్లోంచి రెండు మూడు ఇళ్ళల్లో దీపాల వెలుగు మందంగా బయటికి కనిపిస్తోంది. ఊరంతా చీకట్లో సద్దుమణిగి వుంది.

ఆక్స్‌ఫోర్డ్ వీధి పొడుగ్గా చీకటిగా వుంది. మెట్ట పల్లాలతో కూడి దూరంగా వజీర్ సుల్తాన్ బిల్డింగులదగ్గరకసుమరుగ్గా కనిపిస్తోంది. ఆ భవనాల వెనక

దిగిపోతూన్న రవి బింబం నాతో రాకూడదూ అని ఆహ్వానిస్తోన్నట్టుగావుంది. దేశంలో ఎక్కడ చూపినా మంటలు చెలరేగుతున్నాయి. ఆరిపోయే సూర్యుణ్ని నమ్మి ఇలా.రావటం మంచిదేనా?

చంద్రశేఖరానికెందుకో సూర్యుణ్ని నమ్మాలనిపించింది. కర్ఫ్యూ గురించి అతనికి తెలిసింది అంతంత మాత్రమే. కంటబడిన వాడినల్లా కాల్చిపారేయడమంటే ఏమిటి? దేనితో కాలుస్తారు? పిస్టల్‌తోనా? లేక పొడవాటి తుపాకితోనా? గురి చూసి కాల్చాలిగదా? గురి చూసేదాకా ఆ మనిషి ఆగుతాడా? పెద్ద మైదానంలోగాని, తిన్నగా వుండే వీధిలోగాని అయితే అలా కాల్చడం సులభం. కాని వంకరటింకర్లుగా వుండే సందులగుండా పరిగెట్టే మనిషిని గురి చూసి కాల్చడం సాధ్యమేనా? ఎవరింట్లోనైనా దూరిపోతే అప్పుడేం చేస్తారు? ఆ ఇంటినే కాల్చేస్తారా? ఇంటిగుమ్మంలోంచి పేలుస్తారా లేక కిటికీల్లోంచి కాలుస్తారా?

ఆక్స్‌ఫర్డు వీధిలో అయితే ఇవి తెలుసుకునే అవకాశం వుండదు. ఈ వీధిలో పోలీసులు కనిపించడమే అరుదు. క్లాక్‌టవర్ దగ్గరికెళితేగాని పోలీసులు కనిపించరు. ఇప్పుడు అక్కడకూడా కనిపించడం లేదు. పోలీసులేకాదు అసలెవరూ సంచరించడంలేదు. ఆ పరిసరాల్లో దడదడమని శబ్దం చేస్తూ ఒక బస్సు క్లాక్‌టవర్‌ని దాటి వెళ్లింది. ఇద్దరు పోలీసులు మాత్రమే వున్నారు అందులో. వారిలో ఒకడు చంద్రశేఖరాన్ని చూసి "పో, పో, ఇంటికి పో" అంటూ అరిచాడు. వేగంగా వెళ్ళిపోయింది బస్సు. వందమందికి వంట వండిన వాసనని వదిలి వెళ్ళింది ఆ బస్సు. సెనగనూనెవాసన. తన నీడని చూస్తూ ఇంటిదారి పట్టేడు చంద్రశేఖరం. పది పన్నెండడుగుల పొడవున్నట్లుంది తన నీడ. వంకరటింకర్లుగా సాగుతున్నట్టుంది నీడ. తనకి ఏవో రహస్యాల్ని చెపుతున్నట్టుగా వుంది ఆ నీడ. అయితే దాని భాష తనకి అర్థం కావటంలేదు. "నీడా, నీడా! నీ రహస్యాలు చెప్పవా?" అని అడగాలనిపించింది అతనికి.

ఇంట్లోకి వెళుతూ ఖాసిం ఇంటికేసి పరీక్షగా చూసేడు చంద్రశేఖరం. కిటికీలకి చెక్కలు కొట్టి తెరవడానికి వీల్లేకుండా బిగించారు. వాకిలి తలుపునొకదాన్ని కూడా అట్టాగే బందోబస్తు చేసి వుంచారు.

ఖాసిం ఇంటి తలుపు తెరుచుకుని ఒకతను బయటికొచ్చాడు. చంద్రశేఖరాన్ని గమనించలేదు. గోడవారగా ఒక నిమిషం కూర్చుని పైకిలేచాడు. అతనికి

యాభై యేళ్ళుండవచ్చు. అంతకుముందెన్నడూ చూసిన ముఖంకాదు. పైకి లేచి పై జమా నాడాని బిగిస్తూ చంద్రశేఖరాన్ని చూశాడు. ఎంతో వినయంగా వంగి వంగి సలాములు చేశాడు చంద్రశేఖరానికి. ఆ తరువాత కంగారుగా ఇంట్లోపలికి దూరి తలుపులు బిడాయించుకున్నాడు. ఖాసిం ఇల్లు నిశ్శబ్దంలో మునిగి వుంది.

బుధవారం వూరువూరంతా కలవరంతో నిండిపోయింది. హైదరాబాదు రేడియోలో వార్తలు కూడా నిలిచిపోయినయ్. సినిమాపాటలు మాత్రమే వినిపిస్తున్నాయి. చాలామంది జనం వీధుల్లో తిరగసాగేరు. మూలకొకడు మాత్రమే కనిపిస్తున్నారు పోలీసులు. వాళ్ళ ముఖాల్లో ఏదో దైన్యం గోచరిస్తున్నది. గుంపులు గుంపులుగా కూడి మాట్లాడుకుంటున్నారు ప్రజలు. పోలీస్‌స్టేషన్‌కి ఎదురుగానే భయంలేకుండా ఒక సైకిలు మీద ఇద్దరెక్కి వెళుతున్నారు. పోలీస్‌స్టేషన్లన్నీ నిర్మానుష్యంగా దర్శనమిస్తున్నాయి. రెజిమెంటల్ బజారు పోలీస్టేషన్ ముందు గోడకి అమర్చిపెట్టిన కత్తులు, తుపాకులు ఇప్పుడు కనబట్టంలేదు. ఎవరో ముందే జాగర్త పడి వాటిని అక్కడనుంచి తరలించినట్టుగా వుంది.

ఈ వూళ్ళో ఇంకా ఇంతమంది జనం మిగలి వున్నారా అనేట్టు జనసంచారం మొదలయింది. ఎక్కువగా వీధుల్లో పురుషులే కనబడుతున్నారు. అందరూ హిందువులే. చంద్రశేఖరం రైల్వేస్టేషన్ని సమీపించాడు. వరుసగా నిలబడి వున్నాయి బస్సులు. అవి కదిలేట్టు కనిపించడంలేదు. అక్కడే నీడలో కూర్చున్న ఎర్రచొక్కాల పోర్టర్లు నేలమీద బొగ్గుతో గీతలు గీసుకుని పులి, మేక ఆట కాబోలు ఆడుతున్నారు. నిజాం కస్టమ్సు ఆఫీసులో ఒక్క తలుపు మాత్రం కొద్దిగా తెరిచి ఆఫీసరమ్మ దిగాలుపడి కూర్చుని వుంది. ఎస్.పి.జి. స్కూలు మూసి వుంది. స్టేషన్ కెదురుగా వున్న అంగళ్ళన్నీ కూడా మూసివున్నాయి. రెండు ఇరానీ హోటళ్ళు మాత్రం తెరచి వున్నాయి. వాటిలోంచి గ్రామఫోను రికార్డులు వినిపిస్తున్నాయి.

స్టేషన్ రోడ్డు గుండా నడుస్తున్నాడు చంద్రశేఖరం. ఒక పక్క కె.యి.ఎం.ఆసుపత్రి. ఎదురుగా రెఫ్యూజీల గుడిశెలు వరుసగా. ఆ వీధిలో ఇతర జనసంచారం అంతగా లేదు. రెఫ్యూజీల గుడిసెల్లోంచి పొగపైకి లేస్తున్నది. వాళ్ళు ఎవరితోనూ మాట్లాడుతున్నట్టులేదు. బయట ప్రపంచంతో,

సంబంధంలేనట్టుగా ప్రవర్తిస్తున్నారు. ఆసుపత్రి ఫెన్సింగ్ కమ్ములమీద తడిగుడ్డలు ఆరేసి వుంచారు. వాళ్ళ చిరిగిన జీవితాల వలెనే ఆ బట్టలు కూడా మాసికలై అతుకులతో కనిపిస్తున్నవి. ఇలా మూడడుగుల గోడల మధ్య వాళ్ళ బ్రతుకు ప్రారంభించి అప్పుడే సంవత్సరం దాటింది.

ఒక రెఫ్యూజీ ముఖంలోకి సూటిగా చూశాడు చంద్రశేఖరం. ఆ రెఫ్యూజీ స్నేహభావంగా నవ్వాడు.చేతిలో చిల్లరైనా వుండి వుంటే అతని దగ్గర బేడకో, అణాకో ఏవైనా తిను బండారాలు కొనుక్కుని వుండేవాడు. అతని చిరునవ్వుకి ప్రతిగా ఆమాత్రం చేసినా చాలు. కాని చేతిలో కానీ లేదు.

మోండా మార్కెట్టులో అంగళ్ళన్నీ ఇంకా మూసే వున్నాయి. అయినా జనం ఏదో చర్చించుకుంటూ గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. రెండు రోజుల కిందట ఈ దృశ్యం అసాధ్యం. ఇప్పుడైనా ఎవరికీ సరైన సమాచారం తెలిసిందనుకోవడానికి లేదు. అయితే ఒక్కటి మాత్రం నిశ్చయంగా తెలిసింది. భారత సైన్యాల ధాటికి నిజాం ప్రభుత్వం తట్టుకోలేని పరిస్థితిలో వుంది. ఇక కష్టాలు గట్టెక్కే రోజులు దగ్గరపడుతున్నాయి. మరోవారం, లేకపోతే రెండువారాలు. మహా అయితే ఒక నెల. అంతా సర్దుకుంటుంది.

ఇంత జరుగుతున్నా వూరు ప్రశాంతంగానే వుంది. ఎవరూ హద్దుమీరి ప్రవర్తించడంలేదు. ఈ వార్తలన్నీ నిజం కావేమోననే సందేహం వుందేమో ప్రజల్లో ఇంకా. అందుకే హుషారుగా వున్నారేమో జనం.

పగలంతా సికింద్రాబాదులో తిరిగి తిరిగి సాయంకాలానికి ఇల్లు చేరాడు చంద్రశేఖరం. లాన్సర్ బారక్సు కూడా ఇప్పుడు సందడిగానే వుంది. ఖాసిం ఇంటి తలుపులు తెరచి వున్నాయి. అయితే అతను కనబడలేదు. ఎవరెవరో చిన్నా పెద్దా, ముసలీ ముతకా నిండిపోయి వున్నారు ఆ ఇంట్లో. ఏం చెప్పినా తలలూపే పరిస్థితిలో వున్నారు వాళ్ళంతా. ఎవరు కనబడినా వంగి సలాములు పెడుతున్నారు.

మళ్ళీ రైల్వే ఆఫీసులోంచి మాత్రమే సరైన సమాచారం అందుతున్నది. సూర్యాపేట–హైదరాబాదు మార్గం గుండా భారతసైన్యాలు నిరాటంకంగా ముందంజ వేసి వస్తున్నాయి. భారత సైన్యాలని అడ్డగిస్తున్నారనే వార్తలన్నీ నిజం కావని తేలింది. ఒకవేళ వున్నా అవి పేరుకి మాత్రమే. అవురంగాబాదు సమీపంలో ఒక కాలేజీ ప్రొఫెసరు వందమంది విద్యార్థులని పోగుచేసుకుని కర్రలతో మూర్ఖంగా

భారత సైన్యానికి ఎదురు నిలిచాడు. మొదటి కాల్పులకే ఇరవై మంది చెదిరిపోయారు విద్యార్థులు. రెండోసారి కాల్పులు మొదలవక ముందే అంతా పత్తా లేకుండా పోయారు. ప్రొఫెసర్ని పట్టుకున్నారు. అప్పుడతను వెర్రివానిలా 'అజాద్ హైదరాబాద్ జిందాబాద్' అంటూ పిచ్చికేకలు పెట్టాడు. ఇప్పుడు రజాకార్లు, హైదరాబాదు సైన్యాలు భారత సైన్యాలని ఓడించగలవనే భయం ఎవరికీ లేదు. వాళ్ళ పని నీరుగారి పోయింది. పది, పదిహేను జైళ్ళలో వేలమంది రాజకీయ ఖైదీలు నెలల తరబడి మగ్గిపోతున్నారు. ఓడిపోతున్నామనే కక్షతో రజాకార్లు ఈ ఖైదీలని ఏం చేస్తారో నన్నదే ఇప్పుడు భయపడాల్సిన విషయం.

రేడియోలో లైటు వెలుగుతోందేగాని వార్తలు వినిపించడంలేదు. ఏదో గరగర. వాకట్లోనే నుంచుని "ఖాసిం మిస్టర్ ఖాసిం!" అని పిలుస్తున్నాడు నాన్న. అలా నాలుగైదుసార్లు పిలిచాక తలుపు సందులోంచి ఒక వృద్ధుడు తొంగి చూశాడు.

"ఖాసిం వూరికిపోయాడు. మీకేం కావాలి?" అని అడిగాడు ఆ వృద్ధుడు.

"మీ రేడియో కావాలి" చెప్పాడు నాన్న.

"రేడియోనా? ఉండండి వాళ్ళనడిగి చెప్తాను" అంటూ లోపలికి వెళ్ళాడు.

నాన్నతోబాటు అమ్మా, చెల్లెళ్ళూ అంతా వచ్చి నిలుచున్నారు. కాసేపటికి ఆ ముసలాయన బయటికి తొంగి చూసి అన్నాడు – "రేడియో చెడిపోయింది."

"చెడిపోయిందా? నిన్నటి దాకా బాగానే పాడుతూ వుందే?"

వృద్ధుడు వెకిలిగా నవ్వేడు. అతని వెనక నించి ఒక స్త్రీ కంఠం పలికింది. "కావాలంటే మీరే వచ్చి చూడండి, పాడితే తీసికెళ్ళండి".

చంద్రశేఖరం "నేను చూసొస్తాను" అంటూ పిట్టగోడ దూకి ఖాసిం ఇంట్లోకి చొరబడ్డాడు. తప్పుకుని దారిచ్చాడు వృద్ధుడు.

ఆ ఇంట్లో కాలు పెడుతుంటే తలలోని నరాలు జివ్వుమన్నట్టనిపించింది చంద్రశేఖరానికి. ఎందుకో గుండె దడదడమంది. ఇంట్లో ప్రవేశించాక వూపిరాడనట్లయింది. ఏ మూల చూసినా మనుషులు కిక్కిరిసి వున్నారు. ముడుచుకుని కూలబడి వున్నారు. వాళ్ళ ముఖాల్లో ఏదో భీతి. ఒక మూలగా ప్యారీబేగం కనిపించింది.

"ఇక్కడుంది రండి" అంటూ రేడియో దగ్గరికి పిలిచాడు ముసలాయన.

ఆ గదిలో ఇంకా లైటు వెయ్యలేదు. చీకటిగా వుంది. ఖాసిం భార్య లైటు స్విచ్చి వేసింది. ఆ లైటు వెలుగులో ఆ ఇంట్లో పురుగుల్లా పేరుకున్న జనం ఇంకా ఘోరంగా కనిపించారు. కొందరాడవాళ్ళ ముఖాలమీదికి ముసుగులు లాక్కున్నారు. చంద్రశేఖరం రేడియో ఆన్ చేశాడు. లైటు కూడా వెలగలేదు. రేడియోలోని అన్ని మీటలనీ తిప్పి చూశాడు. అలా పరికిస్తూ యధాలాపంగా రేడియోని పక్కని జరిపాడు. పగిలిన గాజుపెంకులు కనిపించినయ్. సందేహంతోచి రేడియోని వెనక్కి తిప్పి చూశాడు. రెండు వాల్వ్ బల్బులు పగిలి వున్నాయి. ఎవరో కావాలనే అలా పగలగొడితే తప్ప అలా జరగడానికి అవకాశం లేదు. వృద్ధుడు సంకోచిస్తూ నిలబడి వున్నాడు. ఖాసిం భార్య కూడా చంద్రశేఖరం కేసి చూస్తూ నుంచుని వుంది.

పిట్టగోడ దూకి ఇంట్లోకి వచ్చేశాడు చంద్రశేఖరం. ఖాసిం ఇంట్లో లైటార్పేశారు.

"ఏం జరిగింది?" అడిగింది అమ్మ.

"అదిక పాడదు" చెప్పాడు చంద్రశేఖరం.

"బాగనే పాడేదే"

"ఇకనించి పాడదు"

గురువారం వచ్చింది. వీధిలోకి గడ్డిబండి వచ్చింది. జాంపళ్ళమ్ముతూ ఒకడొచ్చాడు. చాలా రోజుల తర్వాత ఒకతె జొన్నకంకులు తెచ్చి అమ్మింది. ఒక భిక్షగాడు అరశేరు బియ్యం ఒకింట్లో అమ్ముకుని వెళ్ళాడు.

ఈ రోజు వీధుల్లో జనసమ్మర్థం పెరిగింది. పెద్ద అంగళ్ళని కూడా తెరిచారు. కాయగూరల అంగళ్ళలో తాజా కూరలు దొరుకుతున్నాయి. దర్జీషాపు, సెలూన్ అన్నీ తెరిచారు.

చంద్రశేఖరానికి పరిచయమైన ఒక సెలూన్ షాపు వాడు పిలిచాడు. "నా దగ్గరిప్పుడు డబ్బుల్లేవు" అన్నాడు చంద్రశేఖరం.

"ఫరవాలేదు. రేపిస్తే చాలు"

"నే నిప్పుడు ఇంటికెళ్ళి స్నానం చెయ్యాలి" అంటున్నా వినకుండా అతణ్ణి కుర్చీలో కుదేసి హుషారుగా తలకి వాసన చమురు, ముఖానికి పౌడరు అద్దేడు. ఆ అంగట్లో ఒక తెలుగు పత్రిక కనిపించింది. బెజవాడ నించి వచ్చేది అది.

భాష తెలిసుంటే చదివి విషయాలు తెలుసుకుని వుండవచ్చు. తెలుసుకోవలసినవి చాలా వున్నాయి. నిజాం సేనాధికారులు ఇక యుద్ధం చేయడం సాధ్యంకాదని తేల్చివేశారు. అసలు మొదట్నించీ భారత సైన్యాలని ఎదిరించగల అంగబలంగాని, ఆయుధ బలంగాని నిజాం సైన్యానికి లేదు. ఆగ్నేయప్రాంతం పూర్తిగా మైదానం. బ్రహ్మరాక్షసులవలె పైపైకి వచ్చే టాంకులకి ఎదురు నిలవగలదా? పాకిస్తాన్ ఏమి చెయ్యాలనుకుంటున్నదో మరి? పాకిస్తాన్ ఈ విషయంలో ఏం చెయ్యలేదని తెలుస్తున్నది.

ఐక్యరాజ్యసమితిలో మొరపెట్టుకోవడానికి మనిషిని పంపి వున్నారు. అదీ ప్రత్యక్షంగా మొరపెట్టుకోవడానికి వీల్లేదు. ఒక ప్రతినిధి ద్వారా మాత్రమే ఈ ప్రస్తావన తేవడానికి వీలుంది. అదీ పాకిస్తాన్ చెయ్యాల్సిందే. ఐక్యరాజ్యసమితికి పంపబడిన నవాబ్ మొయిన్ నవాజ్ జంగ్ ఖజానాలోంచి ధనరాసుల్నీ, ఎంతో బంగారాన్నీ తరలించుకుని వెళ్ళినట్టు తెలుస్తోంది. ఇది నిజమేనా? పరిస్థితులను బట్టి చూస్తే ఇది జరగడానికి వీల్లేదని అనిపిస్తున్నది. మే మేమీ చెయ్యలేము. మిమ్మల్ని మీరు రక్షించుకోండి అన్నట్టు ప్రవర్తిస్తున్నది పాకిస్తాన్.

ఇంకా ఎన్నో రోజులు అవసరంలేదు. ఒకటి మాత్రం స్పష్టం. మరో వారంలోగా ఇదో ఇక్కడ కూడా యుద్ధం జరగొచ్చు. నాలుగువేపుల నించీ హైదరాబాదుని చుట్టు ముడుతున్నాయి భారతసైన్యాలు.

నిన్న కనిపించిన పోలీసులు కూడా ఇప్పుడు లేరు. హైదరాబాదు పోలీసు శాఖలో నూటికి తొంభై మందికి పైగా ముస్లిములే. అయితే ఈ రోజు ఒక్క ముస్లిం కూడా కనిపించటంలేదు వీధుల్లో.

అయితే వీధుల్లో తిరక్కుండా వుండలేని ముస్లింలు కూడా వున్నారు. ఊరికి నడుమ, రైల్వేస్టేషన్ సమీపాన, పెద్దాసుపత్రికెదురుగా, పాతచర్చి పక్కన, ప్లాట్ ఫారాలనే వాసయోగ్యాలుగా మార్చుకున్న ఎందరో రెఫ్యూజీలు కనిపిస్తూనే వున్నారు. బొమ్మరిళ్ళలాంటి వారి గుడిసెల్లోంచి ఇంకా పొగవస్తూనే వుంది. తిండానికి వున్నా లేకపోయినా అమ్మడానికి మాత్రం బజ్జీలు, మురుకులు తయారు చేస్తూనే వున్నారు. మొత్తంగా తురక హోటళ్ళకి అమ్మేస్తూ వుంటారు. ఆ డబ్బుతో మళ్ళీ బ్లాకుమార్కెట్ ధరలకి శనగపిండి, నూనె కొని మళ్ళీ తినుబండారాలు తయారుచేస్తారు. వాటిలో తాము తినడానికి కొన్ని అయినా

మిగుల్చుకుంటారో లేదో! వీళ్ళని చూస్తే అలా తింటున్నట్టు కనబట్టంలేదే. కిందటి దినం తనని చూసి ఆప్యాయంగా నవ్విన రెఫ్యూజీ కనిపిస్తాడేమోనని చూస్తూ నడుస్తున్నాడు చంద్రశేఖరం. ఎవరెవరో నడిచి వెడుతున్నారు. వాళ్ళంతా ఎంతో నెమ్మదిగా అవుపిస్తున్నారు. ఊరంతా సంచలనంతో నిండి వున్నా వీళ్ళు మాత్రం దానికి దూరంగా మసగలుగుతున్నారు. వీళ్ళు దేనికోసమూ, ఎవరికోసమూ ఎదురుచూస్తున్నట్టు కూడా లేదు. ఏదో నిర్లక్ష్యం లేక నిర్లిప్తతనా? ఆసుపత్రి కాంపౌండు కమ్మీలమీద పసిబిడ్డల గుడ్డలు ఆరేసి వున్నాయి. బిడ్డల పట్ల కూడా వీరికి నిరాసక్తతయేనా అనిపించేట్టుగా వుంది వాళ్ళ ధోరణి.

కింగ్స్వే సెంటరులో గుంపులుగా కూడి మాట్లాడుకుంటున్నారు జనం. సికిందరాబాదు సోషలిస్టు నాయకుడు మహదేవ్‌సింగ్ ఇల్లు ఆ సమీంలోనే వుంది. మహదేవ్ సింగ్‌ని అరెస్టుచేసి ఎనిమిది నెలలు దాటింది. ఈమధ్యకాలంలో అతని కుటుంబం అతన్ని చూట్టానికి మూడుసార్లు మాత్రమే అనుమతి లభించింది. ఇప్పుడు రెండు రోజులుగా అతడ్ని కలుసుకోవడానికని ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నారు. చూడకపోయినా ఫరవాలేదు. అతనికేం కాలేదు. బ్రతికే వున్నాడని తెలిసినా చాలు. ఈ మాత్రం సమాచారం చెప్పడానికి కూడా సరైన అధికారులు కనిపించడంలేదు. ఒకటి మాత్రం తెలిసింది. ఇతర చోట్లలో వున్న ఖైదీలందరినీ హైదరాబాదు సెంట్రల్ జైలుకి తరలించబోతున్నారు. ఈపాటికే తరలించారో ఏమో. రెండు వారాల క్రితం రజాకార్ గూండాలు గుల్‌బర్గా జైల్లో దూరి కాంగ్రెస్ ఖైదీలని అమానుషంగా కొట్టి హింసించి వున్నారు. ఆ దెబ్బలకి ఒక ఖైదీ మరణించాడు కూడా. ఇప్పుడున్న పరిస్థితుల్లో కక్షతో ఈ రజాకార్లు ఎంతకైనా తెగించగలరు.

ఊళ్ళో సైకిళ్ళు, టాంగాలు మాత్రమే కనిపిస్తున్నాయి. టాంగాలు ఖాళీగా తిరుగుతున్నాయి. ఫలహారాల అంగళ్ళన్నీ తెరిచిన గంటలోగా ఖాళీ అవుతున్నాయి. వంద తమలపాకులు నాలుగు రూపాయలకి అమ్ముతున్నారు. తక్కిన వ్యాపారస్తులు బేరాల గురించి లెక్క చెయ్యటంలేదు. ఊరికేనే కూర్చుని విసుగుపుట్టిన అంగళ్ళవాళ్ళు పక్క షాపులకొచ్చి మాట్లాడుతూ నిలబడి వున్నారు. హైదరాబాదు మీదికి సైన్యాలని పంపడాన్ని ఒక బందోబస్తు చర్యగా మాత్రమే పేర్కొంది ఆలిండియా రేడియో. సైన్యాలు సాగివస్తున్నాయన్న వార్తల్ని మాత్రమే ప్రచారం చేస్తున్నది. హటాత్తుగా

హైదరాబాద్ రేడియో ఒక వార్తని ప్రసారం చేసింది. – సాయంత్రం నాలుగున్నరకి ఒక ముఖ్య ప్రకటన వుంటుందని ప్రతి పది నిమిషాలకోసారి ఈ వార్తని ప్రసారం చేస్తూ మధ్య మధ్య సినిమాపాటల్ని వినిపిస్తోంది. ఎన్నో సంచలన వార్తల మధ్య ఈ వార్త ప్రభావం పెద్దగా ప్రజల్లో కనిపించింది కాదు. నాలుగున్నరకి ఒక సంగతి తెలిసింది. భారత సైన్యాలు భోంగిర్‌ని చేరుకున్నాయి. హైదరాబాదు చేరడానికి ఇంకా ముప్పై మైళ్ళు మాత్రమే వుంది. సరిగ్గా నాలుగున్నరకి ప్రకటన వినిపించింది. చాలా క్లుప్తమైన ప్రకటన – "సాయంత్రం ఏడున్నర గంటలకి నిజాంగారి ఫర్మానా ప్రకటించబడుతుంది. దీన్ని స్వయంగా రేడియోద్వారా నిజామే చదువుతారు".

కర్‌ఫ్యూని ఎవరూ పట్టించుకున్నట్టులేదు. సాయంత్రం ఆరున్నరకే – స్త్రీలు మినహా – వూరు వూరంతా వీధుల్లో నిండిపోయింది. కొందరు స్త్రీలు కూడా కనిపించారు అక్కడక్కడా – చిన్న వ్యాపారాలు చేసేవాళ్ళు, కాయగూరలమ్ముకునేవాళ్ళు, బటానీలు, వేరుశెనగలమ్మేవారు ఇలా కొంతమంది. ప్రజలమీద ప్రభుత్వానికి కూడా నమ్మకం పెరిగిందేమో. గత నాలుగు దినాలుగా అధికారుల హడావిడి లేదు. ఊరు ప్రశాంతంగా వుంది.

నిజంగారి ఫర్మానాని ఇళ్ళలో వుండి విన్నవారి కన్న వీధుల్లో చేరి విన్నవారే ఎక్కువ మంది. రేడియోని ఎంత పెద్దగా పెట్టవచ్చునో అంత పెద్దగా పెట్టి అంతా కాచుకూర్చున్నారు. నిజాం కంఠం ఆంగ్లంలో స్పష్టంగా ధ్వనించసాగింది.

"కొంతకాలంగా మన సంస్థానంలోని ప్రజలు ఎన్నో ఇబ్బందులనుభవిస్తూ వస్తున్నారు. ఈ పరిస్థితిని ఇక కొనసాగనివ్వకుండా వుండేందుకు, ఈ ఇబ్బందికరమైన పరిస్థితిని అంతమొందించేందుకు కొన్ని చర్యలని అమలు పరుస్తున్నాము. ఇంతరకు పదవి వహించిన ప్రధానమంత్రి, అతని మంత్రివర్గం ఈ వుదయమే రాజీనామా సమర్పించింది. హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరిపోవాలని ఏకగ్రీవంగా తీర్మానించాము. ఫలితంగా మొదటి చర్యగా మన సైన్యాలు భారత సైన్యాలకి వ్యతిరేకంగా పోరాడరాదని, తక్షణమే ఉపసంహరించుకోవాలని ఆజ్ఞలని జారీ చేశాము. సాధ్యమైనంతవరకు ఒక సివిల్ రాజ్యాంగాన్ని ఏర్పరచడానికి అవసరమైన చర్యలు తీసుకుంటున్నాము. అంతవరకు పరిపాలనా బాధ్యత భారతదేశపు ప్రతినిధికి అప్పగించబడుతుంది. శాంతి నెలకొనాలనే

ఉద్దేశంతో రాజకీయ ఖైదీలందరినీ వెంటనే విడుదల చేయవలసిందిగా ఉత్తరువులు జారీ చేస్తున్నాము. ఈ వారం మొదట్లో ప్రకటించబడిన కర్ఫ్యూని, తక్కిన రక్షణ చట్టాలని వెంటనే రద్దు చేస్తున్నాము. తరతరాల మన సంస్కృతి, సంప్రదాయాలకి ఎటువంటి భంగము ఏర్పడని విధంగా మన ప్రజలు బాధ్యతాయుతంగా ప్రవర్తించగలరని విశ్వసిస్తున్నాము. అందరి క్షేమాన్ని కాంక్షించి మేము ఈ చర్యలు తీసుకోవడానికి మాతో సహకరించిన ఇండియా గవర్నర్ జనరల్, మా మిత్రులు అయిన చక్రవర్తి రాజగోపాలాచారిగారికి, ఇక్కడ కొన్ని నెలలుగా మనతో వుంటూ వున్న భారత ప్రతినిధి ఏజెంట్ జనరల్ అయిన కె.యం.మున్షీగారికి ఈ సందర్భంలో కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము..."

చిత్రమైన నిశ్శబ్దంలోంచి ధ్వనించిన నిజాంగారి ప్రకటనని విన్న ప్రజల్లో పెద్ద సంచలనమేమీ ఏర్పడలేదు. ఏదో ఒక మూలనించి వినిపించిన 'జై హింద్', 'స్టేట్ కాంగ్రెస్ జిందాబాద్' అనే నినాదాల ప్రభావం కూడా పెద్దగా కనిపించలేదు ప్రజల్లో. ప్రజల్లోని ఈ నిర్లిప్తత మొదటిసారిగా చంద్రశేఖరానికి ఏదో అవ్యక్తమైన భయాన్ని కలిగించింది. అయితే వెంటనే అతని ఈ భయాన్ని పటాపంచలు చేస్తున్నట్లుగా జనం ఒకరితో ఒకరు మాట్లాడుకోసాగేరు. నిజాం ప్రకటనలో రజాకార్ల ప్రసక్తే రాలేదు. రజ్వీని గురించి ఒక్క ప్రస్తావన లేదు. భారత ప్రభుత్వానికి వీటితో సంబంధం లేదా? ముఖ్యమైనవిగా తోచలేదా? ఇన్ని రోజులు ఎన్నో అక్రమాలు, దోపిడీలు, మానభంగాలు చేసిన వాళ్ళకి శిక్షే లేదా? వేలమంది నేలచిందిన నెత్తురు, త్యాగాలూ అంతా వృధాయేనా? కొందరన్నారు – నిజాం ఏం చేయగలడు? అత్యవసరమైన వాటిని మాత్రమే ప్రకటించగలడే కాని, అన్ని నిర్ణయాలనీ అతను తీసుకోగలడా? హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో చేరిపోయింది. ఇకనించి చర్యలు తీసుకోవలసిన బాధ్యత భారత ప్రభుత్వానిది. ఈపాటికే చర్యలు ప్రారంభించి వుంటుంది. అన్ని విషయాలూ రేపీపాటికి తెలుస్తయ్.

ఖాసిం ఇంటి తలుపులింకా బిడాయించే వున్నాయి. కిటికీ తలుపులు కూడా బంద్ అయి వున్నాయి. పొగ గొట్టం ద్వారా మాత్రమే లోపలిగాలి బయటకు పోవాల్సి వుంది. ముప్పై నలభై మంది జనం ఎన్నాళ్ళని ఇలా గాలి చొరని రెండు గదుల్లో పడి వుంటారు? రెండు వందల సంవత్సరాల క్రితం 146

మంది ఇలాగే ఒక గదిలో బంధించబడి ఒకే రాత్రిలో 123 మంది వూపిరాడక చచ్చిపోయారని ఎక్కడో చదివాడు.

అమ్మ గాఢనిద్రలో వుంది. అంతా నిద్రపోతున్నారు. అందరిలా వూరొదిలి వెళ్ళిపోతే ప్రాణాలు దక్కుతాయని పారిపోకుండా ఎలాగో ఈ ఏడాదిపాటు ఇక్కడే గడిపేశారు. రేపట్నించి ఇక్కడో కొత్త ప్రపంచం ఏర్పడబోతున్నది. ఆ ప్రపంచంలోనైనా దుఃఖానికీ, భయానికీ, దిగులుకూ తావుండదా? చంద్రశేఖరానికి నిద్రపట్టలేదు. లేచి బైటికి వచ్చాడు. రేయి ప్రశాంతంగా వుంది. సికిందరాబాదులో రెండో వర్షాకాలం ప్రారంభమయ్యే రోజులు. తొందర్లోనే వర్షాలు పడేట్టున్నాయి. రాత్రంతా వర్షం కురిసి పగటిపూట వర్షపు ఛాయలే కానరాకుండా దాక్కుంటుంది వర్షాకాలం. ఈ వూళ్ళో కురిసే వర్షమే చాలా తక్కువ. ఈ రోజుల్లోనే కిందటేడు నాజీర్ అలీఖాన్ మొదటిసారిగా తననీ ఒక ప్లేయరుగా గుర్తించి స్నేహం చేసి క్రికెట్ ప్రాక్టీసుకి పిలిచాడు. ఇప్పుడేం చేస్తూ వున్నాడో అతను? నిద్రపట్టకుండా తనలాగే మేల్కొని వుంటాడా? అతని తండ్రి చనిపోయుండాటా? ఆ రెండు వేల మంది రజాకార్లని మరణం వేపుకి నడిపించింది అతని తండ్రేనా?

చంద్రశేఖరం మర్రిచెట్టు కిందికి చేరుకున్నాడు. మునుపొకసారి ఇలాగే వచ్చినప్పుడు దూరాన్నించి ఏదోపాట వినిపించింది. ఇప్పుడు కోడిపుంజు కూత తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది. ఇప్పుడు టైమెంతయిందో? తెల్లారడానికి ఇంకా ఎంత సేపుందో?

లాన్సర్ బారక్సు రెండులైన్లనీ తిరిగి వచ్చాడు చంద్రశేఖరం. మొత్తం పంధొమ్మిది ఇళ్ళు. సగం ఇళ్ళకి పైగా చీకటి. వాళ్ళంతా వూరొదిలి వెళ్ళిపోయినవాళ్ళు. తక్కువ ఇళ్ళలో లైట్లుండి కూడా వెలగడం లేదు. కర్ఫ్యూకి అలవాటు పడిన వాళ్ళింకా అదే అలవాటుని కొనసాగిస్తున్నారు. ఒక రోగి, ఒక పసిపాప, ఒక స్కూల్ స్టూడెంట్ వీళ్ళు కూడా లైటు వేసుకోకుండా ఎలా వుంటున్నారు? ఊరి పరిస్థితి వ్యక్తుల జీవిత విధానాన్ని ఎంతగా మార్చివేసిందో!

కృష్ణస్వామి ఇంటికి కాపలాగా ఎవరో ఒకతను వచ్చి పడుకుని వెళుతున్నాడు. అలారం పెట్టింది అతనే కాబోలు. ఆ ఇంటి మీదుగా వెళుతుంటే అలారం మోగింది.

చంద్రశేఖరానికి కాళ్ళు లాగుతున్నాయి. రెండు రోజుల్నించి గమ్యం లేకుండా తిరిగి రావటం. ఈ అలసటకి ఫలితం లేకుండా పోతుందా? తెల్లారటానికి

ఇంకా అట్టే సేపు లేదు. ఈ ప్రశాంతత, ఈ నిశ్శబ్దం ఈ నిశీధిలోని ఆఖరిక్షణాలు. ఈ నీరవ నిశ్శబ్ద నిశీధిలోంచి ఎక్కడో దూరంగా ఎవరిదో దీన రోదన. కనీసం మైలు కావల నుంచి వినిపిస్తూ వుండాలి.

మళ్ళీ మళ్ళీ వినిపిస్తున్నాయి ఆ దీనాలాపనలు. రైల్వేస్టేషన్ వేపునించి వస్తున్నట్టున్నాయి. ఉన్నట్టుండి ఆ దిక్కున ఆకాశం ఎర్రబడింది. నాలుగు రోజులుగా నెలకొన్న ప్రశాంతత ఒక్కసారిగా భగ్నమైంది.

తనేం చేస్తున్నాడో ఆలోచించకుండా రైల్వేస్టేషన్ దిక్కుగా పరుగుతీశాడు చంద్రశేఖరం. అతనికి కనిపించిన ఎర్రని ఆకాశం, అతని మెదడులోని నరాలని వశం తప్పిస్తున్నట్టుగా అనిపించింది. రెజిమెంటల్ బజారుని సమీపిస్తున్నప్పుడు ఆ ఆర్తనాదాలకి, హాహాకారాలకీ కారణం బోధపడింది. అక్కడ కర్రలు, ఆయుధాలు ధరించి రెండు ముఠాలు ఘోరంగా పోట్లాడుకుంటున్నాయి. ఎదురుగానే పోలీస్టేషనుంది.

పర్యవసానం ఆలోచించకుండా ఆ గుంపు దగ్గరికి పరిగెత్తాడు చంద్రశేఖరం. మునుపోసారి గలాటా జరిగిన అదే పిండిమిల్లు. అదే టైలరింగ్ షాపు. ఆ వరుసలో ఇళ్ళు, అంగళ్ళు అన్నీ మూసి వున్నాయి. ఆ ఇళ్ళలోని ఆడవాళ్ళు, పసిపిల్లలు ప్రాణభయంతో చేసే రోదనలే ఇందాకా తనకి వినిపించిన దీనాలాపనలు.

గుంపు చెదిరింది. నాలుగు దిక్కులా పరిగెడుతున్నారు మనుషులు. మంత్రం వేసినట్లుగా క్షణాల్లో అంతా సందు, గొందుల్లోకి దూరి అదృశ్యమైనారు. ఎందుకిలా పరిగుడెతున్నారో అర్థం చేసుకునేలోగా కారణం తెలిసింది చంద్రశేఖరానికి. ఎక్కడ్నించో ఎవరో తుపాకీ పేలుస్తున్నాడు.

చంద్రశేఖరం కూడా ఒక సందు గుండా పరిగెట్టసాగేడు. ఆ పేట పేటంతా మేల్కొని సందులో నిలబడి చూస్తున్నారు జనం. అది ప్రధానంగా హిందువులు నివసించే ప్రాంతం. ఊళ్ళకి వెళ్ళిపోయిన వాళ్ళు పోగా తక్కినవాళ్ళంతా ఇంకా అక్కడే వుంటున్నారు. ఇక వాళ్ళకి ఏమిటి భయం?

అయితే చంద్రశేఖరానికెందుకో వాళ్ళని చూస్తుంటేనే భయంగా వుంది. సందులూ, గొందులూ దాటి రైల్వేస్టేషన్ దగ్గరికొచ్చాడు. అక్కడి ఇరానీ హోటల్ - నిన్న కూడా గ్రామఫోన్ రికార్డులు వినిపించిన హోటల్ - ముందు పెద్దఎత్తున మంటలు లేచాయి. ఆ మంటల్లో ఆ హోటల్లోని మేజాలు, కుర్చీలు, వంట చెరుకు, బొగ్గు, కాలి మసైపోతున్నాయి. అవి చాలదన్నట్టుగా వంట

పాత్రల్ని పింగాణీ కప్పుల్ని ఆ మంటల్లో విసిరేస్తూ ఆనందిస్తున్నారు. పదిహేనుమంది దాకా చేరిన ఆ మనుషులు. అక్కడ మర్రిచెట్టు దగ్గర్నించి కనిపించిన ఆ మంటల వెలుగు ఇదన్నమాట.

చంద్రశేఖరానికి మరిదేన్ని గురించో గిలి ప్రారంభమైంది. ఈ హోటల్ వాళ్ళు మరికొన్ని రోజులకల్లా కొత్త మేజాలు, కుర్చీలు కొనుక్కొని మళ్ళీ మామూలుగా వ్యాపారం కొనసాగిస్తారు. రెజిమెంటల్ బజార్ అల్లర్లలో కొన్ని ప్రత్యేకమైన ఇళ్ళు అంగళ్ళు మాత్రమే మళ్ళీ మళ్ళీ దొమ్మీ చెయ్యబడుతున్నాయి. అంచేత ఈ గలాటా ముందుగా వూహించే వుంటారు. కాని అసలైన ఘోరం మరెక్కడో జరుగుతూ వుండాలి.

పరిగెడుతూ స్టేషన్ రోడ్డు మలుపు తిరిగాడు చంద్రశేఖరం. మొదట్లో ఆ వీధంతా చీకటిగా కనిపించింది. ఆస్పత్రిలోంచి వచ్చే లైట్ల కాంతిలో కొంత మందమైన వెలుతురు ప్రసరిస్తోంది ఆ వీధిలోకి. ఆ వెలుతురికి అలవాటు పడటానికి కొన్ని నిమిషాలు పట్టింది చంద్రశేఖరానికి. ఏది జరక్కూడదని అతను భయపడుతూ వచ్చాడో సరిగ్గా అదే జరిగింది ఆ క్షణంలో. రెఫ్యూజీల రేకుల గుడిసెలు ఒక్కటి బాకీ లేకుండా ధ్వంసం చేయబడ్డాయి. వీధంతా కుండలు, అల్యూమినియం పాత్రలు, బట్టలు చెల్లాచెదురుగా విసిరివేయబడ్డాయి. పాత ట్రంకుపెట్టెలు విరిగి పడి వున్నాయి. వాటి మధ్య కాయగూరలు, తినుబండారాలు కాళ్ళ కింద నలిగి అసహ్యంగా దర్శనమిస్తున్నాయి. వీధి కుక్కలు మొరుగుతూ చుట్టూ తచ్చాడుతున్నాయి. నిన్నటిదాకా వందల సంఖ్యలో అక్కడ నివసించిన మనుషుల్లో ఇప్పుడు ఒక్కరూ కనిపించలేదు. ఈ ఘోరం కొన్ని గంటల ముందే జరిగి వుండాలి. అంతవరకూ ఎంతో పేదరికంలో కూడా ఒక విధంగా ప్రశాంత జీవితం గడుపుతూ వచ్చిన ఆ ప్రజలంతా ఎక్కడికో అదృశ్యమైపోయారు. అంతా ఏమై వుంటారు? తీసుకుపోవడానికి అసలు వారికేం మిగిలిందని?

ఉన్నట్టుండి "పరిగెట్టు! పారిపోండి!" అని అరుస్తూ వచ్చింది ఒక గుంపు స్టేషన్ వేపునుంచి. ఆ గడబిడలో సైతం చంద్రశేఖరం ఏ మతస్థుడో గుర్తించి తమతో బాటు పరుగెత్తి ప్రాణాలు రక్షించుకొమ్మని అరుస్తూ వచ్చింది ఆ గుంపు. వెనకనించి ఎవరో తరుముకొస్తూ వుండాలి. అయితే వారికి కూడా ఈ రెఫ్యూజీలకు పట్టిన గతి పట్టటానికి ఎంతసేపు?

ఆసుపత్రి వేపుగా పరిగెట్టాడు చంద్రశేఖరం. ఎత్తయిన ఆసుపత్రిగేటు మూసి తాళం వేసి వుంది. చంద్రశేఖరంతో బాటు మరో ఇరవై మంది దాకా ప్రాణభయంతో పరిగెడుతున్నారు.

త్వరలోనే మోండా చేరుకున్నాడు చంద్రశేఖరం. అక్కడ కూడా ఆ సమయంలో కలవరం చెలరేగుతూ వుంది. ఎక్కణ్నించో రాళ్ళూ, కర్రలూ విసురుగా వచ్చి పడుతున్నాయి. ఎక్కడెక్కడి బుట్టల్నీ తట్టల్నీ సేకరించి రోడ్డు మధ్యలో కుప్పపోసి నిప్పంటిస్తున్నారు కొందరు. ఆ మంటల వెలుగులో అక్కడి మనుషులు నిశాచరుల వలె కనిపిస్తున్నారు. వాళ్ళ అరుపులు కూడా మనుషుల గొంతులా లేదు.

ఇస్లామియా హైస్కూల్ దిక్కుగా పరిగెట్టాడు చంద్రశేఖరం. అతణ్ణి ఎవరో తరుముకొస్తున్నారు. మునుపొకసారి ఇక్కడే అతను దెబ్బలు తినివున్నాడు. ఇప్పుడు అదే ప్రదేశంలో ప్రాణాలకి భయపడి పరిగెడుతున్నాడు. ఎదురుగా దివిటీలు పట్టుకుని హాహాకారాలు చేస్తూ ఒక గుంపు వేగంగా వస్తూ కనిపించింది. అది హిందువుల గుంపా అని ఎలా చెప్పడం?

మెరుపులా స్కూల్ పక్కనే వున్న ఒక సందులోకి దూరేడు చంద్రశేఖరం. దివిటీల గుంపు అతడ్ని పసిగట్టి "పకడో! పకడో!" అని కేకలు పెడుతూ అతడ్ని వెంబడించింది.

ఒక ఇంటి గోడెక్కి లోపలికి దూకేడు చంద్రశేఖరం. అతడ్ని తరుముకొచ్చిన గుంపు "పకడో! పకడో సాలేలోంకో మార్‌డాలో" అంటూ ఆ సందు గుండా వెళ్ళింది. అలా వెళుతూ ఆ వీధిలోని తలుపుల్నీ, కిటికీలనీ కర్రలతోటీ, ఈటెలతోటీ పొడుస్తూ వెళ్ళింది. ఆ గలభాకి అంతకుముందే ఆ ఇంట్లోని వాళ్ళంతా లేచి కూర్చున్నారు. క్షణంలో వాళ్ళంతా చంద్రశేఖరాన్ని గుర్తించారు. భయంతో లోపలికి పారిపోయారు.

జంట నగరాలలో పేదరికంలో మగ్గిపోయే వేలాలది కుటుంబాలలో ఒక కుటుంబం అది. ఒకే ఒక గుడ్డి దీపం వెలుగుతున్నది ఆ ఇంట్లో. ముగ్గురో నలుగురో మగవాళ్ళు. నలుగురాడవాళ్ళు, ముగ్గురు పసిబిడ్డలు శిథిలావస్థలో వున్న ఒక ముసల్ది. ఆ మగాళ్ళంతా చేరి చంద్రశేఖరాన్ని ఏమైనా చేసి వుండొచ్చు. అయితే భయకంపితులైన ఆ మనుషులు ఆ క్షణంలో నిర్జీవులై కనిపిస్తున్నారు.

ఆ ఇల్లంతా దుర్గంధంతో నిండిపోయి వుంది.

చంద్రశేఖరం వాళ్ళ పరిస్థితిని అర్థం చేసుకునేలోపున ఒక ఘోరం జరిగిపోయింది. వాళ్ళు ముందుగానే ఆ పథకం వేసుకుని సిద్ధంగా వుండి వుండాలి. ఆ నలుగురాడవాళ్ళలోంచి పదిహేనేళ్ళు కూడా నిండని ఒక అమ్మాయి చంద్రశేఖరాన్ని సమీపించి ఎదురుగా నిలబడింది.

"మాకు ప్రాణభిక్ష పెట్టు. మమ్మల్ని చంపొద్దు" – ఇలా అంటూ కమీజుని విప్పి పడేసింది. మరో క్షణంలో పైజామా నాడాని కూడా విప్పేసింది. ఆ మందమైన వెలుతుర్లో కూడా శరీరంలోని ఎముకలన్నీ కనిపించేలా చంద్రశేఖరం ముందు నగ్నంగా నిలబడింది ఆ అమ్మాయి.

చంద్రశేఖరానికి కళ్ళు తిరిగాయి. "అయ్యో!" అనే ఆక్రందన అతని నోటి నుండి వెలువడింది అప్రయత్నంగా. ఏమని అర్థం చేసుకుందో ఆ దీనురాలు మరికొంచెం ముందుకొచ్చి నిలబడింది అతని ఎదుట నగ్న శరీరంతో.

"అయ్యో! అయ్యో!" అని మళ్ళీ అరిచాడు చంద్రశేఖరం. అతనికి తల తిరిగి వాంతి వచ్చినట్లయింది. కడుపులోంచి పెళ్ళగిల్లి వచ్చిన వాంతిని అలాగే మింగేసి వచ్చిన దారినే గోడదూకి వీధిలో పడ్డాడు. ఉన్మాదిలా పరిగెట్టసాగేడు. రెఫ్యూజీల కుటుంబాలు కళ్ళెదుటే ఛిన్నాభిన్నం కావించబడటం కూడా అతనికి ఇంత వికారం కలిగించలేదు. జీవితంలో మొదటిసారిగా తను నగ్నంగా చూసిన ఆ పేదపిల్ల అతని సున్నితమైన మనసుని అమితంగా కలచి వేసింది. ఆమె ఎదుట తనొక పురుగుగా మారిపోయినట్టనిపించింది అతనికి. తనవాళ్ళని రక్షించడం కోసం తనని ఎంత దిగజార్చుకోవడానికి సిద్ధపడింది ఆ అమ్మాయి! ఆమె ఇంకా ఒక పసిపాపే. ఈ ప్రపంచంలో ప్రాణాలని రక్షించుకోవడానికి పసిపాపలు సైతం ఎంత హీనస్థితికి దిగజారవలసి వుంది! ఈ పరిస్థితికి తను కూడా కారణభూతుడైనాడే! ఈ మచ్చ ఎన్నాళ్ళకి మాసిపోతుంది. ఎలా మాపుకుంటాడు? అసలు ఈ గాయం మానుతుందా?

చంద్రశేఖరం పరిగెడుతున్నాడు. అలా పరిగెడుతూన్న చంద్రశేఖరానికి తూరుపు తెలతెల వారడం కనిపించింది.

**( స మా ప్తం )**

Printed at : Pressworks, Delhi.